# సాధన సామగ్రి

## నాలుగవమూట

(సప్తశతి) దేవీ మాహాత్మ్యమందలి చరిత్రత్రయమందు
బ్రహ్మాదికృతస్తుతులు నాలుగిటి మూలమంత్రసహిత
సమగ్ర వ్యాఖ్య

గ్రంథకర్త :

శ్రీ శ్రియానందనాథుఁడు
**ఈశ్వర సత్యనారాయణ శర్మ**





ప్రకాశకులు :
**సాధన గ్రంథ మండలి, తెనాలి.**

కాపీరైటు ] [వెల రూ. 110-00

సా - 4 - 1

'సరసకవి' 'సాహిత్యరత్న'
**శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు**
అధివక్త.
"కవితా నికేతనము" అత్తితోట అగ్రహారము, నెల్లూరు.
19-12-1964

# పూజా పుష్పము

జగన్మాత యనుగ్రహమునకుఁ బాత్రుల మగుటకు దేనిని మనము చేకూర్చుకొనవలయునో, ఆ సాధన సామగ్రినంతయు నాల్గుమూటలుగాఁ గట్టి మన కందించిన శ్రీశ్రీ శ్రియానంద నాథులు మహానుభావులు. అమ్మతో ముచ్చటలాడఁగలిగిన పరదేవతా ప్రసాద సంపన్నులు. వారి గ్రంథములఁ జదివి, యందలి రహస్యములను గుర్తించు శక్తి యుఁ బరమార్థలాభము వడయు భాగధేయమును ఇప్పుడు కాకపోయినను రానున్న జన్మము నందైనను లభింపకుండునా యని వేచియున్న మాదృశులు శ్రీవారి రచనములంగూర్చి యభిప్రాయ మీయఁబూనుకొనుట అపచార మగును. నా యందలి శ్రియానందనాథుల వాత్సల్యమో యన 'సాధన సామగ్రి' సంపుటములు నా చేరువకు రాఁగా, నే నా యుద్గ్రంథములఁ జదివినప్పుడు నా కొదవినయానందమే యీ యక్షరాకృతి నొందినది.

'సాధన సామగ్రి' నాలుగవమూట నెత్తికొని చూడ సాగినతోడనే, దాని యెనిమిదవ పుటలో నాకు యోగనిద్రా దేవి సాక్షాత్కరించినది.

"తుష్టావ యోగనిద్రాం తా మేకాగ్ర హృదయస్థితః

విబోధనార్థాయ హరే ర్హరినేత్రకృతాలయామ్ ।

విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితిసంహారకారిణీం

నిద్రాం భగవతీం విష్ణో రతులాం తేజసః ప్రభుః॥

నా కీమె చూపట్టిన వెనువెంటనే శ్రీ మత్పరమహంస పరిపూర్ణానందనాథుల "లక్ష్మీశృంగార కుసుమమంజరి" లోని అద్యశ్లోకము నా స్మృతిపథమునకు వచ్చినది. ఆ శ్లోకమునకు మా సాహిత్య గురువర్యులు కీర్తిశేషులు బ్రహ్మశ్రీ దుర్భాసుబ్రహ్మణ్య శర్మగారు వెలయించిన హృద్య పద్యానువాదమును స్మరించితిని. దానిని ఈ దిగువ పొందుపఱచుచున్నాను.

"అమృత సరస్వదంతరవటాగ పలాశపుటమ్మునన్ జగ

త్క్రమ రచనాదిచే నలసి కమ్మఁ బరున్నవిభున్ విలోచనాం

తముల స్పృశించుచున్ స్వలలితమ్ముల నెవ్వతె ప్రీతుఁజేయు న

య్యమలిన యోగనిద్ర భవహారవినిద్ర సమాశ్రయించెదన్."

'హరినేత్ర కృతాలయాం' అని వర్ణింపఁబడిన యోగ నిద్రను గూర్చిన వివరణము, ప్రాణశక్తిరూప విష్ణుప్రస్తావము, మధుకైటభ వినాశ వివేకము - ఇవి యిట్లు ప్రపంచింపఁజేసిన శ్రియానందనాథ స్వాముల యార్ష ప్రజ్ఞకు అంజలి వట్టితిని. త్రిమాత్రా స్వరూపముతో జగద్రూపగా, అర్థమాత్రా రూపముతో పరాజననిగా వెలయు దేవియొక్క తత్త్వమును ఆవిష్కరించిన శ్రీవారి మహిమకు అబ్బురపడితిని. ఆగమసూక్తులతో శాక్తాద్వైతమును సమన్వయింపఁ జేసి భక్తులగు చదువరులకు జ్ఞాననిధులు నెఱచూఱలిచ్చిన వారి యగణ్యకారుణ్యమునకు జోహారు లర్పించితిని. ఒకనికి భగవ ద్ధర్మమం దధికారము కల్గుటకు అతఁడు రసికుఁడును

భావుకుఁడును గావలయుననను భాగవత ప్రమాణమును బయల్పఱచి సాధకులకుఁ గనువిప్పు కల్పించిన యీ మంత్రమూర్తికిఁ బ్రణమిల్లితిని.

ఈ 'సాధన సామగ్రిని' తమ సొమ్ముగాఁ జేసికొన్నవారు అమర్త్యులగుదురు; సంశయములేదు. నిర్భయులగుదురు; ఆనంద సముద్ర తరంగములలో నుయ్యేల లూగుదురు.

మఱి యిప్పు డీ పూజాపుష్పము సమర్పించుటకు నా కవకాశము కలిగించిన మహనీయులకు నమస్కరించి విరమించుట తప్ప నేఁ జేయఁగల్గినది ఏమున్నది ?

ఓం తత్సత్.

నెల్లూరు<br>క్రోధి -మార్గశీర్ష-శుక్ల పూర్ణిమ.

సాధకుఁడు<br>మోచర్ల రామకృష్ణయ్య



శ్రీమాత్రేనమః.

ఓం నమశ్చండికాయై.

**పాఠకులకు నా మనవి.**

అమ్మ వ్రాయించిన "సాధన సామగ్రి" మూటల వరుసను నాలవమూట యిది. ఇందలి సరకులు న్యాయముగా నమ్మూఁడు మూటల తుదలను జేరియుండవలసినదే, కాని పూర్ణసప్తశతకి మూలమంత్ర సమగ్రవ్యాఖ్యలతో యథాస్థితముగా నచ్చున వేయఁజాలమికిఁ గారణములను దొలుమూట మొదటనే విన్నవించి కొంటిని.

ఈ స్తుతులు బ్రహ్మాదులు చేసినవి నాలుగు. ఉత్తమ చరిత్ర మనెడి శుంభాసుర వధాంతమున (అస్మితా నాశము తర్వాత) దేవగణము చేసిన నారాయణీస్తుత్యంతము వాక్యములు - స్నేహమయి, అమ్మగారు ముద్దుబిడ్డలయెడనైన విశిష్ట స్నేహముతోఁ దన మధుమయానానాబ్జమునుండి వినిచిన యంభయ వరదానవాక్యములు ముప్పది శ్లోకమంత్రములుగా నుగ్గడించినది. అవి చదివికొన్నప్పుడే శ్రీమాత యవ్యాజకరుణ, ప్రేమమయత, స్నేహమయత, మధుమయత తేఁటపడును.

"నా చరిత్రములను శాస్త్రోక్తనియమబద్ధులై పారాయణము చేయ నశక్తులైన నా భక్తులు నా చరిత్రత్రయమందు బ్రహ్మశక్రాదులు చేసిన స్తుతి పాఠశ్రవణములతో నన్ను సంతోష పెట్టునపుడు, వారి నన్ని విధముల సంరక్షింతు" ననిన యా ఫలశ్రుతివాక్యములు చదివికొన్నంతనే యెట్టి సాధకుఁడును

ప్రాణపణము పెట్టి నిత్యము చదువుటో, చదివించి వినుటో వ్రతముగాఁ గొనకుండఁజాలఁడు. వాని సమగ్రవివరణము జదివి కొన్నపుడు శ్రీమాతృ (ఆత్మ) తత్త్వబోధమునకై యెవ్వరి గుంబముకడను జే సాఁపనక్కఱలేదు. ఎంత తృప్తి, ఎంత యాశ సాధకహృదయమున నిండునో నేను వ్రాయుటకంటెఁ జదువరులు చదివి గ్రహించి సమాధాన పడవలసినదే !

మూఁడవ మూటగా వెలువడవలసిన యుత్తమచరిత్ర మందలి సాధన సామగ్రిని, ఎత్తి వ్రాసి గ్రంథప్రకాశకులకుఁ జేర్చుపనికి, ఆరోగ్యస్థితి యప్పటి కొప్పకుండుట చేతను, వ్యాఖ్యా సహిత స్తుతులమూట సంసిద్ధముగా నుండుటచేతను, ఈ నాలవ మూట వెల్వరింత యవశ్యమైనది.

ఇమ్మూట ననుశీలించి యవ్యాజస్నేహముతో పూజా పుష్పము నంపిన సాధకపండితోత్తములు "సరసకవి, సాహిత్య రత్న, కవిశేఖర' బ్రహ్మశ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారికిఁ గృతజ్ఞతాపూర్వక నతిశతములు.

సాధన గ్రంథ మండలి పక్షమునఁ బ్రకటింపఁ గోరి మండలివృద్ధి నుద్దేశించియే యథాశక్తి ముద్రణవ్యయములతో నా పంపిన గ్రంథములను బ్రకాశింపఁజేయుట తమ పనిగా నెంచి శ్రమఁగొని నన్ను ధన్యునిఁజేయుచున్న మండలి వ్యవస్థాపకులు, విద్వాన్, శ్రీ. చి॥ బులుసు సూర్యప్రకాశశాస్త్రులు నిరంతరము

శ్రీమాతృకృపావీక్షతో వర్థిల్లుచు, గ్రంథమండలి నామమును సార్థకము జేయఁగల యథార్థ సాధన గ్రంథజాలమును బ్రకటించు నైశ్వర్యమును మహామాయానుభావమున నొందు చుందురు గాతమని యాశాసించుచున్నాను.

ఇఁక నింతలోనే వెలువడు మూడవ మూటయందుఁ బ్రాణప్రతిష్ఠా సాధనము - విష్ణుగ్రంథి భేదము - ప్రారబ్ధక్షయము అనువానికైన సాధనోపాయములు ప్రధాన విషయము. అది యనతికాలములోనే వెలువడ సాధక పండితాశీర్వాదము నపేక్షించుచున్న :

శ్రీకాకుళము,
క్రోధి. సం. మార్గశిరము
17-12-1964

శాక్తబంధుఁడు
శ్రీ శ్రియానందనాథుఁడు, బుధవిధేయుఁడు,
ఈశ్వర సత్యనారాయణశర్మ

# శ్రీ రాజ రాజేశ్వరీ పీఠ సంగ్రహ చరిత్ర

యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః ॥

సర్వ జగన్మాత యగు లలితా త్రిపుర సుందరీ పరాభట్టారికయే శ్రీ రాజరాజేశ్వరీదేవి, ఆమె విలసనమే ఈ విశ్వమంతయు, విశ్వమంతయు తానై, విశ్వాధికయై, విశ్వమునకు సర్గ స్థితి లయములనే కాక తిరోధాన అనుగ్రహములను పంచకృత్య పరాయణ శ్రీరాజరాజేశ్వరీ దేవి - ఆ దివ్యశక్తి మంత్ర తంత్ర యంత్రము లందు నిత్యసన్నిహితమై గురుకృపాలాభమున ఉపాసకులకు కొంగు బంగారమై కల్పతరువై అభీష్టముల నొసంగు చుండును. ఆర్తులు లాభకాములు - జిజ్ఞాసువులు మనశ్శాంతిని కోరువారు, విశ్వకల్యాణాపేక్షులు నిరంతరము దూరదూరముల నుండి తరలివచ్చి, తమ తమ అభీష్టముల నెరవేర్చుకొను దివ్యశక్తి సంపన్నమైన పవిత్ర స్థలము - శ్రీకాకుళంలో నెలకొల్పబడిన శ్రీ రాజరాజేశ్వరీదేవీ పీఠము - ఇది యొక ఆధ్యాత్మిక శక్తి కేంద్రము.

ఏ మంత్రమైనా ఉపాసకుల నైష్ఠికతను బట్టి ఫలప్రదము కాగలదు. శ్రీ విద్యానందనాథ దీక్షానాములు శ్రీ శ్రియానందనాథ శ్రీపరసుఖానంద నాథుల శిష్యులు నైన వేదమూర్తులు శ్రీ సుసరాపు దుర్గా ప్రసాదశర్మ గారు - శ్రీ రాజరాజేశ్వరీదేవి పీఠ, స్థాపకులు - నిర్వాహకులు. వీరు ఉత్తమ వైదిక దంపతులైన బ్రహ్మశ్రీ సుసరాపు అప్పన్న సిద్ధాంతి అలివేలమ్మ దంపతుల గర్భశుక్తి ముక్తాఫలము. బాల్యంలో తండ్రిగారి యొద్ద అభ్యసించిన వైదిక జ్యోతిష శాస్త్రము

లందు విశేషకృషి యొనర్చుచూ బ్ర॥శ్రీ॥ వనమాలి వెంకటరామయ్య వజ్ఝలు గారి వద్ద స్మార్తము, వాటితో పాటు ఉర్లాం వాస్తవ్యులైన శ్రీ, బంకుపల్లె సింహాచల భాగవతార్ గారి వద్ద, సంస్కృత, - భరత శాస్త్రములను, పిమ్మట నరసన్నపేటలో శ్రీ తాళాభక్తుల కామ లింగాచారి గారి వద్ద మృదంగవాద్యమును, బంకు పల్లె లక్ష్మణశాస్త్రిగారి వద్ద కావ్య పాఠములను అభ్యసించిరి. అనాదిగ వీరి కుటుంబము శ్రీదేవీ ఉపాసకులు. అందున అపవర్గదాయిని దుఃఖహంత్రి యగు శ్రీ దుర్గాదేవి వీరి ఇలువేల్పు. ఈ వంశమున నేటికిని పెక్కురు దుర్గా నామములు కలవారున్నారు. వీరి ధర్మపత్ని, శ్రీమతి మహాలక్ష్మి ఈమె శ్రీదేవి ఉపాసకులైన ఇప్పిలి వారి యింట పుట్టిన సాధుశీల – 1972 సం॥లో శ్రీ దుర్గా ప్రసాద శర్మగారు శ్రీ కూర్మం నుండి శ్రీకాకుళం విచ్చేసినారు. ఉత్తరాంధ్రలోనే సుప్రసిద్ధమైన వేద సంస్కృత ఆర్షధర్మ ప్రబోధమున కైనెలకొల్పబడిన "ఉపనిష న్మందిరము"లో వీరు వేదస్మార్త పండితులుగా ప్రవేశించేరు.

"ప్రపేదిరేప్రాక్తన జన్మ విద్యాః" అన్న రీతిగా దుర్గాప్రసాద శర్మగారిలో శ్రీ విద్యాభిరుచి మెండు కాగా అప్పటికే శ్రీ విద్యలో లబ్ధ ప్రతిష్ఠులైన శ్రీ శ్రియానందనాథ ఈశ్వర సత్యనారాయణశర్మగారి వద్ద పంచదశీ ఉపదేశమును పొంది అటు పిమ్మట వారి ఆదేశము మేరకు వారి శిష్యులలో ప్రథమ గణ్యులైన శ్రీ పరసుఖానందనాథ శ్రీదువ్వూరి నరసింహమూర్తి గారి వద్ద పాదుకాంత దీక్షయూ స్వీకరించి తన ఇంట భూపుర శ్రీ చక్ర ప్రతిష్ఠ గావించి శ్రీదేవీ ఉపాసన దీక్షగా చేయుచూ, శ్రీ విద్యానందనాథ దీక్షానామమును స్వీకరించి "భోగమోక్షకరీవిద్యా" అను నానుడి సార్థక మగునట్లు పెక్కు రార్తులకు శ్రీ చక్రార్చనద్వారా శ్రీ సుబ్రహ్మణ్య నవావరణార్చన ద్వారా ఐహికములైన ఇబ్బందులను తొలగించుచూ మంత్ర

శాస్త్రమునందు ప్రజలకు విశ్వాసమును పాదుకొల్పిరి. 1978 లో గురువుల యొక్క ఆదేశము అనుగ్రహము కారణముగా శ్రీచక్రమేరు ప్రతిష్ఠ మహావైభవముగా సుమారు 30 మంది బుత్విక్కులతో జరిపించిరి. ఆనాటి నుండి దినదిన ప్రవర్థమానముగా చండీయాగములు, మత్స్యయంత్ర ప్రతిష్ఠలు మొదలగు వైదిక కార్యక్రమము లను జరుపుచున్నారు. వీరు పరసుఖానంద నాథులతో కలిసి దక్షిణ దేశమునగల సుప్రసిద్ధ పట్టణములను ఆలయములను దర్శించుటయే కాక ఆయాయీ చోట్ల ఆసక్తిగల వారికి ఉపదేశముల నొనర్చుచూ తిరువాయూరు, చిదంబరములలో దాక్షిణాత్య పండితులచే ఘనసత్కారము లందుకొన్నారు.

వీరు 1978 నుండి దేవీ నవరాత్ర ఉత్సవములను కడు శ్రద్ధతో జరువుచు అనుదినము సుమారు 200 మందికి అన్నసంతర్పణ గావించుచున్నారు. వీరు తమ గురువులైన శ్రీ శ్రియానందనాథులవారి స్వప్న సాక్షాత్కారమును పొంది సిద్ధనాగ క్షేత్రమైన శ్రీశైలంలో సామయిక మిత్రులతో కలిసి షోడశీ మంత్ర పురశ్చరణమును గావించినారు. శ్రీశైలంలో వీరి దీక్షాదక్షతలను చూచిన జగద్గురు శ్రీ శృంగేరీ పీఠాధిపతులు శ్రీవాసుదేవానంద భారతీ స్వాములవారు శ్రీ షోడశీ మంత్రదీక్షా పత్రమును వీరి కందించి ఆశీర్వదించినారు.

1985 లో వీరు శ్రీకాకుళం కృష్ణాపార్కు తూర్పు వీధిలో నూతన గృహ నిర్మాణం చేసి అందు శ్రీ రాజరాజేశ్వరీ దేవీ పీఠమును నెలకొల్పినారు. శ్రీ రాజరాజేశ్వరీ దేవి సన్నిధిని ప్రతి పూర్ణిమా దినముననను, విశేష పర్వదినములయందును సాంగోపాంగముగా శ్రీ చక్రార్చనమును జరుపుచున్నారు. వీరి ఆధ్వర్యంలో

శ్రీ విద్యానందనాథ (పరమ గురువులు) ద.వే. లక్ష్మీదత్తుగారి జయంతియు, శ్రీ శ్రియానందనాథ (స్వ గురువులు) శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారి యొక్కయు, పరసుఖానంద నాథ (గురువులు) శ్రీ దువ్వూరి నరసింహమూర్తిగారి యొక్కయు జయంత్యుత్సవములు కడు శ్రద్ధాభక్తులతో జరుపబడుచున్నవి.

పై ఉత్సవములకు రాష్ట్రం అంతటినుండి వీరి శిష్యులు, అభిమానులు అధికసంఖ్యలో పాల్గొనుట విశేషము.

2000 సంllలో వారణాశీ క్షేత్రంలో శిష్యసహచరులతో కలసి త్రిపుర భైరవీఘాట్‌లో మండలదీక్షగ శ్రీ చక్రార్చనమును చేసి పూర్ణాహుతిని సమర్పించిన ధన్యులువీరు. వీరిని ఇటీవల విశాఖ పట్టణంలో లలితా పరాభట్టారికా పీఠాధిపతులు శ్రీ యద్దనపూడి అయ్యన్న పంతులుగారు. "మహాకామేశ్వరీ పురస్కారం" 24 పండితులతో పాటు వీరికిచ్చి గౌరవించిరి.

పలు తావులనుండి వచ్చు శ్రీవిద్యా జిజ్ఞాసువులకు వారి సందేహములను తొలగించుటయేగాక సౌందర్యలహరి, సప్తశతి, భావనోపనిషత్తు మున్నగు శ్రీవిద్యా గ్రంథములను బోధించుట వీరి అలవాటు.

ప్రతి సంవత్సరం ఫాల్గుణ శుద్ధ పంచమీ దినమున శ్రీరాజరాజేశ్వరీ దేవీపీఠ వార్షికోత్సవమును జరిపించుచూ పండితులను, కళాకారులను సత్కరించుచున్నారు. శ్రీ విద్యానందనాథ, శ్రీశ్రియానందనాథ శ్రీ పరసుఖానందనాథ గురువుల సంపూర్ణ అనుగ్రహమున వారి కుటుంబ సభ్యుల సహకారముతో నిర్విఘ్నముగా, అవిచ్ఛిన్నముగా, శ్రీరాజరాజేశ్వరీ పీఠము భక్తుల కోర్కెలను తీర్చునదై సహస్రానేక శిష్య ప్రశిష్య వర్గముతో అలరారుగాక.

వీరు సంకల్పించిన లోకహితంకరమైన, అపురూపమైన శ్రీ శ్రియానందనాథులవారి శ్రీ విద్యా గ్రంథముల పునర్ముద్రణము జరిగి జిజ్ఞాసువులకు కరభూషణములుగను. కంఠభూషణములుగను వెలయుగాత యని ప్రజ్ఞారూపిణియైన శ్రీమాతను ప్రార్థించుచున్నాను.

దుర్గా ప్రసాద శర్మాణం
శఠమర్షణ గోత్రిణం
దుర్గే ! త్వం కరుణాసారై
రభిషించస్వ కింకరమ్ ॥

శ్రీ చక్రార్చన నిరతం । శ్రీవిద్యాశేవధిం గురూత్తంసం ।
శ్రీ శఠ మర్షాణ గోత్రం । వందే దుర్గాప్రసాద శర్మాణమ్ ।

శ్రీ విద్యానందనాథం నిరవధికరుణా వార్నిధిం నౌమి భక్త్యా
శ్రీ విద్యా దానదీక్షం పరమ గురువరం శ్రీ శ్రియానందనాథం ।
శ్రీమాతుః ప్రీతి పాత్రం నిరతిశయదయా శేవధిం సర్వవంద్యం
సేవే ఽ స్మద్దేశికేంద్రం సతత పర సుఖానందనాథం ద్విజేంద్రమ్॥

ఇట్లు
ఉభయ భాషాప్రవీణ,
**ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు,**
కార్యదర్శి,
ఉపనిషన్మందిరం,
శ్రీకాకుళం.

శ్రీ మాత్రేనమః

# పద నిర్ణేజనము

ఈ గ్రంథము "సాధన సామగ్రి" అను శుభనామము గలది. సామగ్రి అనగా వస్తు నిర్మాణమున కగు పరికర సమూహము. శ్రీ శంకరులు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అనిరి. దీని అర్థము మోక్షమున కుపకరించు వానిలో భక్తియే గొప్పదని. మోక్షప్రాపక మగు మార్గములలో భక్తికే తొలిస్థాన మిచ్చిరి. భక్తి జ్ఞానములు వేరుకావు. అవ్యభిచరభక్తియే తనకు తానుగా మోక్ష ప్రాపక మగును. ఈ విషయమును శ్రీ శంకరులు తమ గీతాభాష్యములో సిద్ధాంతితము చేసిరి. శ్రీ శంకరుల పై ప్రమాణ వాక్యములో గల మూడు పదములలో సాధన సామగ్రి అను పదద్వయమును తీసికొని ఈ గ్రంథకర్తలగు శ్రీ శ్రియానంద నాథ దీక్షానా మాంచితులు, బ్రహ్మీభూతులు నగు ఈశ్వర సత్యనారాయణ శర్మగారు తమ రచనకు నామసార్థకత, ప్రామాణ్యము, పూర్వాచార్య గౌరవమును కనపఱచిరి. ఆధ్యాత్మశాస్త్రము దేనికైనను మోక్షమే పరమ ప్రయోజనము. "జ్ఞానాదేవతు కైవల్యం" అను ప్రశస్త వాక్యమునకు "భక్తిరేవ గరీయసీ" అను శంకరుల మాట విరోధిగ కనిపించును. పై చూపునకు కర్మజ్ఞానభక్తి యోగములు భిన్నముగ నున్ననూ పరమార్థమున ఇవి ఉచ్చావచనములు కాక అన్యోన్య సాపేక్షములను పరమసత్యమును నిరూపించు టకే శ్రీ శంకరులు గీతోపనిషద్భాష్యములను రచించి రని నా

అభిప్రాయము. ఈ నిశ్చయజ్ఞానముతో వారి బ్రహ్మసూత్ర భాష్య రచన పరిశీలించినచో ఆచార్య హృదయము అవగత మగును. విషయ సమన్వయమున శ్రీశంకరులదే పై చేయి.

ఈ గ్రంథ కర్తలగు శర్మగారునూ పై సత్యమును మనసున నిడుకొని ఈ "సాధన సామగ్రిని" సాధక సౌకర్యము కొరకై నాలుగు మూటలుగ కట్టి మోక్షప్ర స్థానమునకు పాథేయము సమకూర్చిరి. వీరు శిష్యహితైషులై ఆధ్యాత్మ శాస్త్రములో యోగసాధన ప్రధాన మగు మంత్రశాస్త్రమున గల అనేక రహస్యములను వివరించిరి. ఆచార వైయాత్యముచే అపార్థ తాడితములైన అనేక విషయముల యొక్క కల రూపును స్పష్టపరచి మంత్రశాస్త్ర గౌరవమును నిలిపిరి. ఈ గ్రంథము మంత్రశాస్త్రమునకు ప్రమాణీభూతమై ప్రత్యక్ష ఫలముగలదై భారతదేశమం దంతట ఆదరముగొన్న "సప్తశతి" (చండీపాఠము) నకు ఆంధ్ర వివరణము. దీనికి వీరు రచించిన "శ్రీ సప్తశత్యుపాసన క్రమము", "శాస్త్రసాధనము", అను రెండును పూర్వపీఠిక లనదగినవి. సాధన గ్రంథ మండలి వీటిని ప్రచురించినది. "సప్తశతి సమగ్రజ్ఞానమునకు ఈ రెండును" అవశ్యములు. వ్యాకరణ శాస్త్రమునకు పశ్పశాహ్నికము, ధ్వన్యాలోకమునకు "లోచన" వ్యాఖ్యయు ఎట్లు ఉపకరించునో అట్లే ఈ రెండును. శ్రీ శర్మగారు అనేకము లగు సాధన రహస్యములనే కాక మంత్రశాస్త్ర మహోదధిలోగల అమూల్య రత్నములను వెలికి తీసి స్వానుభవముతో సాధక లోకమునకు అనేక సత్యము లందించిరి.

ఈ గ్రంథము నాలుగు మూటలది. ముడిలేనిదె మూట కాదు. ముడియన గ్రంథి. గ్రంథియనగ లక్షణయా రహస్యమని అర్థము. శబ్ద శాస్త్రమున గల రహస్యములను గ్రంథులని నైషధ కావ్యకర్త యగు శ్రీ హర్షుడన్నాడు. తాను సప్రయత్నముగనే ఈ గ్రంథులు గ్రథించితి ననుచు గురు పద పదవీ పరిణద్ధచిత్తులై, గుర్వనుగ్రహము బడసి ఈ గ్రంథులు విడదీసికొని సాహిత్యానంద సముద్రములో మునుగ మన్నాడు. సాహిత్య శాస్త్రములో గల వ్యాకరణ, అలంకార ధ్వన్యాదుల మర్మము లన్నియు నైషధమున నిక్షేపించినాడు. "నైషధం విద్వదౌషధం" అనుమాట చాల అర్థముగలది. దీనిలో కావ్యత్వము కంటె శాస్త్రత నాలుగింద లున్నది. రహస్య మనగ వెలిచూపున కానక స్వయంకృషితోను గురుసహాయము తోను తెలియ దగినదనుట. ఇది ముఖ్యముగ మంత్ర శాస్త్రమున ప్రాథమిక నియమము. శ్రీ విద్యారహస్య వేత్తలు, ఉపాసనాసిద్ధులైన మేధావు లెందరో "సప్తశతి"కి సంప్రదాయాను సారముగ అసంఖ్యాకము లైన వ్యాఖ్యలు వెలయించిరి. గౌడ, దాక్షిణాత్య సంప్రదాయములు రెండున్నవి. ఇది వేరుమాట. మంత్రశాస్త్ర గ్రంథము లన్నియు వైదిక ప్రామాణ్యము గలవి. శ్రీ విద్య మూలతత్త్వము పరమార్థమున వైదికమైనను సాధన విషయములో అనుభవ ప్రమాణ మగు విషయ మగుట సంప్రదాయ భేదము చూపడును. శాస్త్రసిద్ధి నొంది, విద్యాసిద్ధులై సంప్రదాయ సాంపరాయ సమ న్వయము, సామరస్యము ఎరిగి

వ్యాఖ్యాభాష్యములు వ్రాయుట చాల క్లిష్టమగు విషయము. అందులకే ప్రసిద్ధ శాస్త్ర గ్రంథములకు పూర్వవ్యాఖ్య-లే నేటికిని శరణ్యము లగుచున్నవి. శ్రీ శంకరగౌడపాదులు అద్వైత సిద్ధాంత ప్రవర్తకులై తదభిన్నమగు .... శ్రీ విద్యా ప్రతిపాదకము లైన "సుభగోదయము" శ్రీలలితా త్రిశతీవ్యాఖ్య", "సౌందర్యలహరి", "ప్రపంచసార తంత్రము" మొదలగు గ్రంథములను రచించి శ్రీ విద్యకు వేదసమాన ప్రతిపత్తిని కల్పించిరి. అర్చావిధిలో ఈ నాటికిని శంకరపీఠము లన్నిటిలో శ్రీ విద్యా సంప్రదాయమే ఆదరింప బడుచున్నది.

ఇట్టి గ్రంథము లనేకములను మథించి స్థూలసూక్ష్మ పరోపాసనలలో సంప్రదాయ మేదైనను సాధకునికి పొడసూపు ఎన్నో సందేహములకు సహేతుకము లగు సమాధానములు సాధించి శ్రీ శర్మగారుమనకందించిన నాలుగు ముల్లెలే ఈ "సాధన సామగ్రి". గ్రంథి విశ్లేషము కష్టము కాకుండునట్లు భాషలోను విషయ వివరణలోను శీర్షికా క్రమములోను ఔచిత్యము చూపి పదలాఘవ లాలిత్యములతో ఒక కావ్యముగ మలచిరి. దీని రచనమునకు ఎనిమిదేండ్లు పట్టినది. చేవ్రాతలో రెండువేల అరటావుల బరువు. ఆయన వయస్సు ఎనుబది సంవత్సరములకుముదిమి. "కూర్పరిమనవి" అను తొలిమూట ప్రాగ్వచనములో వారే ఇట్లన్నారు. "ఈ యంత్రములో నుండి అమ్మ ఏమిపల్కి వ్రాయించినదో అమ్మాటలే ఈ కూర్పు" అనియు వ్రాసియున్నారు.

కాలవశమున శ్రీ విద్య, దానితత్త్వము, ఆచారవక్రతవలన ఖిల మగుచున్నది. ప్రమాణ గ్రంథములన్నియు సంస్కృతభాషా గ్రథితము లగుట దుర్బోధముగ నుండును. విడమరచి బోధించు సద్గురువుల లేమియు కొంత కారణము. ఇట్టి స్థితిని గ్రహించిన శ్రీ శర్మగారు తెనుగున ఈ "సాధన సామగ్రి" రచించి ఆంధ్రదేశమునకు మహోపకారము చేసిరి. ఇవి నా మాటలే కావు. సారస్వతోపాసకులై, మంత్రతంత్ర రహస్యముల నెఱిగిన పలువురు విజ్ఞుల మాట. దీని తొలిమూట కభిప్రాయ మిచ్చిన భారతీపుత్రులు, అరవిందయోగ సిద్ధులు నగు కీ॥శే. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి ఈ క్రింది మాటలు కితాబులు. "ఇది తంత్రశాస్త్రమునకొక అలంకారముగను, సాధకులకు కంఠమణిగ నుండి ఒక క్రొత్త వెలుగు చూపుచు కరదీపికవలె మనతో పయినించుచూ ఒక కావ్యము వలె చదివించును. ఇక శ్రీషోడశీరామయణ గ్రంథకర్తలు, మంత్రశాస్త్ర రహస్యజ్ఞులు, భాషా వరశేషులు నైన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి అభిప్రాయ మిట్లున్నది. "సప్తశతి" హృదయమెరుగుట ముముక్షువుల అవశ్య కర్తవ్యము. ఇట్టి నిగూఢ రహస్యములు వివరించిన శర్మగారు లోకమునకు మహోపకారము చేసిరి. ఇది ఇంగ్లీషులోను, సంస్కృతములోను అనువదింపతగిన అపూర్వకావ్యము." ఇదే గాక ఈ గ్రంథమువలన కలుగు లాభము లైదింటిని పేర్కొనిరి.

ఇక నా మాట "సాధన సామగ్రి" రచన మిషగ శ్రీ శర్మగారు ప్రత్యేకముగ "సప్తశతీ" రహస్యములు శ్రీ విద్యాశాస్త్ర

రహస్యములే కాక ఆధ్యాత్మ శాస్త్ర ప్రపంచమున తత్త్వము, సాధనము అను రెంటిని నేడు ఆవరించియున్న పలు మబ్బు తెరలు తొలగించి మనచే ఆత్మనూర్యావలోకమునకు సాయపడిరి. 1. విషయము 2. ప్రయోజనము 3. ఉపాయము 4. సంబంధము అను నాలుగు శాస్త్రాంగములు సమగ్రముగ పోషింపబడినవై ఆధ్యాత్మశాస్త్రమునకు పరమ ప్రమాణముగను పారిభాషిక పదసమగ్ర వివరణము గల గ్రంథముగను దీనిని నేను భావించుచున్నాను. గ్రంథస్థ విషయమును సమగ్రముగ పరామర్శించుటకు నేను చాలను. గ్రంథకర్తలగు శ్రీ శర్మగారు నాకు పితామహులు, విద్యాదాతలును పుత్ర నిర్విశేషముగ నను సాకిరి. గ్రంథ ప్రకాశకుల ఆజ్ఞతో గురు, పితృఋణము తీర్చుకొను అదనుగ మాత్రమే దీనిని భావించి ఈ నాల్గు మాటలు వ్రాయసాహసించితిని. దొసగులు మన్నింప ప్రార్థన.

ఈ గ్రంథ ప్రచురణమునకు స్వచ్ఛ గురుభక్తితోను, శిష్య సాహాయ్యముతోను ఉద్యమించిన దైవజ్ఞులు శ్రీ విద్యానందనాథ దీక్షా నామాంచితులు, ప్రత్యక్షీకృత రాజరాజేశ్వరులు నైన బ్ర.శ్రీ.వే. సుసరాపు దుర్గాప్రసాద శర్మగారు కృతార్థులు. గురు కటాక్ష భాగ్యులు.

ఈ సాధన సామగ్రియెగాక తమ శ్రీ విద్యాగురువులైన శ్రీ శ్రియానందనాథుల రచనములలో 1. శ్రీ విద్యాంధ్ర భాష్యము 2. దేవ పూజా రహస్యము 3. శ్రీ సప్తశత్యుపాసన క్రమము ఇటీవలనే పునర్ముద్రణము చేయించి కృతార్థులైరి. ఈ అక్షర

యజ్ఞమునకు గురు, సంప్రదాయగౌరవముతో ఆర్థిక సహకార మందించిన శ్రీ దుర్గా ప్రసాదశర్మగారి శత శిష్య, ప్రశిష్య వర్గమునకు విద్యాభిమానులకు శ్రీ మాతృ కృపాభాగ్యము కలుగుగాక.

1. శ్లో॥ శ్రీ విద్యాపారదృశ్వా ఽయం శ్రీ విద్యానందదేశికః ।
మను విచ్ఛతశిష్యో ఽయం జీయాల్లోకహితేరతః ॥

2. శ్లో॥ యువాపిపరిపక్వంయత్ జ్ఞానమాజానసంభవం ।
అమౌనీదక్షిణాస్యోయం భూచరోదైవవిగ్రహః ॥

3. శ్లో॥ గ్రంథప్రకాశనాత్తస్య భూయాద్గ్రంధకృతస్సమా ।
శ్రీవిద్యానందనాథస్య కీర్తిరాశామరీమృజా ॥
అని నాఆశాసనము.

ఈ గ్రంథములప్రూఫ్సులు దిద్దుటలోగల బహుశ్రమను, సహించి సహకరించిన శ్రీవిద్యాదీక్షితులు, శ్రీశుకానందనాథ దీక్షానాములైన సాధకోత్తములు శ్రీభాస్కరభట్ల నరసయ్య శర్మగారు. వీరు శ్రీకాకుళం పురపాలకోన్నత పాఠశాలలో ఆంధ్రభాషా పండితులు. వీరికి సాధకలోక పక్షమున, సాధన గ్రంథ మండలి పక్షమున కృతజ్ఞతాభినందనలు.

శ్రీ శర్మగారి గ్రంథములన్నిటికి పలుసార్లు పునర్ముద్రణ యోగము కల్గించి సాధక లోకమునకు చిరకాలముగ అక్షరరూప సరస్వతీ దర్శనముచేయించుచున్న సాధన గ్రంథమండలి వ్యవస్థాపకులు బ్ర.శ్రీ.వే. బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు

కృతార్థులు. ఆంధ్రదేశములో షుమారు 56 సంవత్సరముల నుండి ఆధ్యాత్మగ్రంథ ప్రచురణమే దీక్షగ నిర్వహించుచున్న శ్రీశాస్త్రిగారి వయస్సు తొంబదినాల్గు పంటలు. తమసంస్థ నామమును కృతార్థము చేయుచున్నారు. ఈ సరస్వతీ యజ్ఞములో వీరు చిరాధ్వర్యులు. నాకు సోదరనిర్విశేషులు. వీరిని శతాయురారోగ్య భాగులజేసి ఇట్టి ఆధ్యాత్మిక గ్రంథము లనేకము లింకను ప్రచురింప జేయుగాత మని నా ఇష్టదేవత నర్థించుచున్నాను.

1. శ్లో॥ శ్రీమచ్ఛంకరసద్గురోఃకృతిచయంముద్రాపయిత్వాభృశం
ప్రాగాచార్యకృతాన్యనేకరచనాన్యేతాన్యపిశ్రద్ధయా ।
సూర్యాలోకసుభాగధేయవిభవాన్యాధత్తుమయానతే
సోయంసాధనమండలీకులపతిః జీయాచ్ఛతంవత్సరాన్॥

2. శ్లో॥ నిత్యావగాహినంయుష్మత్పదనిర్ణేజనాంభసి ।
సూర్యప్రకాశనామానంతనుజంపాహిచండికే ॥

అరసవిల్లి పోస్టు
శ్రీకాకుళంజిల్లా
532401
తేది : 20-11-2001

ఇట్లు
గురుపదపాంసువు
డా॥ ఈశ్వరసీతారామధన్వంతరి.
వ్యవస్థాపకాధ్యక్షుడు 'మహతి'
సాహితీసాంస్కృతిక సేవాసంస్థ

# కృతజ్ఞతాంజలి.

పురమథన పుణ్యకోటీ పుంజితకవిలోకసూక్తి రసధాటీ !

మనసి మమ కామకోటీ విహరతు కరుణావిపాకపరిపాటీ !

అమ్మవిషయమై యొకమాట - ఆ యమ్మ ప్రేరేపించిన బుద్ధియం దూహించి, అమ్మ పాదములయందే పూజాసక్తమై యుండు హస్తముతో వ్రాయఁగా నా మాట రతనాలమూట యేలకాదు ? ఇట్టి మూటలు రెండైనవి. ఇది నాలగవది (ప్రకటన వరుసలో). ఈ నాలగవమూట 1,2,3 మూటలకు తలమానికము వంటిది. ఈ మూటలు సాధన గ్రంథములఁ బ్రచురించు మా మండలికి వెలుఁగుబాటలైనవి. అడుగిడఁజాలని బడుగుపై నమృతంపు జల్లులైనవి. మా మండలి నేడు పుష్టమైనది. సాధక పఠితృలోకము తుష్టమైనది. ఇట్టి గ్రంథములు తనయందు వెలువడుటచే నాంధ్రభాషామతల్లి విశిష్టయైనది. పూజ్యులు, సద్గురువర్యులు, బ్రహ్మశ్రీ శ్రీ శ్రియానందనాథులు విశేషాదరముతో నీ రత్న మంజూషలను శక్తికొలది ముద్రణవ్యయముతో మా మండలి కొసఁగినారు.

శ్రీవారి యాదరమునఁ దోగి మండలి ఆలోకవీథులఁ బయనింపఁగల్గినందులకు మండలి, మండలి వ్యవస్థాపకుఁడుగా నేను - వారి శ్రీచరణరాజీవములకుఁ బునః పునః ప్రణామము లాచరించుటదక్క యన్య మాచరింపఁజాలను.

క్రోధి మార్గశిరము
తెనాలి
1964

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు :
సాధన గ్రంథ మండలి.

# విషయసూచిక





# శ్రీమాత కిది యంకితము.

ఈం కారవాచ్య ! ఐం హ్రీం
క్లీం కమనీయాంగి ! ఇత్తుఁ గృతి నీకే; కొ
మ్మోంకృతితో; నీ యమృత మ
యాంకమ్మునఁ జోటు నుంచుమా ! చాముండా !
శ్రీకర శ్రీకరమ్మునఁ ద్రిపుటి బోధ
మును సడల్చు త్రిశూలముఁ బూని, మహిష
నామక రజోగుణ ప్రవినాశిని వగు
నమ్మ, విమ్మూటలెల్ల నీ కచ్చుకొందు.

ఏయమ, అబ్బి ! వ్రాయుమని యీ పరమార్థ రహస్యబోధముల్
వ్రాయఁగ నెన్మిదేండ్లు పనిపట్టఁగఁ గట్టడచేసె, నమ్మహా
మాయవు, నాత్మవున్, సకలమాతవు; నీ కృతులెల్ల నిత్తు నీ
కే; యవి యందుకోఁదగు మహేశ్వరి! యర్థులు లాఁతు లెవ్వరే?
తిరముగ నాత్మదృష్టులు త్వదీయముఖమ్మున నిల్పు సాధనన్
బొరపడనట్టి నీ ప్రియతనూజులు నాకవరుల్ పవిత్రు లీ
సరకులె దారిబత్తెముగ, జన్మరుజాపహ శర్మదౌషధో
త్కరముల పైఁడిసంచికలుగాఁగని సద్గతిగాంత్రు, చండికా !
తల్లితనమ్ముఁజూపి, యిడి ధన్యునిఁ జేసితి; చూచి యిచ్చితిన్
ముల్లెలు మళ్లి నీకె; ప్రియపుత్త్రుల కంటనుబెట్టు బర్వు, నా
వల్లనుగాదు మోయ; సదుపాయయు చూడుమునీవె; యాధ్యులౌ
పిల్లలు కొల్లగాఁ గలరు; పేదఱికమ్మటె నీకు ? శ్రీమతీ !

- శ్రీ శ్రియానందనాథుఁడు.

శ్రీమాత్రే నమః

# సాధన సామగ్రి

## నాలుగవ మూట

ప్రథమఖండమందు బ్రహ్మకృత దేవీస్తుతి.

ప్రలయకాలమందు జగత్తు ఏకార్ణవీకృతమైనపుడు, ప్రభువు భగవంతుఁడు నైన విష్ణుఁడు శేషశయ్యపై యోగ నిద్రను సేవించు చుండెను. అపుడు మధువు, కైటభుఁడు అనెడి పేళ్లతో నిరువురు ఘోరాసురులు, విష్ణుని చెవి గులిమివలనఁ బుట్టినవారు బ్రహ్మను జంపఁగడఁగిరి.

దీని వెనుకటిమంత్రమందు మేధసమహర్షి, మహామాయ నిత్యయయ్యును దేవకార్యసిద్ధికై విశిష్టరూపముతో నావిర్భ వించునపుడు 'ఉత్పన్నా' యని ప్రసిద్ధ, యని చెప్పెను. ఇపుడామె దేవకార్యసిద్ధికైన విశిష్టావిర్భావమును వర్ణించుచున్నాఁడు.

ఇక్కడనుండియే దేవీమాహాత్మ్యవర్ణనము మొదలు.

కల్పాంత మనఁగాఁ బ్రలయకాలము. సృష్టిబీజములు బ్రహ్మమందు లీనమైపోయినపుడు జగత్తుండదు. ఏకార్ణవీకృత మగును. జగత్తనెడి కార్యసమష్టి పరమకారణమందు లీనమగుట - అనఁగా నివి కారణీభావము నొందుటపేరే యేకార్ణవము. ఋగ్వేదమందుఁ జెప్పఁబడిన సృష్టితత్త్వమందు 'సముద్రము, అర్ణవము' అను రెండిటి సృష్టులమాట కలదు. ఈ రెండును నొక్క యర్థము నిచ్చు మాటలేయైనను ఒకటి కార్యమును, రెండవది కారణమును దెల్పును. మఱ్ఱి విత్తు, కాఁబోవు మఱ్ఱి చెట్టు యొక్క

పూర్వావస్థ యైనటులే, జగత్తనెడి యశ్వత్థవృక్షపు బీజము - కర్మసంస్కారసమూహము, బ్రహ్మ మనెడి పరమ కారణమందు నిల్చియుండును. అపుడే కల్పాన్త కాలమను పేరఁ బ్రసిద్ధమగును. ఇట్టివేళ శుద్ధచైతన్యము తక్క మఱేమియు ననుభవమునకు రాదు. కనుక దీనినే యేకార్ణవమని, కారణ సముద్రమని యందురు.

ఇక్కల్పాన్తకాలమందు విష్ణువు యోగనిద్రారాధన చేయును. విష్ణువనఁగా జగద్వ్యాపక చిచ్ఛక్తియే. దేనియందు జగత్తు నిల్చియున్నదో, ఏ చైతన్యము జగత్తనెడి ప్రతీతితో విశిష్టమో దాని పేరే విష్ణువు. సాధనక్షేత్రమం దిది ప్రాణమను పేరితోఁ జెప్పఁబడును. శ్రుతియు - "ఈ సమస్తజగత్తును బ్రాణమే ధరించినది. అదే భగవంతుఁడు" అనెను. "ఉత్పత్తిం ప్రలయంచైవ భూతానా మాగతిం గతిం। వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి॥" "ప్రాణుల యుత్పత్తియు, ఆగమమును, నిర్గమమును, విద్యయు, అవిద్యయు నను నీ విషయము లెవ్వనికి బాగుగాఁ దెలియునో యతఁడే భగవంతుఁడు;" విష్ణుని మఱియొక పేరు. ప్రభువు - అనఁగా స్వాధీనుఁడు; స్వతంత్రముగాఁ దన యిచ్ఛాశక్తిని నడుపఁగలవాఁడు. "కర్తు మకర్తు మన్యథా కర్తుం వా సమర్థః ప్రభుః" అమ్మ యితనికి యిచ్ఛా మాత్రమున సర్వసంకల్పములు సిద్ధింపగలంత యధికార మిచ్చినది. కనుక నితఁడు ప్రభువు. సరే; అతఁడేమి కానీ; జగత్తుండ నపుడు జగద్వ్యాపకచైతన్యము (ప్రాణము) ఏ విధముగా నిల్చి యుండును ? అను దానికి సమాధానముగానే "శేషమాస్తీర్య" అపుడు ప్రాణము అవశేషామృతము నాస్తరణముగాఁ జేసికొని -

అనఁగా మున్ముందు కాఁబోవు జగత్తుయొక్క బీజములను శయ్యారూపమునఁ గల్పించుకొని (అధఃకృత మొనర్చుకొని) అనఁగా దనలోనే ప్రలీనము చేసికొని యోగనిద్రను సేవించును.

యోగమనఁగా నిచటఁ బరమాత్మమిలనభావము. అట్టివేళ జగద్భావము సుప్తమైయుండును. జగద్వ్యవహారపక్షమున నిది నిద్రవంటిది. జగద్వ్యాపకుఁడుగా సదా యుండెడి యా విష్ణుఁడు, జగత్తు లేకుంటచేఁ దన వ్యాపకత్వము, ప్రభుత్వము, భగవత్త్వము మున్నగువానిని విస్మృతిగర్భమందు ముంచివేసి తామసీ నిద్రారూపిణి మహామాయ యొడియందు నిద్రించును. ఇదెట్లు కాఁగలదు ? - ఒక్క యోగమువల్లనే సంభవము. పరమాత్మభావము నందుఁ దన విశిష్టభావమును జేర్చి వేయుటే యోగము. ఈ యోగము సుసిద్ధమైనపుడే జగద్వ్యాపారమునందు నిద్ర (సుప్త భావము) యగును. ఇది యొక యపూర్వ మధుమయావస్థ. ప్రలయకాలమందు భగవంతుఁడు విష్ణుఁడు, ఈ యోగనిద్రా రూపిణియైన మహామాయను భజించును. ఎవ్వఁడెవ్వరిని భజించునో, వాఁడు వారి సారూప్యము నొందును. ఇది సర్వవిజ్ఞాన సమ్మతతత్త్వము; కనుక నీయవస్థయందు విష్ణునకు మఱి స్వతంత్రత యుండదు. "నేను విష్ణుఁడ" ననెడి ప్రతీతి యుండదు. అట్టియపుడు యోగనిద్రారూపిణియైన యమ్మ సత్తయే తోఁచును.

విష్ణుకర్ణ శబ్దార్థము - వ్యాపకచిదాకాశము. శబ్దగుణాత్మకా కాశమును దెలుపుటకే కర్ణశబ్దమును, వ్యాపకత్వమును దెలుపుటకే విష్ణుశబ్దమును బ్రయోగింపఁబడినవి. వల్ల శబ్దార్థము ఆవరకము.

నిర్మల శుద్ధచిదాకాశమునకు ఆవరణ స్వరూపమని, మధుకైటభు లను విష్ణుకర్ణమలోద్భూతులనెను. మధు శబ్దార్థము ఆనందము; కైటభ శబ్దార్థము బహుత్వము. "కీటవద్భాతీతి కీటభః తస్యభావః కైటభః" చిన్న చిన్న కీటము లొక్కచోటఁ జేరుకొని తమ తమ శక్తికొలఁది స్పందనధర్మమును జూపుచు, నొకచోట బహుత్వమును దెలుపునటులే, సంచితకర్మ బీజసమూహము, ఒక్కసారి యనేక భావముల పరిజ్ఞాపనము చేయును; గనుక బహుత్వ బీజములే కైటభనామముతోఁ బ్రసిద్ధము. మొత్తపుమాట యేమనఁగా "ఏకో ఽహం బహుస్యామ్" అను నీ రెండు సంస్కారముల పేరే మధుకైటభులు.

ఇపుడు మనము యథార్థసాధన యుద్ధక్షేత్రమందుఁ జేరికొంటిమి. ఇక్కడ నుండియే దేవీమాహాత్మ్యము, దేవి యావిర్భా వము, దేవకార్యసిద్ధి, అసుర నిధనము మున్నగు లోకాతీత ఘటన ముల వైచిత్ర్యమునందుఁ బడుదుము. సాధకా ! రమ్ము; నెమ్మదిగా ముందడుగు వేయుము. అతి గహనమైన రహస్యము అమ్మా ! బుద్ధిబలము నిమ్ము. నీవు మాయెదుట విజ్ఞానమయ మూర్తితో నిల్వుము. అతిగంభీరరహస్యములతోఁ గూడిన యీ సాధన తత్త్వములను వెల్లడింపుము. మేము ధన్యుల మగుదుము గాక. నీ జగత్తు, నీప్రియతమ సంతానము, ఈ సమస్యయందు మఱుఁగువడియున్న యమృతపాత్రమును గైకొని యమరమగుఁ గాక, ఈ బ్రహ్మర్షి దేశమందు మఱల నింటింటను బ్రహ్మర్షులు విరాజిల్లుదురు గాక.

జీవాత్ముఁడు సమాధి సహాయముతో శుద్ధబోధమనెడి గురుసన్నిధిని మహామాయా స్వరూపస్వభావముల నెఱింగికొని, యామె విశిష్టావిర్భావమును గార్యములను బ్రత్యక్షము చేసికొనుటకై వ్యాకులుఁడై యపేక్షించుచున్నాఁడు. సమాధిస్థుడైనచో నీ సర్వతత్త్వములును దెలిసిపోవును. సాధకా ! మఱువకుమా - ఇది సవికల్పసమాధి. కీలకవ్యాఖ్యయందుఁ జెప్పఁబడినది - కృష్ణాష్టమి - మనస్సుయొక్క, అర్ధభాగలయావస్థతోఁ గృష్ణచతుర్దశి - ఒక్క కళ మిగులువఱకు నగు సమాహితావస్థయందు, ఈ సర్వతత్త్వము లును వికసించుచుండును. సాధకుఁడీ విధముగా సమాధిస్థుఁడై కాతరప్రాణముతో వ్యాకుల హృదయమందు మాత్రావిర్భావమును, మాయావిశిష్ట కార్యములను విశిష్టస్పృహ మును బ్రత్యక్షము చేసికొనుటకై యపేక్షించు చుండునపుడు, రేవగళ్లు తనను జంచలునిఁగాఁ జేయుచున్న జగద్భావములు, అమ్మ కృపచే మఱి తల మెత్తకుండుటను గనుగొనును. జగద్బీజము - సంసారము యొక్క అస్తిత్వము (ఉన్నదనుమాట) ఇంచుకంత ప్రతీతమగు చుండును గాని, దాని విశిష్టస్వరూపానుభవము కాదు. ఎదుట అతిఘనమును, అతిశుభ్రమును, స్వప్రకాశమైన మహావ్యోమమే ప్రత్యక్షమగు చుండును. దీనిపేరే కల్పాన్తకాలము; జగత్తుయొక్క యేకా ర్ణవీ భావము. శేషశయ్యపై విష్ణుని యోగనిద్ర. ఈ యవస్థ యందుఁ జేరుకొన్నపై నగునట్టి హద్దులేని యానందసంభోగము నేడ, సాధకుఁడు కొన్నాళ్లు ముగ్ధుఁడగును. ఏ విధమైన విశిష్టేచ్ఛయు రేకెత్తఁజాలదు. అట్టి యవస్థయందు క్షణముండి జాఱి పోవును. మఱల జగద్భావమునందు దిగిపోవును. అపుడు కడు దుఃఖ

మగును. ఆ యానందస్థితిని దలఁచుకొని బాధపడునపుడు మఱింత దీనుఁడై, అమ్మా ! అమ్మా ! యని యఱచుచుండును. శ్రీ గురు చరణములను మఱింత గట్టిగాఁ బట్టుకొనును. దాని ఫలముగా సౌభాగ్యవంతుఁడైన జీవుఁడు, అమ్మ కృపచే మును జెప్పిన యానందావస్థయందు మఱికొంతసేఁపు నిల్వగల్గు సామర్థ్యము నొందును. అపుడతఁడు "మధుమయక్షేత్రమైన అమ్మయొడినుండి నేనేల జాఱిపోయితి" నని తెలిసికొనఁ గోరును. మఱియు, "అమ్మా ! నన్నెవ్వ రిచ్చటినుండి లాఁగివేసి, మఱల జగద్భావమందు ముగ్ధనొనర్చిరో, చెప్పి చూపవా ?" యని వేడుకొనును. అప్పు డమ్మ కృపచే, ఆ నిర్మల శుభ్ర చిదాకాశక్షేత్రమందు, మల - ఆవరక స్వరూపములైన రెండు సంస్కారములు తల సూపుట కనుగొనును. ఒకటి విశిష్టానందము, రెండవది బహుభావేచ్ఛ. ఇవే విష్ణుకర్ణ మలోద్భూతులైన (విష్ణుని చెవి గులిమివలనఁ బుట్టిన) మధుకై టభులు. ఇవే బహుభావేచ్ఛామూలకమైన యానందము పరమాత్మ యొక్క స్వరూపానందము. కనుక నిది విశిష్టానంద మనఁబడును. అగుఁగాక; అహంబోధాత్మకానందమును, బహుభావేచ్ఛయు ననెడి యీ రెండును విడదీయరాని సంస్కారములు. అవే సాధక కైవల్యమునకు విరోధులు; కావున నివి ఘోరాసురు లనఁబడెను. వీరు బ్రహ్మను జయింపఁగడఁగిరి. ఏమన వీరి దర్శనమైన యవస్థయందు, బ్రహ్మ (సృష్టిశక్తి - మనస్సు) విష్ణుని ప్రాణశక్తి యొడిలో నిశ్చలముగా నుండెను. అనఁగా, నించుమించు

నిష్క్రియావస్థయందుండెను. పరమాత్మతోఁ గూడి యుండుటే బ్రతుకు. దానినుండి విముఖుఁడగుటే చావు. ఆ సమయమును బట్టి మనస్సు నిష్క్రియమైయున్నను. అప్పుడును మనస్సు, నాభి - మణిపురచక్ర సంబంధమును బూర్తిగా విడువఁజాల దయ్యెఁ గనుక నా రెండు సంస్కారములును మనస్సును మఱలఁ గ్రియాశీలమునుగాఁ జేయుటచే జగదాకారముగా నాకారిత మగుటకై యులుకుచుండును. ఇదే మధుకైటభులు బ్రహ్మను జంపఁగడఁగుట.

అమ్మ కృపచే సాధకుఁ డీ మూలసంస్కారములను సాక్షాత్క రించుకొనును (అనుభవించును) నోరితో నెన్ని సారులన్నను వాని యనుభవము కాదు. మాయాకేంద్ర మెచటనున్నదో, యది యీ స్థానమందు మధుకైటభుల దర్శనముచే, దెలియఁగలరు. మున్ను "బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి" అని చెప్పఁబడెను. ఆ బలపూర్వకాకర్షణము, ఈ కేంద్రమునుండియే మొదలగును. ఇచ్చటనే యజేయులైన యసురు లున్నారు. మన యమ్మయొడిలో నిత్యము నుండకుండఁ .జేయు ప్రధాన విఘ్నములు. 'నేను' అనేకమగుదునని, అనేక విధముల నానందోప భోగము చేయుదునని కోరితిని. ఆ కోరిక పరమేశ్వరభావముదే; గాన నది యమోఘము. ఆ యిచ్ఛను హృదయమున ధరించి, యమ్మ తన స్వాధీనేచ్ఛతో స్వాధీనానందముతో నసంఖ్యయోని భ్రమణము చేసినది. బహుకాల మిటు లనేక జన్మములందిరిగి యొక్కసారి, యమ్మ యొడిజాడ నెఱింగినచో - నిర్మల పరమాత్మ స్వరూపాభాసము నొందినచో, ఆ బహుత్వమును, ఎప్పటికప్పుడు

నశించునానందమును బ్రీతిని గలిగింపవు; సరిగదా, బహుకటువు లుగాఁ దోఁచును. అపుడే మధుకైటభ వధమునకు సూత్రపాత మగును.

"స నాభికమలే విష్ణోః స్థితో బ్రహ్మ ప్రజాపతిః ।
దృష్ట్వా తావసురౌ చోగ్రౌ ప్రసుప్తంచ జనార్దనమ్ ॥

తుష్టావ యోగనిద్రాం తామేకాగ్రహృదయస్థితః ।
విబోధనార్థాయ హరే ర్హ రినేత్రకృతాలయామ్ ॥

విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితిసంహారకారిణీం ।
నిద్రాం భగవతీం విష్ణో రతులాం తేజసః ప్రభుః ॥"

వెన్నుని బొడ్డుతామరయం దున్నట్టియు, ప్రజాపతియై నట్టియు, తేజఃపతి యైనట్టియు బ్రహ్మ అత్యుగ్రులైన యయ్యిరువుర నసురులను, నిద్రితుఁడైన జనార్దనునిం జూచి, హరి నిద్రాభంగ మొనర్చుటకై, హరినేత్రకృతాలయయు, విశ్వేశ్వరియు, జగద్ధాత్రియు, స్థితిసంహారకారిణియు, భగవతియు, అతులనీయయు, విష్ణు నిద్రారూపిణియు నైన యా యోగనిద్రను, ఏకాగ్రచిత్తముతో స్తుతించెను.

వివరణము :- మధుకైటభులు విష్ణుని నాభికమలమందున్న బ్రహ్మను జయింపఁగడఁగిరి. అనఁగా మును జెప్పిన ప్రధాన సంస్కారములు రెండును, బ్రాణశక్తి యొడియందు నిదురించిన మనస్సును మఱల జగద్వ్యాపారమం దున్ముఖము చేయఁగడఁగెను. మనస్సు, ఆ రెండు వ్యాపారములను నుచ్ఛేదించు కోరికతోఁ బ్రాణశక్తికి శరణు చొచ్చి, ప్రాణము యోగనిద్రచేఁ గ్రమ్మఁబడుటఁ

గాంచెను. జగద్వ్యాపారమునుండి బహిర్ముఖమయ్యెను. అపు డా యవస్థయందు మఱల మెలఁగించుటకై యోగనిద్రకు శరణాగతుఁ డయ్యెను. యోగనిద్రారూపిణియైన యే మహామాయ ప్రాణశక్తిని జగద్వ్యాపారము నుండి విముఖ మొనర్చినదో, సృష్టిస్థితి సంహార కారిణియైన యా మహామాయయొక్క విశిష్టావిర్భావమును గోరి దీనముగా బ్రార్థించెను. ఇది యిందలి యాధ్యాత్మిక రహస్యము.

ఈ మంత్రమందు యోగనిద్ర కొక విశేషణమున్నది. "హరినేత్రకృతాలయా" హరి అనఁగా విష్ణువు - ప్రాణశక్తి. సర్వ భావములను హరించునది గాన, దీని పేరు హరి. ఛాందో గ్యోప నిషత్తునందు, ప్రాణోపాసన ప్రస్తావమున, ప్రాణమే సర్వభావ విలయకారి - జగద్గ్రాసకారి యని చెప్పబడెను. వాస్తవముగా నిది ప్రత్యక్షమే. జ్ఞానేంద్రియప్రవాహమేకానీ, కర్మేంద్రియప్రవాహమే కానీ, ప్రాణాది పంచవాయుప్రవాహమేకానీ, జననమరణాది పరివర్తన ప్రవాహమేకానీ, సర్వమును బ్రాణ శక్తి నాశ్రయించియే వెలయును; ప్రలీన మగును; గానఁ బ్రాణమే హరి. జీవుఁ డీ ప్రాణశక్తిసంధానము నొందనంత దాఁకఁ - బ్రాణమునే హరి యని, హరినే ప్రాణమని తెలియనంతదాఁక, తాను బ్రాణప్రతిష్ఠితుఁడు కాఁజాలనంతదాఁక, గురుని ప్రాణమునందుఁ దన ప్రాణమును జేర్పనంతదాఁక, ఆకాశము బ్రద్దలగునట్లు హరినామము నుచ్చరించి నను, వాని కమరత్వము, అమరపదసంధానము లభింపదు. మహాప్రభు గౌరాంగదేవుఁడు ఈ సర్వాశ్రయ ప్రాణసంధానము నొందియే, హరినామముతోఁ దన్నుఁ దా మఱచెను. ప్రాణహీన నామము మృతశబ్దమాత్రమే. కాని ప్రాణమయ నామము నామి కంటెను

 

గొప్పది. ఏ నామము నుచ్చరించుచు సాధకుఁడు ప్రాణానుభూతితోఁ దన్నుఁ దా మఱచునో, యా నామ మిప్పుడు కోటి కంఠము లతో నుచ్చరింపఁబడు చున్నది; గాని యెందఱు యథార్థ ప్రాణ సంధానము నొంది యమరత్వమునొంది రసఫలులగు చున్నారు ? నామము నుచ్చరించుచుఁ గన్నీరు విడుచుట, నేలపైఁ బొరలుట, సంస్కారఘటితమై ప్రాణహీనమైన యొక దేవమూర్తిని జూచుట, మున్నగున వన్నియు మనుష్యుని విషయమునఁ గాసంత మీది యవస్థలేకాని, యథార్థముగాఁ గృతార్థుఁడైనట్లు రుజువుచేయఁ దగినవి కావు. దానికేమిలే.

"హరినేత్రకృతాలయా" శబ్దముచేఁ బ్రాణముయొక్క బహిర్ముఖ ప్రకాశత్వము తెలియఁబడును. నేత్రము ప్రాణము యొక్క బాహిరప్రకాశస్థానము. సజీవ నిర్జీవుల విశిష్టత నేత్రముల వల్లనే తెలియఁబడును. ఏ ప్రాణమయి యొడియందు నిత్యమున్నామో, యామె ప్రధానరూపముతోఁ గన్నులయందే ప్రకాశించును. ఈ యక్షిగతపురుషుని గూర్చిన సాధన విషయము, ఉపనిషత్తులందును విశేషముగా వర్ణింపఁబడినది. ప్రతిమా పూజాదులందు 'చక్షుర్దాన' మనుచు నొక క్రియయున్నది. అది ప్రాణముయొక్క బహిర్ముఖ ప్రకాశమును గూర్చి చేయు క్రియయే. ప్రాణప్రతిష్ఠుడైన సాధకుఁడు మాత్రమే, ఏ యుపాయముచే మృణ్మయ జడచక్షువునుండి చైతన్య వికాసము ప్రకటమగునో తెలియఁగలఁడు. ఇక్కాలమం దింటింటఁ బ్రతిమాపూజా యగుచున్నది. కాని యకటా ! "తచ్చక్షుర్దేవ హితమ్" మున్నగు చక్షుర్దానమంత్రములు పఠనమాత్ర సమాప్తములగు చున్నవి. ఎందువలన ? ఏ యుపాయముచే మృణ్మయనేత్రము చిన్మయ

బహిర్వికాసముతోఁ బ్రకాశించునో యనునది తెలిసినవారు కొలదిమంది.

మన సర్వవిధములైన విద్యుక్త క్రియారంభములలో ఆచమనమంత్రమందు "దివీవ చక్షురాతతమ్" అని విశ్వవ్యాపి ప్రకాశశక్తియొక్క ఆంశికానుభవ విధాన మున్నది. అందఱు ఆచమనము చేయుదురు, గాని యీ జగద్వ్యాపి విష్ణుని పరమ పదమును, ఆకాశమునందు విస్తృతచక్షువువలెఁ బ్రకాశించు దానిని, ఆ సర్వతో భేదిదృక్ఛక్తిని బ్రత్యక్షము చేసికొన్నవారెందఱు ? అమ్మచక్షువుతోఁ జక్షువును జేర్చి చక్షుష్మంతు లైనవా రెందఱు ? సరే; అది వేఱే విషయము.

చక్షువునందే మన యమ్మ విశేషించి ప్రకాశించును. నేత్రముదారినే చైతన్యముయొక్క బహిర్ముఖవికాసము కానఁబడును. ఈ ప్రాణశక్తు లంతర్ముఖములై జగద్వ్యాపారము నుండి విరమించునపుడే, చక్షువునుండి వాని ప్రథమప్రకాశమగును. (తొల్తవి కన్నులదారినే కానఁబడును.) కావున మన యమ్మ "హరినేత్రకృతాలయా" యైనది. యోగనిద్రారూపిణి మహామాయ, ప్రాణముయొక్క జగన్ముఖవికాసమును నిరోధించినది. ఆ సమయ మందుఁ బ్రాణము, మాతృయోగము వల్లనైన యానందముచేఁ దన్నుఁదా మఱచినది. ఈ యవస్థయే విష్ణుని యోగనిద్ర. మహా మాయ - అమ్మ ప్రాణమును జగత్సంబంధమైన మంచి సెడ్డ లేమియులేని యొక యవస్థకుఁ దెచ్చి యుంచినది; గాని యమ్మ దానినిట్టి యవస్థయందును నుంచనొల్లదు. దానిచేతనే (ప్రాణశక్తిరూప విష్ణునిచేతనే) జగదుద్ధారవ్రతము పట్టించును. కనుక

విష్ణుని నిద్రాభంగమునకై యీ యా యోజనము. ఇందుచేత బ్రహ్మ (మనస్సు) మాతృచరణములందుఁ బడి స్తుతింపఁగడఁగెను.

ఈ యోగనిద్రారూపిణియైన మహామాయయే విశ్వేశ్వరి; జగద్ధాత్రి, స్థితిసంహారకారిణి. కనుకనే అతులనీయ (సాటిలేనిది). అచింత్యమైన యైశ్వర్యముకలది; భగవతి; మహామాయ యొక్క సృష్టిస్థితిప్రలయశక్తులను దెలుపుమాటలెన్నో మునుజెప్పితిమి. ఇంకను జెప్పఁబడును. దేవీమాహాత్మ్యమునం దిటులు చెప్పుట పునరుక్తిదోషము కాదు. ఏమనఁగా, అదే సాధనకు బీజము. వేదాన్తదర్శనమందలి "జన్మాద్యస్యయతః" అను నీ బ్రహ్మ నిరూపణ సూత్రము సైతము ఆ యొక్క యర్థమును బోధించునదియే. "దీనివలన నీ జగత్తుయొక్క జన్మస్థితి భంగములగు చున్నవో, యదే బ్రహ్మము." దానినెఱుంగుము. సాధన చేయుము. యోగము, తపస్సు, మఱేదేని. సాంప్రదాయికానుష్ఠానము మున్నగు నన్నిటి యుద్దేశ్య మిదే. ఇంతే. ఈ 'జన్మాద్యస్య యతః' యనుదాని యనుభవము చేయఁగల్గుట చేతనే జీవత్వము తుదముట్టును. మనము జీవులము. నాలుగు దిక్కులును జీవత్వపుటెల్లలు. వానినడుమ నివసించి మనము దీనులము, హీనులమునై కూరుచున్నాము. దేనివలన నీ జగత్తు రచింపఁబడినదో, దేనియందు నిల్చియున్నదో, మఱి దేనియందు విలీనమగునో, యేదే నొకవిధముగాఁ దెలియఁగల్గుటచేతనే జీవత్వ మంతమగును. కారణమేమనఁగా, అదే జీవుని యథార్థ స్వరూపము. ఈ సృష్టి స్థితి ప్రలయ రచనమనెడి మహత్త్వము మాట, యొకటి రెండు సార్లు వినినంతనే మన యాత్మస్వరూపము తేఁటపడదు. కనుకనే

సాధకవరేణ్యులు పూజ్యపాదులు ఋషులు మాటిమాటికి, నాత్మయొక్క యీ మూడుగుణములను, ఈ యీశ్వరత్వమును దలపింపఁజేయుటకే, గంభీరధ్వనితో - 'గంభీరవేది' యైన యేన్గునకు నిద్రాభంగమొనర్పఁ బ్రయాసపడిరి.

(చర్మమునుజీల్చి, మాంసమునుదఱిగి, రక్తపాతముచేసినను నిద్రవదలని యేనుఁగును "గంభీరవేది" యందురు. "నీవు బ్రహ్మమవే" యని వేయిసారులు వే విధముల బోధించినను, జీవుఁడు దాని యనుభవము చేయలేఁడు. కనుక జీవునకు గంభీరవేది గజమును సాటి చెప్పిరి.)

మనము గంభీరవేది గజములము. ఏ విధముగాను మన జీవత్వనిద్రాభంగము కాదు, కనుక సాధన జగద్విషయమున, అమ్మ మహత్త్వము, ఎంత పునరుక్తిదోషయుక్తమైన నంత మేలు. మాతృమహత్త్వ విషయమున నధికముగాఁ బునరుక్తులు పలుకువారే మన కధిక కృపావంతులు. మనము పునరుక్తి దోషములనే చూతుము, మలినత చూచుటే మన స్వభావము; కాని మనము చేయు నీ యవజ్ఞ నుపేక్షతో సహించియు, మాటిమాటికి మన కన్నులయెదుట మాతృ మహత్త్వమును జిత్రించువారి యవ్యాజకృప ధన్యము.

వినుము, మఱికొంత వివరణము. నాభికమల మనఁగా మణిపురచక్రము. తేజస్తత్త్వ కేంద్రము. మంత్రమందును "తేజసః ప్రభుః" అను మాట బ్రహ్మకు విశేషణముగా నున్నది. ఈ నాభిచక్రము నుండియే, జాగతికమైన సర్వభావములు వికసించు

చుండును. తేజస్తత్త్వము నుండియే రూపజగత్తు మొదలు, జగత్సంస్కార బీజము లుండునంతదాఁక మనస్సు - సృష్టిశక్తి యీ నాభికమల సంబంధమును విడువదు. విడువలేదు. రెండవవైపు హరినేత్రకృతాలయ యొక్క - ఆజ్ఞాచక్రస్థిత చిత్ప్రతిబింబము యొక్క మోహినీశక్తియెడ మిగుల ముగ్ధమై యుండును. ఈ యవస్థయందు మఱల ననేక భావములుగా స్పందితమగుటకై యుబికినను, మనస్సు మఱల నా శాంతావస్థను విడువ నొల్లదు. అపుడు, యోగనిద్రారూపిణియైన యే చిచ్ఛక్తి యొడిలోఁ బ్రాణము నిష్క్రియావస్థయందుండునో, యా శక్తికే శరణాగతమగును. అభిప్రాయ మేమనఁగా - ప్రాణము క్రియాసహితమగునపుడే, ఆగామికర్మ బీజస్వరూపములైన మూలసంస్కారముల - మధుకైటభుల - వినాశమగును. మఱల నది యనేక భావములుగా స్పందితము కానక్కఱలేదు.

  

# బ్రహ్మకృత స్తుతి

ఓం బ్రహ్మోవాచ ఓం.

ఓం. త్వం స్వాహా త్వం స్వధా త్వం హి
వషట్కారః స్వరాత్మికా ।
సుధా త్వమక్షరే నిత్యే
త్రిధా మాత్రాత్మికా స్థితా ॥ ఓం. 1

బ్రహ్మ స్తుతించుచున్నాఁడు.

ఓ యమ్మా ! నీవు స్వాహవు; నీవు స్వధవు; నీవే వషట్కారాది మంత్రమవు; ఉదాత్తాది స్వరములు; నీవే సుధువు; ఓ యక్షరా ! ఓ నిత్యా ! నీవే త్రిమాత్రా స్వరూపమవు.

వివరణము : 'నీవు' అనుమాట యెదురనున్న వ్యక్తిని గూర్చి ప్రయోగింపఁబడును. ఎదురలేని వ్యక్తినిగూర్చి 'నీవు' అనుట యుండదు. ఇచట బ్రహ్మ (మనస్సు) హరినేత్రకృతాలయయు, యోగనిద్రాస్వరూపిణియు నైన మహామాయను బ్రత్యక్షము చేసికొనుచున్నాఁడు కనుక, త్వం = నీవు, అన్నాఁడు. సాధకుఁడే యిట్లు చేయును. స్తుతి, ఆవేదనము, నివేదించుట, దీనప్రార్థనము, జాలియేడ్పు; ఏదయినను అమ్మను అప్రత్యక్షముగా నుంచి చేయకు.

అమ్మ యెక్కడనున్నది ? - అలక్ష్యస్థానమందు - (కానరాని చోట) నున్నది యని, నీవామె నుద్దేశించి కల్పనా సహాయముతో నిచటఁ గూర్చుండి స్తుతిపాఠమో సాధనమో చేయుదువు; అట్టి భావ ముండునంతదాఁక సాధనమార్గమందు వడిగా ముందడుగు

వేయఁజాలవు. సాధనరాజ్యమందుఁ గల్పనకుఁగాని, అనుమానమునకుఁగాని తావు లేదు. అప్రత్యక్షము నుద్దేశించి యెట్టి సాధనయు సాగదు. సాధనమం దడుగడుగునఁ బ్రత్యక్ష తానుభవము కావలయును. సాధనకుఁ బ్రత్యక్షతయే ప్రాణము; కనుక మన మిచట, బ్రహ్మచేసిన స్తుతికి వ్యాఖ్య వ్రాయక మున్ను, ఒక్కసారి మంత్రచైతన్య విషయమును సంక్షేపముగా నాలోచింతము. ఏమన మంత్రచైతన్యమువల్లనే దేవత ప్రత్యక్ష యగును. చైతన్యహీనముగా మంత్రాదుల నుచ్చరించుటచే - అనఁగా దేవత యప్రత్యక్షముగా నుండుటచేఁ బెక్కేండ్లు కఠిన సాధన చేసినను నిష్ఫలమే; ఇదే ఋషుల యాదేశము.

మంత్రము శబ్దవిశేషము; దేనిని మననము చేయుటచేఁ బరిత్రాణము కల్గునో యదే మంత్రము. మంత్రమునందుఁ బ్రతిపాదింపఁబడిన శ్రేష్ఠమైన యర్థమే గురువు. ఇట్టి యర్థమువల్ల నగు ననుభవము పేరే చైతన్యము. అదే యిష్టదేవత; ఈ విధముగా మంత్రము, గురువు, దేవత యను మూడింటిని, ఏకము చేయుటచేతనే మంత్రచైతన్య మగును. ఒక దృష్టాన్తముచేత నీ విషయమును సులభముగాఁ దెలుపుదును. "చింతపండు" అని యొకమాట యున్నది. ఇదే మంత్రమనుకో. చింతపండు అను శబ్దము నర్థము తెలియనంతసేఁపు, చింతపండేమిటో తెలియదు. అంతదాఁక నది మృతశబ్ద మాత్రమే. నోరితో లక్షసారులు 'చింతపండు' అనుచున్నను, దాని విషయమైన తెలివి గలుగదు. తరువాత నొకఁడు వచ్చి, చింతపండు రూపము, రుచి మున్నగు వానిని జక్కఁగాఁ దెలియఁజెప్పినపుడు, 'చింతపండు' అనుదాని

యర్థజ్ఞానము కలిగినది. ఈ యర్థము పేరే గురువు. మఱల 'చింతపండు' అనుమాట యుచ్చరించినంతనే కోలగా వంకరగా నుండు దాని రూపము, దాని పులుపురసము, మున్నగువాని జ్ఞానము బుకును. మఱల నెన్నఁడేని 'చింతపండు' అనఁగానే, దానిని జూడఁగానే దాని రుచి మున్నగువాని జ్ఞానము నీ యనుభవ పర్యంతము వికసించి నీ నోరూరును, అది చైతన్యమ యమైనదని తెలిసికొందువు. ఇటులే యంతట ననుకో. 'అమ్మ దయామయి' యనుము. అపుడు దయానుభవముతో నీ హృదయము నిండిపోఁగా, దయామయిాపదము, యథార్థముగాఁ బలుకఁబడిన దని తెలిసికొమ్ము. నీవు 'అమ్మ' యనుచున్నావు కాని, అమ్మ యెవరో యెఱుఁగవు. 'అమ్మ' అను మాటకు అర్థమును నీకుఁ దెలియదు. ఇట్టి యవస్థలో నీవు 'అమ్మ' యనుచున్నను అది మతృశబ్దమే. మఱెవ్వరేని, 'అమ్మ' యనఁగాఁ బరిపూర్ణ స్నేహమున కాధారమయిన జగద్వ్యాపి చైతన్యము; ఆమెయే ఆత్మ యని తెలియఁజెప్పుదురు. గురుకృపచేత నేనాఁ డీమాట తెలిసికొందువో, 'అమ్మ' యనఁగానే, యొక స్నేహఘనమును, జైతన్యమయము నైన యాత్మానుభవము, నీలో నేనాఁడుబుకునో యానాఁడే నీమాతృమంత్రము (అమ్మ యను నీ యుచ్చరించినది) చైతన్యమయ మైనదని తెలిసికొందువు. అర్థము నెఱుంగక, అర్థము ననుసరించు రసముతోను, భావముతోను, రసికుఁడును భావుకుఁడునుగాక; మంత్రస్తుతి వాక్యాదుల నుచ్చరించుటచే మనుజునకు యథార్థఫలము చేకూఱదు. ఇదిగో మంత్రచైతన్య మనెడి, వస్తువొక్కటి లేక పోవుటచేతనే సాధనమార్గము దుర్గమ

మును, అంధకారబంధురమునుగాఁ దోఁచును. కావున నేదేని స్తోత్రపాఠమో, విశిష్ట మంత్రజపమో, నామసంకీర్తనమో చేయువేళ నీ యాధ్యాత్మిక ప్రగతికి సాయపడు సదర్థము నెఱింగికొని యర్థాను రూప భావముతో స్వయం సంవేదితుఁడ వగుటకుఁ బ్రయత్నింపుము. అప్పుడే దాని యథార్థఫలము వడిగా నొందఁగలవు.

బ్రహ్మ (మనస్సు) ఆగామికర్మబీజ స్వరూపమైన మధుకైటభులను సమూలముగా నశింపఁజేయ మహాశక్తికి శరణాగతుఁడయ్యెను. ఏలన - అతఁడు, శక్తి యొక తత్త్వమే యనియు, శక్తియే సాధ్యమనియు, శక్తియే సర్వకారణ కారణ మనియు, అవాఙ్మానసగోచర పరమాత్మయనియుఁ దెలిసికొనెను. ఆమె కృపేచ్ఛ లేనిచో, నియ్యసుర నిధనము కాదనియు నెంచెను; గాన మహామాయను స్తుతింపఁగడఁగెను. సమాధ్యవస్థయం దీ సర్వవ్యాపారములు నెట్లు సిద్ధమగు నందురేని, వారు పుస్తకాలు చదివి సమాధి శబ్దమును ముఖస్థముచేసి కొన్నవారు. ఏ సమాధియందు సర్వభావములును బూర్తిగా విలయమగునో, యా దిన మొక్కసారియే వచ్చును. ఆ సమాధి యగునపుడు మఱి వ్యుత్థితుఁడు కాఁడు. కనుకనే గీతయందు "యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ" అనఁబడినది. మఱి యిదియో, ఆ సమాధియందుఁ జేరికొనుటకు ముందుగానగు నవస్థామాత్రమే. అయిన నిదియు సమాధియే. ఏమన నీ యవస్థయందు జాగతిక వ్యాపారములు, ఇంద్రియవృత్తిప్రవాహము, ప్రాణవాయు స్పందనము, దేహబోధము మున్నగునవి యించుమించుగా లోపించిపోవును. కళామాత్రము మిగులుగా, మనస్సు ఆత్మ

బోధమయ చిదాకాశక్షేత్రమందు నిల్చి, జీవ భావము నొందిన కార్య కారణ శృంఖలాదికమును బ్రత్యక్షము చేయుచుండును. అంతేగాక, విశిష్టప్రార్థనము మున్నగు నేదే నొక యుపాయము సాయముతో, విశుద్ధాత్మబోధమందు - అసంప్రజ్ఞాతావస్థయం దగ్రసరుఁడగుటకుఁ బ్రయత్నించును. ఆ యవస్థయందు స్తుతి ప్రార్థనాది ప్రక్రియలు స్థూలమందు మఱి బయలుపడవు. శబ్దహీనమైనను బూర్ణశబ్ద మయము; క్రియాహీనమైనను బూర్ణక్రియామయము. ఆ ధ్వనిలేని ధ్వని, ఆ క్రియ లేని సక్రియావస్థ, యించుకంతయు ననుభవము చేయని వారి కిది సులువుగాఁ దెలియుట యసంభవము. దానికేమి గాని - స్థూలముగా, సమాధియొక్క ప్రాథమికావస్థయందు మనో బుద్ధి చిత్తాహంకారాదులైన సూక్ష్మకరణ సమూహము ప్రత్యక్షమగు చుండుననియు, వాని విశిష్టకార్యప్రణాళి కాన వచ్చుననియుఁ దెలిసికొనుటగును. (సో ఽహంసమాధి గ్రంథమును చూచునది.)

ఇపుడు మనము 'స్తవము' దాని యర్థము నెఱుఁగ బ్రయత్నింతము.

బ్రహ్మ, 'అమ్మా! నీవు స్వాహావు' అనెను. స్వాహా యనునది దేవ హవిర్దాన మంత్రము. అయిన నిచట సర్వదేవ కృత్యములకు నుపలక్షణము, నీవు స్వధవు. ఇది పితృ (నివాపాంజలి) దాన మంత్రము. కాని యిచటఁ బితృకృత్యములకును, అటులే వషట్కారము సర్వమంత్రములకును నుపలక్షణము. మనము అమ్మనుగూర్చిన విచారణము చేయుఁగాఁ దొల్త కర్మ కాండము

కంటఁబడుచున్నది. ఏమన - నంతయు మాత్రావిర్భావమునకుఁ బూర్వసూచనము. కర్మకాండము దేవపితృ భేదముచే రెండుగా విభజింపఁబడినది. ఈ రెండును మంత్ర సాధ్యానుష్ఠానములే.

అమ్మా! నీవు స్వాహవు, స్వధవు, వషట్కారవు; పూజాహోమ వ్రత జప పురశ్చరణాది దేవకార్యములు, శ్రాద్ధ తర్పణాది పితృకార్యములు నను రెండు విధములందును వ్యవహరింపఁబడు మంత్రములును నీవే. ఆ మంత్రములు చదువునపుడు మూడు స్వరము లుచ్చరింపఁబడును. అవి - ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము. ఆ స్వరముల యుచ్చారణ తారతమ్యమువలనఁ గామ్యకర్మముల ఫలతారతమ్యము నగును. ఆ స్వరస్వరూపము నీవే; కనుక నీవు స్వరాత్మికవు. ఇంద్రుని నిధనకామనవలన, వృత్రాసురుని యుత్పత్తికై ఋషులు, ఉచ్చస్వరముతో మంత్రపాఠము చేయుచు నాహుతులిడునపుడు, అమ్మా! నీవే యా సత్యదర్శిఋషుల కంఠములనుండి వెలసి "ఇంద్రశత్రు" పదము నుచ్చరించునపుడు, అనుదాత్తస్వరూపమునకు బదులు, ఉదాత్తస్వరరూపముతో వెడలితివి. దాని ఫలముగానే యింద్రునిచే వృత్రాసురుఁడు చంపఁబడెను. కనుక నీవే స్వరాత్మికవు. ఇదిగాక, జీవుల కంఠమందు నాదరూపమున వెడలు స్వరములు, పరాశ్యన్తీ మధ్యమా వైఖరీ నామములతోఁ బ్రసిద్ధమైన వాగ్రూపమున నీవే యున్నావు.

మును జెప్పిన దేవ పితృ కర్మములవల్ల నగు, నపూర్వ కర్మఫలముగా - అదృష్టరూపముగాను నీవే యున్నావు. కర్మ ఫలమే యమృతము గనుక నీవు సుధాస్వరూపిణివి. ఉపనిషత్తు నందు

"అన్నాత్ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్" అని యున్నది. శ్రీ శంకరాచార్యులును, అమృతశబ్దార్థము కర్మఫలమనిరి. దేవ పితృకార్యములను గేవల కర్మములు గాను, వైధ్యకార్యము లయం దుచ్చరింపఁబడు శబ్దములను గేవల మంత్రములుగాను, విధ్యుక్తకార్యములవలనఁ గలుగు ఫలములను గేవల కర్మఫల ములుగాను గనునంతదాఁక నవి క్షరధర్మము కలవియే; గాని యక్షరయు నిత్యయు నైన మన యమ్మ దేవ పితృ కార్యరూపమున వెలయునని కనుగొననపుడు, ఉదాత్తాది స్వరభేదముతో, మంత్రరూపముతో అమ్మా ! నీవే యుచ్చరింపఁబడు దానవు; అనునపుడు మఱి కర్మఫలములను సుధా (అమృత) యనక నీవెట్లు క్షరధర్మ లనఁగలవు ?

కర్మముల కొక్కటే సాధారణఫలము. దాని పేరే జ్ఞానము. జ్ఞానప్రకాశమును జేయుటే కర్మరూపిణియైన అమ్మ ప్రధానోద్దేశ్యము. జ్ఞానము నిత్యము, కనుక నమృతము; కావుననే కర్మఫలము సుధ (అమృతము) అనఁబడెను.

తరువాత, సర్వమంత్రసారము త్రిధామాత్రా - ఓంకారము. దానివలననే జగత్తు; దానివలననే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు; అదే, అకార ఉకార మకార రూపముతో జగదాకారమున వెలసిన యా 'త్రిమాత్ర' యు నీవే.

ఇచట - త్రిమాత్రాస్వరూప సంబంధమున రవ్వంతయాలో చింతము. మాత్రాశబ్దార్థము స్పందనము. స్పందనము శక్తి ప్రవాహమాత్రమే. చిన్మయి మహాశక్తి జగదాకారమున వెలసి జడశక్తియనుపేరఁ బరఁగును. "జడశక్తి ర్జడాత్మికా" (నామసన్మృతి)

ఆ శక్తి ప్రవాహము త్రివిధక్రియను బ్రకాశింపఁజేయును. మొదటిది - ఉత్పత్తి - నామరూపవిశిష్టమైన యొక ఘనీభూత శక్తి కేంద్రము, ఇదే సృష్టి; అకారమాత్ర. ఇఁక రెండవది స్థితి. ఆ విశిష్టరూపముతో నావిర్భవించిన శక్తి కేంద్రము, లయశక్తితోఁ బ్రతిఘటించి, తన స్వరూపమును స్థిరముగా నుంచుకొనుటకు సమర్థమగునంతదాఁక, ఆ స్థితి ఉకార మాత్రానామముతోఁ బ్రసిద్ధము. మఱి మూడవది లయము. ఈ చెప్పఁబడిన శక్తి కేంద్రము మఱల మహాశక్తి యొడియందు అదృశ్యమగునపుడే లయము; మకార మాత్రయను పేరఁ బ్రసిద్ధము.

ఏదేనొక పండు చేతఁబట్టుకొని చూడుము. ఒక శక్తి యదృశ్య పరమాణువులను జక్కఁగాఁ జేర్చి ఫలరూపమునఁ బ్రకాశితమైనదని తెలియును. అదే మొదటి స్పందనము. అకారమాత్ర. సాధనభాష యం దదే బ్రహ్మ. యోగులు దానిని మనోరూపముగాఁ జూతురు. మఱలఁ జూడుము. ఆ ఫలరూపముతో స్థూలముగాఁ బ్రకటితమైన శక్తి ప్రవాహము, లయము విరోధశక్తితో విరోధించి తన రూపమును విశిష్టముగా వెలయించుకొననంతదాఁక, నది ద్వితీయస్పందనము, ఉకారమాత్ర. సాధనభాషయం దదే విష్ణు వనఁబడును. యోగులు దీనిని బ్రాణరూపమునఁ జూతురు. కొన్నాళ్ల తర్వాత, పండు వాఁడిపోయి, క్రుళ్ల నారంభించును. అదే నాశము. ప్రలయము. అదే తృతీయస్పందనము. సాధనభాష యందది శివుఁడనఁబడును. యోగులు దానిని జ్ఞానరూపముగా దర్శింతురు. ఈ ప్రలయమొక యాకస్మికముగానైన పరివర్తనము కాదు. ప్రత్యేక పరమాణువు

యొక్క, ప్రతి క్షణమందునైన పరివర్తనము ఫలవే. ప్రతి ముహూర్తమందును, బ్రతి పరమాణువు నందును, మును జెప్పిన "జాయతే అస్తి, వర్ధతే" మున్నగు నాఱుమార్పులు నీ మూడు విధములైన స్పందనములలోనే సాగుచున్నవి. జీవుఁడు భూమిపైఁ బడిన క్షణము మొదలు మృత్యువు వంకకే ముందడుగు వేయుచున్నాఁడు. ఒక్కనాఁడే మృత్యువు రాదు. జన్మము, అనఁగా మృత్యువు యొక్క మొదలు. అయినను, తృతీయ స్పందనము - మకార మాత్రను బట్టి యెంతదాక ద్వితీయ స్పందనము - ఉకార మాత్ర ప్రబలముగా నుండునో, యంతదాఁక, మరణమను నొక విశిష్టఘటనము తెలియఁబడదు.

జగత్తునందలి ప్రత్యేకపదార్థమందును, బ్రత్యేకముహూర్త మందును నీ మూడు విధములైన స్పందనములు - త్రిశక్తి ప్రవాహము సాగును. అపుడు, ఏ స్పందనము ప్రబలముగాఁ బనిచేయునో, అప్పుడదే కానవచ్చుచుండును. యోగదృష్టి కల వాఁడు, ఈ జగత్తును మూడు విధములైన శక్తి ప్రవాహము తక్క మఱేమియు గాదని చూచును. ఇదే శ్యామాపూజయందలి త్రికోణమంత్రము. అయిదు త్రికోణములు గీసి, వానియందు శ్యామాపూజ చేయు విధానము తంత్రములందుఁ గానఁబడును. పంచభూతములు నీ మూడు విధములైన శక్తి ప్రవాహమాత్రమే. కర్పూరాదిస్తవమందు త్రిపంచారశబ్దమునకును దాత్పర్యమిదే. తంత్రములందలి సకలయంత్రపూజ, యా మహాశక్తి ప్రవాహాను భవము చేయు యోగ్యతను గలిగించును.

ఓం. అర్థమాత్రా స్థితా నిత్యా యానుచ్చార్యా విశేషతః ।
త్వమేవ సా·త్వం సావిత్రీ త్వం దేవి జననీ పరా ॥ ఓం. 2

అమ్మా ! విశేషరూపముతో నుచ్చరింపఁదగనిది నిత్యయైన యర్థమాత్రయు నీవే. నీవే సావిత్రివి. దేవీ ! నీవే పరాజననివి.

వివరణము :- అమ్మా ! ఇంతవఱకు నీ త్రిమాత్రా స్వరూపము కొంత తెలిసినది. ఉపనిషత్తులందుఁ జెప్పఁబడిన జాగ్రదభిమానిపురుషుఁడు విశ్వుఁడును, స్వప్నాభిమానిపురుషుఁడు తైజసుఁడును, సుషుప్త్యభిమానిపురుషుఁడు ప్రాజ్ఞుఁడు ననువారు, ఆ త్రిమాత్రాస్వరూపులే. పలునాళ్లకు నీ యీ త్రివిధస్వరూప దర్శనము చేసినపైని, నీవే యీ జగద్రూపముతో వెలసితివను తెలివి కలిగినది. అమ్మా ! నీ యీస్వరూపమతి మనోహరమైనను, నంతకంటే గొప్పది నీ స్వరూపమొకటి కలదు. అది విశేషరూపముతో నుచ్చరింపఁబడనది. అదే నీ నిత్యస్వరూపము. దానినే 'అర్థమాత్ర' యందురు. దానిని మాటలతో వెల్లడించుట కాదు. అమ్మా ! త్రిమాత్రాస్వరూపము వలన, విశేషణమునుజూడ విశేష్యము తోఁచు నటులే, జగత్తును జూచిన, శక్తి యనుమానింపఁబడును; గాని అయ్యర్థమాత్రా స్వరూపముతోఁ దురీయావస్థయందు నీవు, అచింత్యవు, అనిర్దేశ్యవు, సర్వేంద్రియాగమ్యవు, సత్యవునై యున్నావు. అనఁగా నొక్కమాట - నీయందుఁ ద్రిమాత్రపూర్ణముగా లయ మొందినపుడే నీ వనుచ్చార్యరూపమున బిందురూపముతో వెలయుదువు.

తృతీయమాత్ర మకారము వ్యంజనము (హల్లు). అది యర్ధమాత్ర; ఉకారము శిరసున నీ యర్ధమాత్రయే నాదబిందు రూపములతోఁ బ్రకాశించును. దానికి ఉనికి కలదు. కాని విస్తారము కాదు. బిందువు దాని కొక స్థానము నియతమైనను దానికి విస్తృతి (పొడవు వెడల్పు) లేదు. ఇది జ్యామిత్రరేఖా గణిత (Meridian) ప్రమాణము. ఆ యున్న యంశము నిర్గుణ పరబ్రహ్మ ద్యోతకము. విస్తారాంశము సగుణబ్రహ్మ (శక్తి) ప్రకాశము. నిర్గుణమునకు గుణము (శక్తి) నొప్పుకొననివారే బ్రహ్మముకంటె మాయను వేఱుగాఁ గాంతురు. ఉనికి యున్న దాని కింతో యంతో విస్తారము తప్పదు. ఏమన బిందు సమష్టియే పదార్థము. బిందువును గేవల చైతన్యముగాను, నాదమును గేవల శక్తిగాను గైకొనుటచే బిందువునకు శక్తి హీనత వచ్చిపడును. ఈ మతముచే, శక్తిహీనునకు శక్తిపరిచాలకత యసంభవము గనుక, బ్రహ్మమును శక్తిహీన మందురు. ఇది వేదమునకును యుక్తికిని విరుద్ధము.

కాని, మా బుద్ధిచేత, నీవు బిందురూపముతో నిర్గుణవును, నాదరూపముతో సగుణవునునై త్రిమాత్రాస్వరూపముతో జగద్రూపముగా వ్యాపించియున్నావు. అయినను నీ యీ యర్ధమాత్రా స్వరూపము నిత్యపరివర్తనహీనమును, అనుచ్చార్యము నయి వాగగోచరము. కనుకనే దేవీ ! ప్రకాశశీలా ! అమ్మా ! నీవే సావిత్రివి. జగత్తును బ్రసవించుదానవు. ప్రాణులను గన్న తల్లివి. పరాజననివి. త్రిమాత్రారూపముతో జగజ్జననివియు, అర్థమాత్రారూపముతో నీవే పరాజననివియు నైయున్నావు.

త్రిమాత్రా, అర్ధమాత్రా శబ్దములకుఁ గ్రమముగా, స్వరములు వ్యంజనములు నని యర్థము చేయువారితోను మా కేమియు నాపత్తిలేదు. ఏమన, స్వరసహాయముతోనే వ్యంజనములు (హల్లులు) ఉచ్చరింపఁబడును. స్వరమును (శక్తిని) ఆశ్రయించియే నిర్గుణబ్రహ్మము సగుణరూపమున వెలయుచున్నది.

ఓం. త్వయైవ ధార్యతే విశ్వం త్వయైతత్ సృజ్యతే జగత్ ।
త్వయై తత్పాల్యతే దేవి త్వమత్స్యంతే చ సర్వదా ॥ ఓం. 3

అమ్మా ! ఈ విశ్వము నీ చేతనే ధరింపఁబడుచున్నది. నీవే యీ జగత్ సృష్టిపరిపాలనములను జేయుచున్నావు. మఱల నంతకాలమందు నీవే దీనిని గ్రసించు (భక్షించు) చున్నావు.

వివరణము :- అమ్మా ! సృజించుటకుమున్ను బీజరూపముతో నీ విశ్వము నీ గర్భమందే ధరింపఁబడును. మఱి నీవే యా బీజమును పరివర్తనశీలమైన (మారుచుండు స్వభావముగల) జగద్రూపముతోఁ బ్రసవించుచున్నావు. మఱినీవే దీనిని బాలించి, యంతకాలమందు భక్షింతువు (లోనికీడ్చుకొందువు). ఇదే నీ మాతృత్వము. గర్భమున ధరించుట, ప్రసవించుట, హృదయమందు ధరించి జ్ఞాన స్తన్యముచేఁ బరిపోషించుట, అంతమందు - (పూర్ణజ్ఞానావస్థయందు) నీకంటె వేఱుకానటులు నీలోఁ జేర్చి వేసికొనుట, యను నిదే నీ మహామాయాత్వము.

'నేను' జగద్భోగయోగ్యత నొందనంతదాఁక (నేను జగత్తును భోగయోగ్యముగాఁ జేయునంతదాఁక) బీజరూపముగా నా గర్భమందు ధరించి, నీ రక్త (ఉపరంజన) శక్తి చేతనే భోగయోగ్యతను

గూర్చితిని. కావుననే ప్రసవించి (సృష్టించి) నా యొడిలోనికే తీసికొంటిని. నా స్తన్యముతో (అమృతముతో) నన్నుఁ బోషించు కొందును. ఒక్కొక్కబొట్టుగా జ్ఞానసంచయమును గూర్చి, అమరత్వమునొందు యోగ్యతను గల్గించుటకై, యసంఖ్య జనన మరణాది పరివర్తనములందుఁ గొనిపోదును. నేను మాతృస్నేహ ముతో ముగ్ధనై, అమ్మనని తన్మయత్వము నొంది, అఖండజ్ఞానము నొంది, పూర్ణజ్ఞానమయావస్థకు వచ్చియున్నపుడే 'నేను' నీ యమృతమును - నీ యన్నము నగుదును. అపుడు నన్నును భక్షించి, నీవు నీ యన్న పూర్ణనామమును సార్థకము చేసికొందువు.

నీ యన్నముగా నున్న మేము "సర్వగ్రాసిని యమ్మ యేనాడో మమ్ములను దినివేయును" అని తెలిసికొనలేనంత దాఁక, నీవే మా యన్నమవు. మేము నీస్తన్యము త్రాగియే పెరుగుచున్నాము. అమ్మా ! నిన్నెన్ని విధములుగా భోగించుచున్నామో, యది విచారించినపుడు, చకితులమై పోదుము. ఎవఁడెట్టి భావముతోఁ జూచునో, యపుడు నీవట్టి భావముతోనే రూపమును ధరింతువు. నీవే విషయాకారమున వచ్చి మా యింద్రియములను భోగపూర్ణము లుగాఁ జేయుదువు. మా యిచ్ఛనుబట్టి మా లాలస కాహారము వేయుచుందువు. ఈ విధముగా నొకనాఁడు కాదు; రెన్నాళ్లు కాదు; అనేక జన్మ జన్మాంతరముల నుండియు నిట్టి యడ్డులేని వాసనలను హృదయమునుండి విడిపించుచున్నావు. మఱి నీవు మా భోగ వాసనలను జరితార్థము చేయుటకు, వాసనాను రూపముగా, క్షుద్ర క్షుద్ర విషయముల వేషముతో మాయెదుట వెలయునంత స్నేహవిమూఢ వగుచున్నావు. నా గొప్ప 'నేను

తనమునకు' బిందుమాత్రమును, అసమ్మానము కాదు. కనుక నింతచేసియు నా సత్తను నేనే దాచియుంచుకొన్నాను. నీవే మా వాసనవు; నీవే మా భోగమవు; నీవే మా యన్నమవు; నీవే తృప్తివి; అని మాకుఁ దెలియనీయవు. ఇంత స్నేహము, ఇంత ప్రేమము, నీ హృదయమందున్నది కదా ! రోగము, శోకము, దారిద్ర్యము, దుర్గతి, ఆశాభంగము మున్నగు సర్వావస్థలందును నీ యలౌకిక పుత్త్ర స్నేహము ప్రవహించుచున్నది కదా ! ఈ నీ స్నేహము నెప్పుడు మేము స్మరించుకొనఁగలమో ! అమ్మా ! ఇన్నాళ్లదాఁక నిన్నుఁ దిని వేసితిమి - అజ్ఞానముతో నిన్ను భోగించితిమి. ఇపుడు మమ్ము నీవు తినివేయుము. ఇపుడొక వేఱయిన 'నేను తనపు' హద్దు పెట్టి, మమ్ములను నీతో వేఱుచేసి పెట్టితివేల ? నీవును నేనును ఒక్కటి కాదా ? మఱి సర్వరూపములతోనున్న యమ్మయెవరు ? సర్వగ్రాసినీరూపముతో నిల్చితివే ! ఆకులనేత్రములతో నొక్కసారి నిన్ను నీవు మఱచి, నీ బిడ్డలమొగము చూచి నీ దివ్యనేత్రము లందు, మా జ్యోతిర్హీననేత్రములను నిల్పి, అమ్మా ! అమ్మా ! యనుచు మమ్ము మేము మఱచెదము. మఱి నీవును, రారా ! కొడుకా ! రారా ! వత్స ! యంచు మమ్ము మ్రింగివేయుము. మేము చచ్చి యమరుల మగుదము.

ఏమందువమ్మా ! ఏమనుచున్నావు ? నీవే సుధవా ? అమృతమే నీ యాహారమా ? ఏదీ, ఇంకను మే మమరత్వ మొందలేదే. సుధ సిద్ధముకాలేదే. కనుక నీవాహరింపలేకున్నావేమో ? ఎవరి దీ దోషము ? నీదా ? మాదా ? ఎందుచేత మేమింకను

అయోగ్యనంతానముగానే యున్నాము ? అమ్మా ! నీవు విజ్ఞానేశ్వరివైన తల్లివి. మేము - అజ్ఞానాంధులమైన బిడ్డలము. నీవు అమృతమవు. మేము మృత్యువునకు గ్రాసముగా నున్నాము. అమ్మా ! ఎవరి దీ దోషము ? ఏమిది - కోరికలుగాను, వాసనలు గాను మా లోపల నెవ్వ రుబుకుచున్నారు ? లీల ! లీల !! అమ్మా ! యిపుడు మేము నీ కక్కఱ లేదు. మమ్ముఁ గోరవు. నీ యానంద మయజగల్లీల నీవు చేయుదువు. మేమును బూర్ణముగా మా 'నేనును' నీతోఁ జేర్చి వేయుదుము. మఱి వేఱుపాటేదీ ? ఎట్లగును ? అమ్మా ! అమ్మా ! అమ్మా !

ఈ మంత్రమందలి - "ధార్యతే, సృజ్యతే, పాల్యతే, అత్సి" అను నీ నాలుగు క్రియాపదములచే సగుణబ్రహ్మము యొక్క మహామాయాత్వము - మాతృత్వము లెస్సగా వ్యక్తమైనది (వెల్లడింపఁబడినది).

ఓం. విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితిరూపా చ పాలనే ।
తథా సంహృతిరూపాంతే జగతోఽస్య జగన్మయే ॥ ఓం. 4

ఓ జగన్మయీ ! నీవే సృష్టికాలమందు సృష్టిరూపవు, పాలనమందు స్థితిరూపవు, మఱి ప్రలయకాలమందు సంహర్త్రి రూపవు నైయున్నావు.

వివరణము : అమ్మా ! నీవే యీ జగత్తునుత్పాదించి పరిపాలించి మఱల సంహరింతువని మున్నంటిమి. కాని యది యథార్థముగా సరిగాఁ జెప్పఁబడలేదు. ఏమనఁగా నిటులనుటచే

జగత్తు నీకంటె వేఱనుచుఁ దోఁచును. వాస్తవముగా నీవే జగన్మయివి. నీవు తక్క నెక్కడను నేమియు లేదు. సాధారణముగాఁ బ్రత్యేక కార్యమునందును మూడు వస్తువులే తప్పక యున్నవని మాకుఁ దెలియఁబడదు. 1. నిమిత్తకారణము (కర్త). 2. ఉపాదాన కారణము (కార్యమునకైన యుపకరణములు). 3. కార్యము (విశిష్టఫలము). కాని, అమ్మా ! నీ యీ జగద్వ్యాపారమందు నీవే నిమిత్తము, నీవే యుపాదానము, నీవే కార్యము. నీరు గడ్డకట్టి మంచగును. గాని దానియందుఁ జల్ల దనమనెడి యొక హేతువు క్రొత్తగా నుండును. అయినను, నీ యీ జగద్వ్యాపారమందు, అట్టిది మఱేమియు లేదు. నీవే కార్యము; నీవే యుపకరణము; నీవే కర్త.

నేనొక పండును గోరితిని. ఈ కోరుట యనెడి వాసనయే పండు యొక్క బీజము. అవ్యక్తముగానున్న యమ్మ, వాసనా రూపముతో ఫలబీజాకారమునఁ బ్రకాశించినది. మఱి యా వాసన ఘనీభూతమై ఫలరూపముతో వెలికి బయల్పడినది. కారణమే మనఁగా, వాసన యొక్క ఘనీభూతావస్థయే ఫలము. ఆ పండు నే ననుభవింపఁగానే మఱల నవ్యక్తమందుఁ జేరిపోవును. ఎల్లప్పుడు నిట్టి ఘటనమే జరుగుచుండును. ఏదో యొక యవ్యక్తక్షేత్రమునుండి యొక్కొక్క వాసన యుబుకుచుండును. మాటిమాటికి నా వాసనలు రేఁగి కోరిన విషయరూపమున నింద్రియభోగ్యములుగా సిద్ధమగు చుండును. భోగాంతమందు మఱల నా యవ్యక్తక్షేత్ర మందుఁ జేరిపోవును. ఈ మూడు విధములైన ప్రకాశమే సృష్టి స్థితి సంహారము లనెడిపేరఁ బ్రసిద్ధములు. సదా ప్రత్యేక జీవునందును జక్కఁగా నిమ్మూడు శక్తు

లును వెలయుచుండును. తల్లీ ! జగన్మయీ ! నీకొక్క క్షణమైనను విశ్రాంతి లేదు కదా. నీవు మాకొఱకే యజ్ఞేయవయ్యు జ్ఞానరూపవు, శక్తిత్రయాతీతవయ్యును శక్తి రూపవు, క్రియా తీతవయ్యును గ్రియాశీలవు. కావున సృష్టికాలమందు నీవే సృష్టిరూపవును, పాలనకాలమందు నీవే స్థితిరూపవును, ప్రలయకాలమందు నీవే సంహారరూపవును నగుదువు. ఈ మూడు విధములైన క్రియాశక్తి రూపముతో నిన్ను నీవే వెలయించుకొనుచున్నావు.

ఓం. మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ।
మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ ॥ ఓం. 5

అమ్మా ! నీవు మహావిద్యవు; మహామాయవు; మహా మేధవు; మహా + అస్మృతివి; కావున నీవే మహామోహరూపిణివి. కనుక నీవే మహాదేవివి. మహా + అసురివి.

వివరణము : అమ్మా ! అసంభవవ్యాపారములన్నియు నీయందే సంభవములు. వెలుఁగుం జీఁకటియు రెండును నొండొంటికి విరోధులేయైనను ఈ యవి చేరియేయుండును. మహాదైవీప్రకృతిగాను, మహాసురీప్రకృతిగాను, నీవే వెలయుచున్నావు. కనుకనే నీవు మహాదేవివయ్యును మహాసురివి. ఏమన, నీవు మహావిద్యవయ్యును మహామాయవు. బ్రహ్మవిద్యా రూపముతో నిత్యము ప్రకాశించుచున్నను జీవజగద్రూపముతో మహామాయా మూర్తితో విరాజిల్లుదువు. మఱి, మహామేధవయ్యు మహా-అస్మృతివి. ఆత్మజ్ఞానధారణోపయోగియైన మహా ధీయుమెడి మహామేధవు. మఱి

నిన్ను మఱచిపోవుట, నీ యస్తిత్వమును మఱచిపోవుట, యను నదియు నీ ప్రభావమే. నీవే మహావిస్మృతి రూపముతో జీవుల హృదయ మందు వెలయుదువు, కనుక మహామోహరూపిణివియు నీవే; నీ సర్వవిధములైన కార్యములును, జగత్తునకు సంబంధించిన కార్యకారణ శృంఖలాజ్ఞానమును మీఱినవి. మానవబుద్ధి నిన్నెఱుఁగఁ జాలదు. మానవులు వెలుఁగు సీఁకటు లొక్కచోట నుండవను కొందురు. జ్ఞానము అజ్ఞానము, మేధ విస్మృతి, యొకచోట నుండఁ జాలవు గాని, అమ్మా ! నీయం దిదియంతయు సంభవమే. దైవీప్రకృతియు అసురీప్రకృతియు నత్యంత విరుద్ధములైనను, సదా నీయందున్నవి. ఓ యమ్మా ! కాంతియొక్క యల్పత్వమే చీఁకటి యనియు, జ్ఞానముయొక్క యల్పత్వమే యజ్ఞానమనియు, నీవేకదా మాకుఁ దెలియఁజెప్పితివి. కనుక, అమ్మా ! నీ రచించిన జీవజగత్తునందును నీ యీ రెండు విధములైన విరుద్ధమూర్తులు నొక్కసారియే యపూర్వముగాఁ జేరియుంట కనుచున్నాము.

(మనము చిన్ననాఁటినుండియు జ్ఞానము అజ్ఞానము, విద్య అవిద్య, సత్ అసత్ అనునివి పరస్పరము నత్యంత విరుద్ధములని వినుచున్నాము; గాని యిది నిజమా కాదా ? పరస్పర విరోధులైన రెండు వస్తువు లొక్కచోటఁ గలిసియుండుట, మానవబుద్ధిక తీతమేయైనను బరమేశ్వరునం దంతయు సంభవమే యనుచు నొక యుక్తి విరుద్ధమైన మాటను స్వీకరించుచున్నాము. అనుభవమునందును జ్ఞానోదయము కాఁగానే యజ్ఞానముండ దనియు, అజ్ఞానముండుదాఁక జ్ఞానము ప్రకాశింపఁదనియుఁ దెలియుచున్నది. అయినను, ఆ యజ్ఞానము జ్ఞానమందే నిల్చి

యున్నప్పుడు, అజ్ఞానమును జ్ఞానమునకు విరోధియనక, ఈషద్ జ్ఞానమన్నచో నెట్టి యుక్తివిరోధమునుంగాదు. ఏమనఁగా - అఖండజ్ఞానమును, ఈషద్ జ్ఞానమును నొక్కచోట నుండుట యసంభవము కాదు. ఇటులే అసత్ అవిద్యా మున్నగు శబ్దము లందును నఞ్‌కు ఈషదర్థమునే కైకొన్నచో సర్వవిధముల తర్కములును సమాప్తములై పోవును. విరోధ, ఈషత్ అను రెండర్థములును లాక్షణికములే యైనపుడు, ఈషదర్థమును గైకొన్న నాపత్తి యేమి ?)

మహామాయాశబ్దముచే, కాళీతారాది దశమహావిద్యలని యర్థము చేసినవారితోఁ బూర్తిగా నైకమత్యము కుదురదు. ఏమనఁగా నిమ్మంత్రమందు, అమ్మయొక్క రెండు మహాప్రకృతుల వర్ణనము చేయఁబడినది. ఒకటి దైవీప్రకృతి; రెండవది యాసురీ ప్రకృతి. ఈ రెండు ప్రకృతుల స్వరూపమును బ్రకటించుటకే, "మహావిద్యా, మహామాయా, మహామేధా, మహా అస్మృతి" యనెడి యొండొంటికి మిగుల విరుద్ధములైన రెండు స్వరూపములు చెప్పఁబడినవి. కావున మహావిద్యాశబ్దార్థము బ్రహ్మవిద్య యని చెప్పుటయే సంగతము.

ఓం. ప్రకృతిస్త్వంచ సర్వస్య గుణత్రయ విభావినీ ।
కాలరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ దారుణా ॥ ఓం. 6

అమ్మా ! నీ వన్నిటియొక్క ప్రకృతివి. సత్త్వము. రజస్సు, తమస్సు ననెడి మూడు గుణములచే (అవస్థలచే) నీ ప్రకృతి స్వరూపము తెలియఁబడును. మఱియు నీ త్రిగుణలయమునకై

నీవే దారుణ (భయంకర) కాలరాత్రివి, మహారాత్రివి, మోహ రాత్రివి గాను వెలయుదువు.

వివరణము :- అమ్మా ! నీవు కేవలము సమష్టిరూప యైన మహతీప్రకృతివే కావు. సరిగదా, వ్యష్టి ప్రకృతిరూపవును నీవే. ప్రత్యేక జీవుని స్వతంత్రప్రకృతిరూపముతో నీవున్నావు. అనఁగా జీవప్రకృతి కధిష్ఠానము నీవే. ప్రకృతి యనఁగా స్వభావమని స్థూలార్థము. ఏ జీవుని దెట్టి స్వభావమో, యదియే వాని ప్రకృతి. అమ్మా ! సమష్టియందు నీ మహాదైవీ మహాసురీ ప్రకృతులు రెండును గానవచ్చును. మఱియు నీ వ్యష్టియందును నవియే కానవచ్చును. ఒకనిది దైవీప్రకృతి; ఒకనిది యాసురీ ప్రకృతి. ఒకఁడు సాధువు; ఒకఁ డసాధువు. అమ్మ అమ్మ యని తమ్ముఁ దాము మఱచి, ముక్తి మార్గమునందు సాగు సాధకులలో సాధనరూపముగా నుబుకుచుండు దైవీప్రకృతి నీవే. మఱి పాపపుటడగు మొట్టులకు దిగిపోయి నరక మార్గమును దెఱచుకొని, నిందాపాత్రులగుచుఁ బోవువారి నిందితాసురీ ప్రకృతివి నీవే. నీవు ఎప్పు డే జీవుని నేమూర్తితో నీ యొడిలోనికిఁ దీసి కొని కూర్చుందువో, యప్పు డా విధమైన స్వభావమునే పరిచయము చేయుచుందువు ఎవ్వనిదే యనుము; ఎట్టి ప్రకృతియే యనుము; అదే వాని యమ్మ.

అమ్మా ! మున్ను నీ మహతీమూర్తిని జూచి యాతంకితుల మైతిమి (భయపడితిమి). మా దగ్గుత్తుకలనుండి వెడలు మా జాలిపిలుపులు, కైలాసమందలి కనకసింహాసనము వఱకుఁ జేరవని తోఁచినపుడు, నీ వీ నిత్యసన్నిహితమైన యభయ మూర్తిని జూపితివి. నీవు బ్రహ్మాండ జననివి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గన్నదాన

వయ్యు మా ప్రకృతిరూపముతో మా యమ్మవు నీవొక్కతెవే, మాకుఁ బ్రీతిసాధన మైనావు. మా భోగాపవర్గ సాధనకొఱకే మమ్ములను నీగుండె కత్తించు కొంటివి. మా లేములు తీర్చుటకే, మా దరఖాస్తులు మన్నించి మా క్షుద్రవాసనలను సైతము పూర్ణము లొనర్చుటకే ప్రకృతి రూపముతో నున్న మా యమ్మవు నీవు. ఈ విధముగాఁ జిన్న పురుగు మొదలుకొని బ్రహ్మాదుల పర్యంతము ప్రతి జీవుని భిన్న భిన్న ప్రకృతిగా నొప్పుదానవు నీవే. కనుకనే "ప్రకృతి స్త్వంచ సర్వస్య" నీవు సమష్టిచే సర్వమునకుఁ దల్లివి. మఱి వ్యష్టిచేఁ బ్రత్యేకమునకుఁ దల్లివి. నీవు చింకిగుడ్డలదానవేకానీ, బిరుసుజుత్తు దానవే కానీ, మకిలిమేని దానవే కానీ, తెగులు గొంటివేకానీ; నీవే మా యమ్మవే. మా కేనా ? ఎవరికిఁగావు ?

అమ్మా ! జీవులు తమ తమ ప్రకృతిరూపిణివైన నిన్నవమానించుట చేతనే, యనేక విధముల దుర్దశలు, సాధనజగత్తునందసంభవ విపర్యయములు, సాంప్రదాయిక దుష్టభావములుఁ గలుగుచున్నవి. అకటా ! ఇంటనున్న యమ్మ కవజ్ఞ చేసి, యెక్కడనో యెవతెనో 'అమ్మ' యను జీవుఁడెంతమూఢుఁడు ! తన తల్లిని విడిచి మఱియొకరి గుమ్మముకడ నెయ్యము నడుగు కొను చున్నను, విధిరహితముగా నీ కృపనే యడిగికొను చున్నాఁడు. ఈ విషయమే గీతయందలి రాజగుహ్యయోగమందు నీవే విశేషించి చెప్పితివి. అమ్మా ! 'నేనును' నిన్నొక్కనాఁడును గుర్తింపలేని కారణముననే నీ దీనమలిన వేషమును జూచి, యవజ్ఞతోఁ దొలఁగించుటకే చూచితిని. అభిమానపూర్ణమును, అశ్రుభరాక్రాన్త మునైన, నాఁటి నీ మోము తలఁపునకు వచ్చుటచే నిపుడును గుండె

ద్ధలగుచున్నది. నీవే రాజరాజేశ్వరివి; మా యమ్మవు; అనంతజగదధీశ్వరివి; అను మాటను, నాఁడేనే నెఱింగియున్నచో, ఎంత యవజ్ఞచేసితిని ! ఇప్పుడును, ఇంకను జేయుచున్నాను. నీవో, ప్రతిక్షణమందును అభిమానపూర్వకముగా, "అవజానన్తి మాం మూఢా, మానుషీం తనుమా శ్రితమ్" (గీత. 9-11) అనుచునే యున్నావు. నిజమమ్మా ! నిజము. మనుజులము మేము నీకెంతో యవజ్ఞచేయుచున్నాము. నీ తిర్యక్సంతానము నిన్నెఱుంగదు. వానికిఁ గృతజ్ఞతావృత్తి వికాసమేలేదు. కనుక వానికి అవజ్ఞ సంభవముకాదు. ఇఁక నీ ప్రియసంతానము దేవతలు; వారు నీ యందు నిత్యయుక్తులు. నిత్యము తమ ప్రకృతిరూపమున నున్న మహామాయను బూజింతురు. కాని మనుష్యులము మేము; మనుష్యశరీరము నాశ్రయించిన ప్రకృతిరూపిణిని నిన్ను, అడుగడుగున నవమానించుచునేయున్నాము. అమ్మా ! నీవు లేక మా యేపనియు సాగదు. ఊపిరితీయుట మొదలు మోక్షము వఱకు నెట్టిపనియు నిన్ను విడిచి సాగుట యసంభవము. అమ్మా ! భోగరూపముతో నీవు, అపవర్గరూపముతో నీవు, సుఖరూపముతో నీవు, అసుఖరూపముతో నీవు, నవ్వురూపముతో నీవు, జననమరణ రూపముతో నీవు; బంధనముక్తి రూపమున నీవు; నీవొక్కతెవే భిన్నభిన్నాకారములుగా భిన్నభిన్నానుష్ఠానములుగా ముస్తాబయి వెలయుదువు.

అమ్మా ! ఇంతేనా ? నేను బహుత్వప్రియుఁడను. ఎప్పుడును గ్రొత్తక్రొత్త ముస్తాబులనే కోరుచుందును. ఇటులు నా కొఱకు నిత్యము క్రొత్త వేషములను వేసికొని నీవొక్కతెవే భిన్నమూర్తులతో

వెలయుదువు. ఎప్పుడేని సాధువు నైపోఁ జూతునేని, నీ వపుడే సాధు వేషముతో నన్నొడిలో నుంచుకొందువు. ఎపుడేని దొంగబుద్ధి పుట్టెనా - అపుడే నీవు తస్కర మలిన వేషముతో ముస్తాబయి నన్నొడిలోనికిఁ దీసికొందువు. ఈ విధముగా స్వర్గమందేమి, నరకమందేమి, నన్నొక్క క్షణమైనను నీ యొడినుండి దిగనీయలేదు. నా తల్లివై నా ప్రత్యేక ప్రతిజ్ఞను జెల్లించుటకు నమ్మిన బంటువలె, నెయ్యపు సకునివలె, నాతోనే యుందువే. అమ్మా ! ఏనాఁడు నీ మహతీమూర్తి యొక్క అమృతమయాంకమందుండి బహుత్వోల్లాసముబికెనో, యానాఁటి నుండి, నీవు నా యొక్కనికే తల్లివైతివి. నాఁటినుండి నీవు నాతోనే యుందువు. ఎంత స్నేహము ! ఎంత యాదరము ! ఎంత వాత్సల్యము ! కాని నేనొక్కనాఁడును దీనిని ధ్యానపూర్వకముగాఁ గనలేదు. నీవు నాకై యింత చేసితివి; చేయుచున్నావు. కాని రవ్వంతైనను బ్రతిఫలము నాశింపవు. కృతజ్ఞత లేనేలేదు; సరిగదా, అవజ్ఞయే చేయుచున్నాను. అయినను నీవు స్నేహశీలవు; పుత్ర వాత్సల్యము నీ కన్ను గప్పి వేసినది. నీది, నా నేరముల నెన్ను కన్ను గాదు. నా చేయు నవజ్ఞలను గాంచు నవసరము నీకు లేదు. నీ విట్టి తల్లివికదా; నిన్నెప్పుడైన 'అమ్మా !' యందునో ? ఎక్కువవద్దు; ఒక్కసారి అమ్మా ! యందునో ? యని యెదురుచూచుచు ఱెప్పపాటులేని కంటితో రేవగళ్ళు నావంకనే చూచుచుందువు. అదిగో, నా నోర యథార్థ మాతృనామము వెడలుటయే, నీ మేరలేని నెయ్యమునకు బదులని యెదురుసూచుచుందువు. రాజరాజేశ్వరీ మూర్తితో నావిర్భవించు నీ యడుగులయందుఁ బూదోయిలి

నిడఁగల్గునప్పు డేమో. ఇంక మఱొకటి - నిన్నుఁ బంచలు జాతిపోవుచున్న పాడుకొంపలో, నుపేక్షితసేవకురాలివలెఁ జేసి యుంచితిని. అమ్మా ! నీ కడుముద్దుబిడ్డలకు, “నాయనా ! మీ మీ ప్రకృతియే మీ యమ్మ” అని చెప్పివేయుము. చూడమమ్మా ! అమ్మ యన నెవ్వరో యెఱుఁగనివారికిఁగూడ, “అబ్బాయి ! మీ మీ ప్రకృతియే అమ్మ” అని చెప్పివేయుము. సాధన చేసియు హతాశులైన వారికిని, “మీ మీ ప్రకృతియే సాధన కాధారము” అని చెప్పివేయుము. గురుసంధానము చేయఁజాలనివారికిని, “మీ మీ ప్రకృతియే మీ గురువు” అని చెప్పి వేయుము.

అమ్మా ! నీవు త్రిగుణప్రకాశికవు. సత్త్వ రజస్తమస్సు లనెడి మూడు గుణములచేత నీ వ్యష్టి సమష్టి ప్రకృతి వెల్లడియగుచున్నది. అమ్మా ! నిర్గుణా ! నీవు తొలుదొల్త ఏకత్వ బోధముతో సంబుద్ధ వగునపుడు, ఏకగుణిత వైతివి - అదే సత్త్వగుణము; మఱి నీవు, అనేక మగుటకుఁ గ్రియాశక్తిని వెలయించినపుడు, ద్విగుణిత వైతివి - అదే రజోగుణము; మఱి నీవు అనేకము కాఁగోరుటే కాక, నీ చైతన్యమయస్వరూపమును జడాకారమునఁ బరిణమింపఁజేసి నపుడు మూడవసారి గుణితవైతివి - అదే తమోగుణము. సత్త్వగుణముగా నీ సత్, రజోగుణముగా నీ చిత్, తమోగుణముగా నీ యానందముఁ బ్రకాశించును. సచ్చిదానందమయీ ! అమ్మా ! నీవు నీ విశిష్ట భావములతోఁ ద్రిధా విభజించుకొని, మూడు గుణములతో గుణితవై, సమష్టిచే మహతివై, దైవీ ఆసురీ ప్రకృతి రూపముతోను, వ్యష్టిచే జీవప్రకృతిరూపముతోను బ్రకాశింతువు.

ఇట్టిదనరాని యవ్యక్తస్వరూపవయ్యును బుత్రస్నేహ ప్రేరణమున గుణత్రయమును బ్రకాశింపఁజేయు ప్రకృతివి. దర్శనకారులు - మూడుగుణముల సామ్యావస్థయే ప్రకృతి యందురు. అది యవ్యక్తము కావున నసాధ్యము. నిన్ను మేము స్థూలేంద్రియములతో భోగింపఁగోరుదుము. స్థూలులమైపోతిమి. కనుక నీ స్థూలభావమును సేవించి తనివి నొందుచున్నాము. కనుకఁ ద్రిగుణాత్మకయైన నీ వ్యష్టిమూర్తియే మా కారాధ్యము. ఇఁక సమష్టిజాడ నెఱింగినవారు - హిరణ్యగర్భులు. వారు ఉన్నతాధికారులు; వారు నీ సమష్టి ప్రకృతి మహాదేవమూర్తిని బూజింతురు. మేము క్షుద్రులము; తెలివిలేని శిశువులము. ఆటబొమ్మలను బ్రేమింతుము; కనుక సర్వభావమయమును సర్వేంద్రియ యుక్తమునైన నీవ్యష్టి ప్రకృతిమూర్తియే మాకుఁ బ్రియము. కావున నీవు మా యెదుర గుణత్రయప్రకాశినివే యగుము. నీ యీ మూర్తిని బూజింపఁగల్గునపుడే నీ మహామూర్తి జాడ దొరుకునని మేమెఱుఁగుదుము. ఏమన, నిమ్మూడుగుణములను బూర్ణముగా లయమొనర్చుటకే నీవు కాలరాత్రి, మహారాత్రి, మోహరాత్రి రూపములతో వెలయుదువు.

ఎచ్చటఁ గాలము సైతము ప్రకాశింపదో యదే కాలరాత్రి; సత్త్వగుణము లయించుచోటినే కాలరాత్రి యందురు; ఇటులే రజోగుణ లయస్థానము మహారాత్రి; తమోగుణ లయ స్థానమును మోహరాత్రి యని పేర్కొందురు. మోహము తమోగుణము యొక్క బహిర్వికాసము. దాని రాత్రి, యనఁగా అప్రకాశము - లయస్థానము.

గుణత్రయప్రకాశినీ ! తల్లీ ! వ్యష్టి ప్రకృతిరూపముతో నీవు మా తల్లివే; మఱెవ్వరి తల్లివి కావు; మా తల్లివే; యని యిటులు మా యమ్మను (నిన్ను) బూజింపఁగా, నీ మూడు స్వరూపములుఁ గనుగొందుము. ఇచ్చోటనే నీయా మూడింటి పూర్ణాభాసము చేసితివి. అందే నీ యా మూడు రూపములు నాభాసించినవి. నీవు కాలరాత్రి రూపముతో వెలసి మా కాలజ్ఞానమును దొలఁగింపుము. భూత భవిష్యద్వర్తమానములనెడి, మూడు విధముల కాలప్రతీతి, గంభీరమును అంధకారమునగు క్షేత్రమందు - అప్రకాశయోగ్య స్థానమందు విలీనమగుఁ గాక. సర్వమును వర్తమానముగానే ప్రతీతమగును. అపుడు నేను గాలాతీతుఁడనై మృత్యుంజయుఁడ నగుదును. నీ యరుణ చరణములను హృదయమందుంచుకొని శివుఁడ నగుదును. జీవత్వము పూర్తిగాఁ దొలఁగును. ఇదే సత్త్వగుణ ప్రలయము. మఱి మహారాత్రి రూపముతో నావిర్భవించి, నీవు మా మహత్తత్త్వపర్యన్తము విలయ మొనర్పుము. అపుడా నా క్రియాశీలత - రజోగుణముచేఁ గలిగిన చాంచల్యము లోపించి పోవును, నాకు నైష్కర్మ్యము లభించును. అపుడు నేను గేవల చైతన్యమయమైన యాత్మబోధమందే వెలఁగుచుందును. మఱి మోహరాత్రి రూపముతో వెలసి, నా జగన్మోహము, సంసార మోహమును బూర్తిగా విలుప్తము చేయుము. అపుడు నేను జయింపరాని మోహమును జయించి నిత్య చిన్మయమూర్తి యందే యెల్లపుడును మోహితుఁడ నగుచుందును.

అమ్మా ! నీ యీ మూడు మూర్తులు దారుణములు బహుభయంకరములు, అచటఁ గాలశక్తి రుద్ధము. జగత్ప్రకాశము

సుప్తము. మోహశక్తి విముగ్ధము. నీ కాల (కృష్ణ) రాత్రి మూర్తిని స్మరించినంతనే జీవుఁడు భయంపడును. అమావాస్య నాఁటిరాత్రి ఘోరకృష్ణ మేఘాక్రాన్తరాత్రి సూచీభేద్యంధకారమునందును నొక్కింత వెలుఁగుండును; గాని, అమ్మా! నీ యా కృష్ణమూర్తి యం దదియు నుండదు. సర్వవిధముల వికాసమును లుప్తమైపోవును. "నతత్ర సూర్యోభాతి న చంద్ర తారకమ్। నేమా విద్యుతో భాన్తి కుతో మగ్నిః ॥" అదెట్టి దారుణమూర్తియో ! అయిన నది స్వయం ప్రకాశము; అనంత శాన్తిమయము, అహంకార శరీరము నంటి యున్న సర్వవిధ జంజాలములును దొలఁగించి, మనో బుద్ధి చిత్తాహంకారముల రాజత్వమును విడిపించి, కేవలాత్మబోధము నకుఁ గొనిపోయి యచ్చట నిలుపును. రాత్రిరూపిణీ ! తల్లీ ! నీ యీ మధుమయాంక మెంత లోభనీయము ! దానిని మాటలతో వర్ణించుటెట్లు ? అది దేవీ పురాణమం దొక శ్లోకమునఁ గానఁబడును :- "బ్రహ్మమా యాత్మికా రాత్రిః పరమేశలయాత్మికా" జీవునిమాట లెక్కయేమి ? పరమేశ్వర పర్యన్తము విలీనమై పోవును. ఆ బ్రహ్మమాయ యొక్కటే నీ స్వరూపము. ఈ బ్రహ్మమాయాత్మిక రాత్రిరూపిణివి నీవు. త్రిగుణలయమునకై, జీవభావపక్షమున నత్యంత భయప్రదములగు కాలరాత్రి మహారాత్రి మోహరాత్రి రూపములతో వెలయుదువు.

ఓం. త్వం శ్రీస్త్వమీశ్వరీత్వం హ్రీం స్త్వం బుద్ధిర్బోధలక్షణా ।
లజ్జా పుష్టి స్తథా తుష్టి స్త్వం శాన్తిః క్షాన్తిరేవచ ॥ ఓం. 7

అమ్మవు నీవే శ్రీవి; నీవే యీశ్వరివి; నీవే యసత్కర్మ జుగుప్సారూపిణివైన హ్రీవి; నీవే బుద్ధివి; నీవే శుద్ధ బోధ స్వరూపవు; నీవే లజ్జవు; పుష్టివి, తుష్టివి, శాన్తివి, క్షమవు.

వివరణము :- అమ్మా ! నీవు సర్వజీవులందును వ్యష్టి ప్రకృతిరూపముతో విరాజిల్లు విషయమే, యీ బ్రహ్మకృత స్తోత్ర మందు విశేషించి వర్ణింపఁబడినది. త్వం శ్రీః - అమ్మా ! నీవే జీవుల సౌభాగ్యరూపమున నుందువు. ఎవ్వఁడేని సౌందర్యము, ఐశ్వర్యము, యశస్సు, అభ్యుదయము మున్నగు పలు విధముల సౌభాగ్యము గల్గియున్నచో, శ్రీరూపిణివైన నీవు వానిని నీ యొడిలోఁ బెట్టుకొంటివనవలసినదే.

ఈశ్వరత్వ = ప్రభుత్వము. అనఁగా వేలకొలఁది జనములపై నెవ్వనికే నాధిపత్యములభించినచో నీయీశ్వరీమూర్తితో వాని నొడిలోఁబెట్టుకొంటివని యెన్నవలసినదే.

హ్రీ - ఎవఁడేని దెలియకో తెలిసియో యసత్కర్మ మొనర్చి, నిందాభయముచే దాని దాఁచిపుచ్చఁ బ్రయత్నించునపుడు, వాఁడు హ్రీరూపవైన నీ యొడినున్నాఁడని తలంతురు.

మా నిశ్చయాత్మికవృత్తి (బుద్ధి) ప్రకాశించినపుడు, ఏది లేకున్న జగత్సత్త యుండదో, యట్టి బుద్ధిరూపముతో నీవే విరాజిల్లుదువని యెఱుంగఁదగును. జగద్భేధము లోపించి శుద్ధ బోధరూపమున నాత్మసత్తవెలసినపుడు, కేవల బోధముతక్క నితర లక్షణములేని నీవే యా బోధలక్షణవని చెప్పవలసినదే.

లజ్జా - నింద్యకార్యము లొనర్చుటకు నెవ్వఁడేని స్వాభావిక మైన సంకోచము నొందుచో, నచట నీవే లజ్జారూపమున నా జీవునందున్నావనవలసినదే.

పుష్టి - ఎవ్వఁడేని శారీరకపుష్టిలాభమునొంది జనసమాజము నందు సాటిలేని బలవంతుఁడని వాసిగన్న చోఁ బుష్టిరూపిణి వైన నీవే వాని నాడిలో నుంచికొంటివనవలసినదే.

తుష్టి - ఎవ్వఁడేని యానందపుతో నవ్వుచు దినములు గడుపుచుండునో, వాని సంతుష్టిరూపిణివి నీవే యొడి నుంచు కొంటివని యెన్నవలసినదే.

శాన్తి - ఎవ్వఁడేని ఆత్మజ్ఞానమునొంది జాగతికములైన సుఖదుఃఖముల కతీతమైన శాన్తిమయావస్థలోనున్న చో శాంతి రూపిణివైన తల్లివి నీవే వానిని నీ గుండె కత్తించుకొంటివనవలసినదే.

క్షాన్తి - ఎవ్వఁడేని బ్రతీకారము (అపకారమునకు బదులు సేఁత) చేయు సామర్థ్యమున్నను, నితరుల యపకారమును బ్రసన్నముఖముతో నోర్చికొనుచో, క్షమారూపిణివైన నీ యంకమందు వాఁడున్నాఁడనవలసినదే.

అమ్మా ! ఈ మూర్తులుగా సర్వజీవుల ప్రకృతిరూపముతో నీవు సదా వెలయుదువు; గాని మూఢులు, దానిని మానసికవృత్తి యనుచు నుపేక్షింతురు. అకటా ! వారు వారి భోగవాసనలను జరితార్థములనుగాఁ జేయుటకై, వారి కూఁత యిచ్చుటకై నీవే యిటులు పలుమూర్తులతో వచ్చి యాదరించుచున్నావని యెఱుఁగరు. అమ్మా ! నీ యీ నిత్యప్రత్యక్ష మూర్తిని - అంతట నెల్లపుడుఁ

ప్రకటమగు నీ యీ స్వరూపమును విడిచిపెట్టి, యెవ్వఁడే నెక్కడనేని, సప్తస్వర్గముల కావలనైనను, సర్వతత్త్వముల కతీతమైన క్షేత్రమునందైనను, నిన్ను వెదకికొనఁ బోఁగలఁడా ? నీవు కన్ను విచ్చిన వారు మాత్రము, సర్వభావముల నీ కౌఁగిటనే కట్టువడి సదా బ్రహ్మానందము ననుభవింతురు.

**ఓం. ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా ।**
**శంఖినీ చాపినీ బాణ భుశుండీ పరిఘాయుధా ॥ ఓం. 8**

అమ్మా ! నీవు ఖడ్గశూలధారిణివి. నీవు ఘోరవు (నీయొక చేత నరముండముగలదు). నీవే గద, శంఖము, చక్రము, ధనుర్బాణములు, భుశుండి (ఒక తదను ముండ్లుగలయినుపదుడ్డు), పరిఘము (లోహముద్గరము) అనెడి యాయుధములను దాల్చిన దానవు.

వివరణము :- అమ్మా ! వెనుకటి మంత్రమ్మందు నీవు జీవజగత్తున శ్రీ, ఈశ్వరీ, మున్నగు పదివిధముల స్వరూపములతో నాత్మప్రకాశము చేసికొనుట వర్ణింపఁబడినది. అది మాతృభావ ముతో-బ్రహ్మభావముతో నుపాసింపఁబడనిచోట, అనఁగా, "మనో బ్రహ్మేత్యుపాసీత" యనెడి శ్రుతి ప్రతిపాదిత సాధనకు విముఖులైన వారియెడ, నీ యా మూర్తులు, ఉత్పీడనమొనర్చు దశ ప్రహరణము లను దాల్చిన మూర్తులతో నావిర్భవించును. వాస్తవముగా నిది యుత్పీడనము కాదు. శాసనాకారమున మాతృస్నేహత్వముయొక్క బహిర్వికాసమే. తెలివిలేని శిశుసంతానమును దఱుచుగా శాసనరూప స్నేహ వికాసముతో, ఉజ్జ్వల జ్ఞానక్షేత్రమునకుఁ దెచ్చుచుందువు.

కావున నీవు ఖడ్గ శూల గదాదులగు నాయుధములతో నలంకృతవై యావిర్భవింతువు.

శ్రీరూపిణి ప్రకృతియొడియం దుండియు - అనఁగా సర్వవిధ సౌభాగ్యములతో ధన్యుఁడయ్యును జ్ఞానహీన శిశువువలె, నా సౌభాగ్యములను భోగించునేని - నీవే వాని యభ్యుదయ రూప ముతో వెలయుచున్నావని కనుగొనఁడేని, అభ్యుదయరూపిణీ ! అమ్మా ! యని నీ యడుగులందుఁ గృతజ్ఞతతోఁ బుష్పాంజలి నిడఁడేని, శ్రీరూపిణివయ్యు వానియెడ నీవు ఖడ్గినీ మూర్తితోఁ బ్రకటిత వగుదువు. అనఁగా వెంటనే యా సౌభాగ్యసుఖమును ఖడ్గముతో నఱికినట్లుగా విచ్ఛిన్నము చేయుదువు. శ్రీరూపముతో నీవు వచ్చితివని తెలుపుటకై - నిన్నుఁగానక తానే సౌభాగ్యకర్తనని కూర్చున్న యా యహంకారము తలను తెగఁగొట్టుటకై నీ శ్రీమూర్తిని ఖడ్గధారిణీ స్వరూపముతోఁ బ్రకటింతువు.

ఇటులే ప్రభుత్వలాభము నొందియు, నీ యీశ్వరీ మూర్తిని లెక్కింపక నిందించువానియెదట నీవు శూలధారిణీ మూర్తితోఁ బ్రకటిత వగుదువు. ప్రభుత్వము నుండి పతనమనెడి శూలా ఘాతముతో వానిని వేధింతువు. కావున నీ యీశ్వరీ మూర్తి శూలధారిణి.

అసత్కర్మములనుజేసి నిందాభయమున గోపనము చేయు వాఁడు, హ్రీమూర్తిరూపిణివైన నీ యంకమందున్న జీవుఁడు, నిన్నుద్దేశింపక నిన్ను స్మరింపకున్నచో, వెంటనే నీవు నరముండము నొక చేతఁ దాల్చి ఘోరరూపముతోఁ బ్రకటవై వాని యా యసత్కర్మ

మును జనసమాజమునందు వెల్లడించి, నీకు శరణాగతుఁడగు శిక్ష వేయుదువు.

ఇటులే బుద్ధివృత్తిని నీ స్వరూపముగానే కానక బుద్ధి మాత్రముగానే తలంచువాఁడు, మాటిమాటికి దైవప్రతికూలత యనెడి గదాఘాతములచేఁ గొట్టఁబడి తన బుద్ధిని భ్రమసంకులమని తలంచి వ్యథనొందుచుండును, గావున బుద్ధిరూపిణివైన తల్లివి, ఆ చోట గదాధారిణీమూర్తిగాఁ బ్రకాశింతువు.

నీ కృపచే శుద్ధబోధ సంధానము నొందియు దానిని తత్త్వ మాత్ర జ్ఞానముగాఁ దలంచి యుపేక్షించుచు నొక యాకాశీయ భావమాత్రముగా నెన్నువాని సంసారచక్ర పరిభ్రమణము నివృత్తముకాదు గాన, నీ బోధలక్షణమూర్తి, యజ్ఞానిజీవులయెడఁ జక్రధారిణీమూర్తితోఁ బ్రకటితమగును.

అసత్కార్యములవలన సంకోచమనెడి లజ్జను నీ విశిష్ట భావముగాఁ జూడనివాని, యా నిందితకర్మములు శంఖధ్వనిచే వలె సర్వలోకములందు విదితములైపోవును; గావున నీవు లజ్జా రూపముతో శంఖిని వగుదువు.

తన శారీరకపుష్టిని, ఆహారము ఔషధము వ్యాయామము మున్నగువాని ఫలముగానే యెంచి పుష్టి (పోషణశక్తి) రూపిణివైన నిన్ననాదరించువాని యాపుష్టి కురోగరూపముగాఁ బరిణమించి నీ చాపినీ (ధనుర్ధారిణీ) మూర్తి యొక్క యావిర్భావమును ఘోషించును.

మానసికతుష్టిని నీ మూర్తిగాఁ జూడక విషయభోగ సంధాన మునే చేయువాఁడు, ఆకస్మికముగా గొడవలలోఁ బడిపోవుట

యనెడి బాణవేధ యగుటచే వాని మర్మస్థానములు, సదా వ్యధితములే యైపోవును, గాన నీ తుష్టిమూర్తి బాణధారిణి.

శాన్తినొందియు, నీ శాన్తిరూపిణీమూర్తిని జూడక, జ్ఞాన సంపన్నుఁడయ్యు జీవుఁడు సాంసారిక దుర్ఘటనములనెడి లోహ దండయుచేనైన యాతనను సహించును; గావున నీవు శాంతి రూపముతో భుశుండీధారిణివి.

ఇతరులను క్షమించి నీ క్షమామయమూర్తిని జూడకుండు వారు పరులచే ననుచితపీడలనొంది నీ పరిఘధారిణిరూపము వికసించుట కాంతురు.

ఈ విధముగా సర్వభావములతో నిన్నే చూడనివాఁడు, నిన్నుఁ జూడకున్నంతదాఁక, నీ వాయా భావములతో నేదే నొక పీడకలిగించి వానికి బుద్ధికఱపుచుందువు. నీ బిడ్డల యజ్ఞానమును దొలఁగించు టకే నీ యీ శాసనమూర్తుల వికాసము. ఒక్కసారి శాసనమును దెలిసికొనలేనియెడల నీవు బాధ్యవై మాటిమాటికి నిట్టి విభిన్నాయుధములు దాల్చిన మూర్తులతో నావిర్భవింతువు. ఇది నీ సంతానవాత్సల్యమున కపూర్వనిదర్శనము. సంతానము నపూర్ణముగాఁ (లోపముగల వానిగా) గను గొని పూర్ణవైన నీవు తృప్తినొందఁగలవా ? కావున సంతానము కోరికనుబట్టియే సంతానము నభిలాషములను బూరించుటకై, అంతఃస్థలము నుండి నీ శుభమయమహేచ్ఛ గుప్తముగా నడుచుచుండును. జీవుఁడు సర్వభావములతో నిన్ను గానలే నన్నాళ్లును నీ యా యిచ్ఛ శాసనాకారముగానే వెలయుచుండును. ఇఁక నిన్నుఁ జూడఁగలవారి

యెడ నీ వామూర్తులతో వెలయక సౌమ్యమూర్తులతోనే యావిర్భ వింతువు. ఇదే యీ పై రాఁబోవు మంత్రమందుఁ జెప్పఁబడినది.

ఓం. సౌమ్యా సౌమ్యతరాశేష సౌమ్యేభ్య స్త్వతి సుందరీ ।
పరా పరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥ ఓం. 9

అమ్మా ! నీవు సౌమ్యవు; సౌమ్యతరవు; సౌమ్యతమవు. నీ వతిశయ సౌందర్య విశిష్టవు. నీవే పరా, అపరా యను రెండింటికి నాశ్రయమవు; పూజనీయవు; కావున నీవే పరమేశ్వరివి.

వరణము :- అమ్మా ! సర్వభావములతో నిన్నుఁ జూచు నలవాటు లేని జ్ఞానహీన శిశువుల జ్ఞాననేత్రమును దెఱచుటకై, నీ వనేక శస్త్రధారిణీమూర్తులతో నావిర్భవింతువు. ఇఁకఁ దమ తమ ప్రకృతిని 'దల్లి' యనుచుఁ దెలిసికొని సర్వత్ర సర్వభావములతో, అమ్మదే కర్తృత్వ మనియుఁ, దాము యంత్రస్వరూపులే యనియు నెంచి "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి । భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" (గీత 18-61) యనెడి గీతోక్త మంత్రమును సాధించి సిద్ధులైనవారి యెదుట నీవు సౌమ్యమూర్తితోనే వెలయుదువు.

సర్వభావములతో, నీవొక్కతెవే విరాజిల్లుదువని తెలివితో నెన్నువారియెడ - అనఁగా బుద్ధియోగమునకుఁ బ్రథమాధికారులైన వారియెడ, నీవు సౌమ్యవు. నీకుఁ బ్రాణ సమర్పణము చేసి, తమ ప్రాణమును బ్రవాహ విశేష మాత్రముగా గనువారి యెదుట,

అమ్మా ! నీవు సౌమ్యతరవు. మఱి సర్వభావములతో నీకు మనస్సు నర్పింపఁగలవారియెడ, అనఁగా బూర్తిగా మనస్సును నీయందే చేర్చివేయఁగలవారియెడ నీవు, "అశేష సౌమ్యేభ్యస్త్వతిసుందరీ" అనఁగా సౌమ్యతమమూర్తితో వెలయుదువు. బుద్ధియోగులయెడ నీవు సౌమ్యవు; ప్రాణదర్శులైనవారియెడ నీవు సౌమ్యతరవు; మఱి మనోవిలయము నొనర్చువారియెడ నీవు సౌమ్యతమవు. అమ్మా ! సంపూర్ణముగా మనస్సును నీ కర్పింపఁగల సౌభాగ్యము నొందిన సంతానము సర్వభావముల మాతృమయమేయైపోవును. వారి స్థూలేంద్రియముల పర్యంతము మాతృధర్మమును మాతృ మహిమమును ననుభవించుచుండును. వారు లోను వెలిని సర్వత్ర, అమ్మ సౌమ్యతమమూర్తి వెలయుటే చూచి ముగ్ధులగుచుందురు. అమ్మా ! నీ సౌందర్యము కంటఁబడినవారు మఱెన్నఁడైన నీ జాగతిక విశిష్ట సౌందర్యముచే నాకర్షింపఁ బడుదురా ? తన ప్రహ్లాదినీశక్తి వికాసమును జూపి, జీవులను ముగ్ధులను జేయునట్టియుఁ, జంద్రునందును, గమలమందును, గామినీ కమనీయ ముఖ మండలమందును దోఁచు సౌందర్యము, నీ సౌందర్యరాశి యొక్క కోటిపాలునకైనను సాటికాదు. జగత్తునందెక్కడ నెంత సౌందర్యము న్నను, అది నీ సౌందర్య సముద్రమందలి యొక చిన్న చిన్కు మాత్రమే. సకల బ్రహ్మాండములందును గల సౌందర్య కణములను నొక్కచోటఁ జేర్చుటచేఁ గల్పింపఁబడు సౌందర్యరాశి, నీ సౌమ్యతమ మూర్తి యొక్క యాభాసమే.

అమ్మా ! నీవు "పరా పరాణాం పరమా" పర - బ్రహ్మాదులు, అపరా - దేవ మనుష్యాదులు ఈ యిరు తెగలకును నీవు

ఆశ్రయమవు (పూజ్యవు). కనుక నీవే పరమవు. సర్వశ్రేష్ఠవు. నీవే పరమేశ్వరివి. మును జెప్పిన నీ త్రివిధసౌమ్యమూర్తులను జూచి ధన్యులై బుద్ధి ప్రాణ మనస్సులను లెన్నగా మాతృయుక్త మొనర్చినవారు మాత్రమే, బ్రహ్మ మొదలు కీటాణు పర్యంతము, ననంతకోటి బ్రహ్మాండములును నీ సత్తచేతనే సత్తావంతములని కనుఁగొనగలరు. ఈ బ్రహ్మాండ యజ్ఞాగారమునకు ముందు వెనుకలఁ, గ్రిందుమీదుల నున్నదంతయుఁ దెలిసియో తెలియకో నీ పూజయందే నిరతమైయున్నది. వాని యెదుర నీ వీ పరమేశ్వరమూర్తితోనే ప్రత్యక్షమగుదువు.

ఇచట నింకను జెప్పఁదగినది - తమ తమ ప్రకృతిని, 'అమ్మ' యని తలంపఁగలుగుటచే సర్వభావముల మాతృయోగ మందే యలవాటుపడుటచే నా ప్రకృతి జగద్ధాత్రియైన దైవీ మహతీ ప్రకృతిరూపమునే యనుభవింపఁబడును. అపుడు దానిని దీనయు మలినయునైన యమ్మగాఁ దలంపరు. ఆ యవస్థయందు సాధకులు - ఇన్నాళ్ళును దేనిని గేవలము అమ్మ యని తలంచిరో, యదే పరాపరపూజ్యయు, పరమయు, పరమేశ్వరియునని కనఁగల్గుదురు. మా యమ్మయే సర్వజగత్తునకు అమ్మ, యను నీ యనుభవము సాధకునకుఁ గల్గునపుడు, అతఁడు తల్లిని సౌమ్యతమగాను, అతిసుందరిగాను జూడక, మఱల మలిన వికారమూర్తిగాఁ జూడఁగలఁడా ?

ఈ సూర్యుఁడు లెక్కలేని గ్రహములచేతను, ఉపగ్రహముల చేతను జుట్టుకొనఁబడి, మన యమ్మ యంగమందుఁ గిరణముల వెదఁజల్లుచున్నాఁడని కనఁగల్గునపుడు, ఈ వాయువు పూదావిసిరిని మోచి తెచ్చి మన యమ్మకుఁ దనివిఁ గూర్పు చున్నాఁడని కనఁగల్గు

నపుడు, మేఘమాల పవిత్రజలమును గురిసి యమ్మ యంగమును స్నిగ్ధముచేయుచున్నదని కన(గల్గునపుడు, ఎత్తైన పర్వతపంక్తి తలయెత్తి మన యమ్మను దర్శించుటకే ధీరముగా నిల్చినదని కన(గల్గునపుడు, పూచిన చెట్లగుమిమన యమ్మ యడుగులందు( బూదో యిల్ల నిడుచున్నదని కన(గల్గునపుడు, పలు తెగల పక్షులు అవ్యక్త మధురస్వరముతో మాతృవందనగీతములే పాడుచున్నవని కన(గల్గునపుడు - ఈ విధముగా సర్వవిధముల సర్వత్ర మన యమ్మ సేవాపూజలే సాగుచుండుట కన(గలుగునపుడు, మఱి యేమైపోవునో వర్ణింప(గలమా ? అపుడు 'నేను' ఉండదు. ఉండు నది యమ్మయే. అమ్మ వాసుదేవమూర్తియే. ఇట్టి యవస్థ యందు సాధకు( డొక యద్వితీయ బ్రహ్మమూర్తి సంవేదనముతో( బూర్తిగా( దన్ను( దా మఱచిపోవును. ఇదే మన యమ్మగారి యతి సుందర సౌమ్యతమ పరమేశ్వరీమూర్తి.

ఓం. యచ్చ కించి త్క్వచిద్వస్తు
సదసద్వాఖిలాత్మికే ।
తస్య సర్వస్య యా శక్తి :
సాత్వం కిం స్తూయసే తదా ॥ ఓం. 10

అఖిలాత్మికా ! జననీ ! సద్వస్తువేదైన, నసద్వస్తువేదైన, నంతయు నీవే. సర్వవిధముల విరాజిల్లు శక్తియు నీవే. కా(గా మఱి నీ స్తవమన నెట్టిది ? (నిన్నేమని స్తుతించుట ?)

వివరణము :- తమ ప్రకృతినే అమ్మ యని సాధనక్షేత్ర మందు ముందంజవేయువారు, ఏ విధముగా నెట్టుమెట్టున భేద జ్ఞాన

రహితమైన యద్వైతతత్త్వమును జేరుదురో, అదియే యీ బ్రహ్మకృత స్తోత్రమందు, ఒక్కొక్కటిగాఁ జూపఁబడినది. అమ్మా ! నీవు పరమాత్మరూపమున నతికష్టముచేఁగాని యను భవమునకురావు. కాని, ప్రకృతిరూపమున మనుష్యమాత్రుల యనుభవమునకు వత్తువు. ప్రకృతిరూపిణివైన నీ సేవ చేయుట చేతనే నీ పరమేశ్వరీ మూర్తి తెలియఁబడును. అపుడు సత్ అసత్ అనుట కెట్టిభేదము నుండదు. సర్వమయమును జగన్మయమును నైన యాత్మ వికాసమునుజూచి, సర్వరూపములుగాఁ బ్రతీతమగు బహుత్వము ఆత్మయొుక్క శక్తిమాత్రమే యని తెలియుటచేతనే జీవుల సర్వసంశయములు తొలఁగును.

సర్వము నా ప్రకృతియే; నా యమ్మ; నా యాత్మ నేను, స్తుత్యము, స్తోత, స్తుతి యను సర్వము నేను, అమ్మయైనపుడు, మఱి యెవ్వరెవ్వరిని స్తుతించుట ? "యదా సర్వమాత్మైవా భూత్తదా కేన కం పశ్యేత్" అను నీయనుభవము కలుగు క్షణ మందే యన్ని విధముల క్రియలును ఆగిపోవును. పూజింపఁబడునది, పూజించు వాఁడు నను భేదముండదు. ఒకటే యైపోవును. అహంత్వమహా ప్రసారమందు - (సర్వము 'నేను' అను తెలివి వ్యాపించునపుడు) జీవభావము (క్షుద్రాహంత) మునిఁగిపోవును. "సర్వస్య ప్రకృతిః" అన్నదే మహాదేవి యైపోవును. చిత్తవిక్షేపము, వాక్కు, నిఃశ్వాసము హృదయపిండక్రియయుఁ దమంత నాఁగిపోవును. ఏకమును ఘనమును ఆనందమయమునైన సత్త మాత్రమే నిల్చియుండును. దేనియం దుపస్థితుఁ డైనపుడు, ఉన్నది "అస్తి" యని తోఁచునో, ఆ మాటయే యిచటఁ జెప్పఁబడుచున్నది. జగత్తుయొక్క

అస్తిత్వము వీని యెదుటఁ జెప్పఁ బడదు - అనఁగా జగత్తున్నదని వీనికి దోఁచదు. అది యుండనీ.

ఓం. యయా త్వయా జగత్స్రష్టా
జగత్పాతాత్తియో జగత్ ।
సోఽపి నిద్రావశం నీతః
కస్త్వాం స్తోతు మిహేశ్వరః ॥ ఓం. 11

జగదుత్పత్తి స్థితి లయ కర్తయైన యా విష్ణుఁడే నీ ప్రభావముచే యోగనిద్రాచ్ఛన్నుఁడైనపుడు, మఱి నిన్ను స్తుతింపఁ జాలువాఁ డెవఁడు ?

వివరణము :- ఏ ప్రాణమువలన సర్వజగత్తు పుట్టినదో, ఏ ప్రాణమందే నిల్చియున్నదో, ఏ ప్రాణమందే యది లయమొందునో (సృష్టి స్థితి ప్రలయకారి యగు) యా ప్రాణమే (విష్ణుశక్తియే) యోగనిద్రచేఁ గ్రమ్మబడినది. ఆ విష్ణువే జగద్బీజ పర్యంతము (జనన మరణ మూలసంస్కార పర్యంతము) దొలఁగింప విముఖుఁడై నపుడు, మఱి నీ స్తుతి యెవఁడొనర్చును ? నేను (బ్రహ్మ) ప్రాణము నొడియందున్న మనస్సును. విష్ణుని (ప్రాణ) సహాయతలేక నిన్ను స్తుతించు శక్తి నాకేదీ ?

ఓం. విష్ణుః శరీర గ్రహణ
మహ మీశన ఏవ చ ।
కారితాస్తే యతోఽతస్త్వాం
కః స్తోతుం శక్తిమా న్భవేత్ ॥ ఓం. 12

విష్ణు(డు, నేను, ఈశాను(డు నను ముప్వురము నీవల్లనే. జన్మ మొందితిమి (మా శక్తి నీశక్తియే యయ్యె) అపుడు నిన్ను స్తుతింప నెవ(డు సమర్థు(డు ?

వివరణము :- అమ్మా ! నీవే జ్ఞానప్రాణ మనోరూపములతో వెలసి, శివ విష్ణు బ్రహ్మ నామములతో వాసి కెక్కుదువు. నీవు జీవభావము నొందు సంస్కారరూపముతో నిన్ను వెలయించు కొన్నపుడే, నీ పేరు మనస్సు ఇటులు ప్రత్యేక జీవుని హృదయమందు ననుభవింప(బడు వ్యష్టిచైతన్యమే ప్రాణము. ఇటులే ప్రతి జీవునియందు సదా ప్రకాశించు బుద్ధియే, జ్ఞానమను పేర( బ్రసిద్ధము. ప్రత్యేకజీవునందు ననుభవింప(బడు వ్యష్టి మనః ప్రాణ జ్ఞానములు, ఒక సమష్టి విరాణ్మనః ప్రాణ జ్ఞానముల యొక్క చిన్న చిన్న బుడగలే. ప్రత్యేక జీవునియందు మనస్సు ప్రాణము జ్ఞానము, అను పేళ్లతో( బ్రసిద్ధములైనవే, సమష్టియందు బ్రహ్మ విష్ణు మహేశ్వరులనెడిపేళ్లతో( జెల్లును. ఈ సర్వమును మహామాయవు, అమ్మవు నైన నీవికాసమే యైనపుడు, మేము నీవుగాక యితర మేమియుం గానవుడు, మఱి నిన్ను నస్తుతింప మాకు సామర్థ్యమొక్కడిదీ ?

ఇచట సాధనరహస్యము కొంచెము చూప(బడినది - ఈ విరాణ్మనః ప్రాణ జ్ఞానముల - అన(గా బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సాక్షాత్కారము నొందుటకై తమ జీవభావీయ మనః ప్రాణ జ్ఞానములను సంధానింతురు. వానిని బ్రహ్మ విష్ణు మహేశ్వరులని పూజలు చేయుదురు. భూమిలోపల దాగియున్న జలప్రవాహమును దాకుటకై తమ పెరటిలో నొక నూయి త్రవ్వుటచే( గోర్కి నెఱవేఱునటులే, విరాట్ - సమష్టి - సంధానము చేయుటకై, తమ

లోపలనే యెల్లప్పుడు ననుభవింపఁబడుచున్న వ్యష్టిసత్త నాశ్రయించు టగును. నీలోనే ప్రకాశించు మహామాయా బిందువునే, నీ యధికారమందున్న ఆ యింత యంశమునే బ్రహ్మ విష్ణు మహేశ్వర జననియని తెలియఁ బ్రయత్నింపుము. ఆమె చరణములకే, నీ సుఖ దుఃఖములను నివేదించుకొమ్ము. ఆమెయే మహాశక్తి రూపముతోఁ బ్రకటిత కాఁగలదు. నీ దౌర్బల్యములఁ దొలఁగింపఁ గలదు.

ఇచ్చట బ్రహ్మ స్తుతించి స్తుతించి, యెచట సర్వమయ మాతృక ర్తృత్వమును దర్శించి, సర్వవిధముల మాతృస్వరూపము ననుభవించి, సర్వత్ర మాతృశక్తి ననుభవించి, క్రమ స్తుతిచేయ విరమించెనో, యట్టి క్షేత్రమునకు వచ్చి నిల్చెను. (అనఃగా నట్టి యవస్థకు వచ్చెను.) సాధనక్షేత్రమందు సైతము సరిగా నిట్టులే యగును. ప్రారంభమందు ద్వైతజ్ఞానము నూఁత చేసికొని, జీవేశ్వర భావములను రెంటిని నాశ్రయించి యగ్రసరుల మగుదుము. క్రమముగా ద్వైతప్రతీతి లోపించి యత్మాను భూతి వెలయు చుండును. జీవయాత్రాసాధవచేతనే యనుము; ప్రతిదిన సంధ్యా వందనాద్యనుష్ఠానముల చేతనే యనుము. ఇట్టి యనుభవమునే చేయుదురు. సాధకులు ప్రతి దినముచేయు నుపాసన చేత, నిట్టి యవస్థాభాసము నొందనంతదాఁక, సాధన సరిగాఁ గాకున్నదని తెలిసికొనవలసినదే. ప్రతిదిన సాధనమందును నింతవఱకు నొక్కసారి సాలోక్యాది చతుర్విధముక్తులలో, మొదటి మూడింటి యాస్వాద మగుచుండును. కావలయును. అది మున్ముందు చెప్పఁబడును.

ఓం. సా త్వమిత్థం ప్రభావైః స్వై రుదారై ర్దేవి సంస్తుతా ।
మోహయైతౌ దురాధర్షా వసురౌ మధుకైటభౌ ॥ ఓం. 13

ఓం. ప్రబోధంచ జగత్స్వామీ నీయతా మచ్యుతో లఘు,
బోధశ్చ క్రియతామస్య హంతుమేతౌ మహాసురౌ ॥ ఓం. 14

ఓ దేవీ ! నీ యత్యుదారప్రభావముచే స్తుతింపఁబడితివి. (నిత్యతృప్తవు నీవు విశేషించి ప్రసన్న వగుదువని ప్రార్థించు చున్నాము.) దుర్ధమనీయులైన మధుకైటభాసురులను ముగ్ధులను జేయుము. జగన్నాథుఁడైన విష్ణుని మేల్కొల్పుము. అమ్మహాసు రులను నీవు చంపవలయునని తెలుపుము.

వివరణము :- అమ్మా ! ఇన్నాళ్లకు నీ స్తుతి నీ సాధన నీవే చేసికొనుచున్నావని తెలిసినది. అత్యుదారమైన నీ ప్రభావము, నీ యలౌకికమహత్త్వరచనము, మహాశక్తివైన నీ యనిర్వచనీయ కథలు, నీ స్నేహముయొక్క యనంత నిర్భర రహస్యము నీవయి వర్ణింపక, తమంత వెల్లడిగాక, నీవు కోరి పట్టువడనీయనిచో, నిన్నెటింగి పట్టుకొనుట యెవరికి శక్యము ? "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునాశ్రుతేన" ఎన్ని శాస్త్రములు చదువనీ, ఎన్ని వేదములు చదువనీ, ఎంత తపస్సు చేయనీ, నీవే దయఁదలఁచి నిన్నుఁ దెలుపక పోయినచో, నిన్నెవఁడును దెలిసికొనఁజాలఁడు. నిన్ను స్తుతించి, నీ విశిష్ట ప్రభావమును గనుగొని ముగ్ధుఁడనైతిని; గాని విశేషించి యీ నోర వెడలు స్తుతి వ్యాఖ్యల రూపమున నీవే యావిర్భవించితివని తెలియఁగల్గితిని. నీ స్తుతి నీవే చేసికొని, దాని ఫలముగా నిత్యతృప్తవైన నీవు విశేష ప్రసన్నురాల వగుదువు;

కావుననే - అమ్మా ! నీ పరమకరుణ వెలయించి, స్వప్రకాశ పరమేశ్వరీమూర్తితో నావిర్భవించి యీ మధుకైటభాసురులను మోహితులను జేయుమని వేడుకొనుచున్నాము. నీ యీ బహుత్వ వాంఛ, నీ యీ బహుత్వక్రీడయు మమ్ములను బాధించుచున్నవి. ఇది పూర్తిగా స్థిరపడి, నీ సౌమ్యమూర్తిని, నీ జగదతీత సౌందర్యమును అనుభవింపనీయకున్నవి. ఈ సురవిరోధు లిరువురును దమ యాసురీభావములను విడిచి, నీ యేకరసానంద ఘనమూర్తిచే ముగ్ధములైపోవునట్లు చేయుము.

వీరిని ముగ్ధుల నొనర్చినంతమాత్రానఁ బని కాదు. ఏ ప్రాణశక్తి యొడినుండి వీరు బయలుదేరిరో; ఎవ్వఁడొక్క క్షణమైనను నెవ్వరి హృదయబృందావనమునుండి విచ్యుతుఁడు కాఁడో, యట్టి యచ్యుతుని విష్ణు నెటులో మేల్కొల్పుపనియు నీదే; ఏమన, నాతఁడు యోగనిద్రాచ్ఛన్నుఁడైనాఁడు; కావు ననే యీ యసురు లత్యాచారము జరుపుచున్నారు. క్షణికమైన యాత్మమిలన బమోహముచేఁ బ్రాణము, జగద్వ్యాపార సమూలనాశమువలన విముఖమై యున్నది. ఇయ్యిరువుర నసురులను జంపుటచే నానందము చిరస్థాయియగును. ఇది తెలిసియుఁ దలఁపకున్నాఁడు. కనుకనే యసురవధమునెడ విముఖుఁడైనాఁడు.

"ఇపుడు మాకు నంసార మక్కఱలేదు. విషయము లక్కఱలేదు; దేహేంద్రియ మనోబుద్ధిప్రకాశ మక్కఱలేదు. కేవలము నిత్యసనాతనమాతృచరణములనే కోరుదుము." అని నోరితో నందుము గాని, ప్రాణమువంకఁ జూచినచో నిది వట్టి మాటయే

యని తోఁచును. ప్రాణము యథార్థముగాఁ బూర్ణ భావముతో, అమ్మను గోరదు. ఎంత కోరిన నంత లభించును. ప్రాణమింకను బూర్తిగా జగత్ఫలనమును దొలఁగింప నొల్లదు. కావున యోగమన్నను నిద్రయే. ఈ నిద్ర తొలఁగవలయును.

యోగులు మాటిమాటికి సమాధివదలి లేచి కూర్చుందురు. దానికిఁ గారణము మఱేమియుంగాదు. ఈ యోగనిద్ర - మధుకైటభులు = అమ్మ, జగత్తు, ఈ రెండును నుండుదాఁక యని కోరుదురు. వారు రెండిటితోను నేస్తము చేయుచునే ముందడుగు వేయఁ గోరుదురు. కాని, అమ్మా ! నీవు సర్వగ్రాసినివి. ఏకముగా నన్నిఁటిని మ్రింగివేయక నీవు తనివి నొందవు. కనుక నీ యసురపీడ ప్రాణమునందే వికసింపఁ జేసి ప్రాణముచేతనే యీ యసురులను జంపింపుము. పూర్తిగా నీలోఁ జేర్చి వేసికొనుము. ఇదే నీ మధుకైటభవధ రహస్యము.

ఇచట బ్రహ్మ అమ్మను మూడు వరముల నడిగికొనుట కానవచ్చును. 1. మధుకైటభుల మోహము; 2. విష్ణుని మేలు కొలుపుట, 3 విష్ణువునం దసురవధ బుద్ధిని రేఁగఁగొట్టుట. ఇమ్మూడును గాకున్న దుర్జయాసుర వినాశముకాదు. ఏమన - అసురరూపమున నున్నదియు అమ్మయే. అమ్మయొక్క యీ యాసురీప్రకృతి, తానయి యీ యసురవధమును గోరకున్నచో వారిని జంపు సామర్థ్య మెవరికిని లేదు. రెండవది, విష్ణువు - ప్రాణ శక్తి, చక్కఁగా జాగరితము గాకయున్న, మాతృలాభము కాదు. మూడవది,

మాతృమిలనాభిలాషము పూర్ణముగా రేఁగినప్పుడే, ప్రాణము జగద్భావమును మథింపఁగడఁగును. ఇదే విష్ణుని కసురనిధన బుద్ధిని రేఁగఁగొట్టుట.

ఇది శ్రీ మార్కండేయ పురాణాంతర్గత దేవీమాహాత్మ్యమందు
ప్రథమచరిత్రమున, మధుకైటభ వధమును జేయింప
విష్ణుని మేల్కొల్ప, యోగనిద్రారూపిణిని
దేవి నుద్దేశించి బ్రహ్మ చేసిన స్తుతికి
శ్రీకాకుళవాసి, శ్రీ శ్రియానందనాథుఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ
వ్రాసిన వ్యాఖ్య
శ్రీపరదేవతార్పణము
శ్రీమాత్రే నమః



శ్రీమాత్రేనమః

ఓం నమ శ్చండికాయై

# సాధన సామగ్రి

## మహిషాసుర వధానంతరము

## శక్రాదికృత స్తుతి

[ప్రార్థనము - సంకటములను విడిపింపఁగోరుట. స్తవము - సంకటములు తొలఁగినపైని గుణానువాదము.]

ఓం. ఋషిరువాచ ఓం.

ఓం. శక్రాదయః సురగణా నిహతే ౽తివీర్యే
తస్మిన్ దురాత్మని సురారిబలే చ దేవ్యా ।
తాం తుష్టువుః ప్రణతిన మ్రశిరోధరాం సా
వాగ్భిః ప్రహర్షపులకోద్గమ చారుదేహాః ॥ ఓం. 1

ఋషి చెప్పుచున్నాఁడు :-

దేవిచేత - నయ్యతి బలశాలి, దురాత్ముఁడు మహిషాసురుఁడును వాని సేనయు జంపఁబడినది. ఇంద్రాది దేవతావర్గము మెడలను మూపులను వంచి ప్రణమిల్లుచు వాక్కులతో నామెను స్తుతింపఁగడగెను. ఆనందవశమున నొడలు గగుర్పొడుచుట చేత దేవతల శరీరములు మనోహరములయ్యెను.

వివరణము :- ఈ యధ్యాయమందు దేవతల స్తుతి వర్ణింపఁబడినది.

మహిషాసురుఁడు దురాత్ముఁడు - అసత్ప్రకృతి. ఎవని ప్రకృతి యసత్ప్రియమై, పరిచ్ఛిన్నతయెడ ముగ్ధమై ఖండఖండ జ్ఞానముతోనే తనియునో, వానిని అసత్స్వభావుఁడు, దురాత్ముఁడు ననవలయును. అమితవీర్యుఁడైన అసత్స్వభావుఁడైన మహిషాసురుఁడు తన సేనలతో సైతము చంపఁబడెను. బహిర్ముఖ వృత్తి ప్రవాహముతోఁ గూడిన రజోగుణము పూర్తిగా బాధింపఁబడినది. కనుకనే సత్త్వగుణప్రకాశమనెడి దేవతా బృందము, ఇపుడు స్థిరముగా మాతృస్వరూపదర్శనము ననుభవింపగలదు. అమ్మయొక్క యీ విశ్వమోహనరూపము ప్రత్యక్షమైనవు డెవ్వఁడును మిన్న కుండఁజాలఁడు. వెలి లక్షణములు - జ్ఞానము భక్తి కర్మములు అను మూడును ఒక్కసారి బయల్పడును. కావున నింద్రాదిదేవతలు, ఆనందముతో మాతృమహత్త్వ కీర్తనమనెడి స్తుతి చేసిరి.

ఈ స్తవమందు మూడు విషయములు ముఖ్యముగా గుర్తింపఁదగినవి. 1. ప్రణతి నమ్రశిరోధరాం సా. 2. చారు దేహః 3. వాగ్భిః, అనునవి. కాయిక మానసిక వాచికములనెడి మూడు విధముల స్తుతులను లక్షించియే, యీ మూడు పదములు ప్రయోగింపఁబడినవి. మనము వరుసగా వీనిని దెలియఁ బ్రయత్నింతము. దేవత లీ విధముగాఁ బ్రణతులైరి. వారి మెడలు మూపులుఁ బూర్తిగా వంగిపోయినవి. ఇదే కాయిక స్తుతి. సాష్టాంగ ప్రణామము. అమ్మను స్మరించుచునే యీ విధముగా సర్వాంగ ములు నామె చరణములందు నమ్రములు కావలయును. అనంత జననమరణములందు సారథియైన యే యమ్మ నొక్కసారి దర్శించుటకై లక్ష జననమరణములనెడి తిరుఁగటి చిప్పలలో నలిగి

పిండియైరో, ఆ యమ్మ నేఁడు ఎదురనిల్చినది. ఆమె స్నేహము, ఆమె విరాట్కర్తృత్వము, ఆమె మహతీశక్తి తలంపునకు వచ్చునపుడు, బిడ్డలదేహము తప్పక వంగిపోవును. ఆనందముతోఁ బులకించుచు. బిడ్డలదేహము తప్పక వంగిపోవును. ఆనందముతోఁ బులకించును. కన్నీరు, వణఁకు మున్నగు సాత్త్వికలక్షణములు బయలగును. ఇదే మానసిక స్తుతి లక్షణము. ఈ రెండిటితోనే, అమ్మమహత్త్వము వాక్కులతో నప్రయత్నముగా స్తుతింపఁబడును. ఇదే వాక్యస్తుతి. అమ్మా ! నీవు అనిర్వచనీయవు. మనసునకు మాటలకు నందవు. అయినను మేము వాక్కులతో నిన్ను స్తుతించుచున్నాము. దీని ఫలముగా మా వాక్కు శుద్ధినొందును. నాలుక నంటిన జడిమ తొలఁగిపోవును. సదా కల్లలాడుటచేతఁ జెడిపోయిన నాలుక పవిత్రమగును. ఉచ్చైఃస్వరముతో జపము చేయుట, మనస్సులోనే స్తుతించుట శాస్త్రముచే నిషేధింపఁబడినవి. మనస్సునందే స్తుతించుట, నిష్ఫలప్రాయమే కనుక "వాగ్భిస్తుష్టువుః" సాధకుఁడా ! నీవును సత్యప్రతిష్ఠా ప్రాణప్రతిష్ఠాభ్యాస ఫలముగా, అమ్మకు సమ్ముఖివైనపుడు, ఈ మూడు విషయములందును విశేషలక్ష్య [illegible]. స్తుతి మొదలిడునపుడే, అమ్మ యడుగులందు నీ స్థూలదేహమును బూర్తిగా వంచి పడవేయుము. అమ్మ యడుగు లంటునపుడు మేను గగుర్పొడుచును. ఉచ్చైఃస్వరముతో స్తవపాఠము చేయుము. దాని వలన వెలుపలిధ్వనులు వినరావు. చిత్తవిక్షేపము కాదు. చిత్త విక్షేపము కాకుండ నిమ్మాటల యర్థమునెడ లక్ష్య ముంచుమా ! కాళిదాసుఁడు - సాధకచక్రవర్తి "స్తుతిభి రర్థ్యాభిః" అనెను. దానితోనే, [illegible]భావము -

అనుభవము, చిత్తక్షేత్ర మందు జాగృత మగుచుండును. ఇదిగో, దీనినే మంత్రచైతన్య మందురు. (మంత్రచైతన్యము ప్రథమ ఖండమందు వ్యాఖ్యా నింపఁబడినది.) మంత్రములను జైతన్యమ యములొనర్చి పఠించుటయే నగు బాహ్య లక్షణములే యిచట సంక్షేపముగా "పులకోద్గమ చారుదేహః" అను మాటచే వెల్లడింపఁ బడినవి. కేవల స్తోత్రమే యననేల ? మంత్రసాధ్య కార్యములైన జపమో, పూజాహోమాది కార్యమో చేయునపుడును మంత్రచైతన్య మనెడి యర్థయుక్తి వైపు లక్ష్యముంచుట యావశ్యకము. చైతన్య మయ మంత్రముతోఁ గూడిన విధ్యుక్త కార్మానుష్ఠానముచే బ్రసాదము - చిత్తప్రసాదమను ధనము - మాతృమహత్త్వాను భూతియు, భోజనము - పంచకోశపుష్టి విధానమును శ్రమలేక సిద్ధించును. (ప్రసాద ధన భోజనము లననేమో ప్రథమఖండము నందు వ్యాఖ్యానించితిమి.)

శ్రీమద్భాగవతకారుఁడును - రసికుఁడును, భావుకుఁడును గాక భగవద్ధర్మమం దధికార మబ్బదనియెను. సాధకా ! నీ వెప్పు డేమేనిఁ జేయుము. నీ సామర్థ్యముకొలఁది నపుడా భావమందు, రసికుఁడవును భావుకుఁడవు నగుటకుఁ బ్రయత్నింపుము. అటు చేయఁగల్గునపుడే సర్వకర్మలును సఫలములగును. నాయనా ! ఉపాసనము భావమునకే యగును. భావముతో సంబంధించినదే; భావాతీత స్వరూపము నుపాసించుటన నేమి ? కాదు. తొలుత జగద్భావములను - విషయరసములను భగవద్భావముతో భావించి, రసమయము లొనర్చిన పైని మెల్ల మెల్లఁగా నాతని కృపచే భావాతీత స్వరూపమందుఁ బ్రవేశించు యోగ్యత లభించును.

మన తొల్లింటి యాచార్యులును సామాదివేదములను బఠించుచుండిరి. అగ్ని, జలము, వాయువు, ఆకాశము, సూర్యుఁడు చంద్రుఁడు, పర్వతములు, నదులు మున్నగువాని స్తుతి గానము చేసిరి. అది వారి సరళచిత్తముల స్వాభావికోచ్ఛ్వాసము. దాని యందెట్టి కపటమును లేదు. సర్వత్ర ప్రాణమయసత్తను దర్శించుచు, సర్వత్ర బ్రహ్మసత్తానుభవము చేయుటచే వారి జడత్వ జ్ఞానము తొలఁగిపోయినది. కావుననే సర్వజడవస్తువులతో సైతము నిప్పటికి ఈ దేశజనులు, తులసీదళచయనము చేయు వేళ సరళప్రాణముతో, "అమ్మా! ఓ తులసీ! నీ వమరవు. విష్ణు ప్రియవు, విష్ణు పూజకొఱకే నీ దళములను ద్రుంచుచున్నాను. నీ వింతయు విచారింపకు. నన్ను క్షమింపుము" అను నర్థముగల శ్లోకములను జదువుదురు. కేవల తులసీదళములను దీయునపుడే కాదు, దైవికకార్యములందుఁ బెక్కింటను సాధారణ దృష్టికి జడములుగాఁ గనవచ్చు వస్తువులతో సైతము, సచేతనములతోనువలె వ్యవహారము కానవచ్చును. ఆహా! స్నానవేళ మృత్తికాలేపనము చేసికొనుచు నోరితో "మృత్తికే హర మే పాపం యన్మయా దుష్కృతం కృతం" అనఁగల్గిన యా దేశపుజనులు రావిచెట్టునకు నీర్వోయుచు "అశ్వత్థరూపీ భగవాన్ ప్రీయతాం మే జనార్దనః" అనుచుండెడి యా దేశపు జనులు, సాలగ్రామశిలను బ్రత్యక్ష భగవంతుఁడుగాఁ జూచి పూజించు నా దేశపుజనులు, ఎంత ధన్యులు ! సరే, అది యుండనిండు.

స్తవాది సంబంధమున మఱొక్క మాట :- అధునికులు కూర్చిన స్తవాదులనుబట్టి చూడ, ఋషులు ప్రవర్తింపఁజేసిన మంత్ర

స్తవాదుల శక్తి మిగుల గొప్పది. చిరకాలమునుండి గురుపరంపరాక్రమమున మహాపురుషశ్రేణి, యే మంత్రస్తోత్ర పాఠములను జేయుచు వచ్చెనో, వాని శక్తి యధికమని చెప్ప వలయును. అధునికులు రచియించిన స్తవ సంగీతాదులును ఉండఁదగినవే, కాని ఋషిప్రవర్తితములవలె నివి భావరసముల నుద్దీపింపఁజేయఁ జాలవు. ఋషి ప్రవర్తిత శబ్దశక్తి వీనికంటె గొప్ప దగుటకుఁ గారణములు రెండు. స్వరప్రధానములు బీజాక్షరబంధప్రధానములు నగుటయేకాక, తపోబలప్రధానములు నై యుండుటే. ఇది పలుతావులందుఁ బరీక్షితవిషయము. శ్రీమద్వాల్మీకి రామాయణము కావ్యమాత్రమే కాదు; మంత్రనిధి (ఈ విషయము సక్రమ సాంగ మంత్రశాస్త్ర పరిశ్రమ చేసినవారు, సుందరకాండమం దధికముగాఁ బ్రత్యక్షము చేసికొనఁగలరు.) కాళిదాస శంకరా చార్యకృత స్తవములు బీజాక్షర బద్ధములే. వాని యందలి తత్త్వము నాస్వాదించినపుడుగాని యది తేఁటపడదు. ఇఁక వైదికశబ్దములు స్వరప్రధానములై ప్రాణఘటితములు. వాని నుచ్చరించుటచే శరీరమందలి ప్రత్యేకాణు పరమాణువునందును, నొక పవిత్రతా సాత్త్వికతల స్పందనము అనుభవింపఁబడు చుండును. సరే; అది యుండనీ - స్తోత్రపాఠము చేయునపుడో, మంత్రసాధ్యమగు నేదేనిఁ జేయఁబడునపుడో, యెల్లపుడును మును జెప్పిన కాయ మనోవాక్యములయందు విశేషలక్ష్యముంచుట యావశ్యకము. మూడు నొక్క స్వరముతో మ్రోగవలయును. వైధకర్మలు, ఏవో శబ్దముల నుచ్చరించుటతోనే సమాప్తములు కావు. అర్థహీనమైన మంత్రోచ్చారణమును,

ఏదో బహుదూర మందున్న సత్తనుద్దేశించి చేయఁబడుకర్మములును దఱుచుగా నిష్ఫలములేయగును. కనుక నీ విషయమున సాధకులు ధ్యానముంచ వలయును.

ఇంతేకాక యా ప్రణతి, ఆ గగుర్పు, ఆ స్తుతిపాఠమునను నిమ్ముఁడును లక్ష్యమందున్నపుడే, జ్ఞాన భక్తి కర్మము లొక్కసారిగా ననుశీలింపఁబడుచుండును. మున్ను జ్ఞానమనఁగా దానిని దెలియుట యనియు, కర్మమనఁగా దాని నుద్దేశించి యే దేని జేయుటనియుఁ జెప్పితిమి. ఎఱుఁగనిదానిని బ్రేమింపఁ జాలము. సాధకసోదరా ! అమ్మ స్వరూపము నెంతగాఁ దెలియుదువో, అమ్మ మహత్త్వము నెంతగా ననుభవింతువో అంతగా నీ జీవభావ మఱఁగిపోవును. ఇదే జ్ఞానఫలము. దాని బాహిర లక్షణము ప్రణతి. కాని పరమ ప్రేమమయియైన యమ్మ స్వరూపమును దెలియఁ గల్గుటచేఁ జిత్తమందొక ప్రేమభావము తనంతనే చేరుకొనును. ఇదే భక్తి. దాని బాహిరలక్షణమే గగుర్పొడుపు. కన్నీరు, వణఁకు మున్నగునవి మఱి భక్తిభావ మెంతగాఁ బోషింపఁబడుచుండునో, అంతగా నామె నుద్దేశించి, యామెను బ్రసన్నను జేసికొనుటకై వైధ కర్మానుష్ఠాన మారంభమగును. అదే జపము, పూజ, స్తోత్రము, పరోపకారము, విశ్వహితకార్యములు మున్నగువాని రూపమున నగుచుండును.

ఓం. దేవ్యా యయా తత మిదం జగదాత్మ శక్త్యా
నిఃశేష దేవగణ శక్తిసమూహ మూర్త్యా ।
తా మంబికా మఖిల దేవమహర్షి పూజ్యాం
భక్త్యా నతాస్మ విదధాతు శుభాని సా నః ॥ ఓం. 2

సర్వదేవశక్తి సంభవయైన యే దేవి తన శక్తిచే నంతట వ్యాపించి యున్నదో, యే దేవి సర్వదేవతలకును మహర్షులకును బూజనీయమో, ఆ యమ్మకు భక్తితో మ్రొక్కుచున్నాము.

వ్యాఖ్య :- అమ్మా! నీవు ద్యోతనశీలవు - నిత్యప్రకాశమయివి; జగత్తునందలి సర్వవస్తువులను బ్రకాశింపఁజేయుటకై మఱి యేదో ప్రకాశవస్తువు నావశ్యకత కలదు, గాని నీవు స్వయంప్రకాశరూపవు. నిన్నుఁ బ్రకాశింపఁజేయు, మఱియొక యెట్టి ప్రకాశము నక్కఱయు లేదు. కొందఱు "అజ్ఞానసహాయముతోనే జ్ఞానము ప్రకాశించు నందురు. అనఁగా - అజ్ఞానము - మాయ, యనెడి ప్రకాశ్యవస్తువుండుటచేతనే బ్రహ్మము - జ్ఞానము ప్రకాశించు చున్నది. ఎటులన నీ పృథివియే లేకున్న, సూర్యుని ప్రకాశస్వరూప ముండనే యుండదు; అటులే ప్రకాశ్య వస్తువు - అజ్ఞానము, సమీపమందు లేకున్నచో జ్ఞానము యొక్క ప్రకాశస్వరూపము ననుభవమే కాదు" అందురు. ఇంత యుక్తితో నీ ప్రకాశస్వరూపమును నిరాకరింపఁ గోరువారు, ప్రమాణమనెడి త్రాటితో నడుము కట్టుకొని, ప్రమాణాతీతవైన నిన్ను దాఁకఁగోరుచున్నారు. యుక్తిసమాయమువల్లను, అనుమానసహాయము వల్లను నిన్నుఁ బట్టుకొనుట కాదు. ప్రకాశ్యములైన వస్తువుల నిన్నిటిని జక్కఁగా సంహరించి, కేవలము నీవే స్వప్రకాశ స్వరూపముతో నిత్యము వెలయుదువను మాటను వారెఱుఁగరు. లేదా, యింతదాఁక నీవు వారిలోఁ బ్రకాశింపలేదో ? కనుకనే ప్రమాణాతీతవైన నిన్నుఁ బట్టుకొనలేకున్నారు. అమ్మా ! యెప్పుడో యొకనాఁడు, నీవే గురురూపముతో నావిర్భవించి, ఆ

నీ శిష్యమూర్తుల చూపు సారింపఁజేసినపుడే, వారు "తమేవ భాన్త మనుభాతి సర్వమ్ । తస్య భాసా సర్వమిదం విభాతి" అను శ్రుతితో స్వరముఁ గలుపుదురు.

"తత మిదం జగదాత్మశక్త్యా" అమ్మా ! నీ శక్తి చేతనే జగత్తు వ్యాప్తమైయున్నది. ఆత్మవు నీవు, శక్తి రూపమున వెలయునపుడే, యీ జగత్తు ప్రకటమగును.

అమ్మా ! నీ యీ "ఆత్మ - శక్తి" శబ్దములను బట్టుకొని యీ జగత్తునం దెన్ని మతభేదములు నడుచుచున్నవో చెప్పవేమమ్మా ! ఆత్మయు శక్తియు, ఆత్మయొక్క శక్తి, ఆత్మతో శక్తి (ఆత్మసన్నిధి శక్తి), ఇది యాత్మ అది శక్తి అని యీ విధముగా ననేక భిన్నభిన్న మతములు, భిన్న భిన్న వాదములు సిద్ధ మగుచునే యున్నవి. ఒకరి మతమును ఖండించుటకును తన మతమును స్థాపించుకొనుటకు నైన ప్రయత్నమునందు, ఎన్ని యుక్తుల, ఎన్ని తర్కముల పనిపడుచున్నదో ! నిన్నుఁ గాననంత దాఁక, నిన్ను దూరముగానున్నట్లు తలఁచుచుండునంతదాఁక, "ఆత్మ, శక్తి" అనువానిపై వాదములు, వితండములు, విచారము సాగుచునే యుండును. అమ్మా ! నీ లీలధన్యము ! నిన్ను నీవు వ్యక్తపఱచు కొనుటకై, మీ హాస్యనాటక లీల లెన్ని చేయుచున్నావమ్మా ! ఇచట మఱల మఱియొకలీల యారంభించితివి. దీని పరిణామ మెట్టిదో నీకే తెలియవలయును. సరే, ఒక్కసారి నీవైపు దృష్టిపడినచో , ఆత్మ-శక్తి, అనెడి మాటలకే భేదముగాని; వాస్తవముగా నించుకంతయు భేదము లేదని కనుగొందురు.

అమ్మా ! నీ వాత్మవు; నీవే యథార్థముగా "నేను" యొక్క స్వరూపమవు. ఆ "నేను" ఒక్కటే ప్రతిజీవుని యందును బ్రతిపరమాణువునందును బ్రతిధ్వనించుచున్నది. ఆ 'నేను' ఒక్కటే జీవరూపియై యనేకాధారములతో ననేకమైన 'నేనుల' వేషము వేయుచున్నది. ఆ ఒక్క 'నేను' పేరే ఆత్మ. మఱి యనేకము లోపల వెలయుటే శక్తి. ఈ యాత్మ - శక్తి, ఒక్కటి యైనను, రెండైనను మఱి యేమైనను, విశిష్టమైన యొకటే యైనను, వచ్చిపోయెడి దేమియు లేదు. ఇట్లు విచారము చేయఁగాఁజేయఁగా, నెప్పుడో తన యథార్థస్వరూపము జీవునకొకనాఁడు అనుభవమునకు వచ్చును. అనేక జన్మ సంచితా జ్ఞానము తొలఁగును.

సరే, ఒక్కసారి యీ యాత్మశక్తి స్వరూపముల నెఱింగినచో హాని లేదు - "మనము చూచుచున్నాము" "నేను చూచుచున్నాను" దీనిలో రెండు వస్తువులు తోఁచుచున్నవి. 1. నేను, 2. చూచు శక్తి. ఇవి యొక్కటో, రెండో యనెడి మీమాంస, తమ బుద్ధి ననుసరించి ప్రత్యేకముగాఁ జేయఁగలరు. కాని, ఒక్కమాట - బ్రహ్మమాయలు, పురుష ప్రకృతులు, శివదుర్గలు, కృష్ణరాధలు మున్నగు శబ్దములచే శక్తి శక్తిమంతులకు (వాస్తవముచే వేఱుగాకున్నను) భేదమారోపింపఁ బడుటగును. సాధన మున్నంత వఱకు, దేహ మున్నంతవఱకు, జగత్తున్నంతవఱకు, ఈ చిలుక గోర్వంకల వాదము సాగుచునే యుండును. చిలుక "మా కృష్ణుఁడు గిరివరము నెత్తెను" అనును. గోర్వంక "మా రాధ శక్తిసంచాలనము చేయకున్న నెటు లెత్తఁగలఁడు ?"

అనును. మనయమ్మ లీలామయి, లీలామయిగా నుండునంత దాఁక, లీల జరుపుచుండు నంతదాఁక, అభేదమందు భేదోపచారము కల్పింపఁబడుచునే యుండును.

అది యుండనీ - నీ యాత్మశక్తి చేతనే సర్వజగత్తు వ్యాప్తమగు చున్నది. "తతమిదం జగదాత్మశక్త్యా" ఒక్క నేను - మఱి యనేక భావములతో దాని ప్రకాశము నంతటఁ గనుచున్నాము. ప్రత్యేక జీవముగా, ప్రత్యేక పరమాణువుగా, ఆ యాత్మశక్తి, ఆ హరగౌరి మూర్తి. అదే రాధాకృష్ణుల యుగళమూర్తి. ఇదే నీ జగద్వ్యాపిని యాత్మ శక్తి. అమ్మా! నీ యిన్ని మూర్తులుగానున్న జీవసంతానముతో "ఓరి జీవుఁడా ! నీవు నీయందు, ఏ "నేను" కూర్చుండుట ననుభవించుచున్నావో - ఆ యనుభవమే "ఆత్మ-అమ్మ" యనియు, ఆ నేను యొక్క, ఎన్ని విధములైన కార్యము లను (ప్రకాశములను) గనుచున్నావో, అవే 'శక్తి' యనియుఁ జెప్పివేయుము" ఈ విధముగా నేకాగ్రమనస్సుతోఁ జూడ నారంభించునపుడు, జన్మ జీవనము సార్థకమగును. భయ మృత్యు విషాదము లెన్నటికిం దొలఁగును.

"నిఃశేష దేవగణ శక్తి సమూహమూర్త్యా" ఆత్మ శక్తి రూప ముతో నీవు జగన్మయివై వ్యాపించియున్నావు. ఇది నీ సాధారణ మూర్తి. ఆ మూర్తిని మేము చూచియును జూడలేకున్నాము. తెలిసియుఁ దెలియలేకున్నాము. కనుకనే నీవు సంతానస్నేహముచే విహ్వలవై, యప్పుడప్పుడు, అసాధారణమూర్తితో, వారి యిష్ట మూర్తితో నావిర్భవింప బాధ్యవగుచున్నావు. అది, సర్వదేవ శక్తులును

జేరుకొనియైన మూర్తి. మహిషాసుర నిధనము నుద్దేశించి, యిట్టి విశిష్ట మూర్తితో నిన్ను వెలయించుకొన్నావు.

అమ్మా! జీవశక్తిబోధ ముండునంతదాఁక నజ్ఞానముండును. ఆ వెనుక దేవశక్తిబోధ మగును. అదే, దాని పేరే జ్ఞానము. ఇఁక, ఆత్మశక్తిబోధమే వెలయునపుడు, ఆ జ్ఞానా జ్ఞానములకుఁ బరమైన యనిర్వచనీయమే - ఈ మూడు విధములుగా బోధము విచరించును. మొదట జీవశక్తిబోధమే యుండును. ఆర్జనము, సంగ్రహము, రక్షణము, వ్యయము, భోగము, పాపము, పుణ్యము, ఖ్యాతి, ప్రతిష్ఠ అను నవిన్నియు "నేను చేసితిని" అనెడి జీవభావీయాభిమానము, సర్వశక్తులను దనవే యనిపింపఁ జూచుచుండును. పలుసారులు మాటిమాటికి నగు దైవప్రతి కూలతవలన, నయ్యహంకారాభిమానములు పిండియై పోవుచుండును. అపుడు మెల్లమెల్లగా దేవశక్తియెడ విశ్వాస మారంభించును. క్రమముగ శక్తి మాత్రమే దేవత; దేవతలు శక్తి మాత్రములే యని తోఁచును. దీనిపేరే జ్ఞానము. ఇది బోధము యొుక్క రెండవ మెట్టు. తుట్టతుదకు ఆ దేవశక్తులు సమిష్టిభావము నొంది యఖండముగాఁ దోఁచునపుడు, జీవుఁడు దానియందుఁ బూర్తిగా నాత్మదర్శనము చేసి (అనఁగా నీ దేవ శక్తులన్నియు నాత్మస్వరూపమే యని యెఱింగి) ఆత్మశక్తిజాడఁ దెలియఁగల్గును. ఓహో ! ఇది యెంత యానందము ! ఎంత తృప్తి ! ఆ స్థితికి వచ్చి యమ్మయెడ మతి పోయినపుడు, సాధకుఁడు "జగద్రూపముతో నేనే వెలయుచున్నాను" అని కనుగొనును. ఈ సూర్యుఁడు, ఈ చంద్రుఁడు, ఈ జ్యోతిష్క మండలము, నిత్యము నాకే యారతిచ్చుచున్నవి. నావలని భయము

చేతనే గ్రహములు బిందుమాత్రమైనను హద్దుమీఱక యనాది కాలమునుండి విచరించుచున్నవి. ఈ వాయువు నావలని భయము చేతనే యెల్లపుడు వీచును. ఈ నదులు నా మేనినే ప్రతిదినము కడిగివేయుచున్నవి. ఈ పూవులు నా పూజకొఱకే వికసించు చున్నవి. ఇంకెంత చెప్పుదును ? అంతయు నేను. నేను దక్కనెక్కడను నేమియు లేదు. అంతయు ఆత్మయే; అంతయు శక్తియే; అంతయు అమ్మయే. ఆ నా 'నేనే' సర్వదేవతలకు, సర్వమహర్షులకుఁ బూజనీయమైన మా యమ్మ. ఆ 'మా' నీవు; ఆ మాది అనుదానికి. నీకు - నేనునకు "భక్త్యా నతాఃస్మ" భక్తితోఁ బ్రణమిల్లుచున్నాము. భక్తి యెక్కడ లభించునమ్మా ! అదియు నీవే. ఇదిగో, నిన్నాత్మగా నెన్నకపోవుటచే, నీ కాత్మదానము చేయకపోవుటచేఁ, బ్రాణముగా నాదరింపకుండుటచే, నీవు భక్తి రూపమున మా లోపల వెలయవు. అమ్మా ! "భక్త్యానతాఃస్మ" కాఁగలవారే బలముతో సాహసించి నీయొడి నెక్కి కూర్చుండఁగల్గుదురు. కాని, అమ్మా ! "అభక్త్యా నతాః" అయినవారు భక్తియన నెట్టిదో యెఱుఁగనే యెఱుఁగరు. దేనిని భక్తియందురో, వారికిఁ దెలియనే తెలియదు. వారెటులు ప్రేమింతురు ? నీ యడుగులయందుఁ దమ ప్రాణము నెటు లర్పించుటో వా రేమెఱుఁగుదురు ? అమ్మా ! మమ్ముల నొడి లోనికిఁ దీసికోవా ? అమ్మా ! మా యాశ ! మా విశ్వాసము ! అమ్మా ! కేవలము నీమొగముపైపే చూచుచు, ననేక జనన మరణ ప్రతిఘాతముల నోర్చుకొనుచు వచ్చుచున్నాము. అమ్మా ! పాషాణములవంటి మా హృదయములందు నీవు భక్తిరూపముతో వెలయునపుడు, మేమును "భక్త్యా నతాఃస్మ" అనుచు జీవత్వపు

టావలియొడ్డు చేరిపోవుదుము. ప్రభువు, తల్లి, తండ్రి, సకుఁడు, సుహృత్తు, స్వామి, చుట్టము, సర్వము నీవే. గీతా గురువేషముతో నీవేకదా యిమ్మాట యంటివి. ఒక యాధారమునుండి మా సర్వప్రేమమును సర్వాకర్షణములను నీవే హరించి కూర్చున్నావు. జగత్తునందలి మా వారు, మా ముఖములవంకనే చూచుచు మమ్ముఁ బ్రేమించుచున్నారు. మేము వారి యిచ్ఛానుసారము పోఁగలిగినపుడే మా వారి ప్రేమకుఁ బాత్రులమగుదుము. కాని నీవో - మా ప్రాణమునే నీయెడకు లాగికొని మాయెడ నెయ్యము నెఱపుదువు. నీ వాత్మవు; నీవు ప్రాణశక్తివి; నీ యా యలౌకిక స్నేహము నెపుడెఱుంగఁగలము ? అమ్మా ! భక్తిరూపిణీ ! మేము నీ యావిర్భావము నెపుడు చూచి ధన్యులమగుదుమో ? అమ్మా ! భక్తి లేకున్నను నీకుఁ బ్రణమిల్లుచున్నాము. 'అభక్త్యా నతాఃస్మ' "నమో నమస్తే ఒస్తు సహస్రకృత్వః పునశ్చ భూయో ఒపి నమో నమస్తే" (గీత 11 - 37) "నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమో ఒస్తుతే సర్వత ఏవ సర్వ" (గీత. 11-40) అమ్మా ! అందుకో; ఈ భక్తిహీన మలిన సంతానము మ్రొక్కు లందుకో.

"విదధాతు శుభాని సా నః" మంగళములను మాకుఁ గలిగింపుము. మాకు శుభములనిమ్ము. కేవలము మాకే కాదు, ఈ విశ్వమందలివారి కెల్లరకును మంగళములను గూర్పుము. విశ్వమయమైన సర్వము నీ మంగళాశీర్వాదముల నొందుఁగాక. విశ్వమున నమంగళములు తొలఁగుఁగాక. విశ్వము నుత్పాదించు. తల్లీ ! దీవింపుము. వరములిమ్ము. నీ సంతానమంతయు సత్య

ప్రేమములనెడి యథార్థమంగళముల నొంది యమంగళకరము నుండి విడువఁబడుఁగాక. అమ్మా !

ఓం. యస్యాః ప్రభావ మతులం భగవా ననంతో
బ్రహ్మహరశ్చ నహి వక్తు మలం బలం చ ।
సా చండికాఖిల జగత్పరిపాలనాయ
నాశాయ చాశుభభయస్య మతిం కరోతు ॥ ఓం. 3

సాటిలేని యేమె ప్రభావమును బలమును వర్ణింప భగవంతుఁ డనంతుఁడు, బ్రహ్మ మహేశ్వరుఁడునుం జాలరో, ఆ దేవి చండిక, సర్వజగత్పరిపాలనమునకును అశుభ భయ వినాశమునకును దలపెట్టును గాక.

"అతీతాను స్మృతిర్మేధా తత్కాలగ్రాహిణీ మతిః ।
శుభాశుభ విచారజ్ఞా ప్రజ్ఞా ధీరై రుదాహృతా ॥"

అమ్మా ! వేయినోళ్లవాఁ డనంతుఁడు, నాలుగు నోళ్ల వాఁడు (నలువ) బ్రహ్మ; అయిదునోళ్లవాఁడు హరుఁడు - అను వీరలును, నీ సాటిలేని ప్రభావమును బలమును గొండాడలేరైరి; నోళ్లేచాలవో ? మాటలేచాలవో ? వారు సర్వశక్తిమంతులైన పరమేశ్వరులేయైనను నీ ప్రభావము నుగ్గడింపఁజాలరై రేల ? అమ్మా ! నీ ప్రభావమును బలమును బూర్తిగాఁ దెలిసికొనుటకై నీలోనే చేరిపోవలయును. చేరలేనంతదాఁక నెట్లును నీ మహాత్మ్యానుభవముకాదు. వాక్కు మనస్సు నుండునంతకును నీలోఁ జేరుటయుఁగాదు. పోనీ; నిన్నుఁ జేరుచో వాక్కులతో మనసు మఱలిపోవును. "యతో వాచో నివర్తన్తే

అప్రాప్య మనసా సహ" ఇంకెట్లు ? వాఙ్మనోరాజ్యమునకు మఱలి వచ్చు నపుడు, నీ మహత్త్వమునకు బహుదూరమై పోదురు. కనుక నెవ్వఁడును నీ ప్రభావము నెఱుంగఁజాలఁడు. నీ స్వరూప నిర్ణయము చేయఁజాలఁడు. అమ్మా ! నీవు మనోవాక్కుల కగోచరవు.

అమ్మా ! బ్రహ్మవిష్ణు మహేశ్వరులు నీ పెద్దకొడుకులు. (జ్యేష్ఠపుత్త్రులు) అగుటచేత నీ ప్రభావమును నీ మహత్త్వము ననుభవింప యోగ్యపాత్రములు. కావున నీ యచింతనీయ మహత్త్వము ననుభవించి, వర్ణించుచోట మౌనము వహించిరి; గాని, మేమో - కేవలము నిన్న మొన్నటివారము. నీ కడగొట్టు సంతాన మిది. మా క్షుద్ర బుద్ధులందు నీ మహత్త్వమెంత (ఎన్నవవంతు) ప్రతిబింబించెనో తెలియఁగల్గితిమా ? లేదా ? అది విచారింపకే గానము చేయుచున్నాము. శిశుపుత్త్రులు (చిన్నబిడ్డలు) తల్లి గొప్పతనము నింతయు నెఱుంగకున్నను "అందఱికంటె మా యమ్మ గొప్పది" అని కథలు చెప్పుచుఁ దిరుగుదురు. మేమును వారివలెనే, నీ ప్రభావకథలను రేవు రేవులఁ బాడుచుఁ దిరుగుచుందుము. పోనీ; మఱేమియుఁగాదు అసద్వాక్యములు పల్కుటచే పవిత్రమైన నాలుక పవిత్ర మగును.

సాధకా ! వినుము, మన యమ్మ ప్రభావము. ఈ కానవచ్చు సూర్యుఁడు మనమున్న భూమికంటెఁ బదునాలుగు లక్షల రెట్లు పెద్ద. ఈ భూమివలెనే దీనికిఁ జిన్నలు పెద్దలునైన మఱికొన్ని (కుజ బుధ శుక్రాది) గ్రహములు, ఆ సూర్యుని యాకర్షణమువలన నాకర్షింపఁబడి, యతని నలువైపులఁ బరిక్రమించుచున్నవి. గ్రహము లతో మఱికొన్ని యుపగ్రహములున్నవి. ఈ గ్రహోప గ్రహములతోఁ

గూడిన సూర్యుని పేరే సౌరజగత్తు. రాత్రివేళ మింట లెక్కలేని చుక్కలు గనఁబడును. వానిలో నొక్కొక్కచుక్క సైతము, చిన్నో పెద్దో, యొక్కొక్క సౌరజగత్తే. ఈ లెక్కలేని సౌరజగత్తులు, ఏ యనాదికాలమునుండి, ఏ యలక్ష్య కేంద్రమును లక్షించి నిరతము వడిగాఁబరుగెత్తుచున్నవో, యా మహాశూన్యము, ఈ లెక్కలేని సౌరజగత్తుల తీవ్రుతగతి నిరంతరము సిద్ధమైనదో యా మహాశూన్యము, ఇన్ని విరాడ్బ్రహ్మాండములను గుండెపై ధరించిన దేదో, యదే మన యమ్మ. ఇదే మన యమ్మ. మన యమ్మ గుండెపైనే, యీ యనంతకోటి బ్రహ్మాండములు., ననాదికాలము నుండి నిరంతరము కడువడి పరుగునఁ దిరుగు చున్నవి. చూడు, సాధకా ! మీ యమ్మను జూడుము.

మఱి యీ రీతిగా నచింతనీయమై సాటిలేని ప్రభావముతోఁ గూడినదయ్యు - ఈ పృథివియందలి యేదోయొక దూర ప్రాంతమున నున్న యొక క్షుద్రతమ పరమాణువు, ఏ భావమందు నిల్చుటచేఁ గడువడిగా, అమ్మ యంగమందుఁ జేరిపోఁగలదో, ఆ వ్యవస్థ చేయఁగలదే మన యమ్మ. ఎక్కడనో యొక క్షుద్రతమ కీటాణువు హృదయమందు రవ్వంత మాత్ర సంవేదనము వికసించుటచే, ఎక్కడనో యొక కీటాణు వింత నిట్టూర్పు విడుచుటచే, వాని నెవ్వరు స్థిరదృష్టితోఁ జూతురో, తాత్పర్యముతోఁ దానే యథోచితవిధానము చేయునో, అదే మన యమ్మ.

మఱి, యేమె యిచ్ఛగించినపుడు సరిగాఁ దత్ క్షణ మందే, యింత గొప్ప యచింతనీయ (ఊహింపరాని) వ్యాపారమును,

ఇంద్రజాలమువలె నెక్కడనో యొక యవ్యక్త క్షేత్రమం దదృశ్యమై పోవునో, ఇన్ని మహాబ్రహ్మాండముల సృష్టి స్థితి ప్రలయము లెవ్వరి తెప్పపాటులో సిద్ధమగుచుండునో, ఆమెయే మన యమ్మ. ఇంతేకాక, అమ్మగారి మఱియొక యచింతనీయప్రభావము - కాన వచ్చును. నేడు కడు దురాచారులు మూఢులు నైనవారు, కొలఁది నాళ్లు కాఁగానే పుణ్యవంతులు జ్ఞానవంతులు నైపోవుదురు. ఇటులు చేయువారికి సృష్టి స్థితి ప్రలయములు చేయుట, యొక చిన్నపనియే కాదా ?

అగుఁగాక - "సా చండికా" అమ్మా ! ఆ చండికవు నీవే. ఎవ్వరిప్రభావముచే బ్రహ్మత్వ విష్ణుత్వ శివత్వములదాఁక తెప్పపాటులోఁ బ్రలయ మనెడి యతలగహ్వరము నందు మునిఁగిపోవునో, ఆ చండికవు, అమ్మవు నీవు. ఒక్కసారి "అఖిల జగత్పరిపాలనాయ, అశుభ భయస్య వినాశాయ చ మతిం కరోతు' ' ఈ సర్వజగత్పరిపాలనమునకును, అశుభ భయ వినాశమునకును నుపయోగించు అఖిల జగత్పరిపాలనమునకై, యశుభ భయ వినాశము చేయుదువు. అశుభ మనఁగా మృత్యువు. దానివల్లనగు భయమునే, అశుభ భయ మందురు. అమ్మా ! విచారించి చూడఁగా, నీ జగ మెల్లప్పుడును మృత్యు భయభీతమే. అమ్మా ! చూడుము; ప్రత్యేక ప్రాణిహృదయ మందును మృత్యుభయ మేరీతిగా నాధిపత్యము చేయు చున్నదో ! మృత్యుభయమనెడి మహాపిశాచము, జీవుని హృదయమందు రక్తబలము నేవిధముగా నింకించివేయుచున్నదో చూడు. జగత్తున వినవచ్చు నా కోలాహల

మంతయు, నా మహాపిశాచము పెట్టించు మొఱ్ఱయే. అది చెవినిఁ బడనివారే, సంగ్రహము, రక్ష, నిద్ర, భోగవిలాసములు అను వానిలో మునిఁగి, మీసాలమీది తేనెలు నాకుచు వెడ పాడి నవ్వు నవ్వువారు. జగత్తుపైని బడిన యా మృత్యుకరాళచ్ఛాయను దొలఁగింపఁజాలు బుద్ధిని బ్రేరేపింపుము. జగత్తునంటిన మృత్యు భయమును దొలఁగింపుము. అమృతమయీ ! మృత్యు భయమును బోఁగొట్టుము. అమ్మా ! నీవు అభయవు; అమృతమవు; సత్యవు, పరమాత్మవు. మృత్యువు, అమృతము అను రెండును నీచేతి యాటబొమ్మలు, కనుకనే నీవు సత్యవు, నభయవు నైతివి. అమ్మా ! జగమునందొక్కసారి యీ యభయ సత్యమూర్తితో వెలయుము. జగత్పరిపాలనము చేయుము. అమృతధార వలన మృత్యుభయము తొలఁగిపోవును. జీవ జగత్తు నీ సత్యమూర్తిని జూచి యభయ మగును. జ్ఞానామృత పానము చేసి యమర మగును.

అమ్మా ! మృత్యువనెడి పేరితో నొక వస్తు వున్నదన్న మాటను, జగత్తునందలి పరిశుద్ధలు మఱచిపోయిరి. అమ్మా ! నీవే యెల్లరగుండెకు నాటునట్లు, "జీవుఁడా ! మృత్యువనుచు నేమియులేదు. నీవు అమృతసంతానమవు. నీ నివాసము అమృత మయియైన యమ్మవక్షమందుఁ గదా. అజ్ఞానకల్పితము నీయీ మృత్యుబోధము. మిథ్య. నేను నీ కభయమిచ్చు తల్లిని. నీవును నిత్యము, నిర్భయము, స్వతంత్రము నైన సంతానమవు." అని యిమ్మాటలు సర్వజీవుల హృదయములందును, రోమరోమ కూపములందును బ్రతిధ్వనించునట్లు చేసివేయుమమ్మా ! "మేము అమృతులము; అభయులము" అని యెల్లరకుఁ దెలియుఁగాక.

అమ్మా ! ఇఁక నీ జాగతిక శోక దుఃఖ హాహాకారములు, కాతర సీత్కారములు, మఱి వినరానీయకు. మా బుద్ధి యెల్లప్పుడును బహుత్వముతోనే నడుచుచున్నది. కనుకనే మే మెప్పుడును మృత్యుభయమునే శంకించుచు శోకదుఃఖములచే నలిగిపోవు చున్నాము. మా బుద్ధియందు నానాత్వము కానఁబడుటచేతనే, మేము మృత్యువువల్లనే మృత్యువునకు గ్రాసముగా మమ్ముల నాహుతి చేయుచున్నాము. అమ్మా ! మా బుద్ధియందు నీవొక్కతెవే ప్రతిబింబించుచుందువని తెలియక, మేము నీవైపు చూడక, బహుత్వము వెంటఁ బరుగెత్తుచున్నాము. కనుక మాటిమాటికి మృత్యుయాతన ననుభవించుచున్నాము. కాని, యిపుడు నీవు మమ్ము నీయెడనే ముగ్ధులమగునట్లు చేసివేయుము.

ఓం. యా శ్రీః స్వయం సుకృతినాం భవనే ష్వలక్ష్మీః
పాపాత్మనాం, కృతధియాం హృదయేషు బుద్ధిః ।
శ్రద్ధా సతాం కులజనప్రభవస్య లజ్జా
తాం త్వాం నతాఃస్మ పరిపాలయ దేవి విశ్వమ్ ॥ ఓం. 4

సుకృతిశాలురైన వారియిండ్ల శ్రీ (లక్ష్మి) గాను, పాపుల యిండ్ల యందు అలక్ష్మిగాను, వివేకుల హృదయములయందు బుద్ధిగాను, సజ్జనుల హృదయములందు శ్రద్ధగాను, కులీనుల హృదయముల యందు లజ్జగాను విరాజిల్లు నీకు మా ప్రణామములు. ఓ దేవీ ! నీ వీ విశ్వమును బరిపాలింపుము.

వ్యాఖ్య :- సుకృతులైనవారియిండ్ల నీవు శ్రీ - ఐశ్వర్య రూపమున వెలయుదువు. కేవల ధనధాన్య రత్నాదులే యైశ్వర్యము కాదు. కోరిక యమోఘముగా నెఱవేఱుటే యైశ్వర్యము. ఇది

కాదు. ఇది బుద్ధిసత్త్వనిర్మలతకు వెలిగుఱుతు. మనదేశమునఁ దాంత్రిక పూజలందు ఐశ్వర్యము అనైశ్వర్యము, వైరాగ్యము అవైరాగ్యము, ధర్మము అధర్మము, జ్ఞానము అజ్ఞానము అను నీ యెనిమిది పీఠ దేవతలుగాఁ బూజించు విధానము కనవచ్చుచున్నది. ఈ యెనిమిదియు బుద్ధిధర్మములు, బుద్ధియే అమ్మ యథార్థ పీఠము. బుద్ధితత్త్వమందే అమ్మ యధిష్ఠానము. పూజ, అర్చనము, ఆరాధనము, ఉపాసనము మున్నగునవన్నియు బుద్ధివఱకే. వెనుకటి మంత్రమందు "మతిం కరోతు" బుద్ధినిర్మలత వల్లనే జీవుఁడు సుకృతిశాలి యగును. అపుడే శ్రీ - యైశ్వర్యము; కోరికలు నెఱవేఱుపట్టున బాధ గలుగదు. దాని ఫలముగా వైరాగ్యము, ధర్మము, జ్ఞానము ప్రాప్తించును. జీవుఁడు మోక్షపదవి నొందును. ఈ విధమైన నీ శ్రీమూర్తి సుకృతిజనుల యిండ్లఁ గానఁబడును.

మఱియు శ్రీ శబ్దమునకు బ్రహ్మవిద్యారూప సరస్వతి యనియు నర్థము. చైత్రశుద్ధపంచమి శ్రీపంచమి. అది మొదలు పూర్ణిమాంతముగాఁ బదిదినములు పూజింపఁబడును. శరన్నవరాత్రములందుఁ బూజింపఁబడునది, పుస్తకరూపిణీ సరస్వతి. కనుక సుకృతులయందు, అమ్మ బ్రహ్మవిద్యాస్వరూపమున వెలయునని భావము. ఎవరియందు బ్రహ్మవిద్య ప్రకాశించునో వారే సుకృతులు.

అమ్మా ! ఇఁకఁ బాపాత్ముల యిండ్ల - పాపాత్ములు పాపబుద్ధులు. వారియిండ్ల నీవే యలక్ష్మీరూపమున నుందువు. అలక్ష్మి - అనైశ్వర్యము. అనఁగాఁ గోరిక నెఱవేఱకపోవుటే జీవుని

వాసనలు, అపూర్ణములుగా నుండునంతదాఁక, వానిబుద్ధి యందుఁ బాపమున్నది యనవలసినదే. పాపమనఁగా సంకోచమని యర్థము. బుద్ధి కేవలము రూపరసాది విషయములను వెలయించుటే పనిగాఁ గొని యుండునంతదాఁక, అది రజస్తమో గుణములచే మలిన మగుటచే సంకుచితమయి యుండును. గాన నది పాపము. బుద్ధిమాలిన్యముచేతనే, అలక్ష్మి - అనైశ్వర్యము రాజ్యమేలు చుండును. గాన నది పాపము. బుద్ధిమాలిన్యముచేతనే, అలక్ష్మి - దాని యందు అధర్మము, అవైరాగ్యము అజ్ఞానము వచ్చిపడును. పాప పుణ్యము లనునవి బుద్ధివఱకే. బుద్ధికిఁబైని మఱి పాప పుణ్యములు లేవు. ధర్మా ధర్మములు, జ్ఞానాజ్ఞానములు, వైరాగ్య భోగములు, సిద్ధ్యసిద్ధులు అనునవెల్ల నీ బుద్ధిపర్యంతమే. జగత్తునందుఁ బాపపుణ్యముల నునవి, ఒకదాని యపేక్ష రెండవ దానికిఁ గలవియే. ఒకనికిఁ బాపమైనది, వేఱొకనికిఁ బుణ్యమగును. కనుక జగత్తు నందలి పాపపుణ్యవిచారమందు, స్వాస్థ్యము, సమాజస్థితి యను వానివైపే ప్రధానముగా లక్ష్యము పడును. ఆధ్యాత్మిక మార్గమందలి ముండ్లు తొలఁగించుటకే పాపపుణ్యవిచారము యొక్క ప్రధానోద్దేశ్యము. సరే; అగుఁగాక; ఇట్టి విచారము చేయఁగాఁ జేయఁగా నొకనాఁడు, జీవుఁడు బుద్ధిసత్త్వమందుఁ జేరుకొనును. అపుడు పాపపుణ్యసంబంధమునఁ గలుగు జ్ఞానము ఆపేక్షికము కాదు. సర్వత్ర, సర్వదా, సర్వావస్థ లందుఁ బ్రయోగింపఁదగినదే.

బుద్ధియందు రెండు విధముల ప్రకాశము సిద్ధము. ఒకటి యింద్రియములచేఁ దేఁబడిన విషయములను గూర్చిన ప్రకాశము (అదే అలక్ష్మి), రెండవది పరమాత్మను గూర్చిన ప్రకాశము. వీనిలో

మొదటిది పాపము (అలక్ష్మి). రెండవది పుణ్యము (శ్రీ). వైషయిక ప్రకాశమువలన బుద్ధియందు సంకోచమగును. పరమాత్మ ప్రకాశముచే దాని ప్రసారమగును. కనుకఁ బాపము సంకోచము; పుణ్యము ప్రసారము. పూవును బూవుగానే గ్రహించుటచే బుద్ధికి సంకోచమగును. గాని దానిని అమ్మగానెంచి, ప్రాణముగా నెంచి గ్రహించుటనే బుద్ధి ప్రసారమగును. వ్యావహారిక పాపపుణ్యములు సైతము, బుద్ధియొక్క సంకోచప్రసారములపైనే చాల భాగము నిర్భరంపడి యున్నవి. బుద్ధిసంకోచము పేరే యజ్ఞానము. అజ్ఞానముచేత, అనైశ్వర్యము గలుగును. కామనలు, అపూర్ణముగా నుండిపోవును. కామనలు నెఱవేఱకున్న వైరాగ్యము రాఁజాలదు. కనుకనే బుద్ధియొక్క యొకవైపున శ్రీ; రెండవ వైపున నలక్ష్మి యున్నవి. ఒక వంక జ్ఞానము, ధర్మము, ఐశ్వర్యము, వైరాగ్యము; రెండవవంక అజ్ఞానము, అధర్మము, అనైశ్వర్యము, అవైరాగ్యము నున్నవి.

అమ్మా ! ఈ రెండు రూపములతో నీవే విరాజిల్లుదువని యెఱుంగఁగల్గువాఁడే సుకృతి, కృతధీ యనఁబడును; కనుకనే నీవు "కృతధియాం హృదయేషు బుద్ధిః" కనుక బ్రాహ్మణులు "ధియోయోనః ప్రచోదయాత్" అనుచు విశుద్ధ బుద్ధి రూపముతోఁ బ్రకాశించుటకై దీనప్రాణముతోఁ బ్రార్థింతురు. అమ్మా ! బుద్ధియందుఁ జేరఁగల్గునపుడే, జీవునకు సర్వము ప్రాప్తించును. లేములు పూర్తిగాఁ దొలగిపోవును. కనుకనే జీవజగత్తుయొక్క బుద్ధిసత్త్వమును వెలయించుటకే నీ రక్తచరణములందుఁబడి, యీ ప్రార్థనము. (ధియోయోనః ప్రచోదయాత్)

"శ్రద్ధాసతాం" సద్వస్తువు నెఱింగినవారి హృదయము లందు శ్రద్ధారూపవముతో - గురువేదాన్త వాక్యములందు దృఢ విశ్వాసరూపముతో - అమ్మా ! నీవే నిత్యము వెలయుదువు. ఎల్లప్పుడును బరివర్తనమే స్వభావముగానుండు నీ వినాశి వస్తువులందు సైతము, అఖండము అపరిణామియునైన నిత్య సత్తను గాంచుచుండువారే యథార్థ సజ్జనులు. పైని జెప్పినట్లు 'కృతధీ' యగుటవల్లనే జీవుఁడు సత్సంధానము నొందెను. ఏ యుపాయముచేత నది యయ్యెనో యదే శ్రద్ధ; అనఁగా గురువాక్య శాస్త్రవాక్యములందును గొండవంటి నిశ్చల విశ్వాసము. అమ్మా ! నీ వెవనిని 'సత్' గాఁ జేయుదువో, వాని హృదయమందే శ్రద్ధారూపముతో నిల్చి, అసత్పారమును జేర్చి వేయుము. ఇదే నీ మాతృత్వము.

"కులజన ప్రభవస్య లజ్జా" మంచికులమందుఁ బుట్టినవారి హృదయమందు నీవు లజ్జారూపముతో నుందువు. అకర్మమునుండి విముఖుఁడగుటయే లజ్జ. నిందితకర్మములు చేయ నొల్ల కుండుట యనెడి చిత్తసంకోచమే లజ్జ. మఱియొక పక్షమున - సత్తుజాడ నెఱింగినట్టియు, విషయములనెడి కులమందుఁ దిరుగుచున్నను, అకులసంధానము నొందినట్టియు, అనఁగా అఖండసత్త ననుభవించినట్టియు జనులు, నిన్ను సర్వకర్మముల కతీతనుగా నెఱుఁగఁగలరు, గాన దేనినంటని నీయందు నెట్టి కర్తృత్వము నర్పించుటకును సంకోచింతురు. ఇదే వారి యకర్మవిముఖత్వ మనెడి లజ్జ.

"తాం త్వాం నతాఃస్మ" అట్టినీకుఁ బ్రణమిల్లుచున్నాము. అమ్మా ! నీవు మా హృదయములందు శ్రీ, అమలబుద్ధి, లజ్జా

రూపములతో నిన్ను వెలయించుకొనుచుందువు. నీవు అదృశ్యవు, అస్పృశ్యవు, అగ్రాహ్యవు నయ్యు నీ రూపములతో నెల్లప్పుడు మా హృదయములం దావిర్భవించుచుందువు. అట్టి నీకుఁ బ్రణమిల్లు చున్నాము.

“పరిపాలయ దేవి విశ్వమ్” నీ వీ విశ్వమును బరిపాలింపుము. అమ్మా ! నీవు యథార్థముగా నీ విశ్వముఁ బాలించు చున్నావు. విశ్వవాసి జీవులు నీ నెయ్యపుటొడియందే యున్నారనెడి విశ్వాసమును, ధ్రువజ్ఞానమును, ఈ మా జీవుల హృదయములం దుద్దీపింపఁజేయుము. నీ నెయ్యపుబిడ్డలు త్రితాపాగ్ని చే మాడిపోవుచున్నారు. దుర్భిక్షము, మహామారి, అకాల మృత్యువు ననెడి తిరుగలిగానుగలందు నలిగి ఛిన్న మర్మ్మ లగు చున్నారు. వారు నిత్యానందమయివైన నీయొడియందే పాలింపఁ బడుచున్నను విషాదముతోను భయముతోను జచ్చిపోవు చున్నారు. నీవు వానిని దొలఁగింపుము. గురురూపముతోఁ బ్రత్యేకజీవుని హృదయ మందును నీవావిర్భవించి (జీవుల) యజ్ఞానమును బాఱఁద్రోలుము. ఇదే నీ యథార్థ జగత్పరిపాలనము. కానిచో జగత్పరిపాలనము చేయు సార్థకత యేమున్నది ? నీవే జగదాకారమున రూపొందినదానవు. మఱి నీవే జగత్సృష్టి స్థితి ప్రలయములు చేయుదానవు. కనుక నీవు జగత్తును బాలించు చున్నావు. పాలింతువు. ఈ మాట చాలు.

అమ్మా ! మేము నిజముగా నిరాశ్రయులము కాము, అని మాకుఁ దెలియఁజెప్పుము. మేము దుఃఖము చేతను, భయము చేతను బ్రబలుల యత్యాచారముల చేతను బీడితులమై, మమ్ము మేము పూర్తిగా నిరాశ్రయులమనుకొని యిరులు నీరసించి

పోవుచున్నాము. ఈ మా దుర్బలభావమును బాఱఁద్రోలుము. అమ్మా ! నిజముగా నీవు విశ్వపాలినీరూపముతో నెల్లపుడును మమ్ము నీ గుండెపైనే పెట్టి యుంచుకొన్నావనెడి మాటను మా మర్మమర్మములయందు ననుభవించు సామర్థ్యము నిమ్ము.

ఓం. కిం వర్ణయామ తవ రూప మచింత్య మేతత్
కించాతి వీర్య మసురక్షయకారి భూరి ।
కిం చాహవేషు చరితాని తవాద్భుతాని
సర్వేషు దేవ్యసుర దేవగణాదికేషు ॥ ఓం. 5

ఓ దేవీ ! అచింతనీయమైన నీ రూపము నేమని వర్ణించుట ? అసంఖ్యాసురుల వినాశమొనర్చు నీ ప్రచురవీర్యమును, యుద్ధ భూమియందుఁ బ్రకటితములైన నీ యలౌకికచరిత్రములు నననవి, యసురులను దేవతలను మీఱినవి.

(ఇచట 'తవాద్భుతాని' అను పాఠమునకు - నీవు రణ క్షేత్రమం దసురులయెడను, దేవతలయెడను బ్రకటించిన నీ చరిత్రములు వింతలు - అని చెప్పఁదగును.)

వివరణము : - అమ్మా ! అవర్ణనీయము, అచింత నీయమునైన నీరూపము, మనోవాక్కులకు విషయము కాదు. కానవచ్చు పదార్థములకే యొక రూపము, అని మే మెఱుఁగుదుము కాని, ఆ రూపవస్తు వేమిటో మాటలతో వెల్లడింపఁ జాలము. మేము దేనిని రూప మనుకొనుచుందుమో, అనుచుందుమో, అది వాస్తవముగా రూపము కాదు. ఆకృతి మాత్రమే. వర్తువ, చదరము,

ముక్కోణము, ఎఱుపు, తెలుపు, నలుపు, మెత్తన, గట్టి, పొడుగు, పొట్టి మున్నగు నెన్నో పదములతో, మేము రూపవస్తువుల నెఱుంగుటకుఁ జెప్పుటకుఁ బ్రయాసపడుట తప్పదు. కాని వాస్తవముగా వానిచే రూపము కొంచెము మాత్రమే తేఁటపడును. ఆకార ఘటనముల కొంత భాగము మాత్రమే వ్యక్తమగును. "రూప" మనుమాటను దెలియుటకై మేము, సుందరము కుత్సితము అనురెండు మాటలను బ్రయోగింతుము. ఇవి యాకారమును జూచియే బ్రయోగింపఁబడును. వాస్తవముగా రూపము రూపమే. దానియందు సుందరము కుత్సితము నేమియు లేదు. రూప మొక్కటేకాక రెండుకాదు. ఈ విశ్వము రూపసాగరమందే భాసించుచున్నది. ఈ రూపముయొక్క స్వరూపమేమో, అది యేవిధముగాఁ బ్రకాశించునో మాటలతో వెల్లడింపఁ బడదు. ఊహకును అతీతమైనది. అయినను రూపము లేదని తోఁచు టకును వీలులేదు. ఎప్పుడును రూపమునే చూచుచున్నాము. కాని ఆ చూచుచున్నది రూపము కాదు. ఆకారము. ఒక యఖండరూప సాగరమందు ఎన్ని నామములు, ఎన్ని యాకారములు నుబుకుచున్నవో తెలియదు. ఆకారము రూపము తక్క మఱేమియుఁ గాదనుట తెలిసియుఁ దెలియలేకున్నాము. ఈ యాకారమే వేదాన్త ప్రతిపాద్యమైన నామరూపములు. వాస్తవముగా మనము రూపము వైపు లక్షించునపుడే, సర్వేంద్రియములకును అగమ్యమైన మహా సత్యక్షేత్రమందుఁ జేరుకొందుము. అనఁగా ఆ క్షేత్రమునకుఁ గొనిపోఁబడుదుము. అదే యథార్థముగా మనోవాక్కులను మీఱినది.

అమ్మా ! మేము దేనిని సౌందర్య మనుకొనుచున్నామో, అదే నీ రూపముగా నెన్ను చున్నాము గాని, అదియు నూహమున కందనిదే - చంద్రునందుఁ గమలమందుఁ గామినీ కమనీ యాస్య మండలమందుఁ, జిన్న బిడ్డల వచ్చి యురాని తొక్కు పల్కు లందు బిందుమాత్ర సౌందర్యమును జూచి ముగ్ధుల మగుచున్నాము. ఏ సౌందర్యసింధువునందలి యొక బిందువే మమ్మింతగా మోహితులను జేయుచున్నదో, యా సౌందర్య సింధువేయైన నీవు, ఎంత ప్రాణసుఖదాయినివో తెలియఁగలమా ? అమ్మా ! ఈ వ్యష్టి రూపములే, యీ వినశ్వరరూపములే మా కనులు గప్పివేయుచు నీవంకఁ జూపుపడనీకున్నవి కదా. సమష్టి రూపమయివైన నీయెడ ముగ్ధులైనవారు, జగద్రూపమును దుచ్ఛముగా నెంచి విడుతురను చోట వింత యేమున్నది ? అమ్మా ! నీవు సాక్షాన్మన్మథమన్మథవు. నీ యీ రూపసాగర మందు మునుఁగఁగల్గి తన్మయులగువారలే, కుత్సితము నిందితము ననుట కేమియ లేదనియు, సర్వము రూపమయమే, సర్వము సుందరమే యని యెఱుఁగఁగలరు. అమ్మా ! అదెంతటి లోభ నీయావస్థ !

అమ్మా ! నీ యా రూపాతీత రూపసాగరమం దేవిధముగా మునుఁగఁగలడో, నాకుఁదోఁచినంత చెప్పనా ? - రూపమునకు అయిదవస్థలు, 1. స్థూలరూపము, అనఁగా ఆకారము. 2. చక్షువు, అనఁగాఁ జూచుశక్తి. చక్షువువల్లనే రూపజగత్తు యొక్క సూక్ష్మ ప్రకాశము. 3. రూపతన్మాత్ర. ఇది రూపము యొక్క సూక్ష్మతర ప్రకాశము. ఇక్కడఁ జేరుకొన్నపైని రూపమన్నది, బోధముతక్క

మఱేమియుం గాదని యనుభవమగును. ఇంతేగాక, రూపమునకు మఱియొక్క యవస్థ యున్నది. 4. అది పురుషార్థము. పురుష - విశుద్ధ బోధస్వరూప పరమాత్మయొక్క భోగసంపాదనము (అనుభవము) చేయుట చేతనే, దీనిపేరు పురుషార్థము. ఇదే రూపముయొక్క అయిదవ యవస్థ. ఇది అతిసూక్ష్మ తమ స్వరూపము.

తొలుత సత్యబోధముతో (ఆత్మసాక్షాత్కారముతో) స్థూల రూపము - అనఁగా నేదేని పదార్థముయొక్క యాకారమును, అమ్మరూపముగానే యెంచి, పట్టుకొన్నపైని, రూపము యొక్క రెండవస్వరూపము - దర్శనశక్తి - భాసింపఁజొచ్చును. విశ్వమందొక్క దర్శనశక్తియే, యథార్థముగా రూపముయొక్క స్వరూపము, అనెడి బోధము (జ్ఞానము) కలుగుచుండును. తరువాత దీనియందు సత్యబోధముంచి అమ్మా ! అమ్మా ! యనుచునే కేంద్రమువంక ముందడుగు వేయుటచే, రూపతన్మాత్రను జేరుకొందురు. అది యతిసూక్ష్మము. జ్ఞానమయరూపము. ఆకాశీయభావము. అయినను, అతిలోభనీయము. అతిశయ ప్రాణారామము. ఇఁక అమ్మా ! అమ్మా ! యనుచు ముందంజ వేసినచో, అమ్మ నా 'నేనే' యనెడి రూపమయజ్ఞాన మగు చుండు చోటికిఁ జేర్చి వేయును. అహంబోధము - అస్మిత, రూపముతక్క మఱేమి యుం గాదనునట్టి యనుభవము వచ్చును. అపుడు "నేను" ఏమయి పోయెనో యనునది మాటలతో నెటులు వ్యక్తమగును ? అరూపము యొక్క రూపమయస్వరూపము నుండి మఱల, అమ్మా ! అమ్మా ! యనుచు నేడ్వ నారంభించి నచో, ఈ రూపమయమైన 'నేను' న కేది ద్రష్టయో, దేని కరుణ దృష్టిచే, నేను రూపము వికసించునో, ఆ స్వరూపముయొక్క యాభాసము లభించును. ఆ తర్వాత మఱల

స్థూలరూపమునకు దిగివచ్చిన సాధకునకు, ఏమగును ? ఆ రూపమునకైన పిపాస, సౌందర్యమున కైన యాకాంక్ష, యెన్నటికిని దొలఁగిపోవును మఱల "రూపం దేహి" యనుచు నమ్మతో దీనముగా మొఱ్ఱ పెట్ట నక్కఱలేదు. అర్గలాస్తుతియందలి "రూపం దేహి" యను మంత్రము యొక్క సిద్ధావస్థ యిదియే.

అమ్మా ! నీ ప్రియతమ సంతానముతో, "అబ్బాయీ ! కేవలము "రూపం దేహి" యనుచు స్థూలరూపమును బట్టు కొని, సత్యప్రతిష్ఠామార్గమున ముందడుగు వేసినచో, ఎంత సులభముగా, నెంత యనాయాసముగా రూపసముద్రమందు అవగాహనము చేయుదువో, రూపాతీతస్వరూపమును గనుగొందువో, నీకే తెలియును" అని చెప్పివేయుము.

"కించాతివీర్యమ్" అమ్మా ! అసురక్షయకారియైన సాటి లేని నీ వీర్యము సైతము మా ధ్యానమును మీఱినదే. అమ్మా ! అసుర వీర్యరూపముతోను నీవే, మఱి యసుర వీర్య క్షయకారి రూపము తోను నీవే యున్నావు. క్షయ శబ్దమునకు రెండర్థములు. వినాశము, నివాసము; క్షి ధాతువునకు నివాసార్థమందును బ్రయోగము కలదు. కనుక, అసుర క్షయ కారి వీర్యము అని రెండర్థములును దోఁచును. ఏ వీర్యము అసురరూపముతోఁ దన్ను వెలయించుకొన్నదో, అదియు నీవే. ఒక్కచోటనే యొండొంటికి విరుద్ధములైన భావము లిటులుండుట, నీ యందే తగును. అసురుల యందును, సురుల యందును నీవు సమానముగానే వెలయుదువు. (రెండు రూపములు నీవేయని యర్థము.) ఎచ్చటను హెచ్చుఁదగ్గులు లేవు; కనుకనే మంత్రమందు "అసురదేవ గణాదికేషు" అని కానవచ్చు చున్నది.

అమ్మా ! బ్రహ్మాండ సృష్టి స్థితి ప్రలయము లొనర్చుట యనెడి, నీ మహావీర్యము వెలయుట కాంచిన మాకింతకు మున్నే, నీ యసురవీర్యము తేఁటపడినది. మేము నీ యీ సాటిలేని వీర్యమును జూచి వింతపడి కొయ్యవాఱి పోతిమి. నీవు కామ క్రోధ లోభ మోహాదులైన యసురరూపముతో వెలయునపుడు, నిష్కామ, నిష్క్రోధ, నిర్లోభాది దేవవీర్యమున కెంతయో పరాజయ మైనది. మఱల దేవవీర్యము ప్రబల మైనపుడు, అసురవీర్య మోడిపోయినది. అమ్మా ! ఈ విధముగా దివారాత్రములు మా హృదయక్షేత్రమందు, నీ వీర్య ప్రభావమే యనుభూతమగుచున్నది. మఱి యీ విధముగాఁ బరస్పర విరుద్ధవీర్యము వెలయువేళ నగు నా యుద్ధమందు, అభూతపూర్వమైన, లోకోత్తరమైన నీ వీర్య మెంతగా వెలయును ! అమ్మా ! అసురవీర్యపీడ యారంభ మగునపుడు, చిత్త క్షేత్రమందు లోకనిందిత లీలాభినయ మెంతయో యగుచుండును. మఱొక్క గడియ తర్వాత (ఉత్తరక్షణమందే) అసురవీర్య ప్రాబల్య మణఁగి పోయి, దేవతావీర్యము ప్రబలమై చిత్తక్షేత్రమందు స్వర్గీయశాన్తిని నిర్మలముగాఁ బ్రవహింపఁ జేయు చుండును.

అమ్మా ! ఇంతేగాక, నీ వీర్యమందు మఱొక్క ప్రభావము కనవచ్చును. అది సురాసురులను మీఱినది. అమ్మా ! సర్వవీర్యములు నెచ్చటఁ బరాభూతములగునో, అది యభయామృతమయ వీర్యము. దానివలని భయముచేతనే వేళకు సూర్యుఁ డుదయించుట, అదను పదను జెడనట్లు గాలివీచుట, మేఘము కురియుట, మృత్యువు భీతిని బరుగెత్తుట యగుచున్నది. ఆ వీర్యమే యిది.

అమ్మా ! నీవు సర్వవీర్యాతీత వీర్యమయివి. నీ చరణములకుఁ గోటి ప్రణామములు.

ఓం. హేతుః సమ స్తజగతాం త్రిగుణాపి దోషై
ర్నజ్ఞాయసే హరిహరాదిభి రప్యపారా ।
సర్వాశ్రయాఖిల మిదం జగదంశభూత
మవ్యాకృతా హి పరమా ప్రకృతి స్త్వమాద్యా ॥ ఓం. 6

నీవు సర్వజగత్కారణవు. త్రిగుణస్వరూపవయ్యు, దోష కారణముచే నజ్ఞేయవు; కనుకనే హరిహరాదులకును ధ్యాన గమ్యవు కావు. నీవు సర్వాశ్రయవు. ఈ యఖిలజగత్తు నీ యంశమే. నీవే యవ్యాకృతము నాద్యమునైన పరమప్రకృతివి.

వివరణము :- మాయమ్మా ! నీవే సర్వజగత్కారణమవు. ఇపుడు మేమున్న యీ జగత్తొక్కటే జగత్తుకాదు. సమస్త జగత్తులు - అనంతకోటి బ్రహ్మాండములు, ఈ యనాది సృష్టి చక్రమునకు సంబంధించిన పరివర్తనశీలపదార్థముల కన్నిటికి నీవొక్కతెవే కారణమవు. కారణము రెండు విధములు - నిమిత్తము, ఉపాదానము. ఈ రెండు నీవే. మేము స్వప్న దృష్టాన్తముచే నిది యించుక తెలియఁ గలము. స్వప్నమందుఁ గానవచ్చు పదార్థములకు నిమిత్తము, అనఁగాఁ గర్తయు, ఉపాదానము అను రెండును, మనస్సుకంటె వేఱేమియుఁ గా నట్టులే యీ జాగ్రదవస్థయందుఁ గానవచ్చు (అనుభవింపఁబడు) జగత్ప్రపంచమునకు నిమిత్తోపాదానములు

రెండును నీవే. ఆత్మవు, మా యమ్మవు నీవే. నిన్నుఁ గొన్ని వంతులుగాఁ జేసి కొని ద్రష్టగాను దృశ్యముగాను వెలయుచున్నావు.

అమ్మా ! ఒకప్పుడు జ్ఞానవృద్ధులైన నీ బిడ్డలు కొందఱు, "ఆత్మ జగత్కారణము కాదు. ఆత్మ నిర్గుణము. నిష్క్రియము. దానియందెట్టి కారణత్వ ముండఁజాలదు. జగత్తున కుపాదాన కారణము జడప్రకృతి. చైతన్యస్వరూపాత్మకు సమీపముగా నుండుటవల్ల, నీ జడప్రకృతియందగు పరిణామమే యీ జగత్తు. మఱి నిమిత్తకారణత్వమును నీ యాత్మయందు లేదు. ఏలన - ప్రకృతికగు జగద్రూపపరిణామమును దర్శించుటయు నాత్మ ధర్మముకాదు. దానియందెట్టికోరికయులేదు. స్వప్రకాశస్వరూపమైన యాత్మయొక్క సమీపతావశమునఁ బ్రకృతియందుఁ జైతన్యధర్మము భాసింపఁజొచ్చును. దాని పరిణామమే యీ జగత్తు" అందురు. ఇటులనెడివారితో మా కెట్టి విరోధమును లేదు. మేము వారి ధిక్కారములను సైతము సత్యజ్ఞానముతో స్వీకరింతుము. గాని, అమ్మా ! నీవు మా యెదుటఁ గేవలము, ఇట్టిభావముతో నిన్ను వెలయించుకొనలేదు. గురురూపముతోఁ నావిర్భవించి విశిష్టభావముతోఁ గానవత్తువు. ఆ జడప్రకృతియు నీవే. ఆత్మా ! మా యమ్మా ! ఆత్మయే మా యమ్మ. కనుకనే, మంత్రమందు "త్రిగుణా" - త్రిగుణాత్మికా ప్రకృతిరూపముతో జగదుపాదానమును నీవే, కాని మఱేదియుఁ గాదు.

పరమాత్మా ! మా యమ్మా ! నీవు చైతన్యస్వరూపవు. చిచ్ఛక్తివికదా. నీ ప్రకృతి జడము - అచేతనము నగునని యెటులంగీకరింతుము ? ఎటులు నమ్మెదుము ? చేతనమైన

యాత్మయొక్క ప్రకృతి, అచేతనము కాఁజాలదు. సరికదా, అచేతనాకార మునఁ జేతనయొక్క ప్రత్యక్షజ్ఞానమును గలిగింపఁ గలది. త్రిగుణ ప్రకృతి ఆత్మకంటె వేఱుగా నుండఁజాలదని కనుగొనునప్పుడే జడసత్తాభాసముకాదు. (జడసత్త ప్రకాశింపదు.) (సూర్యునకును గిరణములకుం బోలి) ప్రకృతికి ఆత్మకును అవినాభావ వ్యాప్తి కలదు. అపుడు మఱి దానిని జడమెటులందుము ? అమ్మా ! నీ యాలోచన ముండునంతదాఁకనే, 'నేను' ఉండు నంతదాఁకనే నీవు త్రిగుణప్రకృతివి. 'నా ప్రకృతి' యని నోర నందురే కాని, వాస్తవముగా 'నేనే' ప్రకృతి. 'రాహువు శిరస్సు' అనఁగానే, రాహువుకంటె శిరస్సు వేఱనుకొనునట్లే యిమ్మాటయు నున్నది. పురుషప్రకృతులు, బ్రహ్మమాయలు, ఆత్మశక్తులు మున్నగు యుగ్మవాచక శబ్దములు (జంటలను దెలుపు మాటలు) ప్రయోగింపఁబడినను, వాస్తవముగా నవి కేవల మభిన్నములు. ఆత్మ ప్రకృతిరూపముతో, మాయా రూపముతో - శక్తిరూపముతో వెలయునపుడే యది ప్రకృతి, మాయ, శక్తి యనఁబడును.

ఒక శంక కలుగవచ్చును - "విశుద్ధబోధ 'జ్ఞ' స్వరూపాత్మ, జడ ప్రకృతిరూపమున అనఁగా - త్రిగుణాకారమున నాకారితమగునా ?" యని, దీనికి సమాధానమేమనఁగా - ఆ 'జ్ఞ' వస్తువునందు జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానములనెడి మూడు విశిష్టభావములు వెలయును. నిర్గుణావస్థయం దది యవ్యక్తముగా నుండును. గనుకనే ప్రకృతికి మఱియొక పేరు 'అవ్యక్తము'. 'జ్ఞ నుండియే జ్ఞాతృ జ్ఞేయాది ధర్మములు వెలయును. అవే త్రిగుణములు. జ్ఞానము -

సత్త్వగుణము; జ్ఞాత - రజోగుణము; జ్ఞేయము - తమోగుణము. ఈ మూడువస్తువులును ఎక్కడనో మఱియొక చోటినుండి రావు. ఆ 'జ్ఞ' వస్తువునుండియే ప్రకాశితము లగును. మూడవస్థలుగాను 'జ్ఞ' ఆత్మవస్తువు సరిగా, అటులే యుండును. ఇఁక, ఆత్మయందే జ్ఞాతృ జ్ఞేయాది ధర్మములు ప్రకాశించి నామరూపాత్మక జగత్తు ప్రత్యక్షమగును. కనుక, అమ్మా ! ఏవైపు చూచిన నావైపే, ఎచ్చటఁ జూచిన నచ్చటనే నీ విచిత్రవికాసమును గాంచి ముగ్ధులమగు చున్నాము. కనుకనె, యెచట నమ్మా ! యని మేము పిలిచినను, అచటనే 'ఓ - ఆఁ' యనెడి నీ బదులుమాట విని, నీ స్నేహాదరముల గర్వము ననుభవించుచున్నాము. కనుకనే దేవతలు నిన్ను స్తుతించునపుడు, "హేతుః సమస్తజగతాం త్రిగుణా" యని ప్రకృతిరూపిణివైన నీ యరుణచరణములందు వ్రాలిరి.

అమ్మా ! నీవు త్రిగుణమూర్తితో జగద్రూపమునఁ బ్రత్యక్ష వగుట యింత సత్యమైనపుడు మేమును దేవతలవలె నిన్ను జగ ద్రూపనుగా నెందులకుఁ జూడము ? కుండ, కూజా చూచుటతోనే మన్ను గానవచ్చునుగదా. కుండలములు చూచుటతోనే బంగారు వసచ్చునుగదా. అటులే యీ జగత్తును గాంచినంతనే నీ దర్శన మెందులకు గాదు ? చిన్మయీ ! నీవే జగత్తయినచో, నీవే నామరూపములయినచో, నిన్నెందులకుఁ గనలేరు ?

"దోషై ర్నజ్ఞాయసే" దోషములు కారణముగా నిన్నెఱుంగరు. దోషము లేవి ? మొట్టమొదటిదోషము సంశయము. రెండవది అవిశ్వాసము. మేము కేవల నామరూపములనే చూడఁగోరుదుము.

మే మెల్లపుడును బరివర్తనరూపమైన జడ జగద్రూపముగానే దీనిఁజూచు నభిలాషముగలవారము; కనుకనే నిన్నుఁ గానలేము. మఱి, యెపుడేని మెఱుపు మెఱసినట్లు క్షణ స్థాయియైన అమ్మదర్శనముచేయు నిచ్ఛ రవ్వంత పొడమినను, ఎంత సందేహము ! ఎంత యవిశ్వాసము ! కన్నుల దుమ్ముకొట్టి యెదుర నిల్చి, ఏమైనది ? ఈ జడమృత్తిక అమ్మయా ? యను చుండును. అయ్యా ! ఈ జడజలము చిన్మయి, అమ్మ కాఁగలదా ? అను చుండును. ఈ విధముగా, మమ్ముల నా రెండును (దౌర్బల్య ములు) మోసపుచ్చుచున్నవి. అవే నీ యీ ప్రకట విశ్వమూర్తి విషయమున జడత్వమనెడి దట్టమైన తెఱను వ్రాల్చుచున్నవి. కనుక రవ్వంత కోరిక కలిగినను, వింతలో నంతరించి పోవుచున్నది.

అమ్మా ! ఇంకెంతవఱకు నీత్రితాపదగ్ధ జీవకులమును మోసపుత్తువు ? నీవే దోషములను సృష్టింతువా ? నీవే నీ యవయవములను దోషములతో నడ్డుపెట్టి యుంతువా ? సరే, దీనివల్లనే నీవు మాకుఁ బట్టుపడవు. నిన్న దోషమయినిగాఁ జూచుటే మా కన్నులకుఁ జిరకాలమునుండి యలవాటయినది. కనుక గుణమయినిగాఁ గనలేకున్నాము. దోషములనుగూడ, అమ్మ రూపముగానే తలంపఁగల్గుదుమేని, మాయనుగూడ, అమ్మ రూపముగానే యంగీకరింతుమేని, ప్రకృతినిగూడ పురుషుఁడనియే గ్రహింతుమేని, మనసునుగూడ ప్రాణమనియే యాదరింతుమేని, విషయములనుగూడ భోక్తృరూపమున భోగింతుమేని, దృశ్యమును గూడ ద్రష్టృస్వరూపముగా దర్శింతుమేని, జడమునుగూడ చేతనమునుగా ననుభవింతుమేని, తప్పక అమ్మా ! నీ దోషా వరణము దూరమై పోవును. తల్లీ ! నీవు తక్క మిగిల్లిన దంతయు

దోషమే. సర్వరూపములతో నీ వొక్కతెవే యున్నావని తెలియఁగల్గిన పైని దోషమెక్కడిది ? దోషము నీకంటె నేదో వేఱుగా నుండునంత వఱకే, నీవు "నజ్ఞాయసే". ఇదిగో, అమ్మా ! ఈ దోషములను మిథ్య యని, భ్రాన్తియని, అధ్యాసమని, కల్పనా మాత్రమని తలంచి కేవలము నీ వైపునకే చూపు సారించువారి యందు సైతము, ఇంతో అంతో దోషము నిల్చిపోయినది. మిథ్యయే యనుము; భ్రాంతియే యనుము; దోషదర్శనమే యగును. కనుక దోషములను నీకంటె వేఱుగా - అనఁగా నీ కావరణముగాఁ గన్నంత దాఁకనే నీవు "నజ్ఞాయసే". అంతవఱకే నీవావృతవై యుందువు. అమ్మా ! గీతయందు "నీవేకదా పొగచే నగ్నిక్రమ్మఁబడి నటులు, ధూళితెఱచే దర్పణము క్రమ్మఁబడినట్లు మావిచే గర్భము చుట్టఁబడియున్న టులు, అజ్ఞానముచే జ్ఞాన మావరింపఁబడి యుండు" నని చెప్పితివి. అజ్ఞానమే దోషము. అజ్ఞాన ముండునంత దాఁక జ్ఞానము ప్రకాశింపదు. ఇది సత్యమే. కాని, పొగ యగ్గితోనే పుట్టిన (సహజాత) దోషమైనటులే, ధూళి తెఱ యద్దమునకుఁ దప్పకంటు నాగంతుక దోషమైనటులే, మావి గర్భమునుసంరక్షించు సహజగర్భావరణ దోషమై నటులే, యజ్ఞానము జ్ఞానమునకుఁ దప్పకగు సహజాత దోషము. అజ్ఞానముకూడ జ్ఞానమేయని తెలిసికొనుటతోనే దోషము దూరమైపోవును. జ్ఞానముదయించును. అపుడు మఱి నీవు "నజ్ఞాయసే" కావు, "జ్ఞాయసే" యగుదువు. అనఁగా అపుడు నీవు జ్ఞానరూపముతోనే నిన్ను వెలయించు కొందువు.

"హరిహరాదిభి రప్యపారా" అమ్మా ! మేము నిన్నుఁ దెలియుటెట్లు ? నీవు మా కే యజ్ఞేయవు కావు. శివ విష్ణు బ్రహ్మల ధ్యానమునకును నీ వగమ్యవు. "ధాతృత, ధ్యేయము, ధ్యానము" (త్రిపుటి) ఉండునంతదాఁక నీ యథార్థస్వరూపము వెల్లడికాదు. హరియని, హరుఁడని విశిష్టబోధముండునంతదాఁక నీ పరమాత్మ స్వరూప మెటులు ప్రకాశించును ? అమ్మా ! 'నేను' ఉండునంత దాఁకనీవు రావు. 'నేను' వెళ్లిపోయిన తర్వాత నపుడు నీవు వత్తువు. అపారచిత్సముద్రమందు విశిష్టమైన యీ 'నేనును' బూర్తిగా నొక్కసారి ముంచివేయు నంతదాఁక, నే విధముగాను నీ వాత్మ రూపముతోఁ బ్రకటవుకావు. కనుకనే నీవు "హరిహరాదిభి రప్యపారా" అయితివి.

"సర్వాశ్రయా" అమ్మా ! ఇంత తెలియరానిదాన వైనను మేము హతాశులము కాము. అగు హేతువులేదు. ఏలన, నీవు సర్వాశ్రయవు. నీవు సర్వమునకు నాశ్రయమై యున్నావు. మేము నీ యాశ్రితులము. సాధారణసంభాషణమందు "నీవు మమ్ముల నాడినుంచికొన్నావు" అందుము. మేము నిన్నెఱుంగలేకున్నను సర్వవిధముల నీ యాశ్రితులమే. నీ యొడియందే కూర్చున్నాము అని తెలిసికొన్నం జాలును. మాకు గావలసినంత లాభమైనదే. మేము నిరాశ్రయులమును, అనాథులమునుగాము. మేము నీయందే యున్నాము. జన్మము, మృత్యువు, శోకము, దుఃఖము, అభావము, ఉత్పీడనము, ఏమికానీ, అవస్థల విపర్యయ మెంతగాఁగానీ; సర్వాశ్రయవు; అమ్మవు. సర్వావస్థలందు సర్వ విధముల ధరించి యుంచితివి. మమ్ములను క్షణమైనను నీవు

విడువలేదు. ఇంతకంటె నధికాశ్వాసన వాక్యములు మఱేముండును ? అమ్మా ! ధన్యులము. మేము నీ సంతానము. నీ యొడియందే నిబ్బరముగాఁ గూర్చున్న నగ్నశిశువులము. అమ్మా ! అమ్మా !

"అఖిలమిదం జగదంశభూతమ్" అమ్మా ! నీవు సర్వాశ్రయవని మేమెటులు తెలిసికొనుట ? ఈ సమస్త జగత్తు నీ యంశము నుండియే పుట్టినది. తన యంగ ప్రత్యంగములను సర్వవిధములఁ దానెఱుంగఁగల యవయవి, అవయవములకు ఆశ్రయమైనటులే, యీ యఖిలజగత్తు నీ యంశమే యగుటచే నీవు సర్వాశ్రయవు. ఒక నీ యంశము జగదాకారముతో వెలయును. శ్రుతి "పాదో உస్య విశ్వాభూతాని" యనుచున్నది. నీ నాల్గవపాలుగా నీ జగత్తున్నది. తక్కు మూడు పాళ్లు స్వయంప్రకాశముగా, అమృతస్వరూపమై యున్నది. అక్కడ జగత్తులేదు. కల్యాణి శ్రుతి, యల్పజ్ఞజీవులమైన మాకు సులభముగాఁ దెలియుటకై అపరిచ్ఛిన్నవు, అనంశవు, పూర్ణ స్వరూపవు నైన నీకు, అంశకల్పనము చేసినది. నీవు సర్వాశ్రయ వను విషయమున నెవ్వరేని - ఈ బ్రహ్మాండమున కాశ్రయ మిచ్చునపుడు, ఎంత పరిమాణ మావశ్యకమో, అంతేకాఁబోలు నీ సీమ యనుకొని శంకింతురు. అట్టి వారి శంకానివృత్తికయియే, ఈ విశాలబ్రహ్మాండము నీ యత్యల్పాంశంముగానే ప్రకాశించుచున్న దనియు, నీ యధికాంశము స్వయం ప్రకాశము, నిత్యపూర్ణము, అపరిచ్ఛిన్న స్వరూపమనియుఁ జెప్పఁబడినది. అమ్మా ! నీవే స్వయముగా నంటివి కదా. "విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన

స్థితంజగత్" (గీత 10-42) అని; ఈ జగత్తు నీ యంశమే యైనపుడు నీవు అంశివి' అని చెప్పనేల ? కనుకనే నీవు సర్వాశ్రయవు.

"అవ్యాకృతా హి పరమా ప్రకృతి స్త్వమాద్యా" ఈ ప్రత్యక్ష జగత్తు నంటిన చంచలతను నియతపరిణామమును జూచి మన మనస్సునందు "ఈ జగదంశముగా నీవును జంచలవు, పరిణామ శీలవు" అని శంక కలుగును. కనుకనే దేవతలు నిన్ను స్తుతించు నపుడు "అవ్యాకృతా, పరమా, ఆద్యాప్రకృతిః" అనిరి. అమ్మా ! నీ వనేక నామములతో, అనేక రూపములతో వ్యాకృతవయ్యును (విశిష్టాకారములను బొందియును) నీ యవ్యాకృతత్వము నఖండముగా నుంచితివి. మంచుగడ్డగా నైనను జల పరమాణువుల యందు వికార మించుకయు లేదు. బోధ వస్తు వెంత వ్యాకృతము కానిమ్ము. ఎట్టి యవస్థయందును దాని బోధత్వమందు బిందుమాత్రమైనను వికారము కాదు. కనుక నీవు జగద్రూపముతో వ్యాకృతవైనను స్వరూపమందు అవ్యాకృతవుగానే యందువు. కనుక నీవు నిర్వికారవు, నిత్యవు, స్థిరవు; ఏ విధమైన చాంచల్యము గాని, పరిణామము గాని, నీయందు లేదు. "జాయతే, అస్తి, వర్ధతే" మున్నగు షడ్భావ వికారములు నీ మీదినుండియే వెళ్లిపోవును; నీవు మాత్రమెల్లపుడు నవ్యాకృతవే. కేవల చిచ్ఛక్తిరూపిణి వగుట చేతనే, యీ యత్యంత విరుద్ధ ఘటనములు, నీయందు గాఁజాలును. కనుకనే పరమవు, ఆద్యవు, ప్రకృతివి. సాంఖ్యులు దేనిని బురుషుఁడందురో, వేదాన్తులు దేనిని బ్రహ్మమందురో, ఉపనిషత్తులు దేని నాత్మయనునో, భక్తిశాస్త్రము దేనిని భగవంతుఁడ నునో, ఆ యిదే ఆద్యా, పరమా, ప్రకృతి. మఱి జగద్రూపముతో

బరిణామము నొందిన త్రిగుణాత్మిక ప్రకృతియను నది అనాద్య. అమ్మా విశుద్ధబోధస్వరూప పరమ ప్రకృతివైన నీవు, జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానరూపముతో సత్త్వరజస్తమో గుణరూపముతో, అనాద్య ప్రకృతి రూపముతో బ్రకాశించునపుడును, నీవవ్యాకృతవుగానే యుండి పోదువు. కనుకనే నీప్రభావము యథార్థముగా నచింతనీయమే. యథార్థముగా నీవే,అఘటనఘటన పటీయసియు జిన్మయియునైన జననివి.

ఓం. యస్యాః సమస్త సురతా సముదీరణేన
తృప్తిం ప్రయాతి సకలేషు మఖేషు దేవి ।
స్వాహాసివై పితృగణస్య చ తృప్తి హేతు
రుచ్చార్యసే త్వమత ఏవ జనైః స్వధాచ॥ ఓం. 7

ఓదేవి ! సర్వవిధముల యజ్ఞములయందు దేవతాగణము దేవి యుచ్చారణమువలనఁ దృప్తి నొందునో, ఆ 'స్వాహా' మంత్రము నీవు. మఱి పితృదేవ తృప్తికై నీవే 'స్వధా' మంత్రరూపమున లోకులచేత నుచ్చరింప బడుదువు.

వివరణము :- ప్రథమఖండమందు "త్వం స్వాహా, త్వం స్వధా "అను మంత్రము క్రింద దీని వ్యాఖ్య చూచునది. అమ్మా ! జగత్తు నందు యథాశాస్త్రముగా దేవ పితృకార్యములను జరుపు వారు, దు:ఖ సంసారారణ్యమందుండియు సుఖశాంతులతో దినములు గడుపుచుఁ బరమ శ్రేయోలాభమొంద గలరు; కావుననే, గీతయందు నీదే "జీవుఁడా! నీవు యజ్ఞాదులచే దేవతలకుఁ దుష్టి పుష్టులు కలిగింపుము, ఆ దేవతలును, అన్నాదుల రూపముతో

నీకుఁ బుష్టిఁ గలిగింతురు. ఇటుల మీలో మీరు పరస్పర శుభచింతలయందు నియుక్తులై యుండి పరమ శ్రేయముల నొందుచుండఁగలరు. దేవతలకు యజ్ఞభాగముల నర్పింపక తామే భోగించువారు దొంగలు; పాపాన్నభోజులు" నని చెప్పివేసితివి.

సత్యమే. అమ్మా ! మా ఇంద్రియములవలనఁ దేఁబడిన రూపసాది విషయ సామాగ్రిని, ఇంద్రియాధిష్ఠిత చైతన్య వర్గమనెడి దేవతల నుద్దేశించి యర్పింపనిచో, హవిర్భాగములు దొరకక పోవుటచే, అనఁగా (సరియైన యభ్యాసములేమిచే) దేవతలు దుర్బలులైపోదురు. ఆయా చైతన్యముల వికాసశక్తి క్షీణించును. మఱి దానిఫలముగా రోగము, శోకము, అకాలమృత్యువు మున్నగు వాని సంఘటన మగును. విశేషమేమనఁగా,అజ్ఞానావరణము తొలఁగుదు. దైవ పితృ కార్యములందింత రహస్యము దాగియున్నది. దాని నాధునిక వైజ్ఞానికులును అంగీకరించుచున్నారు. అమ్మా! ఇంతగా నీమహత్వ సమాలోచనలు చేసియు నిన్నె ఱుంగఁజాల కుండుటకు హేతువు - ఆ దేవతల శక్తులు క్షీణించుటే. ఎల్లప్పుడు నింద్రియముల దారిని విషయాహరణము చేయుచున్నారు; అంతఃకరణ సహాయముచే వానిని భోగించుచున్నారు. ఏ దేవ శక్తి సహాయమువలన నీభోగములు సిద్ధించుచున్నవో, యా దేవతల నుద్దేశించి యెవ్వరు నెన్నఁడును విషయములనెడి హవిస్సుల నర్పింపరు. కనుకనే మన యింద్రియశక్తి శిథిలమై మనో బుద్ధి చిత్తాదుల సామర్థ్యము తఱిగిపోవుచున్నది. సూక్ష్మవిషయ చింతా ధారణ ములందు సామర్థ్యమింతయు లేకున్నది. అతీంద్రియ వస్తువున్ను గూర్చిన చింతయందును, దాని ధరించుట యందును

మన బుద్ధి, తన యసమర్థతనే ప్రకటించుచున్నది. దీనికి ముఖ్యహేతువు-మనము వానిని సరిగాఁ బోషింపకుండుటయే.

'స్వాహా' అనగా దేవకార్యములచేతను, మఱియు 'స్వధా' అనఁగా శ్రాద్ధ తర్పణాది కార్యములచేతను, మన యంతఃకరణములకును బాహ్యకరణములకును అధిష్ఠాతలైన దేవతలు పుష్టినొంది ప్రసన్నులగుదురు. దాని ఫలముగా దుర్విజ్ఞేయవైన అమ్మా ! నీవే విజ్ఞాత వగుదువు. ఇదిగాక మఱి యొక తత్త్వమున్నది-ప్రత్యేక దేవతను వేర్వేఱువిధమునఁ దృప్తి నొందింపఁ బ్రయత్నింపక కేవల ప్రాణరూపిణివైన యమ్మను నిన్నుద్దేశించి స్వాహా స్వధార్పణము చేసినచో, ఇంద్రియముల దారిని దేఁబడిన విషయములనెడి హవిఃసంభారమును, మహాప్రాణరూపిణియైన మాత్రగ్ని (బ్రహ్మగ్ని) యందే యాహుతులిడినచో, దేవతల కపారతృప్తి యగును. దాని ఫలముగా నింద్రియాధిష్ఠిత చేతనవర్గము పరిపుష్టమగును. చెట్టుమొదల నీరు పోసినచో రసప్రవాహముచే శాఖా పత్రపుష్ప ఫలాదులన్నియుఁ బోషింపఁబడును. ఉత్తమాంగమైన శిరస్సునకు స్నిగ్ధోపచారములు చేయుటచే సర్వావయవములను స్నిగ్ధ శీతలము లగును. అమ్మా! నీకుఁ దృప్తియయ్యెనా-సర్వమునకుఁ దృప్తి యగును. "తస్మింస్తుష్టే జగత్తుష్టం ప్రాణితే ప్రాణితం జగత్" నీవు తృప్తినొందితివేని, త్రిజగత్తులు, దేవలోకము, పితృలోకము, సర్వము తృప్తమైపోవును.

అమ్మా ! నీవు నిత్యతృప్తవుకదా. నిన్నింకను దృప్తినొం దించుట యెట్టిది? మేమెప్పుడును అతృప్తినే యనుభవింతుము,

కనుక నీయందును దృప్తి లేమినే (వెల్తినే) కల్పించి నీ దృప్తి విధానములకై పూనుకొనుచుందుము. మఱి నీవును నిజముగా నతృప్తవైన్నట్టులే, మా గుమ్మములకడకు వచ్చి "పత్రం పుష్పం ఫలం తో యం యో మే భక్త్యా ప్రయచ్ఛతి । తదహం భక్త్యుప హృత మశ్నామి ప్రయతాత్మనః" అనుచుందువు. నీవు మేమిచ్చు పండ్లు, పూలు, పత్రములను యాచించుదానవా ? అవి యందు కొనక నీకుఁ దృప్తి కాదు కాఁబోలు. అందులకా - "ఓ ముగ్ధసంతా నమా! అర్పించండి; ఏదో యీయండి; ఏమి లేకున్నను ఇంత జలము (జీవనము) ఈయండి; నేను దానినే ఆదరముతోఁ గైకొందును. వస్తువును జూడవలదు. అది ఇంత అంత యని చూడవలదు. కేవల భక్తిపూర్వకముగా నీయఁజూడుడు. దాని వల్లనే నాకుఁ బూర్ణతృప్తి యగును" అంటివి. ఔరా ! తలంచు కొన్నంతనే హృదయము కంపించును. అమ్మా ! ఒకనాఁడు నీవు, నీకే చిత్తము నర్పించిన ద్రౌపది వలన నొక్క కణము శాకాన్నము నడిగికొని పరితృప్తవైతివి. అమ్మా! నీదయకు మేర లేదే. మా మనసుల నిండియున్న యతృప్తిని దొలఁగించుటకై నీవును, అతృప్తవు కావలసివచ్చుచున్నది. అన్నపూర్ణవు; నిత్యతృప్తవు; మాయమ్మవు. నీవు మా యతృప్తిని దొలగించుటకై స్వయముగా, అతృప్తిమూర్తితో వెలసి, జీవుల గుమ్మములకడ భిక్షమెత్తుదువే. ధన్యు లాజీవులు.

మనుజులు చేయు విధ్యుక్త కార్యములందు నీవే నియోగింపఁబడుచున్నావు. నిన్ను నీవే వినియోగించుకొనుచున్నావు. ఉద్దేశమేమి? కొన్నాళ్ళీవిధముగా, స్వాహా స్వధానుష్ఠానమువలనఁ నీకు దృప్తిఁగలిగించు విధానములు జరుప గల్గుటచేతనే మనుష్యుఁ

డేదోయొకనాఁడు శుభముహూర్తమందు నీముఖమువంక దృష్టిఁ బఱపును. అపుడు నీవు నిత్యతృప్తవు, నిత్యస్థిరవు, నిర్వికల్పవు వైన యమ్మవని తెలియఁగలదు. అప్పుడుమెల్ల మెల్లగా గర్మసన్న్యాసాధి కారము వచ్చును. జీవుఁడు నైష్కర్మ్యము నొందును. అమ్మా! యిదే నీ దేవ పితృకార్యముల యథార్థస్వరూపము.

ఓం. యా ముక్తిహేతు రవిచింత్య మహావ్రతాచ
అభ్యస్యసే సునియతేంద్రియ తత్త్వసారైః ।
మోక్షార్థిభి ర్మునిభి రస్త సమస్తదోషై
ర్విద్యాసి సా భగవతీ పరమా హి దేవీ ॥ ఓం. 8

ఇంద్రియములను సుసంయతముల నొనర్చినవారును, పరమతత్త్వమునే సారముగా గ్రహించినవారు నైన మోక్షార్థి మునులకు ముక్తి హేతువు, అచింతనీయవు, మహావ్రత స్వరూపవు నైన నిన్నే ధ్యానింతురు. దేవీ! ఆ భగవతిని, పరమా విద్యవు నీవే.

వ్యాఖ్య :- మును జెప్పిన దైవ పితృ కార్యానుష్ఠానము చేయఁగాఁ జేయఁగా నాత్మతృప్తి కలుగును. ఆత్మతృప్తితోఁ బరిచయ మొందును. అపుడు జీవుని యింద్రియములు సుసంయతము లగును. మఱి విషయలోభముతోఁ బరుగెత్తవు. ఆ యవస్థయందు ఆత్మయే పరమతత్త్వమనెడి బోధము కలుగుచుండును. అందు వల్లనే జీవుఁడు, ఆత్మనొందుటకు - మోక్షాశయందు జాగృతుఁ డగును. దీనిపేరే ముముక్షు - అవస్థ. అపుడు కేవలము ఆత్మనే

స్థిరముగా లక్షించుచుండుటచేత, వాగ్యంత్రము నడ్డగించి - మౌనము నవలంబించును - ముని యగును. ఇటులు ముని యగుటచే మల విక్షేపావరణాది దోషములు క్షీణించిపోవుచుండును. అట్టి యపుడు, ఆ మననశీల మునిజనులు చేయు నభ్యాసము - నిదిధ్యాసము - అదే నీవు.

ఈ యభ్యాసము యొక్కస్వరూపమేమి? అభి + అస్యసే = అభ్యస్యసే. అస్ విక్షేపే, అను ధాత్వర్థము విక్షేపము. ఉపనిషత్తు - "ప్రణవధనుస్సుపైని జీవాత్ముడు బోధమనెడి బాణము నెక్కించి, బ్రహ్మము నుద్దేశించి, అప్రమత్త తతో మాటిమాటికి బాణమును విడుచును" అనుచున్నది-ఇదే 'అభ్యస్యసే' అను దాని యథార్థ తాత్పర్యము. ఏదేనొక పనిని దఱుచుగాఁ జేయుటపేరే అభ్యాసము. ఇచ్చటను బ్రహ్మము నుద్దేశించి జీవాత్మ శరమును మాటిమాటికి విడుచుటే అభ్యాస మందురు. దీనిని నిదిధ్యాసమన్నను దప్పులేదు.

అమ్మా! జీవుఁ డీవిధముగా నభ్యాసతత్పరుఁడగునప్పుడే, అచింతనీయ మహావ్రతస్వరూపమున నిన్ను నీవు వెలయించు కొందువు. ఏలన, అభ్యాసమనెడి మహావ్రతము యథార్థముగా నచింతనీయమే. జీవుఁడు బుద్ధిపరపారమందుండి అవాఙ్మాన సగోచర పరమాత్మాభాసము నొందుచుండునపుడే, యతని (దాని) నుద్దేశించి జీవాత్ముడు బోధమనెడి శరమును విడువఁగలఁడు. కనుకనే యీ వ్రతస్వరూప మిట్టిదని మాటలతో వివరింపఁ బూనినను, అది వాస్తవముగా నచింతనీయమే. "అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ సిద్ధ్యతి" (గీత.) దాని యథార్థ స్వరూపము

వ్రాయుటవలన జెప్పుటవలన, విచారముచేయుట వలన నను భవమునకు రాదు. ఏలనఁగా - దేని నుద్దేశించి బాణము విడువఁ బడునో, యది భావాతీతము, నిరంజనము. ఇట్టి యభ్యాసమే మహావ్రతము. అదే స్థిరసిద్ధాన్తము. శ్రీకృష్ణుఁడీ యభ్యాస మహా వ్రతము చేతనే సిద్ధి కలుగునని పార్థున కుపదేశించెను. ఇదే చరమాను ష్ఠానము. దీని తరువాత మఱెట్టి వ్రతములు అనుష్ఠాన ములు ఉండవు. అదే ముక్తి హేతువు.

(ఈ సాధనమందు దేశ జాత్యాయురాదుల విచారముండదు, గనుక యోగశాస్త్రము దీనిని "సార్వభౌమ మహావ్రత" మన్నది.)

అమ్మా ! ముక్తి హేతుభూతవును, అచింత్యమహావ్రత స్వరూపవును నీవే. నీ మఱియొక పేరు "విద్యా". "యయా తదక్షర మధిగమ్యతే సా విద్యా" దేనిచేత అక్షర - పరమాత్మ స్వరూపము పొందఁబడునో, యదే విద్య. సర్వకర్మములును, అనుష్ఠానములును గౌణభావముచేఁ బరమాత్మ నొందుటకైన హేతువులే. కావున వానిని అవిద్యా - విద్యయొక్క స్వల్ప ప్రకాశము లనిరి. కాని, యీ యభ్యాసమనెడి మహావ్రతము సాక్షాన్ముక్తి హేతువగుటచే నిది 'పరమాత్మికా విద్యా' యనఁబడును. ఓ దేవీ ! మాయమ్మా ! నీవే భగవతీ (భగవచ్ఛక్తి) స్వరూప పరమాత్మ విద్యారూపముతో నిన్ను వెలయించుకొని, జీవుని యజ్ఞానకల్పిత బంధనభయమునుఁ బూర్తిగాఁ దొలఁగింతువు - అమ్మా ! విద్యవు నీవే; అవిద్యవు నీవే; బంధనము నీవే; ముక్తివి నీవే; మఱి బంధనముక్తుల కతీతవు నీవే.

అమ్మా! ఇంకెన్నాళ్ల కీ దీనసంతానము హృదయము నందు, ఈ భగవతీ విద్యాస్వరూపముతో నావిర్భవించి యజ్ఞానాంధకార మును దొలఁగింతువో! అమ్మా! ఇంకెన్నాళ్లకు నీవు విద్యామూర్తితో మమ్ము నీ యొడికిఁ దీసికొని నిరంతర జ్ఞానా మృతధారలను ద్రాగింతువో ! ఇంకను మేమెంతకాలము నీ యవిద్యామూర్తి యొడిలోఁ గూర్చుండియే, నిన్నుఁ గానక, విషయములవంకనే చూచుచుండుటో ! మేము నీ యవిద్యా మూర్తియొడిలోనే యున్నాము. మా యింద్రియములు సంయతములు కావు; కనుక నీయీ మహావ్రతస్వరూపమూర్తి మా కింతయు నాభాసింపకున్నది. అమ్మా ! ఇంకెన్నాళ్లకు మా జాలి పిలుపు నీ చెవులఁ దాకునో ? అమ్మా !

ఓం. శబ్దాత్మికా సువిమల ర్గ్యజుషాం నిధాన
ముద్గీథ రమ్యపదపాఠవతాం చ సామ్నామ్ ।
దేవీ త్రయీ భగవతీ భవ భావనాయ
వార్తా చ సర్వజగతాం పరమార్తిహంత్రీ ॥ ఓం. 9

అమ్మా ! నీవు శబ్దరూపవు. కనుక నీవే యత్యంత నిర్మల మైన ఋగ్యజుస్సులకును, ఉచ్చైఃస్వరముతో గానము చేయఁబడు రమణీయ పదపాఠముతోఁ గూడిన సామవేదము నకును నిధానమవు. ఈ సంసారస్థితికై నీవే భగవతీ త్రయీ మూర్తితో విరాజిల్లుదువు. మఱి వార్తా - అనఁగా జీవికా రూపముగాను నీవే సర్వజగత్తుల యార్తిని బోఁగొట్టుదువు. కనుక నీవు పరమవు. శ్రేష్ఠవు.

వ్యాఖ్య :- అమ్మా ! దేవతలు నిన్ను స్తుతించుటకు మున్ను, ముక్తి హేతుభూతమైన పరా విద్యా రూపముతో నిన్ను దర్శించిరి. ఇపుడు, ఆ పరావిద్యకు సాధనభూతమైన యపరావిద్యయు నీవే - అనఁగా ఋగాది వేదవిద్యారూపము తోను, నీవే వెలయుదువని ప్రకటించువారై ముందుగా "శబ్దాత్మికా" యనిరి. అమ్మా ! పరా పశ్యన్తీ మధ్యమా వైఖరీ రూపముతో నీవే ప్రతి జీవునియందు వెలయుచున్నావు. ప్రణవమే ఆదిమవాణి - అనఁగా మూలనాదము. విభిన్న దేశ కాల పాత్ర సంయోగముచే, ఆ యొక్క నాదమే విభిన్న రూపములతో వినఁబడుచున్నది. వేదములు ఆ ప్రణవము యొక్క విశేష విశేషములను వెల్లడించునవియే; జైమిని మహర్షియు - వేని యర్థబోధము సులభముగా నగునో, యట్టి పదవ్యవస్థగలది ఋక్ అనియు, సంగీతరూపముతో రమణీయ స్వరతాన సహితమై యుచ్చైఃస్వరముతో గానము చేయఁబడు దానిపేరు ఉద్గీథ సామమనియుఁ జెప్పి, ఇంక మిగిలినది - గానము గాని, పదవ్యవస్థగాని లేనివి - అనఁగాఁ దఱచుగా గద్యము వలెనే యుచ్చరింపఁబడునది యజుస్సనియు, వేదముల నిట్లు నిర్వచించెను. అమ్మా ! ఈ త్రయి నీ మూర్తియే. అధర్వణ వేదమును, శిక్షాకల్ప వ్యాకరణాదులు, వేదాంగములును, ఆ త్రయికి అంతర్గతములే. వేదము త్రిగుణాత్మకముగనుక దాని పేరు త్రయి. జ్ఞాన భక్తి కర్మములనెడి మూటిని వెల్లడించునది యగుటచే, అపరా విద్యను 'త్రయి' యనిరి. భగవంతుఁడును "త్రైగుణ్య విషయా వేదాః" అనెను. ఉపనిషద్ - అనఁగా వేదాన్తములందు, గుణాతీత స్వరూపము నుపదేశమున్నను, అవి 'త్రయి' యం దంతర్గతములే.

ఏలన బ్రహ్మవిద్యోపదేశము, ఆత్మమహత్త్వ వర్ణనము, ఆత్మస్వరూప నిర్ణయము నుండు నంత కవి, యా నిర్గుణమున కంతర్గతములే.

అది యుండనీ - "భవ భావనాయ" అనఁగా లోకస్థితి కొఱకే, అమ్మా ! నీ యీ త్రయీమూర్తి వికాసము. జీవులు, ఉన్మార్గగాములు కాకుండుటకే, కట్టుబాటు లేక ప్రవర్తించి, హద్దు మీఱకుండుటకే నీవు శాస్త్రోపదేశ రూపముననను, వేదవిధి రూపముననను త్రయీమూర్తితో విరాజిల్లుదువు. అమ్మా ! నీ మహిమ మచింతనీయము. నీ యీ త్రయీమూర్తియు భగవతియే. అనంతైశ్వర్యమయి. కేవల శాస్త్రోపదేశరూపముతో, సర్వబ్రహ్మాండముల గతిని నియమింపఁగల యీశ్వరశక్తిని భగవతి యనక మఱేమనవలయును ?

మఱి, యాధ్యాత్మికదృష్టితోఁ జూతము - ఏదేనొక మంత్రము (శబ్దము) సహాయముతో, ఆత్మానుభూతి నొందు చున్నంతదాఁక దానిపేరు ఋక్కు. శ్రుతియు "వాగేవ ఋక్" అన్నది క్రమముగా నా యనుభూతి కొంత విశేషభావముతోఁ బ్రకాశించునపుడు, సర్వశరీరవ్యాపియైన యొక యానందమయ బోధము రేగి సాగుచుండును. అపుడు, ఆ ఋక్కేయజూరూపమునఁ బరిణమించును. ఆ యవస్థయందు మఱి మంత్రాదికము ఛందోబద్ధముగా నుచ్చరించుట కాదు. అనఁగా ఛందస్సు మున్నగు వానియెడ విశేషలక్ష్య ముండదు; స్వరహీనములు తానహీనములు నగు నేవో శబ్దము లుచ్చరింపఁబడుచుండును. ఆ యవస్థపేరు యజుస్సు. క్రమముగా భావరాజ్యమం దధికారము గలుగును.

ఉచ్ఛ్వాసము తగ్గిపోవును. ప్రశాంతభావముతో ననుభూతి వెలయు చుండును. అపుడు మెల్లగా శాంతముగా స్వరతాన సహాయముతో శబ్దము లుచ్చరింపఁబడును, దీని పేరే సామము. ఒక్కింత ధీరముగా లక్షింపఁబడినపుడు, ప్రతిదినము చేయు నుపాసన యందును నిట్టి త్రయీమూర్తి వికాసము కానఁబడును. కీర్తనాదిక మందును బలుతావుల నీ త్రయీమూర్తి వికాసము కానఁబడును. కేవల కీర్తనమనుటేల ? సర్వదేశములందును, సర్వ సంప్రదాయ ముల యుపాసనమందును నాదమయ మహాశక్తి యొక్క యీత్రయీమూర్తివికాసము చక్షుష్మంతులైనవారికి (దివ్యదృష్టి వికాసము గలవారికి) దెలియఁబడుచుండును.

ఋగ్యజుస్సామము లను నివి వేదములు. వేదము - అనుభూతి పేరే వేదము. లోపల నైన యాత్మానుభూతి శబ్దాకార మున వెలిని వెలయునపుడే దానిని వేదమందురు. అది సత్య స్వరూపాత్మ సంవేదనముతో వచ్చునపుడు దాని పేరే వేదము. అది కొందఱు మనుష్యుల మస్తిష్కధర్మమువలనఁ బుట్టిన కొన్ని శబ్దముల విన్యాసముకాదు. ఈ సత్యానుభూతులు, భ్రాంతిలేని వేదనమువలన నావిర్భవించినవి. కనుకనే వేదముల పౌరుషేయము లనిరి. ఇది కొలఁదియో గొప్పయో సర్వదేశములందు నున్నది.

అమ్మా ! త్రయీమూర్తితోనే - శాస్త్ర విధాన రూపముతోనే, జ్ఞాన విజ్ఞాన రూపముతోనే, యీ సంసార విధానము నిల్పుచున్నావా ? - అది కాదు, సరికదా, వార్తా రూపముతోను జగత్తుల యార్తిని - సర్వ దుఃఖములను దొలఁగించుచున్నావు. వార్తా జీవికా (బ్రతుకు

నుపాయము - అనఁగా స్థూలదేహ రక్షణమున కగు వెరవు) రూపముతో, ఆహార రూపముతో సర్వదేశములందును సర్వజీవుల యందును సర్వకాలములందును నీవు వెలయుచున్నావు. అమ్మా ! నీవే మా వార్తవు, నీవే మా జీవికవనెడి సత్యజ్ఞానమునుండి జాఱిపోయిన కారణముననే, మాకీ బ్రతుకు గడవని సంకట కాలము వచ్చి పడినది. భారతదేశవాసులు, బ్రతు కెట్లు నెఱవేఱుననెడి చింతతో వ్యాకులం పడుచున్నారు. అమ్మా ! తమ జీవికారూపముతోను నీ యవ్యయమూర్తిని దర్శించు వారికి, ఎన్నఁడును జీవికాకష్టము (లేమి) కలుగదు. ఈ మాట యీ దేశవాసులు మర్మమర్మములం దెపు డనుభవింతురో ! ఈ దేశవాసులు జీవికకై కల్లలాడుట, మోసగించుట, లంచములు మేయుట, పరుల పాదములు ముద్దాడుట మున్నగు నీచకర్మములు మాని, జీవికారూపిణివైన నిన్ను అమ్మగా నెఱిఁగి యెపుడాదరింతురో ! అన్న చింత యెపుడు తొలఁగునో !

మహాభారతమందు వార్తాపదమున కర్థము మఱియొక విధముగాఁ గానవచ్చుచున్నది. ఒకనాఁడు ధర్ముఁడు మాఱు వేషంతో వచ్చి, మహారాజ యుధిష్ఠిరునితో "వార్త యేమి ?" అని ప్రశ్నించెను. దానికి బదులుగా నతఁడు -

"మాసర్తు దర్వీ పరివర్తనేన
సూర్యాగ్నినా రాత్రి దివేంధనేన ।
తస్మిన్మహామోహమయే కటాహే
భూతాని కాలః పచతీతి వార్తా ॥

"మాసములు, ఋతువులు - అనఁగా - కాలమందుఁ గల్పింపఁబడిన పరిచ్ఛేదమనెడి - తెడ్డుత్రిప్పుచు, సూర్యుఁడనెడి యగ్ని సంయోగముచే, రేవగళ్ళనెడి కట్టెల సాయముతో, ఈ మహామోహమయ సంసారమనెడి బానలియందు, భూతములను కాలుఁడు స్వయముగా వండుచున్నాఁడు. ఇదే వార్త" యనెను. అమ్మా ! నీవు కాలరూపముతో నీ భూతములను సదా పాకము చేయుచున్నావు. జన్మ స్థితి లయములు - (జాయతే, అస్తి, వర్ధతే) మున్నగు షడ్భావవికారపరిణామముల యాకారమునఁ బ్రతిజీవుని యందు నీవే వార్తగా వెలయుచున్నావు. జీవిక (మనుగడ) యీ షడ్భావవికారములల్లో నిమిడియున్నదే. అమ్మా ! సదా వెలయు నీయీ వార్తామూర్తియెడ లక్ష్యముంచి భక్తితోఁ బూదోయిలి నర్పించు వారు, సదా పరివర్తనశీలమైన నీయీ మూర్తియెడ నెన్నఁడును ముగ్ధులు కారు. మఱి వారికి జీవికకైన యెట్టిచింతయు నుండదు. అపుడు నీవు స్వయముగా వారి యోగక్షేమములను వహించు స్నేహమయ మాతృమూర్తితోనే వెలయుచు వారిని నీ యొడి యందుంచుకొని కూరుచుందువు. అపుడు వారి దృష్టి ముఖ్యముగాఁ బరమస్నేహమయమైన నీ యీ యఖండసత్తపైనే తగిలి యుండును. కనుకఁ దప్పక కాఁదగిన పరివర్తనములెల్ల వారికి దెలియకయే వారిపై నుండి కడచిపోవును.

అమ్మా ! ధన్యము నీ నెయ్యము. మేము సంసారస్థితినే పరమ పురుషార్థముగాఁ దలంచుచుండునంతదాఁక, నీ యీ యవ్యయ స్వరూపమును గుప్తముగానే యుంచి, మాయెడ వార్తారూపముతోనే వెలయుదువు. అంతదాఁక మేమును జీవిక

కొఱకు విషయముల గుమ్మముకడఁ భిక్షుకులవలెఁ బడియుం దుము. మఱల నీ సంసారస్థితినే యథార్థముగాఁ గష్టకరమని తలంచినపుడు, వార్తారూపముగాసైతము నీవు తప్ప మఱేమి యుం గాదని యనుభవమునకు వచ్చును. అపుడే మా జీవికా విషయమైన చింత పూర్తిగాఁ దొలఁగిపోవును. అపుడు మఱల నీవే సర్వనాశినీ మూర్తితో నావిర్భవించి, మా సర్వభావములను నశింపఁజేసి, ఏకమును అద్వితీయము నైన మూర్తితో, ఆర్తిహరస్వరూపముతో వెలయుదువు. అమ్మా! అపుడే నీ 'పరమా' నామము సార్థకమగును. నీవు యథార్థముగా శ్రేష్ఠవే. నీవు నిజముగా సర్వశ్రేష్ఠులైన బ్రహ్మాదులకును దల్లివే యని యపుడే తెలియఁగలము. అమ్మా! నీవీ విధమైన యార్తిహంత్రీమూర్తితో నిలువనంతదాఁక, మేమెట్టి యుపాయముతోను ఆర్తిపట్టువలన విడివడఁజాలము. కనుక, అమ్మా! దీనులమై యడిగికొనుచున్నాము. ఒక్కసారి దుఃఖహంత్రీ మూర్తితో నీ బిడ్డల హృదయమందు ఆవిర్భవింపుము. దుఃఖముతో నుడికిపోవుచున్న యీ గుండెలు చల్లబడును. అమ్మా! నీవు తల్లివి; ఆర్తి హంత్రివి; పరమవు; నీవు పరమార్తిహంత్రివి. పరమదుఃఖ నాశినివి.

ఓం. మేధాసి దేవి విదితాఖిల శాస్త్రసారా
దుర్గాసి దుర్గ భవసాగర నౌరసంగా ।
శ్రీః కైటభారి హృదయైకకృతాధివాసా
గౌరీ త్వమేవ శశిమౌళి కృతప్రతిష్ఠా ॥ ఓం. 10

ఓ దేవీ ! సర్వశాస్త్రార్థములను ధరించు మేధవు నీవు. నీవు దుర్గవు; నీవే దుస్తర భవసాగరము దాటించు, అసంగ నౌకవు. కైటభారి (విష్ణుని) హృదయమందు నివసించు లక్ష్మివి. నీవే చంద్రశేఖరుని (శివుని) యంకమందు విహరించు గౌరివి.

వ్యాఖ్య :- నీవే వేదరూపిణివని చెప్పితిమి. ఇపుడు వేదార్థమును ధరించు ధీ - మేధగాను నీవే యనుచున్నాము. నీవే మేధారూపిణివై సర్వశాస్త్రార్థజ్ఞానమును ధరించియుంతువు. కనుక నేదోయొకనాఁడు మేము నిన్నుఁ దప్పక తెలియఁగల్గుదు. మని యాశ. మే మేమేమి నేర్చికొంటిమో, యింద్రియసహాయముతో నేమేమి గ్రహించితిమో, యది యంతయు నొక్కొక్క మృత్యువుతోనే. మఱచిపోవుచున్నచో మఱి యీమా బంధన మేనాఁటికిం దొలఁగదు కాని, అమ్మా ! నీవు మేధారూపమున, అమా బిందుబిందు జ్ఞానమును ధరించి యుంచుచున్నావు. కనుకఁ బ్రతిజన్మమందును మా జ్ఞానముకూడ నధికమగుచున్నది. ఒక జీవనమందు మేము కూడఁబెట్టుకొన్న జ్ఞానమునే మఱల రాఁబోవుజన్మమందుఁ గూడఁబెట్టుకొను నక్కఱ యుండదు. ఏ శక్తి ప్రభావముచే మా పలుపుట్టువులం దార్జించిన జ్ఞానము ప్రోగగుచున్నదో అదే మేధ.

ఈ మేధవల్ల నగు చరమావస్థ - మేధాశ్రేష్ఠ స్వరూపమే - "అహం బ్రహ్మాస్మి" 'నేను బ్రహ్మమను' అనెడి స్మృతియే. ఆచార్యశంకరులును "బ్రహ్మాహమస్మీతి స్మృతిరేవ మేధా" యనిరి. ఏనాఁడు నీ వీ మేధాస్వరూపముతో మా హృదయము నందు వికసింతువో, యపుడు మేము "నేను బ్రహ్మమను" అనెడి స్మృతి గలిగి, జీవత్వమనెడి దృఢబంధనమును ద్రెంచి, పాఱవైచి,

యాత్మస్వరూపమందుఁ బ్రతిష్ఠితుల మగుదుము. నీవు మేధా రూపముతో నిన్ను వెలయించుకొనునప్పుడే, మేము నిన్నెఱుంగఁ గలము; మమ్ము మేమెఱుంగఁగలము. ఇదే యఖిల శాస్త్ర సారము. శాస్త్రసార మర్మము. ఆత్మస్వరూపజ్ఞానమే. "నేనెవరు ?" అనుదాని నెఱుంగఁగల్గునపుడే, సర్వశాస్త్రముల యావశ్యకత తొలఁగిపోవును. అమ్మా! అదే నీ "విదితా" స్వరూపము - జీవుఁడు తన స్వరూపము నెఱుంగఁగల్గునపుడే, నీవు 'విదితా' మూర్తితో నావిర్భవింతువు. నీ యీ విదితా స్వరూపము లక్ష్యము చేసియే సర్వశాస్త్రార్థ రహస్యములు వ్యాఖ్యానింపఁబడినవి. ఆపాతదృష్టిచే (పయి పయి చూపుచే) శాస్త్రవాక్యములం దొండొంటికి విరోధము ప్రతీతమగును. గాని, అమ్మా! నీవు విదితాస్వరూపముతో జీవుని హృదయమందు వెలయునపుడు, మఱి శాస్త్రవాక్యములకుఁ బరస్పర విరోధ మింతయు నుండదు. ఆ యొక్క విషయమునే సర్వశాస్త్రములు ప్రతిధ్వనించుచున్నవని స్పష్టముగాఁ దెలియవచ్చును.

మహాభారతమందు - "వేదా విభిన్నాః స్మృతయో విభిన్నా। నాసౌ మునిర్యస్య మతం న భిన్నమ్ । ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం । మహాజనో యేన గతః సపంథాః ॥" అని చెప్పఁబడి యున్న యీ శ్లోకము, శాస్త్రభేద మత భేద పక్షమునఁ బరిపోషక ప్రమాణముగాఁ జేకొనఁబడుచున్నను, దానిని మేమర్థము చేసికొన్న విధము నిచట వ్రాయుట అప్రాసంగికము కాదు. ఈ శ్లోకపు రెండవపాదము మొదటనున్న 'న' అను దానిని మొదటి పాదముతో నమన్వయించుకొన్నచో, దానికి మఱియొక యర్థమగును. ఎటులనఁగా - "వేదములు విభిన్నములు కావు; స్మృతులు

విభిన్నములు కావు; అనఁగా నన్నియు నొక్కయర్థమును లక్షించి యభివ్యక్తములైనవే. ఎవ్వరి మతములు విభిన్నములు కావో, వారే యథార్థమైన మునులు." "మంతారో వేదతత్త్వార్థం గంతారో మునయః" అనఁగా భేదధర్మలు కానివారే మునిపదవాచ్యులు. ధర్మము యొక్క తత్త్వము గుహయందు - హృదయమం దుంచఁ బడినది. (ఉపనిషత్తులయందుఁ బలుతావుల గుహాశబ్దముచే హృదయమే లక్షింపఁబడుట యెల్లరు నెఱుఁగుదురు.) మహాజనులు - సాధుమహాపురుషులు, ఏ దారిని బోయిరో, ఏ హృదయగుహా మార్గమునఁ బోయి యాత్మజ్ఞానము నొందిరో "సపంథాః" అదియే యథార్గమార్గము. ఈ మార్గమునఁ బోఁగల్గినపుడే ధర్మతత్త్వము తెలియును.

అది యుండనీ; దేవత లింకేమనిరి ? నీ యా 'విదితా' స్వరూపమే సర్వశాస్త్రసారము. నిన్నెఱుంగుటకే సర్వశాస్త్రములు నవతరించినవి. కాని, అమ్మా! నీవు దయచేసి స్వయముగా 'విదితా' రూపముతో వెలయనంతదాఁక, నెట్టి శాస్త్రమును నిన్నుఁ దెలియఁజెప్పఁజాలదు. మఱి నీవు 'విదితా' యైనపుడు, బియ్యము కావలసినవానికి, ఊఁకతోఁ బ్రయోజనము లేనటులు, సాధకునకు శాస్త్రముల యక్కఱయే యుండదు. అమ్మా ! నీవా 'విదితా' స్వరూపముతో, బోధ స్వరూపముతోనే, సర్వదా ప్రకాశమాన వగుచున్నను, నెవ్వఁడును నిన్ను వేగముగా వెంటనే తెలిసికొనఁ జాలఁడు. కనుకనే నీవు దుర్గవు - దుర్జ్ఞేయవు. దురధిగమ్యవు.

మఱియొకవైపు చూచిన - నీవు మేధారూపముతో మా యనేక జన్మసంచిత జ్ఞానరాశిని ధరించి యుంచఁగల్గుట చేతనే, యీ దుస్తర భవసాగరమందు నీవే తరణి (నావ) వగు చున్నావు. జీవులు మేధ యనెడి పడవనెక్కి "బ్రహ్మాహమస్మి" యని తెలిసికొని (అనుకొంచు) ననాయాసముగా నీ దుర్గమ భవసాగర పారముం జేరుకొందురు. పార్థివములైన (పృథివియందు నిర్మింపఁబడు) పడవలకుఁ గర్ణధారుఁడు (చుక్కాణి పట్టి నడుపువాఁడు) తప్ప కుండవలయును. కర్ణధారుఁడు లేకున్న నీ జాగతికములైన పడవలు పోఁజాలవు. గాని, అమ్మా ! నీవు మా 'అసంగతరణిని'; వేఱొకరి సాయమక్కఱలేదు. నావవు నీవే; నావ నడుపుదానవు నీవే; మేధారూపిణివి, మా యమ్మవు, నిజముగా నీవు అసంగవు, సంగరహితవు; నిర్లిప్తవు; నీవు మా బిందు బిందు జ్ఞానరాశిని మేధారూపమున ధరించియుంచినను, మఱి యీ పరిచ్ఛిన్న మలిన జ్ఞానరాశి ననాదికాలమునుండియు ధరించి యుంచినను, మంచి చెడ్డ సంస్కారములెల్ల మేధారూపిణివైన నీ యంగ మందు అంటుకొనియున్నను, వాని సంస్పర్శమున నీవు పరిచ్ఛిన్నవును మలినవును గావు. మా యమ్మవు నీవు, నిత్య బుద్ధ ముక్త స్వరూపవుగా నెటులుంటివో యటులే యుందువు. ఇన్ని బహుభావములను గుండెపైఁ దాల్చియు నిన్ను బహుత్వ లేప మింతయు నంటదు. కావుననే దేవతలు నిన్ను "దుర్గ భవ సాగర నౌ రసంగా" యని స్తుతించిరి.

అమ్మా ! నీవు కైటభారి (బహుత్వవినాశకారి) విష్ణుని హృదయమందు విహరించు శ్రీ వి. మఱియు శశిమౌళి - చంద్ర

శేఖరుఁడైన - మహేశ్వరుని యర్ధాంగమవైన గౌరివి. విష్ణుత్వమును శివత్వమును నీ విభిన్న ప్రకాశములే, కావున, ఒక వైపు నీవు హరిహరాదులను గన్న దానవయ్యు, నొకవైపు వైష్ణవీ శివానీ రూపములతో నీవే వెలయుచున్నావు. ఈ జగద్భావము, ఈ బహుత్వము, ఈ మా జీవత్వము ననెడి వీని నే శక్తి, యే మేధ ధరించియుంచుచున్నదో యదియే వైష్ణవీ శక్తి శ్రీ. మఱియు నీ శక్తియే, ఈ మేధయే, 'అసంగా' రూపముతోఁ దాను వెలయునపుడు - మఱి యట్టి భావములను ధరించు రూపముతో వెలయనపుడే, సర్వభావములను సంహరించు రూపముతోఁ బరిచితయగును గనుకనే, అమ్మా! నీ 'మేధా, విదితా' స్వరూపములే మాయెదుట "శ్రీ, గౌరీ" రూపములతోఁ బ్రకటములగును.

ఓం. ఈషత్సహాస మమలం పరిపూర్ణచంద్ర
బింబానుకారి కనకోత్తమ కాంతికాంతమ్ ।
అత్యద్భుతం ప్రహృతమాత్తరుషా తథాపి
వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ ॥ ఓం. 11

అమ్మా! చిర్నగవుతోఁ గూడినట్టియు, నిర్మల పూర్ణ చంద్రునిఁ బోలినట్టియు, మేలిమి బంగారువన్నెచే మనోహరమైనట్టియు, నీ మొగమును జూచియు మహిషాసురుఁడు కోపవశుఁడై నిన్నుఁ బ్రహరించెనఁట. ఎంతో వింత.

వ్యాఖ్య :- ఏమె శ్రీముఖమండలకాంతిచే ముల్లోకములును ముగ్ధములగునో, యామె లోకాతీతసౌందర్యము ప్రత్యక్షమైనను,

రజోగుణముయొక్క బహిర్ముఖ చాంచల్యము మిగుల నకించిత్కర మైన రూపరసాదికమును బరిగ్రహించు వాసన మిగిలియుండుటను నదే గొప్ప వింత. అమ్మా! "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః" దేని నొందినపై మఱి యెట్టి వస్తువు నొందుటకును నిచ్చ పొడమదో, దానిని బ్రత్యక్షము చేసికొని చిత్తము మళ్లి, యేవిధముగా విషయలోలుపమగునో యది సరిగా విచారమున కందకున్న, వాస్తముగ నిది కడు వింతకదా!

అమ్మా! జాగతికమైన చక్కఁదనమంతయు నొక్క చోటఁ జేరినను నీ యా లోకాతీత సౌందర్యసింధువునందలి బిందువున కైనను సాటికాదు. అయినను మేము దానివైపు చూడక జాగతిక దుఃఖములతోఁ గూడిన విషయముల చక్కఁ దనముచేతనే యా కర్షింపఁబడుచున్నారము. నీయా యలౌకిక శోభమాటయే మఱచితిమి. క్షణస్థాయియు, అకించిత్కరమునైన సౌందర్యము ననుభవించు లాలస, నీ యుత్కృష్టశోభను గప్పి వేసినది. ఇంతకంటె నధికాశ్చర్యవిషయ మేమున్నదమ్మా!

సాధకా! ఆత్మస్వరూప మపుడపుడు, అనుభవయోగ్యమైనను రజఃక్రియాశీలత రవ్వంతయు నణఁగకున్నది. కావున మాటిమాటికి నా సాటిలేని శోభామయ పరమాత్మ స్వరూపమును గప్పివుచ్చి విషయచాంచల్యమే చెలరేగుచున్నది. ఇదే, అమ్మవారి సాటిలేని చక్కఁదనమును జూచియు, మహిషాసురుఁడు, అమ్మపై నస్త్రప్రహారము చేయుట. కదలుచున్న నీట నగు చంద్రప్రతి బింబము స్పష్టముగాఁ గానరానట్టులే, వాయు వేగమున నడుచు

నీలిమబ్బులచాటునఁ బడిన సూర్య బింబము స్పష్టముగాఁ గానరానటులే, రజోగుణ చాంచల్యముచే నగు చిత్తచాంచల్యము, అమ్మయొక్క యీ సాటిలేని చక్కఁదనము ననుభవించువేళ విఘ్నస్వరూపమగుచున్నది. ఈ విఘ్నముపేరే మహిషాసురుని ప్రహారము.

అమ్మా ! ఏ విషయ సౌందర్యము నెడ ముగ్ధులమై మేము నీ లోకాతీత సౌందర్యము నుపేక్షించుచున్నామో, ఆ విషయశోభ గాను నిత్యము నీవే వెలయుదువనెడి మాట, మేమెన్నాళ్ళకు మర్మ మర్మములందు ననుభవింపఁగల్గుదుము ? అమ్మా ! ఈ జగత్తు నందలి సర్వమును నీ సౌందర్యముచేతనే కప్పఁబడినది. నీ రూపమే ప్రత్యేకపదార్థముయొక్క ప్రత్యవయవమందును వెలయుచున్న దనెడి సత్యజ్ఞానముతో, ఈ సరళానుభవము మామనస్సున నిండిపోకు న్నంతదాఁక, అమ్మా ! యథార్థముగా, నీ యీ సాటిలేని చక్కఁదనపు జాడఁ గానఁ గలమా ?

ఓం. దృష్ట్వా తు దేవి కుపితం భ్రుకుటీకరాళ
ముద్యచ్ఛశాంక సదృశచ్ఛవి య న్నసద్యః ।
ప్రాణాన్ముమోచ మహిష స్తదతీవ చిత్రం
కైర్జీవ్యతే హి కుపితాంతకదర్శనేన ॥ ఓం. 12

ఓ దేవీ ! కోపించినట్టియు, బొమముడిచే భయంకర మయ్యు ఉదయచంద్రునిఁబోలిన కాంతి గలట్టియు, నీ ముఖమండలమును జూచి, యీ మహిషాసురుఁడు వెంటనే ప్రాణములను విడువకుండుట వింతయే. కోపించిన యమరాజును జూచియెవఁడు బ్రతికియుండఁగలఁడు ?

వ్యాఖ్య :- అమ్మా ! బొమముడితోఁ గోపించి యెఱ్ఱనైన నీ ముఖచ్ఛవిని జూచియు మహిషాసురుఁడు చావకుండుటే వింత. నీ కోపము వెల్లడియగునపుడు - నీవు ప్రలయంకరీ మూర్తితో నిల్చినపుడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వఱకుఁ గనఁబడరు. అపుడీ మహిషాసురుఁ డతితుచ్ఛుఁడు; వీఁడెంత ? అమ్మా ! దేవతలు నీ భ్రుకుటీక రాళముఖమండలమును వర్ణించునపుడు - "ఉద్యచ్ఛశాంక సదృశచ్ఛవి" యనిరి. పూర్ణ చంద్రుఁడుదయించునపుడు చీకటి యదృశ్యమైపోవునటులే. నీ ప్రలయకరాళముఖచ్ఛవిని గాంచి యజ్ఞానాంధకారమును, ద్వైతభావమును బొత్తిగా లయించిపోవును. ఇది యబాధిత నియమము. కాని, మేమీ క్షేత్రమును గూర్చి వానికి విపరీతముగాఁ దలంచుచున్నాము. మహిషాసురుఁడు నీ కరాళముఖచ్ఛవిని గాంచియు బ్రతికి నీతో యుద్ధముచేసి, సింహము, ఏనుఁగు అర్ధనిష్క్రాన్త పురుషుఁడు (సగము వెలికివచ్చిన పురుషుఁడు) మున్నగు రూపములతో నిన్నాక్రమింపఁజూచెను. ఇది మిగుల వింత, ఎందుచేత నిటులయ్యెను ?

అమ్మా ! నీవు అంబికామూర్తితోఁ గోపము చూపితివి. "కోపం చక్రే తతోఽంబికా" అంబికామూర్తి - మాతృమూర్తి. అమ్మ భ్రుకుటీభీషణముఖము సంతానమును బెదరింపఁగలదు. గాని వినష్టము చేయఁజాలదు. అది చూచి వారు పాఱిపోరు. అమ్మా ! నీవు మధుపానము చేయుటకై యని, మహిషాసురుఁడు గర్జించుటకవకాశమిచ్చితివి. కనుక వాఁడు వెంటనే చావలేదు. యుద్ధము చేసి చచ్చెను. అమ్మా ! మేము దేనిని గేవల మసంభవమనుకొందుమో, అది యఘటనఘటనపటీయసివైన నీయిచ్ఛచే

సులభముగా సంఘటితమై పోవుచుండును. ఇది మేము కొంచెము విచారించినపుడు ప్రతిదిన జీవనమందే కానవచ్చును. అయినను నీ సర్వశక్తిమత్తను, నీ సర్వమయాఖండకర్తృత్వమును బూర్తిగా విశ్వసించి, ఆత్మసమర్పణము చేయఁజాలకున్నాము. అహం కర్తృత్వముచే నైన మిథ్యాభిమానమును నీ చరణములందర్పించి చింతాభారమును దించుకొనలేకున్నాము. ఇదే మా దుర్భాగ్యము.

అమ్మా! మహిషాసురవధకార్యమందు నీ యీ స్వాభావిక నియమముకంటె నన్యథా చూచి, దేవతలు "కైర్జీవ్యతే హి కుపితాంతకదర్శనేన" "కోపించిన యమరాజును జూచియు నెవఁడు జీవించియుండఁగలఁడు ?" అనిరి. అమ్మా ! నిజముగాఁ గుపితయముని దృష్టిని బడినవాఁ డెవ్వఁడును బ్రతుకఁజాలఁడు; గాని కోపించిన యమ్మను జూచిన సంతానము బ్రతుకదా ? నీవే యంతకారిణీరూపముతో వెలయనంతదాఁక, నీ భ్రుకుటీ కరాళకుపితముఖమండలమునుండి సైతము మాతృత్వగౌరవము తోను స్నేహముతోను నిండిన కరుణదృష్టియే పరఁగుచుండును. ఉదయచంద్రుని బోలు ముఖకాంతియే వికసించుచుండును; కావుననే మహిషాసురుఁడు వెంటనే మృత్యువుపాలుగాక యుద్ధముచేసి నీకు మధుపానసుయోగమును గూర్చెను. అమ్మా! నీ యనిర్వచనీయలీల ధన్యము. నీవు మానోర, అమ్మా ! యను మాట వినఁగోరినపుడెల్ల, విని నిజముగా నీ హృదయము మాతృత్వ గౌరవముతో నుబ్బిపోవుచుండును. అపుడు మా దుఃఖ దీనహృద

యములుకూడఁ బుత్త్రత్వగౌరవముతో నుబ్బిపోవు చుండును. అమ్మా! మే మీ గౌరవము ననుభవించు భాగ్యము నిమ్ము.

ఓం. దేవి ప్రసీద పరమా భవతీ భవాయ
సద్యో వినాశయసి కోపవతీ కులాని ।
విజ్ఞాత మేతదధునైవ యదస్త మేత
న్నీతం బలం సువిపులం మహిషాసురస్య ॥ ఓం. 13

దేవీ ! ప్రసన్నవగుము. నీవు శ్రేష్ఠవు. పూజనీయవు. నీ ప్రసన్నతనుబట్టియే మా శుభము లుండును. నీవు కోపింతువేని, కులవినాశమే యగును. మహిషాసురుని యీ విపుల సేనలన్నియు నొక్కసారి విధ్వంసమొందుటచేతనే యీ మాట మాకుఁ దెలిసినది.

వ్యాఖ్య :- అమ్మా! నీవు పరమవు - శ్రేషవు. నీవు పరునకును - పరమేశ్వరునకును దల్లివి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను పరమేశ్వరు లందురు. వారును నీవల్లనే కలిగిరి. నీయందే యున్నారు. కావుననే నీవు పరమవు. నీవు ప్రసన్నవగునపుడే మేము మంగలముల నొందఁగల్గుదుము. అంతేకాదు, నీ ప్రసన్నతయు నీ క్రోధము రెండును జీవులకుఁ బరమహితకరములు. నీవు ప్రసన్నవగుటచే జీవులు లౌకిక పారలౌకికములైన సర్వవిధమంగళ ముల నొందుదురు. నీవు కోపింతువేని జీవుల కులములే వినాశ మొందును. ఇదియును జీవపక్షమునఁ బరమమంగళమే. కులము నశింపక. అకులముజాడ నెఱుంగ లేఁడు. అమ్మా ! ఎన్ని జన్మ జన్మాంతరములనుండియో కుల కులము లందు విచరించి రూపరసాది విషయములను భోగించియే యీ జీవుఁడు, జీవన వ్యతీతుఁ

డగును; మే మేవిధముగాను గులమును విడువలే కున్నాము. ఒక కులమును విడుచుచున్నాము. మఱియొక కులమును బట్టుకొను చున్నాము. ఒకనాఁడా ? రెన్నాళ్లా ? ఏ యనాదికాలమునుండి కులమందు విచరించు టారంభమైనదో యెఱుంగము. అదెవరు చెప్పఁగలరు ? అమ్మా ! నీవు కోపించినచో, ఆ మా కులము ధ్వంసమైపోవును. అపుడు మేము, అకుల సముద్రమం దవగాహనము చేసి, మా మ్మకులమందుఁ జేర్చివేయుదుము. ఈ దుఃఖమిలితమైన పరిచ్ఛిన్నసుఖము చేతినుండి యెన్నటికిం దప్పుకొందుము. మా కులవిచరణము మఱి కాదు. కనుకనే, అమ్మా ! నీ ప్రసన్నతయుఁ గ్రోధమును మాకు మంగళ కరములే.

అమ్మా ! నీ ప్రసన్నతనే కోరువారును, నీ నగుమోము సిరినే చూడఁగోరువారును, ఇంకను దల్లి యసలురూపమును గుర్తించినట్లు తోఁచదు. నీవు అమ్మవు. మేము నీ బిడ్డలము, అని తలంచువారు. నీ భ్రుకుటీ కరాళ కుటిలముఖ శోభను జూచియు రవ్వంత భయపడరు. అమ్మ సంతానము =, అమ్మ కోపమందును అమ్మ ప్రసన్నతయందును నొక్క తీరుగానే, అమ్మ నెయ్యమునే దర్శించుచుండును. అమ్మ నెయ్యమునెడ ముగ్ధులైనవారు, సాంసారికమైన లెక్కలేని విఘ్నములందును అమంగళములందును రవ్వంతయు నమంగళ చిహ్నమును గానరు. కనుక వారు భయమెఱుఁగనివారివలె నగ్న శిశువులవలె, నీ ప్రలయంకర మూర్తియెదుర నిల్చి, గొంతెత్తి, అమ్మా ! అమ్మా ! యనుచునే నీ యొడిలో దూకి కూర్చుందురు.

ఇఁక, నిన్ను విడిచి, మాకు మఱియొక ప్రాపున్నదను కొను వారు, నీ కోపమయమూర్తిని గాంచి యడలిపోయి, నిన్ను విడిచిపెట్టి వేఱొక్క యాశ్రయమువైపు సాగుదురు. కాని నీవొక్క తెవే సర్వమున కాశ్రయమని తెలిసికొన్నప్పుడు, జనన మరణములు, హాస రోదనములు, సుఖ దుఃఖములు, కోప ప్రసన్నతలు మున్నగు సర్వావస్థలందును, నీ వొక్కతవే మా యేకాంతాశ్రయమని బోధపడినప్పుడు, మఱి నీ క్రోధమయమూర్తిని గాంచి, శంకతోను భయముతోను వెనుకకుఁ దగ్గిపోవువా రెవరమ్మా! నీవు కోపింతువేని, యనేక కర్మ ఫలములు మేము భోగించుటగును. రోగము, శోకము, అవమానము, అత్యాచారము, అభావము, ఉపద్రవము నాలుగు వైపుల ముట్టడించినను, వానియందు నీ స్నేహ కరుణామయ ముఖమే తలంపునకు వచ్చుచుండును. అపుడు, ఓ చండీ ! ఒక్క గడియలో మా దుర్భాగ్యము దూరమైపోవును. మమ్ము మేము సౌభాగ్యవంతులనుగా నెంచుకొని ధన్యులమగుదుము.

అమ్మా ! నీ వీ విధమైన కుపితమూర్తితోఁ బ్రతిజీవుని హృదయమందు నావిర్భవించి, మహిషాసురుని విశాలవాహినిని వినాశమొనర్పుము. ఇంద్రియగ్రాహ్యములై తుచ్ఛమైన రూప రసాది విషయములనెడి కులముయొక్క మూలముఁ బెల్లగించి వేయుము. మేము విషయములనెడి కులమును విడిచి, ఓ యకుల తరణీ ! మా యమ్మా ! రమ్ము; నీ స్నేహమయాఁకమందుఁ జనపున నెగిరి దూకి కూర్చుందుము. నీ వొకనాఁడు, యమునా నది యొడ్డున కదంబవృక్షచ్ఛాయను నిల్చి, మోహనమురళీ ధ్వనితో

గోపికలకులమును విడఁదీసి నీవంక కాకర్షించుకొని కృష్ణనామ మును సార్థము చేసితివి. మఱియొకసారి యటులే, యీ యుగసంధి యొక్క మహాక్షణమందు స్వస్వరూపముతో నావిర్భవించి, నీ యా మధుమయ సత్యమహాకర్షణ ధ్వనితో మా యజ్ఞానమును విడఁ గొట్టుము. కులమును విడిపింపుము. మేమును అకులమందుఁ దేలియాడుదుము. అమ్మా ! ఎన్నాళ్ల నుండియో కులమందే యుండి పలు కెరటముల దెబ్బలు తిని యోర్చికొంటిమి. ఆ దెబ్బలతో గుండె గూడు విడిపోయినది. మర్మములు పట్టుతప్పినవి. అమ్మా ! మఱి యోర్వలేము. ఇపుడింకొక్క యడుగైనను వేయఁజాలని నీ సంతానమునకు ఒక్కసారి నీ యకులస్నేహమయవక్షమందుఁ జోటిమ్ము.

ఓం. తే సమ్మతా జనపదేషు ధనాని తేషాం
తేషాం యశాంసి న చ సీదతి ధర్మవర్గః ।
ధన్యా స్తఏవ నిభృతాత్మజ భృత్యదారాః
యేషాం సదాభ్యుదయదా భవతీ ప్రసన్నా ॥ ఓం. 14

అమ్మా ! నీవు ప్రసన్నవై యభ్యుదయ మిచ్చువారికి జనపదములం దాదరము కలుగును. వారి ధనము, యశస్సు, ధర్మము చెడవు. వారి పుత్త్ర దార భృత్యు లడఁకువతో మెలఁగుదురు. కనుకనే వారు ధన్యులు.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు ప్రసన్నమూర్తితో నెవ్వరి నోడిని దాల్తువో, ఎవ్వరు నిన్ను నిత్యతృప్తగాను, నిత్యప్రసన్న జననిగాను నెంతురో, వారే యీ లోకమున దేవోచిత సమ్మానము నొందుదురు.

వారీ జాగతికములైన సుఖసమృద్ధి భోగైశ్వర్య సమ్మానయశస్సులను లెక్కింపకున్నను, అమ్మా ! వారి యెడల నీ విట్టి యభ్యుదయ దాయినీ మూర్తితోనే యావిర్భవించుచుందువు. సర్వమందు నిన్నుఁ జూచు నలవాటు లేనివారు, పార్థివాభ్యుదయరూపఁగానే నిన్ను గౌరవింతురు. దీనిని నమ్మకమన్నింపనివారు, గొడవల యందుఁబడి నీ క్రోధమయమూర్తినే కాంతురు. నీ సౌమ్యప్రసన్న మూర్తి యెట్టిదో వారెఱుంగఁ జాలరు. కనుకనే పార్థివాభ్యుదయము నొందియు, వారు యథార్థసుఖవంతులు కాఁజాలరు.

మఱి సుఖదుఃఖములందును, అభ్యుదయాధఃపతనము లందును, సర్వావస్థలందును, "మే మమ్మయొడియందే యున్నా" మని యనుభవింపఁగల్గువారి ధర్మార్థ కామ మోక్ష చతుర్వర్గ మేనాఁడును దుర్బలముకాదు. వారీ జగత్తునందుండియే యథా క్రమముగా నా చతుర్వర్గఫలము నొందుదురు. అమ్మా ! నీ ధర్మ మయమూర్తిని సేవింపక, అర్థకామములనుమాత్రము సేవించువారే దుఃఖతాపములచే మాటిమాటికిఁ బీకిపోవుచుందురు. అమ్మా ! చూడు - నీ గొప్ప తోడుగల మానవసంతానమందెంతయో యిక్కాల మున ధర్మహీనమై, యర్థకామముల సేవయే చేయుచు నెట్టి శోచనీయ దుర్దశను జేరుకొన్నదో ! నాలుగువైపుల లేమిచిచ్చు రేఁగి మండుచున్నది. దుర్భిక్షము, మహామారి, అకాలమరణము, రోగము, శోకము మున్నగు వానిచే నీ జగత్తునందు శాన్తి - అనందమనెడి పేర నొక వస్తువు కలదన్నమాటయే మఱచిపోవ నంతగాఁ బీడిత మగుచున్నది. త్రివిధ దుఃఖములచే జర్జరీభూతమై యానందమయజగత్తును దుఃఖమయమని ఘోషించుచున్నది.

అమ్మా! నీవు వారితో - "ఓ ప్రియసంతానమా! ధర్మమును విడిచినచో సుఖము లభింపదని మర్మమర్మములందు నాటునటులు చెప్పివేయుము. ఈ జగత్తు ఆనందఘనమని తెలుపుటకే, ఆ యానందము ననుభవించుటకే, అన్నిటికంటెఁ దొల్త ధర్మమునే సేవింపవలయును. జీవుఁ డెంతగా ధర్మపరాయణుఁ డగునో, యంతగాఁ జిత్తమందుఁ బ్రసన్నత కల్గును. చిత్తము ప్రసన్నమయ్యెనేని, అభావబోధము (లేమి యనెడి జ్ఞానము) తొలఁగిపోవును. లేమి (యనెడిది) తోఁచకపోఁగానే, అర్థాభావమే యుండదు. ధర్మానుమోదితములైన కామనలు, నిర్విఘ్నముగా సిద్ధించును: కామనలు పూర్ణమగుటచేతనే జీవుఁడు నిష్కాముఁ డగును. అపుడు మోక్షరూపిణివైన యమ్మవు నీవే వచ్చి కల్పిత బంధములను దెగఁగోసి జీవసంతానముచేత నమృతాస్వాదము చేయింతువు.

ఇట్టి సులభమైన సరళమైన విశాలమైన దారి కానవచ్చు చున్నను, జీవులు పలువురు దారితప్పి తమకు నచ్చిన దారినే త్రొక్కి యపారకష్టముల నెందులకుఁ బొందుచున్నారో, భ్రాన్తిరూపిణివైన తల్లీ! నీవే యెఱుఁగుదువు. అమ్మా! ఒక్కసారి భ్రాన్తిహరమూర్తితోఁ బ్రత్యక్షమగుదువేని, అనాది కాలమునుండియు గల మాభ్రాన్తి తొలఁగిపోవును. భ్రాన్తి రూపముతోను నీవే వెలయుదువని తెలిసికొందుమేని, మే మా భ్రాన్తిని దాటిపోవుదుము.

అమ్మా! ఎవ్వరిని నీ వభ్యుదయసుదాయినీమూర్తితో నాదరింతువో, వారి సేవకులు, పుత్త్రులు, భార్యలు, పరిజనములు, వారి కనుకూలురును, శిష్టులును, సుస్థులును, సదాచారులు

నగుదురు. కనుకనే ధర్మమునొందు నాశతో, లేదా ముక్తినొందు నాసతో వారికి గృహస్థాశ్రమమును విడిచి, నిర్జనారణ్యములకును, గొండగుహలకును బోవు నావశ్యకత యుండదు. వారిహపరముల రెంటిని జయింపఁగల్గుదురు. గీతలందును "ఇహైవ తైర్జితః స్వర్గో యేషాం సామ్యే స్థితం మనః" (5 - 19). అనఁగా నెవరి చిత్తము సమత్వమందు నిల్చునో - అనఁగా సమస్వరూపమున నంతటనున్న మాతృసత్తయందుఁ బ్రతిష్ఠితమగునో, వారీ జగత్తునందే యుండియు స్వర్గలోకమును సైతము జయింతురు; కనుక వారే ధన్యులు. దీనిచేత, అమ్మా ! దేవతలును నిన్ను స్తుతించుచు "ధన్యాస్త ఏవ" యని నీ ప్రియతమ సంతానమునకు ధన్యవాదము లర్పించుచున్నారు. ఆధ్యాత్మిక పక్షమున - ఆత్మజ - భృత్య - దార పదములకు వరుసగా వివేకము, విజితేంద్రియములు, ఆత్మాభిముఖ ప్రవృత్తి యని యర్థము చేసికొన్నచో, నీ మంత్రార్థము సరళముగాఁ దెలిసిపోవును.

ఓం. దర్మ్యాణి దేవి సకలాని సదైవ కర్మా
ణ్యత్యాదృతః ప్రతిదినం సుకృతీ కరోతి ।
స్వర్గం ప్రయాతి చ తతో భవతీ ప్రసాదా
ల్లోకత్రయే ఽపి ఫలదా నను దేవి తేన ॥ ఓం. 15

దేవీ ! నీ ప్రసాదమువల్లనే సుకృతిశాలురు నిత్యము నత్యంత శ్రద్ధాపూర్వకముగఁ గర్మములను ధర్మమయములుగా నొనర్చి చక్కగా ననుష్ఠింతురు. దానిఫలముగా స్వర్గ మోక్షముల నొందుదురు. కనుకనే దేవీ ! ఇటులు నీవు ముల్లోకముల ఫలము నిత్తువు

వ్యాఖ్య :- వెనుకటి మంత్రమందు "న చ సీదతి ధర్మ వర్గః" అని చెప్పఁబడినది. ఒక్క ధర్మసేవచేతనే, క్రమముగా, అర్థ కామ మోక్ష ఫలముల కధికారి యగును. ఏ విధముగా నా ధర్మసేవ చేయుదురో యీ మంత్రమువల్లఁ దెలుపఁబడినది. "ప్రతిదినం సకలాని కర్మాణి, అత్యాదృతో ధర్మ్యాణి కరోతి; ఏవం చ సుకృతీ భవతి" ప్రతిదినము నఖిలకర్మములను మిగుల నాదరముతో ధర్మమయములుగా ననుష్ఠింతురు; ఇటులు చేయఁగల్గుటచేతనే మనుష్యుఁడు సుకృతిశాలి యగును. తత్ఫలముగ స్వర్గమోక్షముల నొందును, అనెడి మాట నింకను స్పష్టపఱుపవలసి యున్నది.

సాధారణముగా లోకులు కర్మములను మూడు విధములుగా నెంతురు. కొన్ని ధర్మకర్మములు - సంధ్యావందనము, వ్రతనియమములు, ఉపవాసములు మున్నగు శాస్త్రవిహిత కర్మములు; కొన్ని యధర్మకర్మములు - హింస, పగ, కల్లలాడుట, ఒరుః సొత్తు దొంగిలించుట మున్నగు నిందితకర్మములు; మఱికొన్ని సాధారణకర్మములు - తినుట, తిరుగుట, పఱుండుట, ద్రవ్యార్జనము మున్నగునవి. వానియందు ధర్మమును లేదు, అధర్మమును లేదు. కర్మశ్రేణీవిభాగ మిటులున్నను, మనము కర్మము నొక్కవిధముగానే కనుచున్నాము. విషయములతో నింద్రియసంయోగమగుటచేతనే కర్మములగును. గీతలందు - కర్మము, అకర్మము, వికర్మము అని కర్మశ్రేణీవిభాగ మిటులున్నది. అవియును విషయేంద్రియసంయోగమనెడి కర్మము యొక్క ప్రకారభేదము మాత్రమే. ఈ మంత్రమునం దామూల భూతకర్మమే లక్షింపఁబడినది. మంత్రమందలి "సకలాని" అను మాటయెడ

లక్ష్యముంచుటచేఁ దెలియఁగలదు. సరే; సర్వకర్మములను ధర్మమనెడి శ్రద్ధతోఁ గూర్చియే చేయవలయును. అశ్రద్ధతోఁ జేయరాదు. "అత్యాదృతః" మిగుల నాదరముతోఁ జేయుము. ఏమి చేసిన నీ కర్మములు ధర్మ్యములు కాఁగలవు ? ప్రతికర్మము నందును మాతృకర్తృత్వమునే కాంచుటనే మాతృయుక్తములైన కర్మముల ననుష్ఠించుట పేరే ధర్మ్యకర్మము. ఇది గీతయందలి "తత్కురుష్వ మదర్పణమ్" (9 - 27) అనెడి మంత్రముయొక్క సాధనమయావస్థ. అహంబుద్ధితోఁ జేసి, యప్పు డీశ్వరార్పణము చేయుట కనిష్ఠాధికారి కార్యము. అనుష్ఠానకాలమందే, యెంతదాఁక జేయఁగల్గినను మాతృ యుక్తములుగానే చేయవలయును. కనుక మంత్రమందు "కరోతి" యని వర్తమానబోధక క్రియాపదము వాడఁబడినది. ప్రారంభ - పరిసమాప్తి పేరే వర్తమానము. ఏ కార్యము నేని మొదలిడి ముగించునంతదాఁక మాతృకర్తృత్వ దర్శనమే యథార్థ ధర్మ్యకర్మము.

విశ్వమయమ్మైన యొక విరాట్కర్తృత్వము కలదు. ఆ కర్తృత్వము - క్రియాశక్తి, మన విషయేంద్రియ సంయోగము వలన వెలయుననెడి యీ జ్ఞానము కొన్నాళ్లలవాటుపడినచో నది స్వాభావికమై పోవును. అపుడు మఱి ప్రయత్నించి ప్రతి కార్య మందును మాతృకర్తృత్వమును గాంచుటకై ప్రయాసపడు నక్కఱ యుండదు. ఈ విధముగా నంతటను మాతృకర్తృత్వ దర్శనమందు సిద్ధుఁడైన సాధకుని కార్యములెల్ల ధర్మమయములే యగును. పక్షాంతరమున - మాతృయోగరహిత = మాతృ కర్తృత్వ దర్శన శూన్యములైన ప్రతి నియమోపవాసాది కర్మములు వెలికి

ధర్మ్యకర్మములుగాఁ గానఁబడినను వాస్తవముగా ధర్మ్యకర్మములు కావు. మఱి యాహారవిహారాదులైన దైనిక వ్యావహారిక కర్మములు కూడ మాతృయుక్త భావముతోఁ జేయఁబడుచో నవియు ధర్మ్యకర్మములగానే పరిణమించును. ప్రతిదినము సర్వకర్మముల నీవిధముగాఁ (ధర్మమయములుగా) జేయువారే యథార్థసుకృతులు. వారి కృతులన్నియు సుఫలదాయకములే. పక్షాంతరమున - స్వర్గాది ఫలములను గోరి కామ్యకర్మములను జేయువారు, పరలోకమైన స్వర్గమందు, అనఁగా సుఖమయక్షేత్రమందుఁ జేరుదురు. ఇఁక నిష్కామ బుద్ధితో, అమ్మ ప్రసన్నతనే యుద్దేశించి కర్మములను జేయు వారు ముక్తి నొందుదురు. వారెల్లరు "భవతీప్రసాదాత్" నీ ప్రసాదము నొందినవారేకదమ్మా ! నీవే జీవుల నీలోకమున సుకృతులను జేయుదువు. నీవే జీవులను బరలోకమునందు స్వర్గభోగాధికారులను జేయుదువు. మఱి నీవే సర్వలోకముల కతీతమైన మోక్షఫలము నిచ్చి జీవులను ధన్యులను జేయుదువు. కనుకనే దేవీ ! "లోకత్రయే ఽపి ఫలదా" ముల్లోకములందును త్రివిధకర్మ ఫలవిధాన మొనర్తువు.

'ఫలదా' అను మాట కింకొక గూఢార్థమున్నది. ఖండనార్థకమైన 'దా' ధాతువు వలనఁగూడ 'ఫలదా' పదము సిద్ధమగును. దానివలన ఫలవినాశినీయనియు నర్థమగును. అనఁగా సర్వకర్మ ఫలములను ఖండించునది 'ఫలదా' యనుట.

అమ్మా ! ఒక విధమున సుఖము, దుఃఖము, జన్మము, మరణము, స్వర్గము, నరకము అనెడి ఫలము నిచ్చుటచేత నీవు ఫలదవగుదువు. మఱియొకవిధమున జీవుల సర్వకర్మఫలములను

జ్ఞానాగ్ని ప్రభావముచే సమూలముగా భస్మమొనర్చెదవు. కావున నీవే ఫలదవగుదువు. అమ్మా! ఇటులు నీవు ఫలదాయిని వయ్యు ఫలవినాశినివి. ఈ ఫలనాశినీమూర్తితో నీవు వెలయుదేని మా కేదో యొకనాఁడు నీ యమృతమయ వక్షమునందుఁ జోటు దొరుకునని యాశ. సర్వకర్మఫలముల దాటిపోవుదుము.

జీవుఁడు, అహం బుద్ధితో సాధారణ భావముతోఁ గర్మము లాచరించునంతవఱకే నీవు ఫలదాయినీమూర్తితో నావిర్భవించి వానికి సుఖదుఃఖాది ఫలముల నిచ్చుచుందువు. మఱి జీవుఁడు తన యహంబుద్ధిని నీ రక్తచరణములందు సమర్పించి విశ్వమయీ ! విరాట్కర్తృత్వమయీ ! మహాశక్తి స్వరూపిణీ ! అమ్మా ! నీ కర్మయంత్రరూపమునఁ గర్మము లాచరించునపుడు నీవే ఫలనాశినీ మూర్తితో వెలసి సర్వకర్మ ఫలములను ఖండించి జీవుని మోక్షఫలాధి కారినిగాఁ జేయుదువు.

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేషజన్తోః
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి ।
దారిద్ర్యదుఃఖ భయహారిణి కా త్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా ॥ ఓం. 16

దుర్గములందుఁ బడినపుడు నిన్ను స్మరించుటచే నీవు సర్వప్రాణుల భయమును హరింతువు. మఱి స్వస్థావస్థయందు స్మరించుటచే సత్యంత శుభమతినిత్తువు. ఓ దారిద్ర్య దుఃఖ భయహారిణీ ! సర్వజీవులకు నిట్టి లుపకారముచేయు సదార్ద్ర చిత్తవు నీవు గాక మఱెవ్వరమ్మా !

వ్యాఖ్య :- అమ్మా! నీ ప్రియసంతానమైన జీవులు దుర్గము లందు - దుఃఖసంకటమందుఁ బడిపోయి తమ్ము రక్షించు కొన వేఱొక్క వెరవు గానక, సర్వవిధముల పురుషప్రయత్నములును వ్యర్థమైపోయినపుడు ఆపదలనెడి నల్ల మబ్బులు నలు వైపులఁ గ్రమ్మి జీవుల దృష్టిశక్తి నరికట్టువేళ, భయసంత్రాసములతో మిగుల వ్యాకులంపడునపుడు, అట్టి యవస్థయందు, ఆ దుఃఖదినము లందు జీవుఁడొక్కసారి యేదో యొక యజ్ఞేయ మహాశక్తివైపు జాలిచూపుతోఁ జూచును. అట్టి గొప్ప కుసమయమందుఁ దనకు రవ్వంత తోడుపడఁగలవారు మఱెవ్వరును గానరారు. అట్టి దుర్దినమందు జీవుఁడు 'నీవే దిక్కు' అనుటకు బాధ్యుఁడగును. నిన్నే స్మరించును. కనుకనే మంత్రమందు "దుర్గేస్మృతా" యనఁబడెను.

అమ్మా! జాగతికదృష్టియందలి కుసమయమే కానీ, జీవుని పక్షమం దదియే సుసమయము. బహుపుణ్యఫలముగా జీవుఁడు నిన్ను స్మరించు శుభావసరము నొందును. నిన్ను స్మరించుటచే - యథార్థస్మరణము చేయఁగల్గుటచే, వడిగా గొడవలెడమగును. కొడుకు, అమ్మా ! యని దీనముగా నఱచునపుడు నీవు నిశ్చింత ముగా నుండఁగలవా ? పుత్త్రుని జాలిపిలుపు విన్నంతనే నీవు పిచ్చియెత్తినట్లు సత్యలోకమునుండి పరుగిడిరా బాధ్య వగుదువుక దమ్మా ! నీ యా మూర్తిని స్మరించి విహ్వలులమై పోదుము. ఆ చెదరిన ముంగురులు, విరిసిన జుత్తు, జాఱెడి యా చీర, అడ్డులేని వడినడక గల మా వెఱ్ఱితల్లి, మమ్ము గుండె కత్తుకొని స్నేహాదర ములు నెఱపునని గంతులిడమా ! అమ్మా ! అమ్మా ! అమ్మా !

సరే; జీవుఁ డాపదలందుఁ బడియే, నిన్నుఁ దలంచు నభ్యాసము చేయును. ఆ యలవాటు ఫలముగా, స్వస్థావస్థ యందుగూఁడ నిన్ను స్మరింపఁగల్గును. క్రమముగా నీ యస్తిత్వ మందు విశ్వాసవంతుఁడగును. సర్వావస్థలయందును శుభములనే మాకుఁ గూర్చు స్నేహమయి మా యమ్మ, మా యెడఁ జెదరని జూపు నిల్పుననెడి నమ్మకముతో హృదయము నిండి పోవునపుడు, అమ్మయస్తిత్వమం దణుమాత్రమును సంశయము లేనపుడే జీవుఁడు స్వస్థుఁడగును. అపుడు మఱి యాపద యనునదే యుండదు. దుఃఖసంకటమనెడి యొకవస్తువున్న దనుమాటే మనసున నుబుకదు. అమ్మా యస్తిత్వమందు విశ్వాసి కాలేనంత దాఁక జీవుఁడెట్టులును స్వస్థుఁడుకాఁజాలఁడు. స్వస్థుఁడు కాకున్న స్వస్తి ననుభవింపలేఁడు. ఔరా ! 'స్వ' జాడ నెఱుఁగనివాఁడు స్వస్థుఁడెటులు కాఁగలఁడు ?

అమ్మా ! ఆపదలందుఁ జిక్కి జీవుఁడు నిన్ను స్మరించుట నేర్చుకొనును. క్రమముగా స్మరణ మభ్యాసమగును. ఆపదలు తొలఁగి నీసత్తయందు విశ్వాసవంతుఁడై స్వస్థుఁడగును. ఆ యవస్థయందుసైతము నిన్నుఁ దలంచును. ఆపదలేదు. వేఱొక్క కామన, వాసన లేదు. ఐనను బ్రాణతాడనముచే స్మరించును. అపుడు నీవేమి చేయుదువో ?

"స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి" స్వస్థావస్థచే నీ వత్యంత శుభమతి నిత్తువు. బుద్ధిసత్త్వముయొక్క నిర్మలతయే శుభమతి. మనము తఱచుగా జగత్తునం దేబుద్ధిని బట్టి విచరించుచున్నామో, వ్యావహారికజీవనము గడుపుచున్నామో అది

రజ స్తమోగుణములచే మలినము చేయఁబడిన బుద్ధి. కనుక నది అవిశుద్ధమతి - అశుభమతి; కాని, అమ్మా! కామనాహీన సంతానము నిన్ను మాటిమాటికి స్మరించునపుడు, నీ కృపచేతనే వారి బుద్ధి మాలిన్యము తొలఁగి బుద్ధిసత్త్వము నిర్మలమగును. ఈ విధముగా అతీవ శుభమతి లభించుటచే దానియందు అమ్మా! చిదానందమయీ! నీ ప్రతిబింబము కనఁబడ నారంభించును. అపుడు జీవుఁడు నీ స్వరూపాభాసము నొంది ధన్యుఁడగును. జననమరణ మోహాదు లెన్నటికిం దూరమైపోవును. ఈ విధముగా సర్వావస్థలందును సంతానమునెడ సదా దయార్ద్రచిత్తులు నీవుగాక మఱెవ్వరున్నారు ? నీవే మా దారిద్ర్య దుఃఖ భయములను హరించు తల్లివి. ఈ విధముగాఁ బ్రతిజీవునందును నీ స్వరూపమును బ్రకటించి యపారదయాపరిచయము గల్గించి జీవుల దారిద్ర్యము నెన్నటికిని దొలఁగింపుము.

"దారిద్ర్యదుఃఖ భయహారిణి" యను మాటను మఱింత పరిష్కారభావముతోఁ దెలియఁ బ్రయత్నింతము. అభావభోదము (లేమి యనుకొనుట) పేరే దారిద్ర్యము. అభావబోధ ముండుట వల్లనే తప్పక దుఃఖము గల్గును. దుఃఖముచేతనే భయము గల్గును. కనుక దారిద్ర్య దుఃఖ భయములనెడి మూడు నొండొంటితోఁ గూడియుండును. ఈ దారిద్ర్యమనునది చిత్త ధర్మము. చిత్తమందెల్లప్పుడు నేదోయొక భావ ముండనే యుండును. ఆ యభావబోధమును - దారిద్ర్యమును దొలఁగించుటకయియే, జగత్తునం దీ కోలాహలము, పరుగులెత్తుట; ఎంత కూడఁబెట్టనీ; ఎంత భోగింపనీ; చిత్తక్షేత్రమం దింకను గ్రొత్తలేములు తలసూపుచునేయుండును. ఈ దారిద్ర్యము

తొలఁగక దుఃఖభయము లెన్నఁడును దొలఁగిపోవు. ఇక్కాలమున దేశమందంతటను వ్యాపించి భయానక దరిద్రతామూర్తి రూపము కానవచ్చుటకు, ఈ యభావబోధమే కారణము. అభావబోధమెంత యధికముగా నున్నదో, యంతగా సామగ్రిసంచయము, భోగము ననువాని యభావము లేదు. ఏ వస్తువు లభించుటచే నీ యభావము తొలఁగునో, చెప్పనా ? అదే 'బుద్ధి'. "తత్త్వ జ్ఞాన లక్షణా బుద్ధిః" ఆ బుద్ధి యశుభముగా (మలినముగా) నుండునంతదాఁక, సర్వవిధముల యభావములను (ఎట్టి యభావమునైనను) నశింపఁజేయఁగల వస్తువుయొక్క స్వరూపమే కానఁబడదు. కనుకనే యభావబోధ మేవిధముగాను దొలఁగదు, గాన శుభమతి యావశ్యకము. అది యమ్మ స్మరణమువల్లనే కలుగును.

ఏది లభించినచో మఱి యెద్దాని లాభమును గొప్పదని పించదో, దేనియందు నిల్వఁగల్గుటచే దుస్సహదుఃఖములు వచ్చిపడినను జెదరుపాటుండదో, ఆ పరమానందమయ నిత్య వస్తువేదో, ఏది లభించుటచే దారిద్ర్య దుఃఖ భయములు కడుం దొలఁగిపోవునోఁ దానిజాఁడ నెవ్వరు చూపుదురు ? దాని యాచూకి యెవరిత్తురు ? శుభమతి - నిర్మల బుద్ధిసత్త్వమే. ఉపనిషద్భాష యందు, దీనిని ప్రజ్ఞా - "అపరోక్షానుభవపర్యంత విచారిణీ బుద్ధిః' ' అనిరి. ప్రజ్ఞ ప్రకాశించునపుడే జీవుఁడు పరమాత్మ స్వరూపానుభవము చేయఁగలఁడు. అపుడు లేములు, గొడవలు, భీతులు నన్నియుఁ దొలఁగిపోవును.

రా ! సాధకా ! రమ్ము, మనమును వేల్పులసారముతో సారము కలిపి భక్తివినమ్రచిత్తముతో "దుర్గే స్మృతా హరసి భీతి

మశషజన్తో ః। స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి । దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా । సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా ॥" అని యమ్మను గొండాడఁగడఁగుదము.

అమ్మా ! జీవులకెల్లరకు నెల్లవిధముల మేలుచేయుటకై యెల్లప్పుడు దయార్ద్రచిత్తముతో నెయ్యముచే మెత్తగిలిన చిత్తము గలవారు నీవుగాక మఱి యెవ్వరు ? సర్వవిధముల దయామయివైన యమ్మవు నీవు కావా ? దయతో, స్నేహముతో, మాతృత్వముతో, నీ హృదయము కరఁగిపోవుచుండును గదా ? కాని అమ్మా ! మేమిం కెన్నాళ్లకు నీ యా సాటిలేని మాతృత్వము ననుభవించి, యథార్థ పుత్రత్వము (తనుజత్వము) నొంది ధన్యులమగుదుమో ?

ఓం. ఏభిర్హతై ర్జగదుపైతి సుఖం తథైతే
కుర్వంతు నామ నరకాయ చిరాయ పాపమ్ ।
సంగ్రామ మృత్యు మధిగమ్య దివం ప్రయాంతు
మత్వేతి నూనమహితాన్ వినిహంసి దేవి ॥ ఓం. 17

దేవీ ! ఈ యసురులు చంపఁబడుటచేతనే జగత్తు యథార్థముగా సుఖింపఁగలదు. అసురులును మఱి చిరకాల నరకజనక పాపములను జేయఁజాలరు. మఱియొకటి - సమ్ముఖ సమర మందుఁ జచ్చి స్వర్గము నొందెదరు; అను నివియన్నియు విచారించియే యసురులను జంపితివి.

వ్యాఖ్య :- అమ్మా ! నీవెల్లరకు నుపకారము చేయుదాన వయ్యు ఎల్లరయెడ నీ చిత్తము దయార్ద్రమేయైనను, శత్రుఁడు,

మిత్రుఁడు, పాపి, పుణ్యుఁడు, జ్ఞాని, అజ్ఞాని యనెడి విచారము నీకు లేకున్నను, ఈ యసురకులము నెందులకు నిహతమొనర్చితివి ? ఈ విషయమందు నీ వనెడివి మూడు మాటలు. మొదటిది - వీరు చచ్చిన జగత్తు శాన్తినొందును. రెండవది - అసురులకును నింక నరకవాస దినపరిమాణము పెఱుఁగదు. మూడవది - సమ్ముఖసంగరమందుఁ జచ్చుటచే వీరు స్వర్గమునకుఁ బోఁగలరు, అను నీ మూడు నుద్దేశించియే నీ వసురులఁ గసి మసంగితివి. యథార్థముగా మరణమనుచు, అనుపకారమనుచు, నిష్ఠురత యనుచు నొకటి యున్నచో, నీ యందు ఉపకారము, అనుప కారము, దయ, నిష్ఠురత యనెడి రెండు ధర్మములు గాఁ బడును. ప్రత్యేకము నీ యిచ్చు మంగళప్రదమే యైయుండ నమంగళము నిష్ఠురత యనెడి దించుకయు నుండఁజాలవనెడి మాటను, మా గుండెను జక్కఁగా నాటించుకొనలేనంతవఱకే, జాగతికదృష్టితో నీయందు సైతము, ఉపకారానుపకారములు, దయానిష్ఠురతలు ననెడి రెండు వస్తువులు కానఁబడును. స్థూలదర్శి - భేదజ్ఞాన సంపన్నమగు దృష్టివలన నిట్టి ద్వైతదర్శనమేయగును; గాని అమ్మా ! నీవు దయతో నెవ్వరి భేదజ్ఞానమును దొలఁగింప నెంతువో వారు, నీవు తప్ప నింకెక్కడను నింకేమియు లేదని తెలియఁగల్గుదురు. అమ్మా ! వినాశము, సృష్టియనెడి రెండును, సమానమైన నీ యానందలీలయే యని యెంచినవారు నీ వొకరి యెడ దయను, వేఱొకరియెడ నిష్ఠురతను వెలయించు దానవని యెట్లనఁగలరు ? అనలేరు.

మఱియు నీ భేదదర్శనమునుబట్టి నిన్నుఁజూచినను జీవులు నీ బిడ్డలు; నీవు జీవులఁగన్న తల్లివి. తల్లికిఁ బిడ్డలయెడ నెన్నఁడును

నిష్ఠురత యుండఁజాలదు. అపుడు మఱి దేనిని నిష్ఠురత యనుచున్నామో - రోగము, దారిద్ర్యము, శోకము, దుఃఖము, మరణము మున్నగు వేనిని మేము యథార్థముగా ననుపకారము లనుకొనుచున్నామో అవియును వాస్తవముగా మాతృస్నేహమే కాక, మఱేమియుంగావని తెలుపుటకే, వానియందును మునుఁ జెప్పిన నీ యీ మూడుద్దేశ్యములును లక్షింపఁబడుచున్నవి.

మొదటి యుద్దేశ్యము - "జగదుపైతి సుఖమ్" అసురులు నిహతులైనచో జగత్తు శాంతి నొందును. అసురులు సచ్చి రేని జగత్తునం దత్యాచారము లడఁగునని స్థూలముగా నెల్ల రెఱుఁగుదురు. ఇఁక సూక్ష్మభావముతో - వాసనలు పైకొనుట కవసరమీయక ప్రలయమువంక మఱలింపగల్గెనేని జీవుఁడు యథార్థ శాంతి నొందును. ఏలనఁ గామనాపూర్తివల్లనగు సుఖముకంటెఁ గామనలు తలసూపకుంటవల్ల నగు సుఖము వేయింత లధికము. విశుద్ధచిత్తముతో విషయములను భోగించుటచే నగు సుఖము కంటెఁ బ్రశాంతచిత్తముతో, విషయభోగాభిలాషము లేకుంటచేతనే యధికసుఖ మగును. చిత్తవిక్షేప భావమే దుఃఖము; చిత్తప్రశాంతతయే సుఖము. ఇపుడు చూడు - జగత్తునకు (నీకు) యథార్థసుఖమే కావలసినచోఁ దప్పక యసురకులము (దుర్వాసనలు) ధ్వస్తము కావలయును.

రెండవ యుద్దేశ్యము - "నరకాయ చిరాయ పాపం న కుర్వంతు" అసుర (వాసనామయ) చిత్తము సదా వాసనలను బూరించుచు నెల్లపుడును నరకమును భోగించును. నరుఁడు, అతిసంకీర్ణుఁడును, అపవిత్రుఁడు నయి యుండుచోటే నరక

మందురు. చిన్న చిన్న విషయములను, జిన్న చిన్న కామనలను బట్టుకొని మనుజుఁడు, యథార్థసుఖమన నేమో యెఱుఁగ లేనంత ముగ్ధుఁడై యుండును. కనుకనే వానిని సమ్ముఖ సంగ్రామమందుఁ జంపుట కడునావశ్యకము. ఇదే యసురనిధన మనెడి మూడవ యుద్దేశ్యము. యథార్థసుఖము నెదుర నుంచు కొని, చిన్న చిన్న పెక్కువాసనలను సమష్టిభూతము చేసి, దాని వైపు పరువెత్తఁగల్గినచో నారకీయవృత్తుల విలయమైపోవును సమ్ముఖసమరమం దసురుల గసిమసంగు రహస్య మిదే. భూమ సుఖాభాసము నెదురగా గానఁగల్గుట చేతనే జీవులు దుఃఖమిశ్రితమును క్షణభంగురము నైన సుఖమందలి కామన నశ్రమముగా వీడఁగల్గుదురు. మన యమ్మ, యానందమయ - పరమసుఖమయ మూర్తితో నెదుర నిల్చినపుడే సర్వాసురభావముల విలయమై పోవును; గనుక దేవతలు "అహితాన్ వినిహంసి" యనిరి. అహితులు మనకు హితకరులు కారనెడి భావము నణఁచివేసి, మన పరమమంగళ మార్గమును దెఱచివేయుటకే, అమ్మగారి యీ సమగవిడంబనము.

ఓం. దృష్ట్వైవ కిన్నభవతీ ప్రకరోతి భస్మ
సర్వాసురా నరిషు ప్రహిణోషి శస్త్రమ్ ।
లోకాన్ ప్రయాన్తు రిపవో ఽపి హి శస్త్రపూతా
ఇత్థం మతి ర్భవతి తేష్వపి తే ఽతి సాధ్వీ ॥ ఓం. 18

అమ్మా! నీ నిగా పడినంతమాత్రనే, యసురులు నుసియై పోవుదురు; అయిన నటులు చేయక పరులపై వస్త్రములు పఱపుటకుఁ

గారణము - శత్రుగణము సైతము నీ యస్త్రాఘాతముచేఁ బవిత్రమై యున్నతలోకములకుఁ బోవుననియే. అవురా ! పగతురయెడ సైతము నీ కిట్టి సాధుమతియే కదా !

వ్యాఖ్య :- అమ్మా ! నీవు సృష్టిస్థితి ప్రలయంకరీ మహాశక్తివి. నీవు తలంచినంతనే యాసురికభావములు ఱెప్పపాటులో విలయ మొందఁగలవు. అటులౌనర్పక యరులపై వస్త్రశస్త్రములఁ బఱపుటయు నీ సమరవిడంబనము నెందుకమ్మా ! ఆఁ, దీనియందును నీ సాధుమతియు మంగళమయేచ్ఛయు నిమిడి యున్నవి. నీ చేతితోఁ బఱపఁబడిన యస్త్రములచే వేధింపఁబడి పవిత్రులగుదురు; నిష్పాపులగుదురు. ఉన్నతలోకములకుఁ బోవుదురు. నీ వరవపువునఁ జేరిపోదురనెడి యత్యుదార సాధుమతిని బట్టియే నీ యీ సంగ్రామలీల. ఆహా ! పగవారియెడఁ గూడ నెంత పరమదయ ! ఇది తలఁచిన నెంత వింత ! మేము నిష్ఠురత యనుకొనునది వాస్తవముగా నిష్ఠురత కాదు. కరుణా కపట రూపము మాత్రమే.

అమ్మా ! యెపుడు నీవు జీవుల యాసురీవృత్తులను శస్త్రములచేఁ బవిత్రము చేయుదువో, ఎపుడు చిన్న చిన్న వాసనలను గొంచెకొంచెముగా నీవంక కాకర్షించుకొందువో, ఎపుడు జడత్వమోహమును దెగఁగొట్టి మెల్లమెల్లగాఁ జిత్త వృత్తులకు బోధమయసత్తా సంధానము నొందింతువో, యపుడే వారు స్వర్గీయసుఖము ననుభవింతురు. ఇదే దేవతలు వినమ్ర కంఠములతో 'లోకా ≡ ప్రయాన్తురిపవో ఽపి హిశస్త్రపూతాః' అనిరి. అమ్మా ! మా యంతర్ముఖవృత్తుల నిటులే రవ్వలవ్వంతగా

నానందరసభోగము చేయించి, క్రమముగా నీలోఁ జేర్చి వేసికొమ్ము. అపుడు మఱి నీవు "ఏక మేవా ద్వితీయమ్" రూపముతో విరాజిల్లుము. అమ్మా! నీ కార్యప్రణాళికయొక్క అపురూపమయిన క్రమమెంత ధన్యము !

ఓం. ఖడ్గప్రభావికరవిస్ఫురణై స్తథోగ్రైః
శూలాగ్రకాంతి నివహేన దృశో ఽ సురాణామ్ ।
యన్నాగతా విలయ మంశుమదిందుఖండ
యోగ్యాననం తవ విలోకయతాం తదేతత్ ॥ ఓం. 19

అమ్మా ! నీ ఖడ్గకాంతి సముదాయపుఁ దళుకులును, నీ శూలపుమొన మెఱపులును, ఆ యసురుల చూపుబల్మిని బోఁగొట్ట లేకుంటకుఁ గారణము, వారు జ్యోతిర్మయ చంద్రకలా విభూషిత మైన సాటిలేని నీ యీ మోమును జూచుటయే.

వ్యాఖ్య : స్థూలదృష్టిచేత - ఈ మహిషాసుర యుద్ధమందు నీ ఖడ్గప్రభల తళతళలును, నీ శూలాగ్రకాంతులును, అసురుల దర్శనశక్తిని విలయమొందింపలేకపోయినవని తెలియుచున్నాము. ఇఁక, సూక్ష్మభావముతోఁగూడ - నీ విజ్ఞాన ఖడ్గ ప్రభలును, జ్ఞాన మయశూలద్యుతులును అసురీదృష్టిని నశింపఁ జేయఁజాల లేదని తెలియుచున్నది. ఎందుల కిట్లయ్యెను ? ఏ విశుద్ధ బోధమనెడి శాణితాస్త్ర ప్రభావముచే సర్వద్వైతభావములనెడి దైత్యగణము నశించెనో, దాని యాభాసమునొందియు నాసురిక దృష్టి యేల నశింపలేదు ? - "అంశుమదిందుఖండ యోగ్యాననం తవ విలోకయతాం" అమ్మా ! నీ సముజ్జ్వల ముఖచంద్రుని జూచుట చేతనే యాసురదృష్టి చెడలేదు. అవును. అమ్మ నగవు నెయ్యము

వెలయు నానన పరమశోభను దేఱిచూడఁగల్గునపుడు మఱి దృష్టివిలయశంక యుండునా ? ఆసురికసత్తయును జిదా నంద మయ మాతృసత్తయే, కాని వేఱేమియుం గాదనెడి రహస్య ముఁ జక్కఁగా ననుభవింపఁగల్గునపుడే పూర్వోక్తసంశయము తొలఁగిపోవును. సర్వవిధముల యానందభావములను విలయ మొనర్చి విశుద్ధబోధస్వరూపమైన నీ సత్తను బట్టుకొన నెంచువారు, బహుశః యీ రహస్యము నుపేక్షాదృష్టితోనే చూతురు. దానికై ప్రయత్నించు చుందురు కాని, యించుక ధీరముగాఁ జూచినచో వారును, "అమ్మ మోముఁ గాంచిన తర్వాతఁ గూడ, ఆసురీదృష్టి యుండు" నని గొంతెత్తి ఘోషింతురు. క్రమముగా సమయము వచ్చినపుడు, అది పూర్తిగా విలయమొందుననియు ఘోషింతురు. అమ్మా ! నీ ప్రియతమ మానవ సంతానమునకు, "అసురీదృష్టి యున్నను నీ స్నేహ కరుణామయ ముఖసౌందర్య మును జూచు సౌభాగ్య మబ్బఁగల"దని నీవు తెలియఁజెప్పుము. అతి దురాచారు లును నిన్ననన్య చిత్తముతో భజింపఁగలరు. నిన్నుఁ జూడక యనన్యచిత్తముతో నీ భజనము కాఁగలదా ? అది యటుండనీ.

అమ్మా ! చంద్రదృష్టాన్తముచేసైతము మేమీ సత్యము నెఱుంగఁగలము. సాధారణదృష్టికి "అంశుమదిందు" - కాంతిగల చంద్రుఁడు - చంద్రుని కిరణములే యని కాఁబడును, గాని తత్త్వదృష్టిచేఁ గిరణములు చంద్రునివి కావు. అవి సూర్యునివే. చంద్రునందుఁ బ్రతిబింబితములైన సూర్యకిరణములే చంద్ర కిరణములుగా దృష్టిగోచరము లగును. ఈ విధముగానే వేనిని మేము, ఆసురిక దృష్టులు - ఆసురిక భావములు - అనుకొను

చుందునో, అవియును అమ్మా! నీ సత్తచేతనే సత్తావంతములగు చున్నవి. నీ ప్రకాశము చేతనే ప్రకాశించును. ఇంతకుఁదక్క వానికి వేఱొకసత్త లేనేలేదనెడి రహస్యమును యథార్థముగా ననుభవించు వారి యాసురీదృష్టి, విలయమగుటయుఁ గాకుంటయు సమానమే. కేవల ప్రాణరూపిణివయిన నీవే సురాసురుల యాకారమునఁ బ్రకాశింతువు. మేము నిన్నుఁ జూడక, ఆ యాకారముల యెడ ముగ్ధుల మగుటచేతనే మోసపడుచున్నాము. కల్యాణమయీ ! అమ్మా! నీవు మా యీ మోహమును నెట్టివేయుము. కల్యాణదృష్టిని విప్పుము. ప్రాణప్రతిష్ఠితులను జేయుము.

ఓం. దుర్వృత్త వృత్తశమనం తవ దేవి శీలం
రూపం తథైత దవిచింత్య మతుల్య మన్యైః ।
వీర్యంచ హంతృహృత దేవ పరాక్రమాణాం
వైరిష్వపి ప్రకటితైవ దయా త్వయేత్థమ్ ॥ ఓం. 20

ఓ దేవీ ! దుర్వృత్తుల వృత్తముల నణఁచు నీ స్వభావమును అచింతనీయమైన నీ రూపము, దేవపరాక్రమముల నశింపఁజేయు నసురులను జంపు నీ వీర్యమును, వైరులయెడసైత మిట్టి దయయు ననువానికి సాటి నీయందే కలదు. మఱెక్కడను లేదు.

వ్యాఖ్య :- అమ్మా ! చిత్తవృత్తులు అనద్వస్తువునం దాసక్తములై యుండునంతవఱకే యవి దుర్వృత్తులు. కేవల సత్స్వరూపవైన నిన్ను విడచి చిత్తక్షేత్రమందు విషయ స్పందనములు వెలయునంతవఱకే వృత్తులు దుర్వృత్తములు; కాని, యీ దుర్వృత్తులను బూర్తిగా నణఁచివేయుట నీ స్వభావము. అమ్మా ! "వినాశాయ చ దుష్కృతాం" దుష్కృతుల నణంచివేయుట నీ

పనియే. ఇదెట్లు సిద్ధమగును ? నీ రూపమును జూచినంతనే దుర్వృత్తులు శమించిపోవును. "రూపం తథైత దవిచింత్యమ్" ఈ నీ రూప మచింతనీయము. చింత చిత్తధర్మము. నీ రూపము ప్రకాశించునపుడు చిత్తమనుట కేమియు నుండదు. ఉండఁజాలదు. కనుకఁ జింతయు నుండదు గాన, అమ్మా ! దుర్వృత్తులు శమించుట అనాయాసముగా నైపోవును. ఇదే నీ స్వభావము.

సాధకా ! నీ వా యరూపముయొక్క రూపము నెన్నఁ డేనిఁ జూచితివా ? పరిచ్ఛిన్నసీమగల, యేదోయొక రూపముఁ జూచుటచేఁ దఱచు మోహితుఁడవు కాఁజాలవు. గాని, ఆ రూపహీన రూపసాగరమందు మునుఁగుదువేని, దప్పక ముగ్ధుఁడవగుదువు. ఒక తుచ్ఛమైన పార్థివరూపమునెడ ముగ్ధుఁడై మనుజుఁడు కులశీల మానముల కన్నటికి జలాంజలి యీఁగలఁడు గాని, యపరిచ్ఛిన్నము, మధుమయము, ప్రాణమయము, ప్రేమమయము నైన రూపము నెదుట నిల్చి జీవుఁడు మతిపోకుండఁ గలఁడా ? అయ్యా ? రండు; అందఱము కూడి, అమ్మగారి యా యచింతనీయ రూపసాగరమందు దూఁకుదము. దానిచే మన దప్పి పూర్తిగాఁ దీఱిపోవును. సర్వ దుర్వృత్తులు శాంతించును.

అమ్మా ! నీ రూపమును గాంచినంతనే చిత్తవృత్తులు తమంతనే యణఁగుననుటయందు నమ్మకములేక, నిన్ను విడిచి నేర్పుతోఁ (బ్రాణాయామాది కౌశలముతో) జిత్తనిరోధము చేయఁ గోరువారికి ఈ రహస్యమును జక్కఁగా దెలియఁజెప్పుము, అమ్మ

యన్నను, సత్యమన్నను, ప్రాణమన్నను, ఆత్మయని తెలిసి పిల్చుట చేతనే నీ యచింత్య రూపరాశి యెదుట వెలయును. అది యెంత మధుమయము ! ఎంత యపారము ! చెప్ప నలవి కాని రూప మది. అది ప్రకాశించెనా - చిత్తము తనంతనే ముగ్ధమైపోవును. దుర్వృత్తము - అసత్ప్రియత్వము పూర్తిగా నెడమగును. నిర్వికల్పవు, నిరంజనవు, భావాతీతవు నైన మా యమ్మా ! నీ ప్రకాశముచే సర్వభావములును, సర్వవిధముల వైషయికస్పందనములును విలుప్తములై పోవును.

అమ్మా ! కేవల రూపమే కాదు. నీ వీర్యముసైతము దుర్వృత్తుల వృత్తముల నణఁచివేయఁగలదే. దేవభావముల నిర్వీర్య మొనర్పఁగల యాసురీశక్తులకు విలయమొనర్ప వలఁతివి నీవే. అమ్మా ! జగత్ సృష్టి స్థితి ప్రలయముల ననాయాసముగాఁ జలుపు నీ వీర్యము - మహాశక్తియెడ లక్ష్యముంచునపుడు, చిత్తవృత్తుల ప్రయత్నముగానే యడ్డగింపఁబడ కేమి చేయును ?

అమ్మా ? నీ రూపహీనరూపము నెఱుంగఁజాలనివాఁడు, ఎఱింగియు ధరింపఁజాలనివారికి - అనఁగా "సత్యం జ్ఞాన మానందం బ్రహ్మ" యనెడి యీ స్వరూపమును బట్టుకొని నీ యెదుర నిల్వలేనివారికై, నీ యీ యమితవీర్య - (మహాశక్తి) ధారణోపదేశము విహితమైనది. "జన్మాద్యస్య యతః" అను నీ తటస్థలక్షణసహాయముతో (దేనివలన జగదుత్పత్తిస్థితి లయము లగునో) వారు, ఆ లీలామయశక్తి యెదుర నిల్తురు. దీనిచేఁ గూడఁ జిత్తవృత్తి యశ్రమముగా నిరుద్ధమగును. అందులకును నసమర్థ

లగువారికయియే, ఈ "వైరిష్వపి ప్రకటితైవ దయా త్వయేత్థం" నీ సాటిలేని దయమాట తలపింపఁజేసితివి. పగతుర యెడ సైతము దయచూప లోభపడనిదానవు - నీవు మా యమ్మవు; మేము నీ సంతు. కనుక నీ దయనొందు విషయము నందెన్నఁడును వంచితులము కాము. అమ్మా! జగమునందంతట వ్యాపించి హద్దులేక సదా ప్రత్యక్షమగుచు నత్యంత ప్రకటమగు నీ దయ యెదుట సరళబుద్ధితో, సత్యజ్ఞానముతో, నొక్కసారి, అమ్మా ! యనుచు నిల్వఁగల్గునంతనే చిత్తవృత్తి నిరోధమైపోవును. అసురకుల విలయమైపోవును.

అమ్మా! ఇట్టి నీ రూపము, నీ శక్తి, నీ దయ అను నిమ్మూడిట నేదో యొక దాని నాశ్రయించుటచేఁ జంచలచిత్తము నిరుద్ధమగును. దుర్వృత్తవృత్తమనాయాసముగా శాంతించును. కనుకనే దేవతలు, అమ్మా! దుర్వృత్తవృత్తమును శమింపఁ జేయుటే నీ స్వభావమనిరి. ఈ మూడే సాటిలేనివి. అనఁగా మఱొక్క సాధనముగాని, యుపాయముగాని వానికి సాటి చెప్పఁదగి లేవు. కనుక మంత్రమందు "అతుల్య మన్యైః" అని చెప్పఁబడినది.

అమ్మా ! మేము నీ చిన్న బిడ్డలము; మా విషయమున నీ మూడవ యుపదేశమే యత్యంతోపయోగి. మేము నీ కృపను యాచించువారము. విశ్వమయమై వెలయు నీ దయామయ మూర్తియెడ ముగ్ధులమగుటకే ప్రయత్నింతుము. అమ్మా ! యనుచునే నీ మొగమువంకఁ జూచుచునే కూర్చుందము. ఏదో యొకనాఁడు నీవు దర్శనమిత్తువు. ఏదోయొకనాఁడు తప్పక నీ దయానుభవము చేయఁగలము. ఆనాఁడు మా దుర్వృత్తములు

శాంతించును. మఱి ప్రయత్నములేకయే నీవీర్యము యొక్క తటస్థలక్షణమును జేరికొందుము. నీవే యరూపరూపమును గొని, మా యాత్మరూపమున - సత్యజ్ఞానానందరూపమున - బ్రహ్మ స్వరూపమున వెలయుదువు. అమ్మా ! అమ్మా ! యనెడి మా పిల్పులు సార్థకములైపోవును. ఆనందముతో "జయ మాతా !" యనుచు జననమరణ సుఖదుఃఖముల దాటి పోదుము. అమ్మా ! ఆ దిన మింకెంతదూరమున్నదో చెప్పుమా; చెప్పవా ?

ఓం. కేనోపమా భవతు తే ఽస్యపరాక్రమస్య
రూపంచ శత్రుభయకార్యతిహారి కుత్ర ।
చిత్తే కృపా సమరనిష్ఠురతా చ దృష్ట్వా
త్వయ్యేవ దేవి వరదే భువనత్రయే ఽపి ॥ ఓం 21

ఓ దేవీ ! ఓ వరదా ! నీ యీ పరాక్రమమునకు సాటియేదీ ? శత్రువులకు భయముగొల్పునది యయ్యును, నతి మనోహరమైన యిట్టి రూప మెక్కడ నున్నది ? చిత్తమందుఁ గృపయున్నను, సమరమందు నిష్ఠురత - యీ ముల్లోకములందు నొక్క నీయందే కానఁబడును.

వ్యాఖ్య :- అమ్మా ! అనంతకోటి బ్రహ్మాండముల సృష్టి స్థితి ప్రలయములు చేయు మహాశక్తివి నీవు. కనుకనే నీ పరాక్రమమునకు సాటిలేదు. ఇఁక జెప్పెడిదేమున్నది ? పక్షాంతరమున - జగత్తునందుఁ బరాక్రమ ప్రభావశాలురనెడి వారి పరాక్రమము, దీనులు దుర్బలులు నైనవారి యెడనే ప్రయోగింపఁబడును. దుర్బలుల కన్నీరుఁ జూపఁబడకున్నచో వారి పరాక్రమము సార్థకము

కాదు. కాని, అమ్మా ! నీ పరాక్రమము పూర్తిగా దీనికి విపరీతము. శత్రువులపై సైతము, అపారకరుణఁ గురియుటే నీ పరాక్రమ ఫలము. కనుకనే, జాగతికపరాక్రమముతో నీ పరాక్రమము సాటి చేయుట కేవల మసంభవము.

దీని తర్వాత నీ రూపము :- అదియు సాటిలేనిదే. భయ జనకత్వము, మనోహరత్వము ననెడి విరుద్ధధర్మములు రెండును గేవలము నీయందే యున్నవి. జగమునం దెచ్చటను నిట్టి పరస్పర విరుద్ధధర్మములు కలిసియుండుట యసంభవము. ఒక్కసారిగా శత్రులకు భయదాయకమును, పుత్త్రుల కానందదాయకము నైన రూపము నీయందే సంభవము. నీకే చెల్లును.

రజోగుణమువల్ల నగు చిత్తవిక్షేపమనెడి శత్రుసమూహము నీ యా రూపహీన రూపసాగరమందు మున్గిపోయి, భయము తోనువలె నందుఁ జేరిపోవును. మఱియొకవంక - ఆ యచింతనీయ రూపప్రకాశముచే, సాధకులప్రాణమం దూహింప రాని యానంద ముబుకును. అమ్మా ! నీ చిత్తమందు మహాకృప యున్నను, వెలిని సమరనిష్ఠురత - శత్రుసంహారమునకై శాణితాస్త్రములను బఱపుట యను నీ విరుద్ధధర్మములు నీ యొక్క తెయందే కనఁబడును. జగత్తునఁ గానవచ్చు రోగము, శోకము, అత్యాచారము, పీడ, దుఃఖము, దారిద్ర్యము మున్నగునది, నీ కనిష్ఠ సంతానమునకు నీ నిష్ఠురతగానే కానఁబడును గాని, నీ స్తన్యపానముచేఁ బరిపుష్టులైన వారు, తోడ్తోనేయుండు నీ చిత్తమందలి కృపను, నీ సమరనిష్ఠురతను గాంచి ధన్యులగుదురు. సమరనిష్ఠురత యనెడి చిక్కని ముసుఁ గులో నీవు గుప్తముఁగా నుంచి, జీవసంతానముపై నీ యవి ల

కరుణాధారలు కురియించుటను వారనుభవింతురు. మఱి సర్వావస్థలయందును నీ కృప యనెడి నిర్మలానందరసమునే పానముచేసి, ప్రఫుల్లులై యుందురు.

ఓం. త్రైలోక్యమేతదఖిలం రిపునాశనేన
త్రాతం త్వయా సమరమూర్ధని తేఽపి హత్వా ।
నీతా దివం రిపుగణా భయమప్యపా స్త
మస్మాక మున్మద సురారిభవం నమస్తే ॥ ఓం. 22

అమ్మా ! నీవు శత్రుసంహారముచేసి ముల్లోకములను రక్షించితివి. సమరక్షేత్రమందుఁ జంపి శత్రువులకు స్వర్గమిచ్చితివి. మత్తెక్కిన దుష్టాసురులవలని భయమును మా కెడలించితివి. అమ్మా ! నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- ప్రతి జీవునియెడ నిమ్మూడు కార్యములు పూర్ణములొనరించి, నీ దయామయీ నామమును సార్థము చేసితివి. ముల్లోకములకును శాంతి, అసురులకు స్వర్గప్రదానము, అసురపీడ వలన మాకు విడుపు, అను నిమ్మూడే నీ కార్యములు. నీ దయ కివి వెలికిఁ గానఁబడు ఫలములు. పలుజన్మముల నుండి మమ్ము బాధించుచున్న కామక్రోధాదుల యత్యాచారములను, సంచితసంస్కారములనెడి యసురులపీడను సైఁప లేకుంటిమి. కనుక నీవు స్వయముగాఁ గత్తిపట్టి మా హృదయమనెడి రణరంగమున నవతరించి, యా యసురకులమును నిర్మూలించితివి. మా చిత్తక్షేత్రమందు అసురభయమనెడి ప్రబల సంస్కారము గట్టిగా

నాటుకొన్నది. దానిచే సంకుచితులమై నిన్ను మనసార అమ్మా! యని పిలువలేకపోతిమి. చిత్తమందుఁ గామక్రోధాది మాలిన్యములును, గృహస్థాశ్రమమును నుండు నంతదాఁక నిన్ను స్మరింపఁజాల మనుకొంటిమి; గాని నేఁడు నీవు సంతానస్నేహముచే బాధ్యవయి, యా మా శంకను దొలఁగించితివి. మా చిత్తసంకీర్ణత యెడమై పోయినది. సంచిత కామనలవలని విక్షోభముననైన యాసురిక చాంచల్యము మఱిపుడు లేదు. మాతృమిలనముపట్ల మున్ను మాకుండిన బాధలయెడ మాలోఁ బెరిగిపోయిన వైరబుద్ధియును నేఁడు నీ స్నేహముచే బవిత్రమై, సజీవమై, నీ పవిత్రాంగమందే చేరిపోవుట కనుగొనుచున్నాము. నీ యపారకృపా ప్రభావముచే నవియు నేఁడు "దివం నీతాః" అయిపోయినవి. భూరాది త్రిలోకములందును నత్యాచారములు చేసి కడు నశాంతిని గల్గించి నవియు నేఁడు నీ యంగమునకు భూషణములే యైపోవుటచేత మా యశాంతియు నేఁడు తొలఁగుటను గ్రహించితిమి. నీవు జగద్రక్షకే సిద్ధముగా నుందువు. నలుదిక్కులఁ గ్రమముగా దాని యాయోజన మగుచునేయున్నది. అమ్మ! నీవు వాఙ్మనస్సుల కతీతవు. అవరిచ్ఛిన్నవు. అయిన నిటులు ప్రతిజీవుని హృదయమందు నీ వింతటి క్షుద్రభావముతో నిన్ను వెలయించు కొందువో! ఔరా! నీ దయ! మాటకును మనసునకు నందదు కదా! మాది - యనుచు మఱేమున్నదమ్మా! కేవల ప్రణామమే. నమస్తే, నమస్తే, నమస్తే.

ఓం. శూలేన పాహి నోదేవి పాహి ఖడ్గేన చాంబికే ।
ఘంటాస్వనేన నః పాహి చాపజ్యా నిఃస్వనేన చ॥ ఓం. 23

ఓం. ప్రాచ్యాం రక్ష ప్రతీచ్యాం చ చండికే రక్ష దక్షిణే ।
భ్రామణే నాత్మ శూలస్య ఉత్తరస్యాం తథేశ్వరి ॥ ఓం. 24

ఓ దేవీ ! శూలము, ఖడ్గము, ఘంటాధ్వని, ధనుష్టంకారము అనువానిచే మమ్ము రక్షింపుము. ఓ చండికా ! ఈశ్వరీ ! నీవు శూలమును ద్రిప్పుచు ప్రాగాది చతుర్దిక్కులందును మా రక్ష యొనర్పుము. (శూల ఖడ్గాదుల యాధ్యాత్మిక రహస్యము మున్ను జెప్పఁబడినది.)

వ్యాఖ్య :- సాధకా ! నీ నలువైపుల నంతటను మాతృ శక్తి - మాత్రాహ్వానము నున్నది. విశిష్ట విశిష్టజ్ఞానము - నాద శక్తియే సర్వత్ర విషయాకారమున వెలయుచున్నది. రమ్ము; మనమును శక్రాది దేవతలవలెనే సరళప్రాణముతో, జాలితోఁ బ్రార్థింతము. అమ్మా ! శూలము, ఖడ్గము, ఘంటాధ్వని, అల్లెటంకారము మున్నగు నీ యన్నియస్త్రములతోను మమ్ము రక్షింపుము. ఎటుచూచిన నటే ఘనీభూతమైన జడత్వమూర్తి కానఁబడుచున్నది. ఈ జడత్వమనెడి మహాసురుని పట్టునుండి మమ్ముఁ దప్పించి రక్షింపుము. ప్రాణస్వరూపవైన నీవే మా నలువైపుల నిండి వెలయుచున్నావనెడి మాటను మేము వేయి యాలోచనలచే సైతము మఱచుచున్నాము. జడత్వముచేఁ గడుఁ బీడింపఁబడుచున్నాము. దాని ఫలితముగానే లక్షల కొలఁది జననమరణములనెడి తిరుగటిఱాళ్లలోఁ బడి నలిగిపోవు చున్నాము. అమ్మా ! మమ్మీ యాపదలవలన రక్షింపుము.

ఎటుచూచిన నటే, ప్రాణస్వరూపిణి మాతృమూర్తి కానవచ్చుట యగునో, విషయజ్ఞానముతోనే విషయములనుభోగించి తాపత్రయాగ్నిచేఁ గాలిపోవుట దేనివలన మాకుఁగాదో యట్టి జడత్వప్రతీతి తొలఁగుటకై నీ యెన్ని విధముల శక్తులను బ్రయోగింపవలయునో, యన్నియుఁ బ్రయోగింపుము.

ఓం. సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యే విచరంతి తే ।
యాని చాత్యర్థఘోరాణి తైరక్షాస్మాం స్తథా భువమ్ ॥ ఓం. 25

ఓం. ఖడ్గ శూల గదాదీని యాని చాస్త్రాణి తే ఽంబికే,
కుపల్లవ సంగీని తైరస్మాన్ రక్ష సర్వతః ॥ 26

అమ్మా ! ముల్లోకములందును అతిసౌమ్యములు, అతి భయానకములు నైన నీ రూపము లెన్ని సిద్ధముగా నున్నవో యన్నిటి తోను, మమ్ములను ఈ విశ్వమును రక్షింపుము. అంబికా ! ఖడ్గ శూల గదాదులైన యస్త్రములు నీ చేతులం దెన్ని యొప్పునో, ఆ యన్నిటితోను మమ్మెల్లవిధముల రక్షింపుము.

వ్యాఖ్య :- అమ్మా ! ఈ జగత్తునందు నీ మూర్తి రెండు విధములఁ గానఁబడును. ఒకటి సౌమ్యము; ఒకటి ఘోరము. పార్థివములు, నపార్థివములు నైన సర్వవిధ సుఖసామగ్రిని గొని, నీవు సౌమ్యమూర్తితో మమ్ముల నాడిని వేసికొని, కూర్చున్నపుడు, మేము, సుఖమోహముచే నీ స్నేహస్పర్శమును మఱువనీయకుము. పార్థివభోగమైన యైశ్వర్యము, అపార్థివములైన సిద్ధిశక్తులు, లేదా స్వర్గాధిసుఖము, మమ్ము ముగ్ధులను జేయనీయకుము. అమ్మా ! ఈ ముగ్ధతచేతఁ జిక్కకుండ నీ సౌమ్యమూర్తితో మమ్ములను

గాపాడుము. సర్వవిధ సుఖరూపముతోను నీవే సిద్ధముగా నుందు వనెడి మాట, ఎప్పుడును మాలోనుండి జాఱిపోకుండఁ జూడుము. మఱి దుఃఖదుర్దశ యనెడి యమావాస్యా కాలరాత్రి క్రమ్మినపుడు, రోగ శోక దారిద్ర్య మృత్యు భయములచేఁ బీడింపఁబడినపుడు, నీవే ఘోరమూర్తితో వచ్చి మమ్ముల నాడినుంచుకొంటివని తలపింపుము. అపుడు మఱి నీ భయానకమూర్తిని జూచి మేము భయపడము. దుర్బలులము కాము. దానిచే నీ యస్తిత్వమందును, నీ మాతృత్వమందును మఱి సంశయము రవ్వంతయు నుండదు. ఎన్ని ఘోరమూర్తులతో నీవు ఆవిర్భవించినను సరే, ప్రకృతి యెంత ప్రతికూలవేదనముతో సిద్ధమైనను సరే, "నీవే నిజముగా మా యమ్మ" వనుచోట అపనమ్మకము గలుగదు. అమ్మా ! ఈ జీవనచక్రము సదా పరివర్తనశీలము. సుఖ దుఃఖ పరివర్తన మెల్లప్పుడు నగుచునే యుండును. వానిలోనే నీ సౌమ్య ఘోర మూర్తుల ప్రకాశము. ఈ రెండు మూర్తుల తోను మమ్ము రక్షింపుము. కేవలము మమ్ములనే కాదు, "తథా భువమ్" ఈ విశ్వమంతట వ్యాపించియున్న జీవుల నందఱిని రక్షింపుము. అమ్మా ! నీవే సుఖదుఃఖాకారమున వత్తువనెడి మాట ప్రతిజీవుని మర్మమర్మమం దంకితము చేసి వేయుము. దీనిపేరే రక్ష. ఎట్టి యవస్థయందును జీవుఁడు తనను నిరాశ్రయునిఁగాను, అనాథునిఁగాను దలంప కుండునట్లు చేయుటకై యెన్ని విధముల యస్త్రములు పఱచు టావశ్యకమో, యన్నియుఁ బఱపుము. సర్వాయుధధారిణీ ! మా యమ్మా ! నీ సర్వాయుధములను బ్రయోగించి మమ్ములను రక్షింపుము. "రక్ష సర్వతః" ఈ సర్వభావములవలన, బహు భావములవలన మమ్ము రక్షింపుము. సచ్చిదానందమయివి నీవొక్క

తవే సర్వభావములతోఁ బ్రకాశింతువు. నీవు తక్క సర్వ - బహు, అన నేమియు లేదనెడి యీ సత్యమునందే మమ్ము స్థాపింపుము. మేము సర్వావస్థ లందును సత్యాశ్రితులము, సత్యస్థితులము, అను నిమ్మహాజ్ఞానరూపముతో నీవు ప్రతి జీవుని హృదయ మందును గట్టిగా నెలకొనుము. అమ్మా ! దృఢప్రతిష్ఠిత వగుము. అమ్మా ! జగత్తునుండి దుఃఖభయము నెన్నటికిని దొలఁగి పోవును.

ఓం. ఏవం స్తుతా సురైః సర్వైః కుసుమై ర్నందనోద్భవైః ।
అర్చితా జగతోధాత్రీ తథా గంధానులేపనైః ॥ ఓం. 27

ఓం. భక్త్యా సమస్తై స్త్రిదశై ర్దివ్యై ర్ధూపైస్తు ధూపితా ।
ప్రాహప్రసాదసుముఖీ సమస్తాన్ ప్రణతాన్ సురాన్ ॥ ఓం. 28

దేవత లీ విధముగా జగద్ధాత్రి నమ్మను గొండాడి, నందన వన దివ్యపుష్పములతోను, గంధానులేపనములతోను బూజించిరి. దేవతల్లెలరు భక్తిసహితులై దివ్యధూపములచే దేవిని సౌరభాకు లితను జేసివేసిరి. పిదపఁ బ్రసన్నవదనయై దేవి, ప్రణతులైన దేవతల కిట్లనెను.

వ్యాఖ్య :- ఇంద్రాది దేవత లీవిధముగా స్తుతించి గంధ పుష్పాదులతో, జగద్విధాన మొనర్చు దేవిని బూజించిరి. ఆధ్యాత్మిక దృష్టితో సైతము - ఇంద్రియాధిష్ఠిత చైతన్యవర్గము, ఆనందమయ సాత్త్వికభావములనెడి వందనకుసుమములతోను, వివేకాగ్నిచే జ్ఞానకర్మేంద్రియములఁ గాల్చఁగాఁ బుట్టిన సురభి ధూపములతోను, శ్రద్ధా నిర్మమతా శుచితా వైరాగ్యాది గంధానులేపములతో జగద్ధాత్రి నమ్మను బూజించిరి. దేవియు నిట్టి పూజల కలరి వరము

లీయఁగడగినది. ఇచటఁ బూజాసంబంధమున నొకటి రెండు మాటలు అప్రాసంగికములు కావు.

గీతలందు - "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి" ఇది దేవీమాహాత్మ్యమందును బలుతావులఁ బుష్పాదులతోడి పూజ యుల్లేఖింపఁబడినది. ఇంతేగాక, స్మృతి సంహితా పురాణాదులందుఁ బూజావిధానము పలువిధములఁ జెప్పఁబడినది. గాని మఱికొన్ని చోట్ల "బాహ్య పూజాధమాధమా" అని యున్నది. కొందఱీ యుపదేశము ననుసరించి కర్మకాండమును బూర్తిగా విడిచిపెట్టి కేవల ధ్యానసహాయముతోఁ బరమాత్మ సాక్షాత్కారమునకై ప్రయత్నింతురు. ఈ సంబంధమున మనమేమి తెలిసికొనవలయును ?

మనము ఆహార నిద్ర లున్నంతవఱకు, అనుకూల ప్రతి కూలబోధ మున్నంతవఱకు, పిన్న పెద్ద జ్ఞాన మున్నంతవఱకు బాహ్యపూజ యుండనే యుండును. కేవలము పూలు, కుంకు మము, మారేడుపత్రి విడుచుటతోనే బాహ్యపూజ వదలిపోదు. ఎట్లయినను బాహ్యపూజగానే పూజ ముగిసిపోకుండ లక్ష్య ముంచవలయును. బాహ్యపూజ నిజముగా నధమముకంటె నధమమనుట సత్యము. శ్రుతియందును - ఉపాస్యుఁడొకఁడు, ఉపాసకుఁడొకఁడు అను నిట్టి భేదబుద్ధి నాశ్రయించి, దేవపూజ చేయువారు దేవతలకుఁ బశువులు - అని యున్నది. మఱి భగ వంతుఁడును దానే "అన్య దేవతలఁ బూజించుటనునది, అవైధ (విధిరహిత - విరుద్ధ) పూజ యైపోవు" ననెను. "పరిచాయ పురాదేవం దేవపూజాపరో భవ । తావత్పూజాం న మనుతే యావత్పరిచయో

నహీ" (వి ॥ చం॥) భేదజ్ఞానముతోడి పూజయే బాహ్యపూజ. 'బాహ్య' అనఁగానే, యేదో యొక ఘనబోధ ముండునంతదాఁక, యథార్థ పూజ కధికారమే యుండదు. "బాహ్యమనుచు నేమియులేదు. సర్వము నంతరమందేయున్నది" అను జ్ఞానము నందుఁ బ్రతిష్ఠితుఁడగుటచే, మఱి బాహ్యపూజ యుండనే యుండదు. ఇది నోరితో నన్నంతనే సరిపోదు. ఈ జగత్తును అంతరముగా నెంచి యనుభవింపవలయును. ఇదిగో, ఆ యంతర బాహ్య భేదజ్ఞానము నంతరింపఁజేయుటకే సర్వారాధనములు పూజలు సాధనలు పుట్టినవి. స్థూలమూర్తి సహాయముతోఁ బూజచేయుటచే సులభ ముగా అంతర బాహ్య భేదజ్ఞానము తొలఁగిపోవును. జ్ఞాన భక్తి కర్మము లొక్కసారిగా ననుశీలించుట కింతకంటె సులభో పాయము మఱొండుతోఁపదు. ఉన్నచో ఋషిపుంగవులు ఈ దేశమం దిట్టి మూర్తిపూజా ప్రచారము చేయనే చేయరు. అది యుండనిండు.

ఈ యంతర బాహ్య భేదజ్ఞానము తొలఁగనంతదాఁక, దేవత యెవ్వరో తెలియనే తెలియదు; గనుక నెవరి పూజ చేయుదువు ? "దేవే పరిచయో నాస్తి యది పూజా కథం భవేత్" మఱియు, "జాతే సరిచయే దేవే పూజామపి న కాం క్షతి" దేవతతో బరిచయమైనపుడు మఱి పూజ చేయు నిచ్ఛయే చేయఁడు. కనుకనే "ఉభయోరపి పక్షయోః పూజాం పశ్యామి దుర్ఘటామ్" ఉభయపక్షములందును బూజ సంభవమే కాక పోవును. పూజ - పూజించువాఁడు, పూజ్యము అనెడి భేదజ్ఞానముతోఁ బూజచేయుటవల్లనే, అది యజ్ఞానముతోడి యధమ పూజ యగును. గాని మన 'ప్రాణము', మన 'నేను' అను దాని పూజనే చేయుచున్నామనెడి బోధముతోఁ బూజించునపుడు,

ఆ పూజ వ్యర్థముకాదు. ఈ విధముగా నభేదమందు భేదజ్ఞాన ముతోఁ బూజచేయ మొదలిడుటచేతనే క్రమముగా భేదజ్ఞానము సడలిపోవును. పూజకు విఘ్నములును వచ్చును. విధి లంఘన మగును. శాస్త్రోక్తపూజాక్రమమును మఱపగును. ధూపమునకు బదులు పూలు వేయుటగును. అయినను అదియే పూజాఫలము. కనుకనే "దేవ ఏ వేతి ధియా విస్మృతే పూజనక్రమే। పూజాయాంజా యతే విఘ్నః పూర్ణపూజాఫలం లభేత్ ॥"

ఇక్కాలమందును నీ దేశమున లక్షలకొలఁది స్త్రీ పురుషులు పూజ చేయుచున్నారు. ఆ పూజ కేవలము నిష్ఫలము కాదుగాని, విశేషించి యున్నతి లభింపదని తోఁచును. సామాన్య దైనిక కార్యమువలెనే పూజయు సాగిపోవుచున్నది. ఇఁకఁ గేవల ధనాద్యాశలతోఁ బూజాభిసయము చేయువారి మాట చెప్పనే మున్నది ? అది వేఱు. ఎందుల కిట్లగుచున్నది ? పూజలు చేసియు జ్ఞాన భక్తుల నేల పొందకున్నారు ? అది పూజ్యదేవతతోఁ బరిచయము లేమినే. ఎవరిని బూజించుటో, వారి నెఱుఁగరు. వారెవ్వరో, ఎక్కడ నెట్టి భావముతో నున్నారో యది యెఱుఁగరు. ఎందుకో, ఏమిటో, పూజ యభ్యాసమైపోయినది. అందుకే పూజించు చున్నారు. ఇది కారణముగానే పూజలు, ఆశానురూప ఫలముల నీయకున్నవి.

ఈ దేశమందు నిత్యక్రియయైన పూజ కర్మకాండమైనను నొక మృతకర్మమే యైపోయినది. మఱల నెప్పుడో యీ దేశ కర్మకాండము, జ్ఞానపరాభక్తులందుఁ బ్రతిష్ఠింపఁబడి సజీవమైన యెడల, దేశమందలి హాహాకారములు, లేమి, పీడ మున్నగున వన్నియుఁ దొలఁగునని తోఁచును. ఒక్కసారి ధర్మ నిర్మలరసా

స్వాదము చేసెనేని, లోకము మఱి ధర్మహీనము కానేరదు. ధర్మహీనులు కాకున్నపుడే సర్వసుఖములును మనుజులకు సులభములు. ఈ యుత్తరదాయిత్వము ముఖ్యముగా బ్రాహ్మణులపై నిర్భరమైయున్నది. ఏలన - బ్రాహ్మణులపైనే ప్రత్యక్షముగానో పరోక్షముగానో కర్మకాండము నేఁటికిని నిల్చియుండుట కనుచున్నాము. వారే యీ ప్రాణహీనమైన కంకాళముతో నున్న కర్మకాండమునకుఁ బ్రాణప్రతిష్ఠ చేసి, మఱల సజీవమును సాఫల్యమయమును జేయఁగల్గిరేని, వారాదర్శభూమిపై నిల్చి సోదర జీవుల నాదరముతోఁ బిల్చి గౌరవింపఁబడుదురు. సర్వము ధర్మమయమగును. సర్వము ధర్మ్యకర్మమయము కాఁగలదు. సర్వకర్మములును జ్ఞానమయములే యగును. జ్ఞాన పరాభక్తి ధారచే సర్వము మధుమయము కాఁగలదు. ఈ విశ్వరాజ్యము ధర్మరాజ్యముగఁ బరిణమింపఁగలదు. అసత్యము తొలఁగిపోయి సత్యప్రతిష్ఠ కాఁగలదు. ఈ యాశతోనే సత్యప్రాణ ప్రతిష్ఠా రూపయై, యమ్మ వరాభయహస్తములతో మన యెదుట నిల్చియున్నది. (నా ('దేవపూజరహస్య' గ్రంథము చూచునది.)

సాధకా ! అదిగో; దేవతలపూజచే మన యమ్మ ప్రసన్నయై పరములీయ సిద్ధపడినది. "ప్రాహ ప్రసాదసుముఖీ సమస్తాన్ ప్రణతాన్ సురాన్" పూజించి ప్రణతులగుట చేతనే, అమ్మ ప్రసన్నయైనది. ఇదిగో, కేవల దేవతల పూజానమస్కారములతోనే తృప్తి నొందుననియు, భక్తిహీన శ్రద్ధాహీన విశ్వాసహీన దుర్బల సంతానము చేయు పూజాప్రణతుల నామె యాదరముతో నందు కొనదనియుఁ దలంపరాదు. ఈ విశ్వాసము లేని యుగమందు సైతము వరాభయములిచ్చి యాదరించునా ? యనరాదు.

సాధకజీవులారా ! రండు. మంత్రహీన క్రియా హీనులమైన మనమెల్లరముఁగూడి, అమ్మా! యనుచు నామె చరణములందు భక్తినమ్రులమై పోవుదము. అమ్మ ముమ్మాటికి నిశ్చయముగ మనకును బ్రసన్నయగును.

ఓం దేవ్యువాచ ఓం.

ఓం. వ్రియతాం త్రిదశాః సర్వే ।
యదస్మత్తో ఽ భివాంఛితం ॥ ఓం. 29

ఓం దేవా ఊచుః ఓం.

ఓం. భగవత్యా కృతం సర్వం న కించి దవశిష్యతే ।
యదయం నిహతః శత్రురస్మాకం మహిషాసురః ॥ ఓం. 30

దేవతలారా ! మీరు నావలన వలచిన వరము లందు కొనుఁడు ("దదామ్యహ మతిప్రీత్యా" యనెడి యర్ధశ్లోకము మూలసంహితయందు లేదు.)

దేవత లనిరి :- భగవతివలన సర్వకార్యములు పూర్ణమైనవి. మా శత్రువు మహిషాసురుఁడు చంపఁబడెను గాన, నింతయు మిగులు లేదు.

వ్యాఖ్య :- సరిగా నిటులేయగును. అమ్మ విశిష్టభావముతో నావిర్భవించి వరములీయఁబూనినపుడు సంతాన మిట్లనకుండదు. 'లేదమ్మా ! మతేమియుఁ గొదువలేదు. మే మేమియుఁగోరము' పూర్ణస్వరూపవు నీవు మా యెదుర నిల్చితివి. ఇఁకఁ గోరఁదగిన దేమున్నది ? ఈ విధముగానే నీవు మా యెదుట నుండుము.

హృదయము పరిపూర్ణమై పోయినది. మఱి కోరిక లేదు. సదా నీవే మాయెదుర నిల్పువము. లోలోపలి భాగమెంత వెదకినను మఱి లేమి కానఁబడదు - 'న కించి దవశిష్యతే'.

సాధకులకే యీ యవస్థ కల్గును. కామనావాసనలతో నెన్ని పూజావ్రతములు చేయనీ; అమ్మ దర్శన మొక్కసారి యైనచో మఱి మనసున రవ్వంతయుఁ గోర్కి యుండదు. 'సర్వము లభించె, నింకేమి కోరుకొందు' నని తోఁచును. బాలయోగి ధ్రువునకుఁగూడ నీ యవస్థయే యయ్యెను. రాజ్య కామనతోనే సాధన మారం భించెను, గాని కమలలోచనుఁడు సాక్షాత్కరింపఁగానే, "ప్రభువా ! పరమేశ్వరా ! గాజుముక్కకై వెదకుకొనుచున్న నా చేత నమృత పానము చేయించితివి. నా కెట్టి కోరికయు లే" దనెను.

సాధకా ! ఇట్టి సంఘటన మెన్నఁడేని, ఎట్టి భాగ్యవంతుఁ డైనవానికేని కాఁగలదా ? అనుకొనకుమా. అటు లెన్నఁ డును గాదు. ప్రతి మనుజుఁడును బ్రతిదినము నిటులు భగవత్సాన్నిధ్యము నొందఁగలఁడు. పూర్ణత్వము ననుభవింపఁగలఁడు. అసంభవము నసాధ్యము నిందేదియు లేదు. భగవంతుఁడు సర్వదా సర్వత్ర సుప్రకటుఁడు సుప్రసన్నుఁడునై యున్నాఁడు. కోరినంతనే కానఁబడును. "దీర్ఘకాల తపఃఫలముగానే, యెక్కడనో యెవనికో భగవద్దర్శనము కాఁగలదు" అనెడివారి తాత్పర్యము వేఱు. "యథార్థముగ భగవంతుఁడు నాకుఁ గావలయును" అనెడి యొక కోరికను రేఁగఁగొట్టుటకే దీర్ఘకాలము - దీర్ఘకాల మననేల ? అనేక జన్మములందు సాధన చేయుట తప్పదు. ఏ మనుగడయందే నిట్టి

కోరిక యాభాసించెనేని, వాఁడచిరముగానే యభీష్టసిద్ధి నొందఁ గలఁడు. అది యట్లుండనీ.

ఈ మంత్రమునకు మఱియొక గూఢార్థమున్నది. "భగవత్యా కృతం సర్వం న కించి దవశిష్యతే" ఇందలి నజర్థకము పూర్వార్థ ముతో నన్వయించినచో, మఱియొక విధముగా నర్థమగును. "భగవత్యా సర్వం న కృతం, కించి దవశిష్యతే" అమ్మా ! నీవు మా కొఱకెంతో చేసితివి కాని, కార్యమంతయుఁ బూర్ణము కాలేదు. కొంత మిగులున్నది. మహిషాసురవధముచే జీవత్వము పూర్ణముగాఁ దుదముట్టలేదు. శుంభవధ మావశ్యకము. (అస్మితానాశమావశ్యకము.) కనుక దేవతలు 'కించి దవశిష్యతే' యనిరి.

ఓం. యది వాపి వరో దేయ
స్త్వయాస్మాకం మహేశ్వరి ।
సం స్మృతా సంస్మృతా త్వం నో
హింసేథాః పరమాపదః ॥ ఓం. 31



ఓం. యశ్చ మర్త్యః స్తవైరేభి
స్త్వాం స్తోష్యత్యమలాననే ।
తస్య విత్తర్ధి విభవై
ర్ధనదారాది సంపదామ్ ॥ ఓం. 32

ఓం. వృద్ధయేఽస్మత్ ప్రసన్నా త్వం ।
భవేథాః సర్వదాంబికే ॥ ఓం. 33

ఓ మహేశ్వరీ ! నీవు తప్పక మాకు వరము లిత్తువేని, మేము నిరంతరము నీ స్మరణము చేయఁగల్గునటులును, దాని ఫలముగ మా మహాపదలెల్లఁ దొలఁగిపోవునట్లును జేయుము. ఓ యమలాననా ! అంబికా ! ఈ స్తవములతో నిన్నుఁ గొండాడు మనుష్యుని యెడ సదా ప్రసన్నవగుము. మఱియు, జ్ఞానము, ఐశ్వర్యము, సంపత్తి, ధన పుత్త్రాదిక మంగళముల నొసంగుము.

వ్యాఖ్య :- బిడ్డలు తల్లిని జూచునపుడు విస్మయానందలతో నొడలు మఱతురు. కోరికొనుట కేమియు దొరకదు. కాని, అమ్మయుఁ దన బిడ్డల లేములను, అభియోగములను సర్వము నెఱుంగఁగలదు. సర్వమును జూడఁగల యామె ముక్కన్నుల కింతయు నెక్కడను మఱుఁగుకాఁజాలదు. కనుకనే అమ్మ తానే వరములిత్తు ననుచు, బిడ్డల హృదయమందు, మున్ను మఱపైన లేములను క్షణములోఁ దలఁపించినది. ఇటులే యగుచుండును. తొలుతటి దర్శనమువల్లనే సాధకుని కొదువలెల్ల మఱపైపోవును. ఏలన - మన యమ్మ పూర్ణతమ; ఆ వెనుక మెల్లమెల్లఁగా, ఆ భావము వచ్చిపోవుచుండును. ఒక వంక - అమ్మ అప్రకట యగునపుడు, ఆమె యభావమూర్తి వెలయుచుండును. ఈ యభావజ్ఞానము గల్గుట పేరే, వరప్రార్థనము. అమ్మ నెదుట నుంచి కొన్నపుడు, అనఁగా - అమ్మ యెదుర నిల్చినపుడు, అభావబోధము రేఁగెనేని (లేములు తోఁచునేని) శీఘ్రముగానే యవి వెల్తి తొలఁగిపోవునని గ్రహింపుము. అమ్మ తన బిడ్డ నెయ్యముచే, నోరితో నేమియు నన కున్నను సంతాన హృదయములో దాఁగి యున్న యభావబోధ మనుదొలఁగించునంతగా ముగ్ధయగును. వెనుక

ముందులుచూడక కోరిన వరములిచ్చి ధన్యుల నొనర్చును. గాని, మనమో - బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును ధ్యానగమ్యకాని యామె సన్నిధిని నిల్చియు, అతితుచ్ఛములైన యభావాభి యోగముల పట్టిక సిద్ధముచేసి యందిచ్చునంతటి కృతఘ్నులము, సంకీర్ణ హృదయులమునైన బిడ్డలము. అమ్మా! ఈ మా హృదయ సంకీర్ణత యింకేనాఁటికిఁ దొలగింతువో ?

సాధకా ! రమ్ము. సాధకులారా ! రండు. మనమును దేవతలవలెనే "ఓ మహేశ్వరీ ! నీవు మా పరమాపదలనెల్లఁ దొలఁగింపుము. దానిచే నిన్ను మేము సదా స్మరింపఁగలము." అని మొఱలిడుదుము.

'పరమాపద' శబ్దముచే - పరమమునకైన యాపదయను కొందుము. అనఁగా మనకుఁ బరమస్వరూపలబ్ధివిషయమున బాధకములైనవే పరమాపదలు. "మేము సదా పరమాత్మ రూపమందే నిల్తుము" అనెడి బ్రాహ్మీస్థితికిఁ బ్రతి కూలములైన విఘ్నములే పరమాపదలు. ఒక్కమాటలో - అమ్మను మఱచుటే పరమాపద యని తెలిసికొనుఁడు. అమ్మా! నీవింత నికటమందుఁ బ్రత్యక్షవుగా నున్నను, నిన్ను మఱచి జాగతికధూళు లలముకొని శాంతుల మగుచున్నాము. మా కింతకంటె విపత్తి యేది కాఁగలదు ? కనుకనే, అమ్మా ! "సంస్మృతా సంస్మృతా త్వం నో హింసేథాః పరమాపదః" అని ప్రార్థించుచున్నాము. దీనివలన మేము నిన్ను మాటిమాటికి స్మరింపఁగలము. తత్ఫలముగా మాకుఁ బరమ స్వరూప విషయమున వర్ధంతులు కావు.

మఱొక్కమాట - ఇట్టి నీ చిర్నగవుతోటి నిర్మల ముఖమును, ఇట్టి స్నేహమయమైన యంబికామూర్తిని జగత్తునం దెల్లరు దర్శించి ధన్యులగుదురు. లోకమున దురాచారు లనఁ బడువారెల్లరును ఈ స్తుతి సహాయమున నీ నిత్యప్రసన్నత నొందగలరు. తత్ఫలముగా ధనదారాదులనెడి భోగమును జ్ఞానైశ్వర్యములనెడి యపవర్గమును బడసి ధన్యులగుదురు. ఈ జీవజగత్తు మరణశీలమైనను, నీ కృపచే నమరత్వము నాస్వాదించును. నీ వీ విధముగాఁ బ్రతి జీవహృదయ మందును భోగమోక్షము లొనఁ గూర్చు నిత్యప్రసన్నాంబికా మూర్తితో నావిర్భవింపుము. జగత్తు నుండి దుఃఖరోదనము లెన్నటికిని దొలఁగిపోవును. మమ్ముఁ జూడుమమ్మా !

విచారించి చూడుమమ్మా ! నీ జీవసంతానవు మోక్ష విషయము కడుదూరము. పోనీ; భోగించుటయు నెఱుఁగదు. కేవల భోగాశతో సంచయముచేయుచు ననుక్షణము వినాశ చింతతోను, అభావపీడతోను నలిగిపోవుచున్నది. ఆ కుటీంట వసించి ముతుకయన్నముఁ దిను భిక్షుకుఁడు మొదలు రాజభవనములందు వసించి రాజభోగములతోఁ బెరుగు ధనవంతుల వఱకు నెల్లరును అభావగ్రస్తులే. లేమిచేఁ జిక్కినవారే. ఎవ్వఁడును విషయభోగముచేఁ దృప్తినొందఁడు. భోగోపభోగ సమీపమందే యుండును. ప్రాణము లొడ్డియైన భోగ్యసామగ్రిని గూర్చు కొనుచునే జీవనము గడపి వేయును. నిజముగా భోగించుటైన నెఱుఁగఁడు. కనుకనే నీ వొక్కసారి భోగమయీమూర్తితో దర్శనమిమ్ము. మనసార నొక్కసారి మాతృస్నేహమనెడి విషయమును భోగించి తృప్తులమగుదుము. ఈ విశ్వమును గ్రమ్మిన పెల్లాఁకలి యడఁగిపోవును. అపుడు నీవు

అనాయాసముగా జ్ఞానైశ్వర్యముతోఁ గూడిన యపవర్గప్రదాయినీ మూర్తితో నిన్ను వెలయించుకొని జీవుల కమరత్వాస్వాదము భోగింపఁ జేయుము. అమ్మా! మా యీ క్షుద్రబుద్ధులకుఁ గోరఁదగిన దింతయు లేదు. నీవేమియు మిగుల్పలేదు. కేవలము నీ చరణము లందుఁబడి, అమ్మా! విశ్వమునకు మంగళమగుఁగాక యని చాల మొఱపెట్టుచున్నాము.

ఓం ఋషిరువాచ ఓం.

ఓం. ఇతి ప్రసాదితా దేవై ర్జగతో ఒర్థే తథాత్మనః ।
తథేత్యుక్త్వా భద్రకాళీ బభూవాంతర్హితా నృపా ॥ ఓం. 34

ఋషి యనెను :- రాజా ! సురథ ! దేవతలచే నిట్లు స్తుతింపఁబడి ప్రసన్నయై జగద్ధాత్రిదేవి, 'తథాస్తు' అని యంతర్హిత యయ్యెను.

వ్యాఖ్య :- జగన్మంగళార్థము అనాదికాలమునుండి దేవబృంద మీవిధముగా దేవిని బ్రసన్ననొనర్చుకొను నుద్దేశ్యముతోఁ బలువిధముల సాధనలను - స్తవస్తుతులను జేసిరి. జగములకు మంగళములగుటచేతనే వారికిని (వేల్పులకు) మంగళములగును. ఆత్మయే జగదాకారముతోఁ బ్రకాశించి యెల్లప్పుడు తాపత్రయ దుఃఖము ననుభవించుట యనెడి కల్పితాభినయము చేయు చుండును. ఈ దుఃఖమును దొలఁగించుటకై యాత్మనే ప్రసన్నముఁ జేసికొనుట తప్పదు. ఆత్మ మన యమ్మ నిత్యపూర్ణము, నిత్యతృ ప్తయుఁ గదా. ఆమె నెట్టిదుఃఖము నంటదు; అని యెన్నఁగల్గుట

చేతనే ఆత్మకుఁ బ్రీతి కల్గును. తత్ఫలముగా నీ విశ్వము శుభము లందును. సరే, దేవతల ప్రయత్నమువలన మంగళమయి భద్రకాళి, అమ్మ ప్రసన్నయైనదని కన్గొంటిమి. దేవతలు విశ్వమంగళమును గోరికొనిరి. అమ్మయు 'తథాస్తు' అని యంతర్ధానయైనది.

సాధకజీవుఁడా ! ఇది కల్పనకాదు. ఉపాఖ్యానముకాదు. ఇది కేవల సత్యఘటనము. వ్యష్టియందు - ప్రతిజీవుని హృదయమందు నిట్టిఘటన మగుచున్నటులే, సమష్టియందును దేవతా బృందము జగన్మంగళమునకై యమ్మను బ్రసన్నను జేయుటకీ విధముగాఁ బ్రయత్నించెను. ఇక్కాలమున నిట్టి సంఘటనమెవ్వరి హృదయ మందును గాకున్నను, ఇట్టి సంఘటనమును గాంచుటకే కడు నుబలాటము కలిగెనేని సరళప్రాణముతో నన్వేషింపుము. అమ్మ యెదుర నిల్చి ప్రార్థింపుము. ఆ మహాసమ్మేలన క్షేత్రమును జేరఁగలవు. ఆ దేవలీలయందు సహచరుఁడవై జీవనముఁ బవిత్రము చేసికొనఁ బ్రయత్నించినచో నేమి హానియున్నది ?

ఇది మార్కండేయ పురాణాంతర్గత దేవీమాహాత్మ్యమందు
ద్వితీయ చరిత్రమున, మహిషాసుర వధానంతరము,
శక్రాది దేవతలు చేసిన దేవీస్తుతికి,
శ్రీకాకుళవాసి, శ్రీ శ్రియానందనాథుఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ వ్రాసిన వ్యాఖ్య.
శ్రీ పరదేవతార్పణము.



శ్రీమాత్రే నమః

# సాధన సామగ్రి

## శుంభాసుర నిధనమునుగోరిన దేవతలు చేసిన దేవీస్తుతి.

మహిషాసుర వధానంతరము ఆ యపరాజితాదేవి ప్రసన్నయై "మీ కెప్పు డే విపత్తివచ్చినను నన్ను స్మరించినచో మీ యాపదల నన్నిటిని నేను దొలఁగింతు" నని వరమిచ్చినది. ఇపుడు శుంభ నిశుంభాసురుల యత్యాచారముచేఁ బీడితులై, పరాజితులై స్వర్గమునుండి నెట్టివేయఁబడిన దేవతలు, అమ్మ యభయవర వాణిని స్మరించుకొని యమ్మను స్తుతింపఁగడఁగిరి.

(దేవతలు, చైతన్యముయొక్క విశిష్టాభివ్యక్తి మాత్రములని, చైతన్య మనఁగా - చిచ్ఛక్తి (అమ్మ యని, తాము మాత్రంకమందు (చైతన్యమందు) సర్వవిధములఁ బ్రతిష్ఠితులని - మున్నె వివరింపఁ బడెను.)

చూడుము. నీ వెచట నెట్టి యవస్థయందైనను సరే, నీ విషయమున, నీ యింద్రియాధిష్ఠిత చైతన్యవర్గవిషయమున "నేను" అనెడి యహంకారమే శుంభాసురుఁడు. వీఁడున్నంత దాఁక "అమ్మ - నేను" అను రెండిటియందు నొక తెగని వ్యవధానము వెలయుచుండును. ధ్యాన ధారణాదులే కానీ, సమాహితావస్థయే కానీ, నీ సూక్ష్మాహంకారము నిర్మల మాతృ వక్షమునుండి నిన్ను దవ్వు నెట్టివేయును. నీ హృదయసింహాసనము నందు, ఈ యస్మిత యనెడి శుంభాసురుఁడెక్కి కూర్చుండి, నిన్ను హృదయరాజ్యము

నుండి తొలఁగించుటే, శుంభుని (అస్మిత) యత్యాచారము. వాని తమ్ముఁడు నిశుంభుఁడు (మమత).

ఇంతవఱకు, మధుకైటభ, మహిషాసురపీడ (బహుత్వవాంఛ, బహుత్వానందము, రజోగుణము, తజ్జన్యసంస్కారములు, అనువానివలని పీడ) మాతృకృపచేతను, శ్రీగురుని యవ్యాజకరుణ చేతను స్థూలేంద్రియాత్యాచారము, స్థూలహంకారము తొలఁగినవి. కాని, అస్మిత, మమత (శుంభ నిశుంభల) వలని పీడ సైఁపలేక, నాఁటి వరదానమును స్మరించి, స్తుతించుచున్నారు. ఈ యహంత (అస్మిత) విజ్ఞానమయకోశము నంటిన యహంకారము.

సాధకులారా ! రండు; దేవతలవలెనే మనమును, అమ్మా ! అమ్మా ! యని యేడ్తము. మన కాతరక్రందనముచే అమ్మ స్నేహవిహ్వలయై యీ దుర్జయాహంత చేతినుండి తప్పించి రక్షించును. మనకు రాఁబోవు విపత్తి అమ్మ యెఱుఁగను. కనుకనే పరిత్రాణమును సూచించినది. పరమాత్మస్వరూపము నుండి దూరమైపోఁగలరు బిడ్డలని యెఱిఁగియే తల్లి వరదానము చేసినది. రండు; తల్లిని స్మరింతము.

అని బుద్ధిని స్థిరపఱచుకొన్న దేవతాగణము, కొండల రాయఁడైన హిమవంతుని కడఁజేరి, దేవిని విష్ణుమాయను (హైమవతిని) స్తుతింపఁ దొడఁగెను.

దేవతలు హిమాచలనమునకుఁ బోవుట యను దాని రహస్యము - దేహాత్మ బోధనమునకు దిగుటే (హిమాలయము దేహాత్మబోధము). సూక్ష్మ విజ్ఞానమయకోశమందు అసురుల యత్యా

చారముల ననుభవించి దేవతలు స్థూలమందు (దేహాత్మబోధ మందు) అవతరించి. దేహాత్మ బోధము లేక స్తవాదులు కాఁజాలవు. స్థూలదేహముతోనే సర్వకర్మములు పూర్ణములగును. కనుకనే దానికి 'ధర్మక్షేత్రము, కురుక్షేత్రము' అని పేరయ్యెను. సూక్ష్మ దేహమందెట్టి కర్మములును గాఁజాలవని యెఱుంగవలయును. ఈ స్థూల దేహముతోనే యగు కర్మ సహాయముచేత, తీవ్ర వేగావలంబనము చేసి, సూక్ష్మక్షేత్ర పర్యంతము నతిక్రమించి, విశుద్ధ బోధస్వరూప పరమాత్మ క్షేత్రమందుఁ జేరికొనఁగల్గును. కనుక, స్తుతిమంగళ పాఠము సర్వశ్రేష్ఠ సాధనము.

**ఓం. నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః ।**
**నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాస్మతామ్ ॥ ఓం.1**

దేవికిఁ బ్రణామము. మహాదేవికి శివకు నిరంతరము మా మ్రొక్కు. భద్రాప్రకృతికి మా జోత. మేమందఱము నా మనోవాగ గమ్యకు మ్రొక్కుచున్నాము.

వ్యాఖ్య :- చూడుఁడు; అమ్మను దేవతలు స్తుతింప నారంభించి తొలుదొల్త నమః యనుచు, అహంతాపూర్వకముగా వినతియొనర్చిరి.

తొల్త మాతాపిత్రాది గురుజనమునకును, దరువాత దేవ మందిరములకును, అందలి దేవతలకును మ్రొక్క నేర్చి కొన్నాము. శిరమునం దంజలిఘటించియో, తల నేలమోపియో, కట్టెవలె మేను నేలవ్రాల్చి సాష్టాంగ దండప్రణామము చేయు నపుడో, ప్రణమిల్లితి

మనుకొనుచున్నాము. ఇది వాస్తవిక ప్రణామమా ? ప్రణామ మెంత యున్నత విజ్ఞానమందు నెలకొల్పఁబడినదో, యాతత్త్వ మెన్నండే నాలోచించితిరా ? అహంతయొక్క నిక్కిన తల (దేహాత్మబోధ గర్వితశిరస్సు) వంచుటకుఁ బ్రణామముతో సరివచ్చు సులభోపాయము మతేదియు లేదు. కనుకనే మనము రేవగళ్లు సంసారమునకు దాసులమై, రోగశోకానుతాపములచేఁ బీడింపఁబడుచున్నాము. ప్రణామరహస్యము మఱచుటవల్లనే నేఁడీదేశజనులు, పడరాని వారి కాళ్లపైఁ బడుచున్నారు. ప్రణామము చేయు టెఱిఁగిన వార లెన్నఁడును, నెవ్వరి పాదములకును మ్రొక్కరు. 'భిక్షాం దేహి' యనుచు నొరుల గుమ్మములకడ నొరఁగరు.

ఒక ప్రకృష్టమైన విధమున నవనతులగుటపేరే ప్రణామము. "నేను" అనుచునజ్ఞానభారమునే యెత్తుకొని జ్ఞాన గర్వముతోఁ దల నిక్కించుచున్నాము. ఆ యహంతాబోధమును (అజ్ఞాన భారమును) జ్ఞాన సమీపమునఁ బూర్తిగా నవనతము చేయుటే యథార్థ ప్రణామము. ఆ యజ్ఞానమును, దానితోనే చేరియుండు నసమర్థతా దీనతా దుర్బలతలను సర్వనియంత చరణములందు వంచనివానిది ప్రణామమే కాదు. కావుననే "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' ' ప్రణిపాత పరిప్రశ్న సేవలనెడి మూఁడు పాయములచేఁ దత్త్వదర్శులైన మహాపురుషులవలనఁ దత్త్వ జ్ఞానగ్రహణము చేయువలయునని చెప్పఁబడినది. మొట్టమొదటిది ప్రణిపాతము. అహంకర్తృత్వ జ్ఞానమును బూర్తిగాఁ బడఁగొట్టుటే యథార్థ

ప్రణిపాతము "అనునయ ప్రణతౌ ప్రకర్షేణ భక్తి శ్రద్ధాదతి శయేన నీచైః, పతనే దీర్ఘనమస్కారే దండవత్పతనే ప్రకృష్టో నిపాతః"

ఇది కానంతదాఁక మనకు బ్రణామముచేయుట తెలియదన్న మాటయే. కనుకనే బ్రహ్మవిద్యాలోచనము జగత్తత్త్వ విశ్లేషణ మనిరి. ఆత్మసాక్షాత్కారము, భగవత్ప్రాప్తి మున్నగు పెద్ద పెద్దమాటలు విను నధికారము పొందు నధికారము కలుగకమున్ను గొన్నాళ్లు కేవల ప్రణామముచేయుట యభ్యసింప వలయును. జీవితపర్యంతమగు కఠోరసాధన ఫలముగా నొక్కసారియైనను బ్రణామముచేయుము. జీవితమందొక్కసారి యొక ముహూర్తమందైనను బ్రణామము చేయఁగల్గినచో జీవితము సఫలమగును. సాధకా ! నీవు శిరస్సు వంచు; వంచకపో; అహంతాశిరస్సు దేనిచే వంగునో యది చూడవు. ప్రయత్నింపవు. ఈ విశ్వమందలి సూక్ష్మతమ కీటాణువు మొదలుగా నీశ్వరపర్యంత మన్నియు నీ గురువులే; అన్నియు అమ్మయే (ఆత్మయే) - అంతయు నీకుఁ బూజ్యమే, యనుచు సహస్ర భావములతో, సహస్ర శిరస్సులతో నమ్మకుఁ బ్రణామములు చేయు చుండుము. భయపడకు. ప్రణామము చేయుటకు నీవు దీనుఁడవు, హీనుఁడవును గావు. చేయవలయును. అంతేగాక జగత్పిత కీవిధముగాఁ బ్రణామము చేయఁగల్గినచో, మఱెన్నఁడు నెవ్వరికడ, నీకుఁ దలవంచు పని పడదు. కేవల జగన్నాథునకుఁ బ్రణామము చేయనప్పుడే, మనుజులయ్యు విషయముల యభావ బోధము తొలఁగదు.

ప్రణామము చేయునంతమాత్రాన జీవున కెట్టి యున్నతి ప్రాప్తించునన్నది విచారింతము. నీ వెవరికైనను బ్రణామము

చేసినంతనే నీలో నొక గురత్వభావ ముదయించును. ఎవనికి నేను బ్రణతుఁడునో, యతఁడు నాకంటె శ్రేష్ఠుడు, అనెడి శ్రేష్ఠత్వభావము మనసునం దొకవంక నుబుకును. తోడ్తోనే మఱియొకవంక, నే నతనికెంటె నపకృష్టుఁడ ననెడి భావమువికసించును. తత్ఫలముగా నీకే లాభము. ఒకవైపు శ్రేష్ఠత్వభావమును, మఱొకవంక నహంబోధ మింత యణఁగుటయు నగుటచే నీకే యధికలాభమగుట నిశ్చయము. ఏమన నిట్టి ప్రణామము చేయఁజేయఁ జిత్త మున్నత భావముతో నిండిపోయి, యహంకారమనెడి శత్రువుతల యెత్త కుండును.

ఈ సందర్భమున నొకమాట. ఇప్పటి పాశ్చాత్యశిక్షాభి మానులు, కొందఱొక మనుష్యమాత్రుని గురువని, యీశ్వరుఁడని ప్రణామము చేయుట మూర్ఖత్వమని తలంతురు. ఔరా ! వార లిది యెఱుఁగరు. ఏమన - యథార్థముగా నీశ్వరు నొందఁ బ్రయత్నించువా రెవ్వరినో యొకరిని, గురువుగానో యీశ్వర రూపముగానో పరిగ్రహింపవలయును. వానిని బ్రత్యక్షేశ్వరునిఁగా నెంచి నమస్కరించి పూజించి, యహంతాజ్ఞానము నణఁచుకొన వలయును. ఆధ్యాత్మికరాజ్యమందు విచరించుట కిదియే ప్రవేశద్వారము. అక్షరములు నేర్చుకొన్నప్పుడు బాలుఁడుపాధ్యాయుని యుపదేశమును దా విచారింపకే మన్నించు నటులు, ఆత్మరాజ్య మందుఁ బ్రవేశింపఁగోరు సాధకులొక మనుజు నీశ్వరరూపముగా మన్నించుటయు, వాని పాదములయం దనాది జన్మసంచితమైన తమ యహంతాభావమును బూర్ణముగా నర్పించు టకై సదా ప్రయత్నింపవలయును. అది యొక్కటే భగవత్ప్రాప్తికైన యుపాయము.

శ్రుతియు "ఆచార్యవాన్ పురుషో వేద" యనుచున్నది. గురు ప్రాప్తియైన వారే యాత్మ నెఱుంగఁగలరు.

మఱి యొకమాట - ఒక తత్త్వదర్శిపురుషునివలన నొక విశిష్టోపదేశమో, దీక్షయో పొందినంతనే గురుప్రాప్తి కాదు. గురువునం దీశ్వరజ్ఞానముంచి, యతఁడే యన్నిటికంటె నాకుఁ బ్రియమును వాంఛనీయవస్తువు ననెడి భావము సర్వదా వఱలు చుండువారే యథార్థసద్గురువు నొంది ధన్యులగుదురు. యథార్థముగా సద్గురు లాభ మొందినవారి కిఁకెట్టి భీతియు దుశ్చింతయుఁ గలుగదు. ఇట్టి గురుప్రాప్తికై యన్నిఁటికన్నమున్ను బూర్వోక్త ప్రణతిక్రియనే యాశ్రయింపవలయును. ఆ ప్రణామ మెంత సత్యమై, యెంత సరళమై, యెంత యకృత్రిమమై యుండునో, అంత వడిగా నభీష్టసిద్ధి నొంది చరితార్థులగుదురు. ఇదే ప్రణామ రహస్యము. ఇదే ప్రణామమాహాత్మ్యము. కనుకనే సాధకుఁడు తత్త్వకథలను వినుటకు మున్ను, గేవల సరళబుద్ధితోఁ బ్రణామము చేయు టభ్యసించి, తన యహంతాభావమును గురు చరణములయుం దర్పింప వలయును. అపుడు జీవితము నిజముగా నానందమ యమగును.

అది యుండనీ - మనమును దేవతలవలెనే "నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః" అనుచు శ్రీ మాతృస్తుతి మంగళ పాఠములతోఁగూడ ఆత్మాభిమానబోధమును మాతృ చరణముల కుపహారముగా నీయఁబ్రయత్నింతము.

"నమో దేవ్యై" - దేవికి నమస్కారము. స్వయంప్రకాశ శీలయ్యు, సృష్టి స్థితి ప్రలయ తిరోధానానుగ్రహములనెడి యైదు

క్రీడలను జలుపునదియు, జీవ జగదాకారముతో - విశ్వమూర్తితో నిరంతరము వెలయునదియు నైన తల్లియొక్క స్థూలమూర్తికి మా ప్రణామము.

"మహాదేవ్యై శివాయై సతతం నమః" - అనిర్దేశ్య సూక్ష్మ మహామూర్తితో జగత్తును బ్రకాశింపఁజేయునదియు మంగళమయి యునైన మహాదేవికి సర్వదా మా ప్రణామము. స్థూలమూర్తికిఁ బ్రణమిల్లుటకుఁ గర శీర్షాది సంయోగ రూపమైన బాహ్యక్రియ తప్పదు గాన, సతత ప్రణామము జరుగదు. కాని, తల్లియొక్క సూక్ష్మ జగదాధార మహామూర్తికి, ఈ జీవులెల్లరు, తెలిసియో తెలియకో, యప్రయత్నముగా సర్వదా ప్రణామము చేయుచునే యున్నారు. జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి మూడవస్థలందును, నిటులేదో యొకటి చేయుచునే యున్నారు. దానివలన నా మహాశక్తికి నిరంతర పూజాప్రణామములు జరుగుచునే యున్నవి. కనుక నామె సతత ప్రణామయోగ్య. ఆ నిత్యప్రణామయోగ్య మంగళమయి మహా దేవి చరణములకు జ్ఞానముతోఁ బ్రణతుల మగుచున్నాము. అమ్మా ! మా ప్రణామము లందుకొమ్ము.

"నమః ప్రకృత్యై భద్రాయై" - మంగళమయ ప్రకృతికి మా మ్రొక్కు. పూర్వోక్త స్థూల సూక్ష్మములకుఁ గారణమైన యా మూలప్రకృతిరూపిణి తల్లియే భద్ర - సంతానమునకు శుభము లిచ్చునది. జీవుఁడామె కృపచేతనే (ప్రకృతికిఁ బరమై) స్థూల సూక్ష్మముల కతీతక్షేత్రమైన ముక్తి మహా ప్రాంగణమందుఁ జేరును. ఇట్టి భద్రాప్రకృతికి మా ప్రణామము. ఈమె యవ్యక్త. ఒకప్పుడొక

భాగ్యవత్సాధకుఁడీమె సంధానము నొంది, చరణములం దవన తుఁడు కాఁగలఁడు. పాలన కర్త్రియైన యామెకు సంయతు లమై ప్రణమిల్లు చున్నాము. అనఁగా నింద్రియవృత్తులను జక్కఁగా నియమించి, వాఙ్మనసుల కగోచరయైన యామెకు మ్రొక్కుచున్నాము. ఆమె యెవరో మాటతో వ్యక్తపడదు. మనసుచే ధారణ చేయఁబడదు. స్థూలసూక్ష్మకారణాతీత; అజ్ఞేయ; జ్ఞ స్వరూప; నిత్య సత్యస్వరూప; ఆ జననికి నమస్కారము.

ఈ మంత్రమందు దేవతలు తొలుత "నమో దేవ్యై" యనుచు నమ్మ స్థూలమూర్తికిఁ బ్రణమిల్లిరి. "మహాదేవ్యై శివాయై సతతం నమః" యనుచుఁ దల్లి సూక్ష్మస్వరూపమునకు మ్రొక్కిరి. "నమః ప్రకృత్యై భద్రాయై" అనుచుఁ గారణ రూపజనని కెరఁగిరి. "నియతాః ప్రణతాః స్మ్మతామ్" అను మాటతో, స్థూల సూక్ష్మ కారణాతీతయై తత్పదమాత్రగమ్యయైన నిర్గుణస్వరూపకుఁ బ్రణమిల్లిరి. ఇంద్రియ వృత్తులు లెస్సగా నియమింపఁబడక, యా నిరంజన సత్తాభాస మించుకంతయు నొందఁబడదు, గాన నామెకు మ్రొక్కుటకు నియతేన్ద్రియులు కావలయును. ఈ యధ్యాయము ప్రణతిప్రధానము.

సాధకులారా ! మనము నీ విధముగానే యమ్మకుఁ బ్రణమిల్ల నలవాటుపడినచో ధన్యుల మగుదుము.

ఓం. రౌద్రాయై నమో నిత్యాయై గౌర్యైధాత్ర్యైనమో నమః ।
జ్యోత్స్నాయై చేందురూపిణ్యై సుఖాయైసతతంనమః ॥ ఓం. 2

రౌద్రాయై - భయానకవైన నీకు నమస్కారము; నిత్యాయై - ధ్వంసవిర్భావములు లేనట్టియు; గౌర్యై - ధాత్ర్యై - జగదాధార

రూపయు, జ్యోత్స్నాయై - చంద్రికా రూపిణియు, ఇందురూపిణ్యై- చంద్రరూపిణియు, సుఖాయై - సుఖదాయినియు సుఖస్వ రూపయు నైన నీ కెల్లప్పుడు నమస్కారము.

వ్యాఖ్య :- రుద్రశక్తికి - సంహారరూపిణి మహాశక్తికి; వెనుకటి మంత్రమందుఁ జెప్పఁబడిన త్రిగుణాతీత, భావాతీత, తత్పదగమ్య నిరంజనయైన తల్లికి మనముచేయు నమస్కారము చాలసేఁ పుండదు. వెంటనే జగద్భావమునకు దిగును; ఆ సమయమందు, అమ్మయొక్క రౌద్ర (సంహారిణీ) తామసీమూర్తి మాటయే మొదట మనసునకుఁ దట్టును. కారణమేమన - జగదతీత సత్తను జేరుట సంహారిణీమూర్తి నాశ్రయించియేయగును. తొల్త 'రౌద్రాయై నమః' అంచు బ్రలయకారిణీ రుద్రశక్తి ప్రణామమే యైనది. అనఁగా - ప్రలయ కుక్షిగత సర్వభావముల యంతరాళమం దుపలబ్ధమగు వస్తువే నిత్యము; దానికి క్షయోదయములు, హానివృద్ధులు లేవు. అచట శుద్ధ సత్త్వగుణమే వెలయును. ఆ స్వరూప మత్యంత రమణీయము. కనుకనే గౌరీనామము చేకొనఁబడినది. తర్వాత సర్వజగ ద్విధారణభావము బయల్దేఱెను. కనుకనే ధాత్రీనామ ప్రయోగము ఇటులు బయల్దేఱెను. కనుకనే ధాత్రీనామ ప్రయోగము ఇటులు ధాత్రీ పర్యంతము బ్రణామముచేసి, చంద్రికా చంద్ర రూపిణి యగు తల్లికిఁ బ్రణామము చేయుటగును. 'ఇందు' - మనస్సు, 'జ్యోత్స్నా' - వ్యాపకశక్తి, అనఁగా సర్వతోద్భాసిత విషయ సమూహము - మనస్సు విషయములను అభిన్నములు. ఈ విధముగా సర్వత్ర సర్వభావములను బట్టియే, అమ్మను బ్రణమిల్లి దర్శించువారల చెంత సర్వావస్థలందును, అమ్మయొక్క సుఖమయ

మూర్తి వికాసమే యగును, గావుననే "సుఖాయై సతతం నమః" యనిరి.

"యోవై భూమాతత్సుఖం మహాన్" అన్న దే సుఖము. అమ్మ మనోరూపముగా, దిక్కాలరూపముగా, విషయ రూపముగాఁ దనను గల్పించుకొనునపుడు, అనఁగా నిందురూపముతో జంద్రికారూపముతోఁ బ్రకాశించునపుడు యామె సుఖస్వరూపము విశేషించి వెలయును. మహత్త్వోపలబ్ధియే సుఖము. పక్షాంతరమున - అణువుగాక మహత్తనుగాకయుండు నది పరమార్థముచే సుఖస్వరూపమైనను, సుఖవిశిష్టభావముతో భోగ్యము కాదు. ఏలన - భోక్తృ భోగ్య భావ మచటలేదు. కాన, విశిష్టసుఖభోగమునకై మహత్త్వోపలబ్ధియే కావలయును. తల్లి విరాణ్మనోరూపముతోఁ దన్నుఁ గల్పించు కొన్నపుడే (జీవుఁ డీశ్వరత్వమందుఁ జేరునపుడే) యీ మహత్స్వరూప మాస్వాదింపఁబడును. ఇఁక సాధారణజీవులు విషయ భోగమువలన (ఇంద్రియ భోగ్యవస్తువుల వలన) అత్యల్పమాత్ర సుఖాభాసమునే పొందుదురు. కనుకనే, తెలిసియో తెలియకోయెల్లరును సుఖమునకే దేవులాడుదురు. సుఖమునే సేవింతురు. కనుకనే సర్వజీవులు నిరంతరమీమెకే ప్రణమిల్లుదురు. ఈ తత్త్వమును లక్షించియే దేవతలు "సుఖాయై సతతం నమః" యనిరి.

సాధక జనులను నిట్లే యా యమ్మ నడుగడుగున ననుభవింతురు. తొలుత స్థూల విశ్వరూపమందును, బిదప సూక్ష్మమహాశక్తి రూపమందును, దర్వాత నవ్యక్తకారణ (బీజ) రూపమందును, దుట్టతుదను గుణాతీత నిరంజన స్వరూపమందును, నీ విధముగా

నే భావమం దవతరింతురో, యది యిమ్మంత్రమందుఁ దేఁటపడు చున్నది. గుణాతీత స్వరూపము కంటె మున్ను సంహారిణీశక్తియం దవతరింతురు. తోడనే నిత్యత్వానుభవమును, సత్యగుణోద్బోధ మును నగును. ఇదే గౌరీమూర్తి. క్రమముగా జగద్బీజములను ధరించు ధాత్రీమూర్తి; తరువాత మనోవిషయములందు (చంద్ర చంద్రికా మూర్తి) అనఁగా జగద్భావమందు దిగుదురు. అపుడు జగద్భావముతోనో, జగదతీత భావముతోనో, యఖండసత్తా సంధానము నొంది, బహిరంతరములందు - వ్యక్తావ్యక్తములందు, స్థూల సూక్ష్మములందు నంతట నానందమయసత్త ననుభవించి "సుఖాయై సతతం నమ" యనుచు ధన్యలగుదురు.

చూడుఁడు - దేవతలవలె స్వర్గభ్రష్టులైనను, బరాజితులై సర్వముం గోలుపోయినను, మీరును సకల బ్రహ్మాండము ధ్వంసమైనను, సకల బ్రహ్మాండ కర్తృత్వము లభించినను "సుఖాయై సతతం నమః" యనుచునేయుందురు. అందుచేత సుఖము తక్క మఱొక్క వస్తువు లేనేలేదు. మనము సుఖమనుకొన్నదియు, సుఖమాత్రమేయని తెలియలేనందుననే, యసుఖభయముతోఁ బరుగులెత్తి యెక్కడనో సుఖమున్న దనుకొనుచూన్నము.

ఓం. కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మో నమోనమః ।
నైఋృత్యైభూభృతాం లక్ష్మ్యైశర్వాణ్యైతే నమోనమః ॥ ఓం. 3

కల్యాణస్వరూపకు (మంగళమయికి) నీకుఁ బ్రణామము. వృద్ధిసిద్ధి స్వరూపిణికి నమస్కారము. అలక్ష్మీస్వరూపిణికి నీకు

నమస్కారము. రాజలక్ష్మికి - శ్వేతచ్ఛత్ర నమస్కారము. రాజలక్ష్మికి - శ్వేతచ్ఛత్ర చామరరూపిణికి నీకు నమస్కారము. (లేదా) పర్వతలక్ష్మికి నీకు నమస్కారము. శర్వాణ్యై - మాహేశ్వరికి నీకు నమస్కారము. మానసప్రత్యక్ష యగుటవలన "తే" యని యుష్మచ్ఛబ్ద ప్రయోగము.

మంగళమయి - మంగళదాయినీ స్వరూపిణి, తల్లికొక్క నమస్కారము చేయఁగల్గినచో మఱి యమంగళము లుండవు. తల్లి యెవనిచెంతఁ గల్యాణమూర్తితోఁ బ్రకటిత యగునో వానికి బుద్ధి, సిద్ధి (అభ్యుదయము, సఫలత) లభించును. అనఁగా, ఆ రూపములతో, సంసారక్షేత్రమందును సాధనక్షేత్ర మందును అమ్మ వెలయుననుట, సాధకుఁడే కాని సాధారణుఁడెఱుంగలేఁడు. అట్టివారికిని జ్ఞానప్రదానము చేయుటకే, అమ్మ ప్రతికూల శాసనమయమూర్తితో నావిర్భవించును. అపుడే యామెకు 'నైఋృత్యై' (రాక్షసి) యని పేరు. అపుడట్టి వారల కార్యప్రణాళి, యాచార వ్యవహారములు రాక్షసమే యగును. రాక్షసీమూర్తిఁ దాల్చిన తల్లి యొడిలో నున్న సంతానము, కేవల స్థూల విషయభోగములనే యాశించి, యాహార నిద్రా భయాది పశుధర్మమునే యనుసరించుచుఁ దనియుచుండును. గీతలయందును -

"అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు ।
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ॥

ఆసురం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాంగతిమ్ ॥"

మనుష్యశరీరము నాశ్రయించిన నన్నవమానించువారు (నేనుగా నేనును గుర్తింపనివారు) ఆసురప్రకృతి నొందుదురు. కనుక నొకవంక అమ్మ తన కల్యాణమూర్తిని బ్రకటించి మనుజులకు వృద్ధి సిద్ధ్యాది సాఫల్యము నిచ్చుననియు, అటులే మఱియొకవంక నైఋృతీమూర్తిని బ్రకటించి, రాక్షసీ రూపముగాఁ బరిణతి నొందున నియుఁ దెలియును. అమ్మా ! నీవు అనిర్వచనీయవు. కేవలము నీయందే పరస్పర విరుద్ధములైన రెండు ధర్మములు, ఒక్కసారియే సంభవించుచున్నవి. నీకుఁ బునః పునః ప్రణామములు.

"భూభృతాం లక్ష్మ్యై" - రాజలక్ష్మిగాసైతము నీవే వెలయుదువు; కాని భూభృల్లక్ష్మీ పదమునకు నీ కృపచే మఱి యొక యర్థము తోఁచుచున్నది. భూశబ్దమునకు క్షితితత్త్వమును, భృత్ - ధారణ కారిణః - క్షితితత్త్వమును ధరించిన వారనఁగా - క్షితితత్త్వ పర్యంతము నహంతా బోధముతోఁ జేర్చినవారే భూభృత్తులు. కనుక భూభృచ్ఛబ్దార్థము - జడ దేహాభిమాని జీవుఁడు. వాని లక్ష్మి యనఁగా - చిద్వస్తువు. జీవదేహమందుఁ జైతన్య సత్తాభివ్యక్తి యుండునంత దాఁక ఆ శోభాయమాన రూపము తెలియఁబడు చుండును. మృతదేహమునకుఁ బలువిధముల వస్త్రాలంకారములఁ గూర్చినను శోభింపదు, కనుకనే బ్రతికియున్న వారి పేళ్ల ముందు శ్రీ శబ్దము వ్రాయు నియమము; కనుకనే అమ్మా ! నీవు జడత్వాభిమాని

జీవులకుఁ జైతన్యరూపముతోను - బ్రాణరూపముతోడను లక్ష్మీ రూపముతోను వెలయుదువు. ఇదే నీ భూభృల్లక్ష్మీమూర్తి.

మఱియు శర్వాణి (ప్రలయదేవతయైన శర్వుని శక్తి) రూపముతో నీవే సమస్తమును బ్రలయకాలమందు గ్రసించుచున్నావు. ఈ విధముగ నీవు భూభృలక్ష్మివై అనఁగా జీవ చైతన్య రూపముతోఁ బ్రకాశించి యసంఖ్య జన్మధారణము చేసి, మఱల శర్వాణీరూపముతో సమస్తము మృత్యుభయంకర గ్రాసమునకుఁ బ్రేరణము చేయుచున్నావు. ఒక వైపు నీకల్యాణమూర్తి; వృద్ధి సిద్ధిరూపిణి, మఱియొకవైపు నీ నైఋృతి మూర్తి; జన్మమృత్యు సంసారధర్మరూపిణి. కేవల పరస్పర విరుద్ధములైన నీ మూర్తులకు మా ప్రణామము. ఈ మంత్రమందు, 'తే' అను మాటకు, నీకు అని యర్థము. సమ్ముఖమందమ్మను జూడఁగల్గుటచే యుష్మచ్ఛబ్ద ప్రయోగము. సత్యప్రతిష్ఠ చేయలేనివార లీ తత్త్వమును సులభముగా నెఱుంగలేరు.

ఓం. దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై ।
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతంనమః ॥ ఓం. 4

దురధిగమ్యవును, త్రాణకారిణివియు, సర్వశ్రేష్ఠవు, సర్వజననివియు, ఖ్యాతిరూపవును, కృష్ణవర్ణవును, ధూమ్ర వర్ణవు నైన నీకు నమస్కారము.

అమ్మా ! నీవు దుర్జ్ఞేయ తత్త్వస్వరూపవు. ఏలన, జ్ఞాతృ జ్ఞేయ బోధ ముండునంతదాఁక, నీ యథార్థస్వరూపము తెలియఁబడదు.

నీవు దుర్గపారవు - సంసారము నావలిగట్టు నీవే. చేర్తువు. సర్వభావాతీతమైన నీ సమ్యక్స్వరూపము నాశ్రయింపనంతసేఁవు, దుర్గమ సంసారమునుండి యేవిధమైన పరిత్రాణమున లేదు. మఱియు నీ సంసారక్షేత్రమందు సర్వభూతములలో వెలయు నీ స్వరూపము చంచలతామయము. పరివర్తనశీలము; కావున నసారమైనను నీవు సారవు, అనఁగా స్థిరాంశ స్వరూపిణివి. ఇంత గొప్ప వైచిత్ర్యముతోఁ గూడిన చంచలజగత్తు, ఏ సత్తపై నిల్చి యున్నచో, అది నీవే. కాన నీవు సారవు, నిత్యవు, సచ్చిదానంద స్వరూపిణివి.

అమ్మా! నీవు సర్వకారిణివి. సృష్ట్యాదులైన సర్వభావములను నీవే వెలయించుచున్నావు, గాన సర్వకారిణివి, అన్నంతనే నీ పరమేశ్వరీమూర్తి కథ తలఁపునకు వచ్చును. చితిశక్తి స్వరూపిణివైన నీవే స్వరూపముచే నిర్గుణవు, కనుక నీ వెన్నఁడును సర్వకారిణివి కాఁజాలవనియు, ప్రకృతియే సర్వకారిణి యనియుఁ బలుకువారు; మాయను (ప్రకృతిని) నీతోఁ బూర్తిగా నెడపెట్టుచున్నారు. కార్యముచే సద్వితీయత్వభంగ మగుచున్నది. మాయను సత్తాహీనయు, అనిర్వచ నీయయు, అజ్ఞానస్వరూపయు నని భావించి యద్వితీయత్వమును రక్షించుటకుఁ బ్రయత్నించుచో సర్వ సందేహములు తొలఁగునా ? వర్తమానజగత్తు యుక్తిని జూచును, యుక్తి తర్కముల సాయముతో స్వీకరింపలేనివారు, ఇట్టి విషయము వేదసమ్మతమైనను, ఆదర పూర్వకముగా గ్రహింపలేదు. కావున నీ పరిచ్ఛిన్నయుక్తి ప్రమాణము తోనే తెలియఁ బ్రయత్నిం తురు. నిన్నెఱుంగటయు నిన్నొందుటయు నీ కృపలేక జరుగదు. ఇట్టి యాలోచన మెందులకుఁ జేయుదురో ?

నీకృపనే యాశించి నపుడు జిహ్వాజడత్వము బుద్ధిమాలిన్యము తొలఁగును గదా.

అమ్మ యను వస్తువేదో యిప్పుడెఱుంగఁజాతము. కేవలా నందమే యమ్మ స్వరూపము. శ్రుతి "ఆనందం బ్రహ్మణో విద్వాన్, నిబిభేతి కుతశ్చన" అనుచున్నది. ఆనందమే బ్రహ్మము స్వరూపము. ఆనందవస్తువు ననుభవ మింతయో యంతయో జీవ మాత్రునకుఁ గలదు. జగత్తున గమ్యవిషయము పొందఁబడెనేని క్షణకాల మొక యానందభావము హృదయమునందుబుకును. ఒక్కసారి యీ భావమును స్మరింపఁ బ్రయత్నింపుము. క్షణికానందా భాసము జన్యానందము, అనఁగా విషయేంద్రియ సంయోగమున నైన యొకవిధమైన చిత్త వికారముమాత్రమే. స్వరూపానందాభాసమే విషయానందము. ఎచట నెట్టి విషయసంస్పర్శమును లేదో, చింత లేదో, భావన లేదో, త్యాగములేదో, గ్రహములేదో, చూచుట వినుట మున్నటు వ్యాపారములు లేవో, కేవల మానందమే కలదో, యట్టి వ్యవస్థయందు నీ వేస్వరూపమును జేరుదువో, యదే యమ్మ స్వరూపమని యెఱుంగుము. ఇంకను ముందునకు నడువుము. ఆనంద మొకవిధమైన యనుభవము (బోధము). మన బోధము ఆనందస్వరూపముగాఁ బ్రకాశించునపుడే. ఆనందవస్తువు ననుభవము చేయఁగల్గుదుము. అది కేవలానుభవానంద స్వరూపము. ఆ కేవలానందస్వరూపమునం దెట్టి భేదమును లేదు. తెలియఁబడదు. అనఁగా దానికి సజాతీయమైన మఱియొక యానందదాయక వస్తువు లేదు. "ఆ యానందమునకు విజాతీయ మైన దేదే నున్నదా ? ఉండునా ?" యనెడి యిట్టియుప లబ్ధియు రేఁగదు. మఱి

దానియందు స్వగతభేదమును లేదు. అనఁగా దానియం దెట్టి యంగాంగిభావముగాని, భోక్తృ భోగ్యాది భావము గాని లేదు. కేవల విశుద్ధానందమే. దీనినే శ్రుతి "ఏకమేవా ద్వితీయమ్" అన్నది. ఈ యానందమునకు మఱియొక పేరు ప్రేమరసము.. వేదమునందు "రసోవైసః" యను మాటచే నిర్దేశింపఁ బడినది. ఇచట - ప్రేమ ప్రేమిక ప్రేమాధారమునం దెట్టి భేదమును లేదు. రసిక రస రస్యరూపమైన విభిన్నతలేదు. కేవల ప్రేమము. కేల రసము. ఏభాషతో దీనిని దెలియఁజెప్పుట ? అది భాషకు వెలిది. అందుకే వేదము "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అన్నది. 'నేతి నేతి' మున్నగు మాటలతోను బోధించుట కెంతో ప్రయత్నించి నది. ఇదే మన తల్లి నిర్గుణస్వరూపమని యెఱుంగ వలయును. ఇచటఁ గేవలానందము తక్క నెట్టి విశిష్టతయు, అనఁగా భావరంజనము లేదు. కనుకనే, అమ్మ నిత్యశుద్ధ నిరంజన యైనది.

ఈ నిర్గుణ నిరంజన స్వరూపము పైని గూడ, అమ్మగారి రెండు విధములైన మహత్త్వములు వెలయుచున్నవి. ఒకటి ఈశ్వరత్వము, రెండవది జీవత్వము. ఇందుఁ దొలుత నీశ్వరత్వ మనెడి మాతృమహత్త్వమును గూర్చి యోజింతుము. ఉపనిషత్తు, "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే" యను చున్నది. ఆనందమువల్లనే భూతముల యుత్పత్తియు, వాని యునికియు నగుటెగాక, మఱి జీవుల ప్రలయస్థలమునై యున్నది. ఇచట, ఏయానందము - కేవలానందము - అనఁగా సర్వభావవర్జిత నిర్గుణ ముగాఁ జెప్పఁబడినదో, జగత్తుయొక్క సృష్టి స్థితి ప్రలయ హేతువైన యానందమని చెప్పఁబడినదో, యా రెండానందములు నొక్కటియా ?

వేర్వేఱా ? యని సంశయము కలుగవచ్చును. దీని కుత్తరముగా - "నీవు నిర్గుణానందమనుచున్నది, కథనమాత్రమే. ఆనంద మెన్నఁడును నిర్గుణము కాఁజాలదు. నిర్గుణమనఁగా నిర్విశేష గుణమని యర్థము ఆనంద మొక గుణము (ధర్మవిశేషము). అది సూర్యకిరణములు సూర్యునికంటె భిన్నములును, అభిన్నములును నైనట్టులే, మఱియొక యానందము హ్లాదినీశక్తి. ఈ శక్తి యెవనిదో వాఁడే యీశ్వరుఁడు. అనఁగా హ్లాదినీశక్తి. ఈ శక్తి యెవనిదో వాఁడే యీశ్వరుఁడు. అనఁగా హ్లాదినీశక్తిమంతుఁడు. కనుకఁ గేవలానందకర్మ మీశ్వరునిదే కాఁజాలదు." ఇత్యాది వాద ప్రతివాదము లెన్నో రేఁగుచున్నవి. ఈ విభిన్నమతముల మీమాంస మిగుల సుగమ్యము. ఎవఁడెట్టులనునో వానిదే సత్యముగా నంగీకరించినచో నెట్టి గొడవయు నుండదు. ఏలన - బ్రహ్మవస్తువు లేదని యెవ్వఁడు ననలేఁడు. బ్రహ్మము పూర్ణము. దానియెడ నెట్టి యభావకల్పనముం గాదు; కనుకనే దాని సంబంధముననెవ్వరే మన్నను సత్యమే. బ్రహ్మ మెవరియెడ నేభావముతోఁ బ్రకటమగునో, వారి నోర నట్టి భాషయే వెలువడును. ఎవ్వఁడేని బ్రహ్మమును లేదుననా ? అదియు సత్యమే. ఏలన - వానియందా బ్రహ్మము 'నాస్తి' రూపము గానే ప్రతిభాసించినది. ఏదో యొకవిధముగా దానిని స్వీకరింపకుండ లేదు. ఇదే బ్రహ్మముయొక్క విశేషత. కేవల మీ విధముగానే యవశ్యము నసాధ్యమైనది కాదు. మఱియు - ప్రకాశము, అంధకారము, జ్ఞానము అజ్ఞానము, విద్య అవిద్య, సగుణము నిర్గుణము, సుఖము దుఃఖము, మున్నగు పరస్ప విరుద్ధ ధర్మములకును నదియే యాధారము. ఈ విరుద్ధ ధర్మ సమూహము

బ్రహ్మమందే యొకదానితో నొకటి నిల్చి యున్నది. ఇచట మఱియొక విశేషమే మన - ఆ యత్యన్త విరుద్ధ ధర్మములు బ్రహ్మమనెడి యధారమందే సదాతోఁచుచున్నను, దాని నిరంతన స్వరూపమున కించుకయు హాని గలుగదు. కేవలానందస్వరూప బ్రహ్మము, తన నిరంజన స్వరూపము నఖండముగానే యుంచి, యొక్కసారిగా నీశ్వర జీవరూపముతో వెలయుఁగలదు. ఇదే బ్రహ్మముయొక్క బ్రహ్మత్వము.

ఈ నిర్గుణానంద్వసరూపవస్తు వేరూపమున నీశ్వరుఁడై (సర్వగుణ సంపన్నుఁడై) యడరునో యనుటను, మనమెఱుంగఁ బ్రయత్నింతము. సరే, ఆ నిర్గుణానందమం దనుభవించుట కేమే నున్నదా లేదా ? చెప్పఁగలరా ? చెప్పఁగలము. కాని యను భవశక్తి లేదు. ఎందుల కిట్లగును ? నిర్గుణవస్తువునం దేదే నిట్టి శక్తిని స్వీకరించినచో, ఆనందమునకు స్వగతభేదమున్నటులేయ్యై ద్వైతాపత్తి సంభవించును. కాదది కాదు. ఆనందము తన్నుఁదా నెపు డనుభవించునో, యపుడు భోగ్య భోక్తృ భోగాది రూపమైన భేదము దేనివల్లనుం దెలియఁబడదు. కనుకనే యీ విశుద్ధానందస్వరూప వస్తువునందు, ఆ భోగ్యాది భేదము లెవ్వియు లేవు. .ఇది నిశ్చయము. ఇక్కడ మఱియొకమాట - ఏమేని సంశయమున్నచో, నిర్గుణ నిర్మల విశుద్ధానందమైన వస్తువొకటి యున్నదనుఁడు. దానియం దెట్టి భేదమును లేదు. శంకరాచార్యులు సైతము ఈ నిర్గుణ సగుణ సామంజస్యము చేయుటకు "అనిర్వచనీయ" యని యొకపదము వ్యవహరింపవలసి వచ్చినది. దానినే గౌరాంగప్రభువు

"అచింత్య భేదాభేద" మనియెను. అపుడు దానిని మీరు గ్రహింపఁగలిగి, శాస్త్రములు, గురువులు చూపిన యుపాయములచే దానిని బొందఁ గోరినచో, వారి కృపచే, నొకనాఁ డవశ్యముగ నానందవస్తువు నిర్గుణమని తెలియఁగల్గుదురు.

అఖండజ్ఞానము, అసీమశక్తి, యను రెండు నభిన్న వస్తువులని మును జెప్పఁబడినది. జ్ఞానమే శక్తి; శక్తియే జ్ఞానము; అను నిమ్మాటను సరిగాఁ దెలియలేనివారును, అనుశీలనముచేసి అనుభవింపఁజాలనివారును, ఈ యానంద తత్త్వమును సరిగా గ్రహింపఁజాలరు.

సరే; మున్ను విశుద్ధజ్ఞాననామముచేఁ దోఁచిన దేదో యది, కేవల జ్ఞానమేకాదు. దాని యానంద స్వరూపమును సైతము దెలియఁబ్రయత్నింతము. చిద్వస్తువు కేవల చిత్ కాదు. ఆనందము సైతము దాని స్వరూపమే. ఆనంద మనఁగానే, యానందానుభవమును దాని సత్తయుఁ బ్రతీతిగోచరము లగు చుండును. ఈ యనుభవముపేరే చిత్. సత్తయే చిత్. కావున నానందశబ్దము నర్థమువలన, సచ్చిదానందములనెడి మూడును దెలియఁబడును. ఈ మూడు వస్తువులును వాస్తవముగా మూడు కావు. ఒక్కటే. సత్త, చైతన్యము, ఆనందము అనునవి యొక్క వస్తువునకేయైన మూడు పేళ్లు. ఈ యానందము విశుద్ధమైయు న్నప్పుడును దానియందు 'చిత్' అనుభవశక్తి, 'సత్త' యనునవి కలవు. అనుభవశక్తి (చైతన్యము) యొక్క యభివ్యక్తి లేనపుడు, ఆనందప్రతీతియు నుండదు. ఆ యనుభవశక్తి విశేషభావముతో వెలయునపుడు దాని యందు [illegible] కర్తృ, కర్మము అనెడి రెండు

భావములును విశేషించి తెలియఁబడును. అనఁగా - అనుభవించు వాఁడు, అనుభవింపఁబడునది, అనుభవము అను నిమ్మూడును దోడ్తోనె తెలియఁబడును. అనఁగా ఆనంద వస్తువునం దీమూడు భావములును వెలయుచున్నను స్వరూపముచే నించుకంతయు భేదము లేదు. ఒక్క యానందవస్తువే తన్నుఁదా ననుభవించు చున్నది. అనఁగా ఆనందము నెచట విశేషించి యనుభవించునో, ఆ యద్వితీయ వస్తువునందు స్వగతభేదము కానవచ్చును. ఇవే సత్త్వరజ స్తమోగుణములనెడి పేళ్లతోఁ బ్రసిద్ధములు. సచ్చిదానంద ముల ప్రథమ స్పందనముచే 'సత్' సత్త్వగుణము, అనఁగా, ఆనందముయొక్క బోక్తృభావమును, రెండవ స్పందన ముచే 'చిత్' (రజోగుణ) అనఁగా, నానందముయొక్క యనుభవ శక్తియు, మూడవ స్పందనముచే ఆనందము (తమోగుణము) అను భావ్యమైన యానందమనెడి భోగ్యభావమును బ్రకాశించును. ఇట్టి విశిష్టతలున్నను, విశుద్ధానంద స్వరూపము విశుద్ధముగానే యుండునను టమఱవరాదు.

దానిపేరు "నేను" లేదా "ఆత్మ" యనుము. పంచదశీకర్త "ఇయమాత్మా పరానందః పరమప్రేమాస్పదం యతః" ఈ జ్ఞాన స్వరూపాత్మ పరమ ప్రేమస్థానము; కనుకే యానంద స్వరూపము. ఎల్లరుం బరమప్రేమాస్పదమైనదానినే కోరుదురు. మివులఁ బ్రేమింతురు. దేనియందలి ప్రీతిసాధనకొఱకే యీ జీవత్వబంధన మనాదికాలమునుండియు సాగుచున్నదో, దేని రక్షకై సమగ్ర పృథివీత్యాగము చేయుదురో ("ఆత్మార్థం పృథివీం త్యజేత్") అట్టి యాత్మ యెంత ఘనానందస్వరూపము ! అది మాటలతోఁ దెలియుటెట్లు ?

మును జెప్పినటులు, ఆత్మ విశిష్టభావముతోఁ దన్నుఁదా ననుభవించునపుడే, యది సగుణనామమునఁ బరఁగును. దీనికి దార్శనికులు - వికారమని, పరిణామమని, వివర్తమని, భ్రాన్తియని, కల్పనమని, యధ్యాసమని, యేపేరేని బెట్టనీ; హానిలేదు.

ఇది వినుఁడు, సగుణ నిర్గుణములు రెండును సత్యములే, నిర్గుణవస్తు వొక్కటే యీ విధముగా సగుణ మగును. అసలు మాట యేమనఁగా - వేయిసారులది సగుణత్వము నొందినను, దాని నిర్గుణత్వము బిందుమాత్రమైనను వికారము నొందదు, అది యఖండముగా యథాపూర్వముగానే యుండును. ప్రత్తి, సూత్రము, వస్త్రము అను పేళ్లతోను ఆకారముతోను బరిణామ మందినను, దాని స్వరూపమునం దించుకంతయు నంతరముండదు. బంగారు కంకణ కుండలాది నామములతో, వివిధాకారములతో నాకారితమైనను, దాని సువర్ణత్వ మఖండముగానే యుండును. నీరు - సముద్రము, నది, సరస్సు, మంచుగడ్డమున్నగు భిన్ననామములతో భిన్నరూపములతో నాకారితమైనను, దాని జలత్వమున కన్యథాత్వము లేదు. సర్పము కుండలరూపియై యాపేరఁ బరఁగినను, సర్పము సర్పమేకాని కుండలముకాదు. ముత్తెపుఁ జిప్పయే, కాని వెండి కాదు. ఆకాశము ఘటమఠాది విశేషణములతోఁ గూడినను, అది యాకాశ నిర్విశేషముగానే యుండును.

ఇపుడు చూడుఁడు. ఆనందవస్తువు తన్నుఁ దా విశేష రూపముతో ననుభవించినపుడే యది సగుణము. వేదాన్తులు దీనిని మాయయొక్క యధ్యాసమందురు. సాంఖ్యులు ప్రకృతి సంబంధ మందురు. కాని యుపనిషత్తు లీ సగుణస్వరూపమును 'ఆత్మ

బ్రహ్మ' శబ్దములతో నిర్దేశించినవి. మఱి యా సగుణానందమందు బహుత్వానుభవము తెలియఁబడును. ఎందుచేత ? ఎటులు ? అని ప్రశ్నింపవలదు. అది యాత్మలీలగాను, ఇచ్ఛగాను దలంపవలసినదే. "నేను ఆనందస్వరూపుడను. ఒక్క రూపముతో ననుభవించి పొందునాననందమును, బహుధా విభజించి భోగింతును." అనెడి యిచ్ఛ నా కయినపుడు, నా పేరు ఈశ్వరుఁడు. "ఏకో(హమ్ బహుస్యామ్" అను నీబోధము (అనుభవము) పేరే ఈశ్వరుఁడు. కేవలానందస్వరూపాత్మయందనేక భావముల యుత్పత్తి స్థితి లయము లగునపుడే, ఆ యాత్మ ఈశ్వరుఁడు. అపుడు బ్రహ్మ మానందరహిత మనఁగలరా ? లేదు. బ్రహ్మవస్తువు స్వరూపముచేతనే యానందము. దాని యానందమునకు లేమి యన్నది, యేకాలమందును లేనేలేదు. అపుడు దాని యేకత్వము (అద్వితీయత్వము) సత్యత్వము స్వాభావిక మైనట్టులే, దాని బహుత్వముకూడ (ఈశ్వరత్వము) జగద్దర్శన కాలమందును సత్యమును స్వాభావికమునై యున్నది. జగదతీతావస్థయందు బ్రహ్మము నిర్గుణమైనట్లే జగద్దర్శనకాలమందది సగణము. అది గుణాతీతము, గుణమయము. ఈ రెండు భావములును నేకాధారమం దొక్కసారి తోఁచును. గాని యొక దానివలన నొకదానికి హాని పరివర్తనము లింతయుఁ గలుగవు. సరే, మును జెప్పినట్లు పరమ ప్రేమాస్పదమును, ఆనందమయమునునైన యాత్మ తన్నుఁదా బహుధా విభజించుకొని భోగించునపుడే 'ఈశ్వరుఁడు'. ఇది మఱువకుండునపుడే ఆత్మయొక్క ఈశ్వరత్వమనెడి మహత్త్వమేమో తెలియఁబడును.

ఆత్మయొక్క మఱియొక మహత్త్వము జీవత్వము. "తత్త్వమసి" మున్నగు మహావాక్యములు "సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఆత్మైవేదం సర్వమ్" "స ఏవ సర్వమ్" "పురుష ఏవేదం సర్వమ్" "యదిదం కించ తత్సత్యమ్" మున్నగు శ్రుతి వాక్యములవలన జీవుఁడు బ్రహ్మముతోఁ గేవల మభిన్నమైన వస్తువే యని ప్రతిపాదింపఁబడినది. జీవుఁడెవఁడు ? ఈశ్వరానందము అనఁగా బహుధా ప్రకాశమానమగు సమష్ట్యానందము యొక్క వ్యష్టిరూపము. ఆ 'బహు' అనుదాని యందలి ప్రత్యేకమే జీవుఁడు. కావుననే జీవుఁడును స్వరూపముచే నానందమే. ఇచట మును జెప్పిన ప్రత్తి, నీరు, బంగారు, దృష్టాన్తములను స్మరించుకొనునది. సముద్ర మందలి జలతరంగములు జలము తక్క మఱేమియుం గావు. దారముచేనైన వస్త్రము ప్రత్తి తక్క మఱేమియుంగాదు. ఇటులే జీవుఁడు విభిన్ననాముఁడైనను, స్వరూపముచే నానందము తక్క మఱేమియుంగాదు. ఈ విధముగా జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములనెడి నాలుగు విధములైన భూతగ్రామము (ప్రాణి బృందము) ఈశ్వరానందమునందె పుట్టి, ఈశ్వరానందమందె యుండి, ఈశ్వరానందమందే యవసానము నొందుచున్నది. కావున జీవుని స్వరూప మానందమే. ఇపుడాలోచించి చూడు. ఆత్మ (అమ్మ) కేవలానందమయియు, సర్వకారిణియు, నీశ్వరానందమయియు నైనది.

సాధకుఁడా ! ఈ రూపములందు లక్ష్యముంచి మెల్లమెల్లఁగగా నెచటఁ జేరితివో చూడు. ప్రథమఖండమందు దేనిని గేవల సద్రూప ముగా నెఱిఁగితివో, ద్వితీయఖండమందు దేనిని జిద్రూపము

(ప్రాణరూపము) గా నెఱింగితివో, యదే యిపుడు పరమప్రేమాస్పద పరమానంద స్వరూపాత్మయైనది. ఆ యానందమునుండియే నీవును వచ్చితివి. నీ ప్రత్యేకసంకేత మానందమయము. చూడు. నీ శరీరమందలి ప్రత్యేక పరమాణువును, ఆనందముతప్ప మఱియొకటి కాదు. ఆనందమందే నీ వున్నావు. నీ రోగశోకాదు లానందమయ ములు. నీ దుఃఖ దారిద్ర్యము లానందమయములు, నీలో నగు ప్రత్యేక చింతయు నానందమయము, నీ జన్మమృత్యువు లానందమయములు, నీయెదురనున్న చెట్టు సైత మానందము వల్లనే ఘటితమైనది. ఒక ఘనానందసత్తయే వృక్షాకారమున వెలయుచున్నది. జడమైన రాతిముక్కను జూడు; ఈ యానందమ యాత్మయే యా రూపమున వెలయుచున్నది. నీకంటె వేఱుగా నీకుఁ దోఁచు భార్యాపుత్త్రులు, స్వజనము సైతము, ఆ బహుత్వ విషయకానందసత్తవే. నీ యానందోల్లాసమే మూర్తిమంతమై ప్రతిభాసించుచున్నది. ఏ వైపున నీవు చూచినను, ఏ యింద్రియము వలన గ్రహించినను, అదియంతయు నానందమయమే. క్షిత్యాది పంచభూతములు, శబ్దాధి పంచవిషయములు, చంద్ర సూర్యాది జ్యోతిర్మండలము నీ పరమప్రేమాస్పద పరమానందమయాత్మకంటె వేఱేమియుఁగాగు. ఈ యానందమయాత్మస్వరూపము నాస్వాదింపనిచో, నీ జీవనమువ్యర్థమే. నీవానందసముద్రమందే మునిఁగియున్నావు, మునుఁగుచున్నావు. రేవగళు లానందసేవయే చేయుచున్నావు. అయినను ఆనంద మెచటనున్నది ? యనుచు గ్రుడ్డివాఁడువలె వెదకుచూన్నవు. ఒక్కసారి అమ్మవైపుచూడుము. నీ కానందా భావ మెన్నఁడును లేదు; ఉండదు; అని తెలియును. ఏ క్షణమందు నిన్ను నీ వానందమయునిఁగాఁ దలంతువో, యా

క్షణమందే నీ యెదుట, నీ సంసార మానందమయమై వెలయును. అది మొదలు విశిష్టభావములతో నగు జగద్భోగవాసనలు, పూర్తిగా మఱఁగిపోవును.

చక్కఁగా విను - ఆనందమే నీ స్వరూపము. ఇది యథార్థముగాఁ దెలియునపుడు, కామ్యవస్తు సంగ్రహము చేసియు, భోగించియు, నానందసంధానమును జేయఁగలవా ? ఎన్నఁడును జేయలేవు. అపుడు సహజముగానే నీయందు వైరాగ్య ముదయించును. "నే నానందమయుఁడను" సర్వత్ర విషయాకారముగాఁ బ్రతిభాసించు చున్నాను అనెడి సత్యము నెఱుంగఁగల్గినచోఁ బుట్టవిడుపులు, పలుకుసేఁతలును మఱి యుండవు. నిర్విచారవిషయానందమందు విచరించు శక్తి కలుగును. "రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్ । ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి". (గీత)

ఉండనిండు. పరమానంద తత్త్వము నాలోచనము చేయుచుఁ గడుదూరము వచ్చితిమి. మఱల మనము దేవతల స్వరముతో స్వరము చేర్చి "సారాయై సర్వకారిణ్యై నమః" అనుచు నానందమయి చరణములందు వ్రాలుదము. ఆత్మ - ఆనందమయి - అమ్మ 'సార' - నిర్గుణచైతన్యమయి యయ్యు సర్వకారిణీ రూపముతో, నీశ్వరమూర్తితోఁ బ్రకటిత మైనది; అగుచున్నది.

"ఖ్యాత్యైతథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః" ఖ్యాతి శబ్దమునకు యశఃప్రతిష్ఠాదులను మీఱిన యర్థము మఱి యొకటి కలదు. అదే వివేకఖ్యాతి. ప్రకృతి పురుషుల పృథక్తత్త్వము

(వేఱుపాటున) గూర్చిన సుదృఢప్రతీతి. దానిని వివేకఖ్యాతి యని సాంఖ్యు లందురు. ఆపాతదృష్టిచే (పై పై చూపుతో) సాంఖ్యకారులు ప్రకృతిని జడనామముతో నుల్లేఖించిరి. వాస్తవముగాఁ బ్రకృతి జడముకాదు. చైతన్యము యొక్క జడత్వప్రతీతి మాత్రమే. జడత్వముసైత మొకవిధమైన బోధమే, బోధవస్తువు చేతనమేకాని జడము కాదు. కేవల చేతనమే కాదు. ఆనందమే దాని స్వరూపము. నిర్గుణానంద వస్తువే రూపమున సగుణభావము నొందినది. అనఁగా సత్త్వ రజస్తమో గుణమయమై ప్రకాశించినది. ఈ విషయమును జక్కఁగా ననుభవించుటపేరే ప్రకృతిపురుష తత్త్వవివేకము. లేదా వివేకఖ్యాతి.

అమ్మా ! ఈ ఖ్యాతిరూపముతో నీవే నిన్ను వెలయించు కొనుచున్నావు. ఆనందమయపురుషుఁడవైన నీవే నిన్ను విశేష భావముతో ననుభవించునపుడు నీకు "ప్రకృతి" యను పేరయ్యెను. ఈ ప్రకృతి పురుష తత్త్వముల యథార్థానుభవ రూపముతోనే నీవున్నావు. ఈ యనుభవము (ఉపలబ్ధి) పేరే వివేకఖ్యాతి. తద్రూపిణివైన నీకుఁ బ్రణతి.

ఈ ఖ్యాతికి విపరీతమైన యజ్ఞానమయమూర్తితోఁ గూడ నీవే యున్నావు. ఏ రూపముగాను బోధవికాసము లేక, లక్ష్యసాధనలు చేసినను, అనుభవవికాసము కాకయున్నపుడే "అజ్ఞానమయ కృష్ణమూర్తితో విరాజిల్లుదు" వందురు. ఆ యజ్ఞాన మయమైన నీ కృష్ణమూర్తికిని మా ప్రణామములు.

మఱి, యీ రెండిటిని మధ్యవర్తిపై (ఖ్యాతి కృష్ణల నడుమ) నీ మఱియొక మూర్తి యున్నది. దాని పేరు ధూమ్ర. ఈ ధూమ్రామూర్తి వలన జ్ఞానము యొక్క ఈషత్ప్రకాశముతోఁ గూడి యజ్ఞానురూపప్రకాశ మగును.

అమ్మా! నీ సంతానమందుఁ గొందఱు వేదాది ప్రతిపాద్యమైన నీ స్వరూపమును వ్యాఖ్యానింప దక్షులు; సగుణ నిర్గుణాది తత్త్వవిశ్లేషణ సమర్థులు, మోక్షశాస్త్రమందును అధ్యయనాధ్యా పనములందును బటువులు నయ్యు, నీ యీ యానందమయ స్వరూపానుభవము లేకయే పోవుచున్నారు. అప్పుడే, అమ్మా! ఈ ధూమ్రమూర్తితో (జ్ఞాన వికాసము రవ్వంతగల మూర్తితో) వారి నాడి నుంచుకొన్నావని తలంతుము. అట్టి నీ యపూర్వధూమ్రమూర్తికి మా మ్రొక్కులు.

మఱియొక వంక, అమ్మా! నీవు సదా ఖ్యాతి కృష్ణా ధూమ్రామూర్తు లతో సర్వజీవుల నాడి నుంచుకొందువనియు మాకుఁ దెలిసినది. మేము విషయగ్రహణము చేయునప్పుడే నీ యీ మూర్తుల విశిష్టత ప్రకటమగునని మేము తెలిసికొను చున్నాము. "మేమిది తెలిసికొనుచున్నా" మనునదే విషయగ్రహణ స్వరూపము. సర్వత్ర మే మీ మూడు మూర్తుల స్వరూపము స్థితి రూపముగాఁ బ్రకాశించుట కనుగొనుచున్నాము. దానికి మా ప్రణామము.

ఓం. అతిసౌమ్యాతి రౌద్రాయై. నమస్తస్యై నమో నమః।
నమోజగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమోనమః॥ ఓం. 5

అతిసౌమ్యకు, అతిరౌద్రకు, నీకుఁ బ్రణామము. ఈ రెంటికి నతీతమై తత్పదలక్షితమై మనోవాక్కులకందని నీ స్వరూపమునకు మా ప్రణామము. జగత్ప్రతిష్ఠాస్వరూపిణికిఁ దల్లికి కృతిదేవికి మా ప్రణామములు.

వ్యాఖ్య :- అమ్మా ! ఇంతకుమున్ను ఖ్యాతి కృష్ణారూపములతో రవ్వంత విరుద్ధములైన నీ రెండు మూర్తుల నెఱింగితిమి. అవియే మఱల నిచట. "అతిసౌమ్యా, అతి రౌద్రా" అనెడి పేళ్లతో దేవతలచే స్తుతింపఁబడుచున్నవి. అమ్మా ! ఒక వంక నీవు, అతిసౌమ్యా - స్నేహమయివి, ఆనందమయివి, దయామయివి యైన మాతృమూర్తివైనటులే, అతిరౌద్రము - భయంకరమునైన కృష్ణామూర్తితో నిత్యము వెలయుదువు.

అమ్మా ! ఇక్కానవచ్చు స్థూల జగత్తునందును నీ యీ రెండు విధములైన మూర్తుల లీల తఱచుగాఁ గను చున్నాము. ఒక వంక నీవు, దుర్భిక్షము, మహామారి, విసూచి, మసూచి, వెల్లువలు, తుఫానులు, భూకంపములు మున్నగు వాని రూపమున నతిరౌద్ర మూర్తితో నీ సంతానమునకుఁ జెప్పరాని దుఃఖమును నష్టమును గలిగించుచున్నావు. మఱొక వంక దయారూపముతో వేలకొలఁది జీవుల హృదయమం దావిర్భవించి, అతిస్నేహమయ మును అతిసౌమ్యము నైన మాతృమూర్తితో సహాయసామగ్రి నందించి, వారి దుఃఖములను దొలఁగించుచున్నావు. ఎటఁజూచిన నటనే నీ భయంకర మూర్తితోనే, కరుణామయ మాతృతోనే, కరుణామయ మాతృమూర్తియుఁ గానవచ్చుచున్నది. నీ సంతానము నంటిన

యచ్ఛృంఖలాచారమునకు నాస్తికతకును నొచ్చుకొని, శాసనరూపముగాను, దండనరూపముగాను బ్రకాశించుచున్నటులే కష్టహరణ మూర్తితోఁ బ్రకాశించి, నీ సంతానము కన్నీరు తుడుచుచున్నావు. ఇదె నీ మాతృత్వ లీల.

జీవుఁడా ! నీవు, అమ్మ నెచట వెదకఁబోవుచున్నావు ? తల్లిని దర్శించుటకై సాధన భజన తపస్సులఁ జేయుచున్నావో ? ఇంతకష్టపడియును మాతృనామమునకు మచ్చ పెట్టుదువు. నీవెటఁ జూచిన నచటనే మాతృమూర్తి చక్కగా నుద్భాసించుచున్నది.

"యో హి పశ్యతి నాత్మానం దృష్టిసంపాతమాత్రతః ।
కదాపి నేక్షితుం శక్యో దృక్సహస్రధరోఽపి సః ॥"

కను విచ్చునంతనే యమ్మను జూడలేనివాఁడు వేఁగన్నుల వాఁడైనను, నెన్నఁటికి నమ్మను గానలేఁడు. యథార్థముగా, అమ్మ యంత సరళ. అంత సులభ. సత్యముగా నిట్లు దేవతలవలెనే, యమ్మను సర్వత్ర చూచి యథార్థభక్తితో మ్రొక్కఁగల్గుదువేని, అమ్మ యథార్థస్వరూపము ననుభవింపఁగల్గుదువు. అపుడు దేవతల స్వరముతో స్వరమునుగల్పి "తస్యై నమోనమః" యనుచు, అవాఙ్మానసగోచర కేవలానందస్వరూపకుఁ బ్రణామము, అనఁగలవు. ఔరా ! అతి రౌద్రమూర్తియందును, ఆనందమెక్కడ ? అనకుమా. ఇంచుక చక్షుష్మంతుఁడవైనచో, నానందమే సత్తయనియు ఆనందవస్తువే సుఖదుఃఖాద్యాకారముతో వెలయు చున్నదనియుఁ దెలియఁగలవు. సరే. జీవునివంకఁ జూడుము. జీవుఁ డేడ్చునపుడు, ఆ యేడ్పునందును గొంత యానందాభాసమున్నది. కనుకనే

దుఃఖము ననుభవించుచున్నాడుఁ. జీవుని నవ్వునందును నానందమయాత్మసత్త తేఁటపడుచున్నటులే, యేడ్పునందును దేఁటపడుచుండును. గాని యేడ్పునందును నానందమును దెలిసికొనుటకుఁ గొంత యోగ చక్షువు మాతృకృపయు నావశ్యక ములు.

అమ్మయొక్క యీ సౌమ్య రౌద్ర భావాతీత స్వరూపములను దెలిసికొనుట కెట్టి భావముతో, నెట్టి స్థితియం దుండ వలయునో, యదియు మంత్రము నుత్త రార్థమునఁ జెప్పఁబడి యున్నది. "నమో జగత్ప్రతిష్ఠాయై నుత్తరార్థమునఁ జెప్పఁబడి యున్నది. "నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యైకృత్యై నమోనమః" ప్రతిష్ఠ యనఁగా ఆశ్రయము; జగత్ప్రతిష్ఠ యనఁగా, నిమిత్తో పాదానరూపముగా నున్న యానందమయ చైతన్యసత్తకు నమస్కారము. అటుపిమ్మటఁ గృతిదేవికి, అనఁగా, అఖండానందవస్తువు, నీ ఖండఖండ జగదాకారమునఁ బ్రకాశింపఁజేసిన క్రియాశక్తికిఁ బ్రణామము. అనఁగా జగన్నిమిత్తోపాదాన కారణభూతయు, సృష్టి స్థితి ప్రలయంకరియు నైన మహాక్రియా శక్తికి మా ప్రణామములు.

ఓం. యా దేవి సర్వభూతేషు
విష్ణుమాయేతి శబ్దితా ।

❋ ఓం నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం
ఓం నమస్తస్యై నమోనమః ॥ ఓం. 6

విష్ణుమాయ - జగద్వ్యాపినీ స్థితిశక్తి; దేవీ - స్వయం ప్రకాశ రూప చితిశక్తి; అశబ్దము, అస్పర్శము, అరూపము, అవ్యయము.

❋ ఈ 6వ మంత్రము మొదలు 25వ మంత్రమువరకు ఉత్తరార్థము యీ విధముగానే పఠించవలయును.

అవ్యయము; ఆనందస్వరూపముగా మును మనము చెప్పికొన్నదే. సర్వభూతాకారముగా నాకారితమై (సర్వభూత రూపముతోఁ దానే ప్రకాశించి) ఈ క్షణము చేసి యనుభవించునపు డదే విష్ణుమాయ యనఁబడును. స్థూలమందు సర్వభూతరూపముతో (ఆధిభౌతిక రూపముతో) వెలసిన యమ్మకు విష్ణుమాయకుఁ బ్రణామము. సూక్ష్మమందు ఆధిదైవిక మూర్తితోఁ; మహతీశక్తిరూపముతో వెలసిన యమ్మకు విష్ణుమాయకు మా మ్రొక్కు. పిదప స్థూల సూక్ష్మముల కతీతమైన కారణరూపకు విష్ణుమాయామూర్తికి అమ్మకు నమస్కారము. ఇఁక మిగిలిన, స్థూల సూక్ష్మ కారణముల కతీతయైమనోవాక్కుల కందనిదై తత్పదలక్షితయైన తల్లిని లక్షించి, నమస్కరించి 'నమోనమ' యనుచుఁ బునః పునః ప్రణామములు చేయుచున్నారు.

ఇక్కడినుండి యీ స్తుతియందలి ప్రత్యేక మంత్రమందును ముమ్మాఱు 'నమస్తస్యై' ప్రయోగముండుటేకాక, 'నమోనమః' యను పదమునుం బ్రయోగింపఁబడినది. మొదటి 'నమస్తస్యై' పదము వలన, అమ్మ యాధిభౌతిక స్థూలరూపమునకు నమస్కారమే కాక, యిందుఁ గాయిక వాచనిక మానసిక నమస్కారమునుఁ దెలియఁబడును. రెండవ 'నమస్తస్యై' వలన సూక్ష్మస్వరూపము లక్షింపఁబడి, సూక్ష్మచైతన్య శక్తి స్థూలమునుజేరి, విశిష్టనామాకారముతో నవ్యక్తమైనది. దానిని లక్షించి ప్రణమిల్లుటయే ప్రణామముయొక్క సూక్ష్మావస్థ. దీనినే మానసిక ప్రణామమందురు. మూడవ 'నమస్తస్యై' అన్నది కారణస్వరూపమునకుఁ బ్రణామము. ఈ ప్రణామము కారణశరీరమందే యభివ్యక్తమగును. కారణ

స్వరూపము బుద్ధితత్త్వమును మీఱియున్న దైనను, ఈ ప్రణామము విజ్ఞానాతీతకారణమును లక్షించి, బుద్ధితత్వమందే యభివ్యక్తమగును. గాన దీనిని బౌద్ధప్రణామమందురు.

ఇఁక 'నమోనమః' యనునది నాల్గవప్రణామము. ఇది స్థూల సూక్ష్మ కారణముల కతీతమైన విశుద్ధజ్ఞానమయక్షేత్ర మందు (అనగాఁ బరమప్రియతమ పరమాత్మయందే) ప్రకటితమగును. ఇచటఁ బ్రణమ్యము, ప్రణామము, ప్రణామకర్త యను మూడిటిస్ఫురణము లేకున్నను, మొదటినుండియు శరణాగత భావముగల సాధకు లీ యద్వైతక్షేత్రమందుఁ జేరినపుడే, 'నమోనమః' అనుచుఁ గేవల శరణాగతభావసహాయముతోనే, పరమ ప్రేమాస్పద పరమానందస్వరూప పరమాత్మయందు మునిఁగిపోవుదురు. ఈ తురీయావస్థయే నాలవప్రణామము.

ఇటులు స్థూల సూక్ష్మకారణ కారణాతీతము లనెడి యీ నాలుగవస్థలును, విశిష్టభావముతో లక్షించి, ప్రణామము చేయఁగలవారలే యథార్థ దేవతలు. శుంభనిశుంభాసురుల యత్యాచారములచేఁ బీడింపఁబడిన దేవతాబృందము, ఈ భావముతోనే ప్రణమిల్లఁగల్గెను. కనుకనే తల్లి వడిగఁ దానే రణక్షేత్రమునకు దిగి యసురకులమును నశింపఁజేసినది. మనమును బైని జెప్పిన నాల్గు స్వరూపములందును లక్ష్యముంచి, యమ్మకుఁ బ్రణమిల్ల నలవాటు పడవలయును. అప్పుడే సర్వ విధముల యాసురాత్యాచారముల వలన విముక్తుల మగుదుము.

పురాణములయందు ముక్తితరగతులు నాలుగు విధము లుగాఁ జెప్పఁబడినవి. 1) జడత్వమును విడఁదీసి చైతన్య

లోకమందుఁ జేరుటే సాలోక్యముక్తి. 2) సమష్టి చైతన్యమందవస్థితుఁడగుటే సామీప్యముక్తి. 3) సూక్ష్మకారణకేంద్రమందుఁ గారణముగాఁ బ్రకాశించి యందుఁ జేరుటే సారూప్యముక్తి. ఇచటఁ జేరుటచేతనే సాధకుఁడు తత్స్వరూపుఁడగును. గనుకనే యీ యవస్థకు సారూప్యమని పేరు. 4) దీనిపైది సాయుజ్యముక్తి. ఈ యవస్థయందెట్టి విశిష్టతయు నుండదు. జీవుఁడు నిర్విశేషచైతన్యమందుఁ జేరును - దీని మాఱుపేరే నిర్వాణము. మన దైనికసాధనమందును నీ నాలుగ వస్థలయందును లక్ష్యముంచవలయును. నాలుగవస్థల యందును సంపూర్ణముగా లక్ష్యముంచలేనివాడు, రెండు మూడవస్థలయందైన లక్ష్యముంచినపుడే, యది యథార్థ సాధనమగును. ప్రతిదినము నల్పమో, యధికమో ముక్తి నాస్వాదించుచుఁ బోఁగాఁబోఁగా జీవన్ముక్తి నాస్వాదించుటగును.

ఓం. యా దేవీ సర్వభూతేషు చేతనే త్యభిధీయతే ।
ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... 7

(చేతనా - సర్వేంద్రియ ప్రవృత్తిహేతు రంతఃకరణ శక్తివిశేషః । సా చ చిత్తవ్యాపారరూపా । చిత్తంతు జ్ఞాన శక్తి ప్రధానం మహత్తత్త్వం । మహత్తత్త్వస్య ద్వే శక్తీ । జ్ఞానం క్రియా చ । తత్ర జ్ఞాన శక్త్యాత్మకం చిత్తం క్రియా శక్త్యాత్మకం సూత్రముచ్యతే । చేతనా - సుఖదుఃఖానుసంధాన శక్తిరితి కేచిత్.)

చేతన స్థూలమందు నామరూపాకారముతోఁ బరివ్యక్త మగుచున్నది. సూక్ష్మమందుఁ బ్రాణశక్తిరూపముగాను, కారణమం దవ్యక్తబీజరూపముగాను నున్నది. స్థూలాభిమాని చైతన్యము విశ్వుఁడనియు, సూక్ష్మాభిమానిచైతన్యము తైజసుఁడనియు, కారణాభిమాని చైతన్యము ప్రాజ్ఞుఁడనియు వ్యవహరింపఁబడును. చైతన్యరూపిణి అమ్మ విశ్వచైతన్యనామముతో, ఈ పరిదృశ్యమాన విశ్వరూపముతో నామరూపధారణపూర్వకముగా సదా వెలయు చున్నది. ఆ యాధిభౌతిక చేతనామయమూర్తికిఁ గాయిక వాచనిక ప్రణామము చేయుచున్నాము. పిదప, తైజస చైతన్యనామముతో అనఁగా నీ ప్రకటవిశ్వముయొక్క సృష్టి స్థితిలయ తిరోధానాను గ్రహములనెడి పంచకృత్యములందు నిరతయై, సూక్ష్మమైన ఈ యాధిదైవిక చేతనారూపిణియైన శక్తిమయ మూర్తికి మానసిక ప్రణామము చేయుచున్నాము. పిదప ప్రాజ్ఞ చేతనా నామముతో, నీ స్థూల సూక్ష్మ రూపములకు బీజరూపమై కారణరూపముగా నున్న యాధ్యాత్మికచేతనా రూపమైన యవ్యక్త కారణమూర్తికి బుద్ధిసహాయ ముతోఁ బ్రణమిల్లుచున్నాము. ఇఁక నీ స్థూల సూక్ష్మ కారణములను మీఱి, విశుద్ధచైతన్యస్వరూపమై యవాఙ్మానసగోచరమైన నీ నిత్యనిరంజనస్వరూపమును లక్షించి 'నమోనమ' యనుచుఁ బరమ ప్రేమాస్పద ప్రియతమ మధుమయాత్మస్వరూపమందుఁ జేరిపోవు చున్నాము. మనమును దేవతలవలె నాత్మచైతన్యమును విశేష భావముతో లక్షించి 'నమస్తస్యై' యనుచు సాష్టాంగ ప్రణామము చేయవలయును. ఆ హృదయానుభూత చైతన్యమే, స్థూలదేహ రూపముగాను, దేహాత్మబోధరూపముగాను వెలయుచున్నదని

యెఱింగి, ప్రథమప్రణామమును; ఆ చేతనయే సర్వభూతముల కధిష్ఠాత్రియై యుండి సర్వవ్యాపినియైన చిన్మయమాతగా నెఱింగి, రెండవ మానసిక ప్రణామమును; తర్వాత నవ్యక్తకారణరూప చేతనను లక్షించి విచిత్రనామరూపములతో నింతయు వ్యాకృత కాకయున్న యంతినవూక్ష్మావస్థను లక్షించి తృతీయం బౌద్ధప్రణామమును జేసి, ఆ తరువాత నమ్మ దయచేఁ గారణాతీత స్వరూపసంధానము చేసి, యా యజ్ఞేయ నిరంజన సత్తను లక్షించి 'నమో నమః' యనుచు, మధుమయ పరమాత్మసత్తయందుఁ జేరిపోవలయును.

ఓం. యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।

ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... ...... 8

అమ్మ బుద్ధిరూపిణి. వ్యష్టి బుద్ధిరూపమునఁ బ్రతిజీవునం దును, సమష్టి బుద్ధిరూపమున మహత్తత్త్వమందును, బుద్ధి బీజ రూపమున అమ్మయే యున్నది. ఈ మూడు రూపములకుఁ గాయిక వాచనిక మానసిక బౌద్ధప్రణామములు చేయుచున్నాము. అమ్మ నిరంజనసత్త వీనికిఁ బైఁగా నున్నది. బుద్ధిని బ్రకాశింపఁజేయునది, యమ్మ నిరంజనస్వరూపమే బుద్ధియనుట కేమియు లేకున్నను, బుద్ధి యామెగానే యున్నది. అదె మన యథార్థ స్వరూపము. దానికి 'నమోనమ' యనుచు బునఃపునః ప్రణామములు చేయుచున్నాము. అమ్మవాని నందుకొని మమ్ములను దన స్వరూపమునఁ జేర్చుఁగాక.

మనము తొలుదొల్త మన బుద్ధికే ప్రణమిల్లవలయును. తద్రూపగానే అమ్మ యున్నది. ప్రణామములు "నమో నమోనః

ప్రచోదయాత్" అనుచు బుద్ధి నొందుటకే త్రిసంధ్యలందును గాయత్రీ మంత్రముతోఁ బ్రార్థింతురు. బుద్ధిరూపయైన యమ్మకు సరిగాఁ బ్రణమిల్లఁగల్గినచో వ్యష్టి బుద్ధిస్థానమైన మహదాత్మ సంధానము నొందుదుము. మఱియు వ్యష్టి సమష్టి బుద్ధుల కవ్యక్త బీజమైన మూలప్రకృతికిఁ బ్రణమిల్లఁగా నిరంజన నస్వరూప మందుఁ జేరుదుము. భావాతీతమును ద్రిగుణరహిత మును, గురు స్వరూపము నైన యాత్మస్వరూప మందుఁ జేరుదుము. 'నమోనమ' యనుచునే మన యహంత విలయమై పోవును.

ఓం. యా దేవీ సర్వరూపేషు నిద్రారూపేణ సంస్థితా ।
ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... ..... 9

అమ్మ నిద్రాస్వరూపిణి. నిద్ర యనఁగా నింద్రియ నిమీలనము. మన యింద్రియ వ్యాపారములును బుద్ధి వృత్తులును నిరుద్ధములగునపుడు, జ్ఞానమయి యమ్మ 'నేనేమియు నెఱుంగను' అనెడి యజ్ఞానహృదయమం దుండును. అదే మన యమ్మ నిద్రామూర్తి స్వరూపము. అపుడు సర్వభావముల నిరోధవిషయకజ్ఞానరూపమున వెలయును గనుకనే, పాతంజల దర్శనము దీనిని 'అభావ ప్రత్యయాలంబనవృత్తి'గా నిర్దేశించెను. అమ్మ అట్టిరూపముతో వెలయునపుడే, మనము స్నేహమయి ప్రేమమయి మధుమయి యైన సుషుప్తిమూర్తియంకమందే యుండి యింద్రియవ్యాపారములవల్ల నగు కర్మ శ్రమలవలనఁ దొలఁగి పరమతృప్తి నొందుదుము. మన మీ దుఃఖమయ

త్రితాపమయ జగత్తున జనించి, యలసి సొలసి పోయినపుడే, అమ్మ తన నిద్రామూర్తితో వచ్చి మనలను దన పక్షమందుఁ జేర్చుకొనును. అట్టి స్నేహమయాలింగనమును మనము మఱచిపోవుచున్నాము. ప్రతిదినము జగన్మాతను నిద్రారూపమున ననుభవించుచున్నాము. అమ్మ మన స్వమ్ము. ఈ స్వమ్ము నొందించునది కావుననే నిద్రకు 'స్వపితమ్' అని పేరు.

జగన్మాతా ! సుషుప్తిరూపిణీ ! నీకుఁ బ్రణామము. మా కాయిక వాచనిక ప్రణామము నందుకొమ్ము. సుషుప్తిమయియైన నీ యీశ్వరీమూర్తి సర్వబ్రహ్మాండములందు నిండియున్నది. ఆ మూర్తికిఁ బ్రణామములు. దాని దర్శించినంతనే శరీరేంద్రియములు స్తబ్ధములై పోవును. ఆ కృష్ణా సుషుప్తిమూర్తి యెంత ఘనము ! అమ్మా ! వ్యష్టి సమష్టి నిద్రకుఁ గారణమును, సుషుప్తిబీజరూపము నైన నీ యవ్యక్తమూర్తికిఁ బ్రణమిల్లి, నిద్రాతీతము, నిరంజనము, నిత్యజాగరణమయము, నిత్యబోధమయమునైన నీ స్వరూపమునకు చేయు పునఃపునః ప్రణామముల నందుకొమ్ము !

ఓం. యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా ।
ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... ..... 10

అమ్మ భోజనేచ్ఛారూపముతో సర్వభూతములందు నున్నది. ఈ స్థూలశరీరమందలి రసరక్తాది సప్తధాతుపోషణమునకై యాహార గ్రహణావశ్యకత తోఁచును. అదే యమ్మ క్షుధామూర్తి. అన్నమయకోశ మనఁబడు నీ స్థూలదేహమందే, యీ క్షుధామూర్తి ప్రకాశముంటేని

కాదు. తక్కు ప్రాణమయాది కోశములందును అమ్మ క్షుధామూర్తితో వెలయుటను గనుచున్నాము. ప్రాణమయ కోశాహారము జీవనశక్తి; మనోమయకోశాహారము చింత; విజ్ఞానమయ కోశాహారము జ్ఞానము. ఆనందమయకోశాహారము ప్రీతి, హర్షము. ఈ విధమైన పంచకోశాహారములను గ్రహించు నిచ్ఛగాఁ బ్రకాశించు హేతువేమనఁగా, మనము ప్రతిదినము ప్రతిజన్మమందు నీ క్షుధానివృత్తికై, తెలియకో తెలిసియో అమ్మవైపే నడుచుచుందుము. ఈ యపూర్వాకర్షణమయ క్షుధామూర్తియొక్క ప్రత్యక్షజ్ఞానము ధన్యము. మొదట నిత్యానుభూతమగు నన్న బుభుక్షకు, అనఁగా స్థూల వ్యష్టి క్షుధామూర్తికి "నమస్తస్యై" యనుచుఁ బ్రణామము. తర్వాత సర్వబ్రహ్మాండరూపిణియైన మహాక్షుధామూర్తి సర్వజీవులందును, సమష్టిరూపముగా నున్నది. ఆ యఖండక్షుధా మూర్తి తృప్తికయి, ఏ యనాది కాలమునుండియో, పైని జెప్పిన యైదువిధములైన యాహారమును గ్రహించియుఁ దృప్తినొందలేదు. ఈ విశ్వవ్యాపిని క్షుధామూర్తికి యథార్థముగా నమస్కరించువారి కెన్నఁడును భవక్షుధయే యుండదు. ఎన్ని జన్మజన్మాంతరముల నుండియో జగద్భోగము చేయుచు, అనేక శోక దుఃఖ ఘాత ప్రతిఘాతములను సహించుచున్నను, మన యీ విషయక్షుధాని వృత్తి కాలేదు. సంతానమునకగు నీ యాఁకటి నెఱింగి యాహారము నిచ్చుటయే మాతయొక్క మాతృత్వము. అమ్మా! నీవు అన్నపూర్ణవు. నీ బిడ్డ లన్నమునకై యన్వేషించుటయా ? నీ బిడ్డల యాఁకటిమంట లడఁగింపక యూరకుందువా ? మే మాఁకొన్న బిడ్డలము. నీ వన్నపూర్ణవు. [illegible] నీకుఁ ప్రణామము. [illegible] యేమియుకాని మా

విషయక్షుధాగ్నిని బొత్తిగాఁ జల్లార్పుము. ఈ మా స్థూల సూక్ష్మకారణ ప్రణామము లంది కొమ్ము. మేము "నమోనమ" యనుచు నాఁకలిదప్పులు లేని, యహోరావశ్యకతలేని నీ నిరంజనస్వరూపమందుఁ జేరిపోదుము.

ఓం. యా దేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా ।
ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... ..... 10

ఛాయ యనఁగా జీవుఁడు. 'ఛాయాతపౌ బ్రహ్మవిదోవదన్తి' (ఉప). శంకరాచార్యులును దీనిని వ్యాఖ్యానించుచు నీ యర్థమునే చెప్పిరి. ఛాయకును స్థూల సూక్ష్మకారణములనెడి మూడవస్థలు కలవు. ఛాయా - (చిత్ ప్రతిబింబము) చిత్ ప్రతిబింబమే జీవుఁడు. స్థూలదేహమందయిన చిత్ ప్రతిబింబము ఛాయాస్థూలమూర్తి. దశేంద్రియములు, పంచప్రాణములు, మనోబుద్ధులు ననెడి పదునేడు తత్త్వముల రూపమైన సూక్ష్మదేహమందుఁ గల చిత్ప్రతి బింబమే ఛాయా సూక్ష్మమూర్తి. ఇటులే కారణదేహమందగు నవిద్యా చిత్ ప్రతిబింబవే ఛాయాకారణమూర్తి. ఈ మూర్తులకుఁ బ్రణమిల్లుటకే మంత్రమందు మూడు ప్రణామములు. నాలవది ఛాయాతీత స్వరూపమున లక్ష్యముంచి చేసిన ప్రణామము.

ఛాయా సంబంధమందు మఱియొకమాట - సాధారణ చ్ఛాయ ప్రకాశము ననరించునటులే, యీ జీవచ్ఛాయయుఁ బరమాత్మ స్వరూపమున కావరకముగా నుండును. ఈ యావరకము లను దొలఁగించుటకే ఇన్ని ప్రణామములు. ఇంత శరణాగత

భావము. ప్రణామములు చేయఁగా జేయఁగా మిథ్యాభి మానము

- తొలఁగిపోయి జీవభావముయొక్క పృథక్సత్తానుభవము కాదు. ప్రతిబింబమునకు స్వతంత్రతలేదు. బింబసత్తచేతనే ప్రతిబింబసత్త నిల్చునని, యపుడే సరిగా ననుభవము చేయఁగలఁడు. ఆత్మ యొక్కటే యని యనుభవము చేయుటకు సర్వరూపములందును ఛాయాదర్శనము చేయుటే సులభోపాయము. బుద్ధితత్త్వము చక్కఁగా వికసించినవారలే జీవజగత్తును యథార్థఛాయా రూపముగాఁ బ్రత్యక్షము చేసికొందురు. అద్దమందుఁ బ్రతిబింబించు మహానగరమువలెనే, యీ నామరూప విశిష్ట స్థూలవిశ్వము యథార్థముగా ఛాయవలెనే ప్రతీతమగును. ఆధునిక వేదాన్తవాదులు మిథ్యయని, భ్రాన్తియని, యధ్యాసమని యీ చిచ్ఛాయ నెగురఁగొట్టుట కెంత ప్రయత్నించినను, వారి స్థూలదేహ ముండునంతదనుక, వేయి సారులు మిథ్యయన్నను, వేయిసారులు ప్రయత్నించినను నిది తొలఁగదు.

గీతయందు భగవంతుఁడు "ఈశ్వరుఁడు సర్వభూతముల హృదయమందుండి, జీవులను యంత్రారూఢులనువలెఁ ద్రిప్పు చున్నాఁడు" అనెను. అద్దమునెదుర నిల్చి యెవ్వఁడైన నే విధముగా నంగభంగిమలను జేసినను, అందుఁ బ్రతిబింబించిన మూర్తియు, నా విధముగానే యంగ భంగిమలను జేయును. జీవుఁడనెడి చిత్ ప్రతిబింబముసైతము, ఈ విధముగానే హృదయమందున్న యీశ్వరునిచేతఁ బరిచాలితమై బహువిధములుగా నభినయించును.

'జీవుఁడీశ్వరుని ప్రతిబింబమై తనచేసిన కర్మ మీశ్వరుని చేతనే చక్కఁగా నియమితమైనపుడు, ధర్మాధర్మములు, పాపపుణ్యములు

ననెడి యెట్టివిచారము నుండదే' యను నాశంక కలుగును. ఔ, నిజమే - ఇట్టి జ్ఞానమందుుండి తమ్ముఁ బరమేశ్వరుని ఛాయా మాత్రముగా ననుభవింపఁగలవారియెడ, నిజముగా ధర్మాధర్మ పాపపుణ్య నామకమైన వేదియు లేదు. గాని యిట్టి యనుభవము కాకమున్నే, అనఁగా - అహంకర్తృత్వాభిమానము నిల్చునంతవరకు ధర్మాధర్మ పుణ్య పుణ్య విచారముండనే యుండును. పలుసారులు వెలికి లేదన్నను, లోపల నుబుకుచునే యుండును. అది యుండనీ -

అమ్మయే మన బింబప్రతిబింబములని యెఱుఁగుదుము. అమ్మయే పరమాత్మరూప బింబమై, బుద్ధియందుఁ జిచ్ఛాయ పడుటవలనఁ దానే జీవుఁడై, ఛాయగా సిద్ధమగును. కనుక మనమును నీ ఛాయారూపమునకుఁ బ్రణమిల్లఁదగును. అమ్మా ! నీవు చిన్మయివి గనుక నీ ప్రతిచ్ఛాయ దేనియందు సంక్రమించునో, యదియును జైతన్యమయమ్మే యగును. జడవస్తుచ్ఛాయ జడ వస్తువుపైఁ బడుటవలన దానియందుఁ జైతన్యవ్యవహార ముండనే యుండదు. కాని చైతన్యరూపిణివైన నీ ఛాయచే జడ దేహము జడేంద్రియములు జడబుద్ధి సమస్తము చైతన్యమయములై పోవును. అమ్మా ! 'నేను' అనునది నీ రూపమే కనుక నీ ఛాయ పడుటచేతనే జడదేహాదులును 'నేను' అనెడి యభిమానము నొందుచున్నవి.

తొలుత 'నమస్తస్యై' యనుచు మా వ్యష్టిబుద్ధియందుఁ బ్రతిబింబించిన చిచ్ఛాయామూర్తికిఁ బ్రణమిల్లుచున్నాము. క్రమముగ సమష్టిబుద్ధియందుఁ (మహత్తత్త్వమందు) గలట్టియు, శాస్త్రకారులు 'హిరణ్యగర్భుఁడు' అనునట్టియు అమ్మహాచ్ఛాయ మూర్తికిఁ బ్రణమిల్లి, కారణక్షేత్రమందైన నీ యవ్యక్తచ్ఛాయకును

'నమస్తస్యై' యనుచుఁ బ్రణమిల్లి, తుదను ఛాయ యనుటకును నెచ్చట నేమియు లేదో, దేని సత్త, ఛాయకును సత్తయై యున్నదో, యేది ఛాయను బ్రకాశింపఁజేయునో, యట్టి నిరంజనక్షేత్రము నుద్దేశించి ప్రణమిల్లుచున్నాము.

ఓం. యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా ।
ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... ..... 12

శక్తియనఁగా సామర్థ్యము, ఉత్సాహము. శక్తియనఁగానే తొలుదొల్త దేహముపైనే దృష్టి నిల్చును. ఇంచుకంత ధీరముగా యోజించినచో, నీ దేహము శక్తికంటె వేతేమియుంగాదని తోఁచును. చూచు శక్తి వినుశక్తి, మున్నగు నింద్రియ శక్తులను జూడఁగా రక్తమాంసాది పిండమైన యీ స్థూలాంశముమీదనే లక్ష్యము పడును. అపుడు కొన్ని యణుపరమాణువులు, ఇట్టిదన రాని యొక ధృతిశక్తివలన దేహాకారము నొందినవని తెలియ వచ్చును. పిదప నయ్యణువులవంక లక్షింపఁగ నణువులు సైతము వాస్తవిక జీవాణువులే; శక్తి సమూహములే కాని మఱొండు కాదని తెలియును. ఇటులీస్థూలదేహ మొకానొక శక్తి సమష్టిరూపముగాఁ బ్రతీతమగును. అమ్మయొక్క యీ స్థూలశక్తి మూర్తికిఁ బ్రణామము. ఆధునిక జడవాదులు స్థూలకారమునఁ బ్రకాశించు నీ శక్తి మూర్తిని జడరూపముగాఁ దలంతురు. సర్వభూతములందును, స్థూల దేహములందును, భౌతికపదార్థములందును, బ్రకాశమందును, వేడిమియందును, మెఱుపునందును, జంద్ర సూర్యులందును

సర్వత్ర కానఁబడుచున్న శక్తిరూపప్రకాశము నీది. అది జడమనఁబడు చిన్మయేచ్ఛాశక్తిమాత్రమే, యనెడి మాటను వారు విచారింపరు. శక్తి యనునది చేతనకంటె వేఱేమియుం గాదని వారు గ్రహింపరు. అమ్మా ! వారి తెలివికన్ను విప్పుము. భూతభౌతిక పదార్థ మెట్టిదైనను జైతన్యమయశక్తి ప్రవాహమని వారి మనస్సులకు మాటిమాటికి నచ్చఁజెప్పుము.

శక్తి యన్నది మఱేమియుం గాదు. చూచుశక్తి వినుశక్తి మున్నగు శక్తులకు మఱియొక పేరు లేదు. నరిగదా, ఒక్కమహాశక్తియే వేర్వేఱునామములతో వేర్వేఱురూపములతో వెలసి, వేర్వేఱు కార్యముల నొనర్చును. ఇది కేవల దేహమందును, ఏదేనొక విశిష్టపదార్థమందును మాత్రమే కాదు, అనంత విశ్వ - మనఁగా మన యల్పబుద్ధి వ్యాపించు నంతదాఁకఁ దోఁచు నెట్టిదియు శక్తికంటె మఱియొక వస్తువుగా భావింపలేము.

అమ్మా ! ఏకయు, నద్వితీయయు, మహతియు నైన యే శక్తి యొక్క విశాలమహత్త్వములకు మనోబుద్ధులు స్తబ్ధములై పోవునో, యేది సర్వభూతరూపముగా, ననంతరూపముగాఁ బ్రకాశించు మహాశక్తియో, దేనియందు విశిష్టలక్షణ ముంచినచో సృష్టి స్థితి లయములనెడి మూడు విధములు స్పందనములు తోఁచునో, ఆ సమష్టి రూపిణీమహాశక్తివి నీవే. అమ్మా ! యీ దురధిగమ్య మహాశక్తి సముద్రమందలి యొక్కొక్క తరంగము, విభిన్న జీవజగదాకారమున నుబుకుచు, మఱల క్షణములో విలయమొందుచున్నది. ఈ నీ యీశ్వరీశక్తిమూర్తికి మా ప్రణామము.

మఱి వ్యష్టిసమష్టిశక్తికి బీజమై యీ మహతీ శక్తి వికసించు నవ్యక్తక్షేత్రమైన యా మహాకారణరూపశక్తి మూర్తికిఁ బ్రణమిల్లి, నీ నిరంజనస్వరూపమునఁ జేరిపోవుదుము. అచట శక్తియనుట కేమియు లేదైనను, అది లేకున్న శక్తికి సత్తయే లేదు. అది శక్తిరూపముగాఁ బ్రకటమయ్యును దాని స్వరూప మించుకంతయు వ్యత్యయమొందదు. మనో వాక్కులకందరాని యా స్వరూప మును లక్షించి, 'నమోనమ' యనుచు మాటిమాటికిఁ బ్రణమిల్లు చున్నాము. అమ్మా ! జ్ఞానులైన నీ బిడ్డలు కొందఱు నీ పరమాత్మ స్వరూపమును శక్తి హీనముగా వ్యాఖ్యానింతురు. మఱియు ననేకవిధముల యుక్తి తర్కములతో నందులకై యెంతో ప్రయాస పడుదురు. దయఁ జూచి వారియెడ నీ యాత్మస్వరూపము నున్మేషింపఁ జేయుము. పరమాత్మ శక్తిహీనము, రసహీనము, ఆనందహీనము నైన యొక జడవస్తువు కాదని తెలియఁగలరు.

ఓం. యా దేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా ।
ఓం. నమస్తస్యై ..... ..... ..... ..... ..... 13

తృష్ణ - అప్రాప్తియందైన యభిలాషము. ధనాదులు విరివిగా నున్నను, అధిక లాభమందు విముఖత లేకపోవుట సర్వభూతము లందును దృష్ణారూపమున నున్న దేవికి మమ్మాఱు ప్రణామము. పునః పునః ప్రణామములు.

వ్యాఖ్య :- అమ్మా ! సర్వభూతములందును దృష్ణ (దప్పి) రూపమున నీవే యున్నావు. ఈ సర్వభూతతృష్ణను స్మరించునపుడు, తొలుత నీ తృష్ణమీదనే దృష్టిపడును. అమ్మా ! నీవు కేవల జలపానేచ్ఛా

రూపతృష్ణవే కావు. తృప్తిలేని యొక కాంక్షారూపమున సైతము, లోననీవె యెల్లపుడు రేఁగు చుందువు. పలు జన్మములనుండియు నీ యీ తృష్ణామూర్తిని దనుపుటకుఁ బ్రయత్నించుచున్నాము. కాని చాల లేకున్నాము. సకల బ్రహ్మాండాధిపత్యము లభించినను దృష్ణానివృత్తి కాదు. ఇంతదాఁక దృష్ణవుసైతము నీవే యని తెలియమైతిమి. కనుకనే, అమ్మా ! యని యాదరింపలేదు. గాన మాయందు నీవే తృష్ణారూపముగాను, ఆకులాకాంక్షారూపముగాను, వెలయుచున్నావని నేఁడు తెలిసినది. నిత్య తరుణాశారూపిణివి నీవే మా మదులఁ జల్లఁబఱతువని నమ్మి నీకుఁ బ్రణమిల్లి తృష్ణను దాటిపోవుదుము.

అమ్మా ! ఈ విధమైన నీ వృష్టితృష్ణామూర్తిని జూడఁగాఁ జూడఁగా, సర్వభూతములందు వెలయు నీ సమష్టి తృష్ణామూర్తిపైన జఱుపడును. జగత్తునం దెటఁజూచినను, నీ యతృప్తలాలసా మూర్తియే కానఁబడును. ఎంత కాలమునుండి యీ పుట్టుసావుల దంపు నోర్చికొనుచున్నామో తెలియదు. ఆ సమష్టి తృష్ణామయ మూర్తివి నీవు, తృష్ణారూపముతో వెలసి, యొక యద్వితీయానంద మయస్వరూపముతో, నీ బహుత్వలీలయందు వినియోగించిన నీ మహాతృష్ణాస్వరూపము నెటులెఱుంగఁగలము ? తెలిసియో తెలియకో "నమస్తస్యై" యనుచుఁ బ్రణమిల్లుచున్నాము. అమ్మా ! విషయతృష్ణామూర్తితో దర్శనమీయకుమా ! రసస్వరూపవైన యమ్మను నిన్నొందు ప్రబల తృష్ణారూపముతో నేవచ్చి మమ్ముమలను ధన్యులను జేయుము.

ఈ మహాతృష్ణ పుట్టిన యవ్యక్తకారణమునకు నీకుఁ బ్రణామము. నీ తృష్ణాతీత భావాతీత బోధమాత్రస్వరూపమునకు 'నమోనమః' యనుచు నసంఖ్యప్రణామము లాచరింతుము. అచటఁ దృష్ణయనుట కేమియు లేదు. దాని సత్తపైనే తృష్ణ నిల్చియున్నది. తృష్ణారూపమున వెలసినను దానికి రవంతయు వికారములేదు. అదె నీ నిరంజనస్వరూపము. మమ్ముల నచటికే కొనిపొమ్ము.

ఓం. యా దేవీ సర్వభూతేషు క్షాన్తిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 14

క్షాన్తి - అపకారియెడసైత మనపకారేచ్ఛ - సర్వభూతముల యందును క్షాన్తిరూపమున వెలయు దేవికి నమస్కారము. ముమ్మాఱు, పునఃపునః ప్రణామములు.

వ్యాఖ్య :- పరులవలనఁ బీడింపఁబడియు, దాని బదులు సేతకగు తగు బలిమియుండియు, నయ్యపకారము నూరక యోర్చు సామర్థ్యమనెడి క్షమారూపముతో నీవే యున్నావు. మా హితచింతకులు పీడించినను నోర్చుకొనునటులే, మా యహితుల పీడను సైతము సహించు శక్తిగల్గినపు డా క్షమా మూర్తితో నీవే మమ్మొడిని బెట్టికొందువు. అట్టి పరాపకార సహిష్ణుతయే నీక్షమా మూర్తి. నీ యీ వ్యష్టిక్షమామూర్తికి మా ప్రణామము. ఆ నీ మూర్తియే మాకు శాన్తిని గూర్చును.

ఆ క్షమామూర్తి సర్వభూతములందు సమష్టిస్వరూప బోధముగా వ్యాపించినపుడు, ఆహ్లాదోత్సాహరూపముతో నూఱింతలుగా

హృదయమందు విచరించును. అమ్మా ! ఆ విశ్వవ్యాపి క్షమామూర్తియు నీవే. నీకుఁ గోటి ప్రణామములు. అమ్మవు నీవు. క్షమయే నీ మూర్తి. అపరాధమింతయులేని, అపకారమింతయు లేని, యన్యాయము రవ్వంతయు లేని, స్వేచ్ఛాసంచారస్నేహ బహిర్వికాసముగల, క్షమామూర్తివి నీవే. నీవు తెప్పవేయక మావంకనే క్షమామూర్తివై చూచుచున్నావు. కనుకనే మేమున్నాము. కాకున్న నీ యకృతజ్ఞ జీవజగత్తున కస్తిత్వమే యుండదు. నీ సత్త నంగీకరింపని యకృతజ్ఞ జీవజగత్తును సైతము సాకుటే నీ క్షమామూర్తి కపూర్వోదాహరణము. నీ సమష్టి మహాక్షమామూర్తికి అసంఖ్యప్రణామములు. బీజరూపిణివియు నవ్యక్తకరుణామూర్తివియు నగు నీకుఁ దృతీయ ప్రణామము చేసి నిరంజనక్షేత్రమందుఁ జేరుదుము. అచట క్షమయు నక్షమయు లేవు. దాని సత్తపైనే క్షమ నిల్చియున్నది. క్షమారూపముగా వెలసినను దాని నిర్గుణసత్తకు వెల్తి లేశమునులేదు. ఆ గుణాతీతమూర్తి కనేక ప్రణామములు.

**ఓం. యా దేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా ।**
**ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 15**

సర్వభూతములందును జాతిరూపముతో నున్న దేవికిఁ బ్రణామము. పునఃపునః ప్రణామములు.

వ్యాఖ్య :- జన్మముతోనే జాతి ప్రకటమగును. బ్రాహ్మణ క్షత్రియాది జాతిరూపముగాను, దేవమానవపశ్వాది జాతిరూపముగాను, నీవే సర్వజీవులను ధరించుచున్నావు. "నేను దేవతను"

 

అనునపుడు, నీవే జాతిమూర్తితో వాని నీ యొడియందుంచుకొన్నా వని తెలియును. అమ్మా ! నీ యీ వ్యష్టిజాతిమూర్తికిఁ బ్రణామము.

ఈనాఁడు జాతిభేదమునే యెగురఁగొట్టఁజూచుచున్న నీ సంతానము, జాతిరూపముగానున్నది నీ వికారమే యని యెఱుంఁగదు. నీవు నిత్యవు. నీ యీ జాతిమూర్తి నిత్యము. జీవ జగత్తు సృష్టి యందుండునంతదాఁక జాతిభేదముండక తప్పదు ఎంత కొట్టుకొన్న నది నశింపదు. అమ్మా ! జాతిస్వరూపము సత్యము. కాలావస్థాదేశ భేదముచే జాతిభేదము రూపాంతరము నొందునదే కాని, అది జగత్తుండునంతకాలము చెడదని వారికి నీవే తెలియఁజెప్పుము.

అమ్మా ! నీ యీ వ్యష్టి జాతిమూర్తికి మ్రొక్కఁగా మ్రొక్కఁగా, సమష్టి మహాజాతిమూర్తివైపు చూపు సాగును. అపు డా యద్వితీయ జాతిసముద్రమందలి తరంగములే యీ వ్యష్టిజాతులని తెలియును. సర్వభూతమహేశ్వరరూపవైన నీ మహాజాతిమూర్తికిఁ బ్రణామము. మహాప్రలయమందు బ్రహ్మాండములు లయించినను, బీజరూపముతో నీ జాతిరూప కారణమూర్తి నిల్చియుండును. జాతిలేని, మూర్తి లేని, ప్రలయములేని దానియందే సర్వము నిల్చియున్నది. జాతిరూపముగాఁ దాను వెలసినను, దనకు రవ్వంతయు వికారము లేని, మనోవాక్కుల కందరాని యా స్వరూపమును గుఱించి మాటిమాటికి మా చేయు నతులందు కొమ్ము.

ఓం. యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 16

సర్వభూతములందును లజ్జారూపముతోనుండు దేవికి మమ్మాఱు ప్రణామము. పునఃపునః ప్రణామములు.

వ్యాఖ్య :- అమ్మా ! నింద్యకార్యములయెడనైన సంకోచమును విముఖతయు ననెడి లజ్జగా, సర్వభూతములందును నీ వభివ్యక్తవు కాకున్నచో, జగత్తు యథార్థముగాఁ బశురాజ్యముగానే మాఱియుండును. ఒక వంక సాటిలేని క్షమామూర్తితో జీవులందు వెలయుచున్నటులే, యొకవంక లజ్జా మూర్తితో వెలయుచున్నావు. నీ యీ వ్యష్టిలజ్జా మూర్తికిఁ బ్రణామము. పిదప నీ లజ్జ నీ యీశ్వరమూర్తితో విశ్వవ్యాపినిగాఁ జేసి, సర్వభూతము లందును వెలయించి సమష్టిలజ్జారూపముతోఁ గానఁబడుచున్నావు. ఆ నీ లజ్జామూర్తివల్లనే నీ మాతృభావము పూర్ణముగా నభివ్యక్తమై స్నేహపరాకాష్ఠ చక్కఁగాఁ దేఁటపడుచున్నది. అమ్మా! నీ యీ సమష్టి లజ్జామూర్తికిఁ బ్రణామము. ఈ వ్యష్టి సమష్టిలజ్జామూర్తికి బీజమైన యా నిరంజనక్షేత్రమునకు మూడవ ప్రణామము.

ఎచట లజ్జలేదో, సంకోచములేదో, స్వేచ్ఛావర్తనము లేదో, సంశయములేదో, దేని సత్త యీ యన్నిటిసత్తయో యిన్నిరూపములతో వెలయుచున్నను, దేనికిరవ్వంతయు వ్యత్యయములేదో, యట్టి "ఏకమేవా ద్వితీయమ్" తత్త్వమునకు నీకుఁ బునఃపునః ప్రణామములు.

ఓం. యా దేవీ సర్వభూతేషు శాన్తిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 17

సర్వభూతములందును శాన్తిరూపముతో నున్న దేవికిఁ బ్రణామము. ముమ్మాఱు పునః పునః ప్రణామములు.

వ్యాఖ్య :- విషయ సంభోగమందు యథార్థశాన్తి లేదు. శాన్తియొక్క యాభాసమేయైనను జిత్తమందుఁ బూర్ణ ప్రశాన్తభావ మేర్పడక శాన్తి జాడయైనను దొరకకున్నను, విషయములను గ్రహించుటవలన, వాని ననుభవించుటవలనఁ గల్గిన, యస్వాభావిక చిత్తవిక్షేపమందు రవ్వంత శాన్తి క్షణ కాలము మాహృదయములను బవిత్రము చేసినచో నా శాన్తి మూర్తినీవే. సర్వభూతములయందును నీమూర్తి యింతయో, యంతయో కానవచ్చును. అది నీ వ్యష్టిశాన్తి మూర్తి. నీవు నీ శాన్తిమయమూర్తితో మమ్ము నీ యొడియందుఁ జేర్చి కొన్నపుడే, శాన్తిస్వరూపము ననుభవింపఁగల్గుదుము. అది క్షణమాత్రమే యైనను, (అపురూపమే) అపూర్వమే. అమ్మా ! శాన్తికై వెలినెక్కడనో వెదకు నీ బిడ్డలకు, "నాయనలారా ! శాన్తి వెలిని లేదు. మీ లోపలనే కలదని" తెలియఁజెప్పుము. నీవు మా యమ్మవు. శాన్తిరూపిణివి. నీకుఁ బ్రణామము. ఒక్క యపారశాన్తి తక్క మఱే మియు లేనట్టియు త్రితాపసంతప్త మైన మా గుండెను జల్లఁబఱచు నట్టియు, నీ మహాశాన్తిమూర్తి కడకు మమ్ములను గొనిపొమ్ము. అది మధుమయము; అనిర్వచనీయము. ఆ నీ మహతీసమష్టిశాన్తి మూర్తికి మా యసంఖ్య ప్రణామములు. ఎన్నఁడును దానితో వేఱు సేయకుమా. విషయభోగాసక్తి తొలఁగనంత దాఁక, నీ యనిర్వచ

నీయశాన్తిమూర్తి జాడయే దొరకదు. దానికి మ్రొక్కఁగా మ్రొక్కఁగా, నవ్యక్తముగ శాన్తిబీజముండెడి వ్యష్టిసమష్టి శాన్తిమూర్తి యుబుకును. అట్టి కారణరూపశాన్తిమూర్తికి నమస్కారము. త్రిగుణాతీతమును మనోవాగగోచరమును నిరంజనమునైన దానిని గుణించి పునఃపునః ప్రణమిల్లుచున్నాము. మమ్మట్టి నిత్యశాన్తిమయ క్షేత్రమందుఁ జేర్పుము.

ఓం. యాదేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 18

సర్వభూతములందును శ్రద్ధా = వేదార్థమందు దృఢ ప్రతీతి. శ్రత్ = సత్యమ్ ధీయతే ఇతి శ్రద్ధా. పరిపూర్ణ విశ్వ రూపముగానున్న దేవికిఁ బ్రణామము. పునఃపునః ప్రణామములు.

వ్యాఖ్య :- అమ్మా ! శ్రద్ధ యనఁగానే, తొల్త నీ వ్యష్టి శ్రద్ధామూర్తియే తోఁచును. గురువేదాన్త వాక్యములందు దృఢవిశ్వాసమే శ్రద్ధ, యైనను నిరుక్తకారుఁడు యాస్కముని చేసిన నిరుక్తినిగూడఁ దెలిసికొనుట ముఖ్యము. "శ్రత్ = సత్యం ధీయతే ఇతి శ్రద్ధా" సత్యమును ధరించు ప్రయత్నమే శ్రద్ధా శబ్దవాచ్యము. నీ వెవరిని గల్పితమాయాబంధమునుండి విడిపింతువో, విడిపింపఁ జూతువో, వారి హృదయమందు మొదట నీ శ్రద్ధామూర్తియే యావిర్భవించి, గురువేదాన్త వాక్యములందు విశ్వాసమును గల్గించును. సత్యప్రతిష్ఠయే వారి జీవనలక్ష్యమగును. కొలఁదియో గొప్పయో సర్వజీవుల హృదయమందును వ్యష్టి శ్రద్ధారూపముతో వెలయుచున్నావు. అట్టి నీకుఁ బ్రణామము. గీతయందు -

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః । జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధి గచ్ఛతి" భక్తిపూర్వక కర్మానుష్ఠానము చేయువాఁడు, తత్పదమందు బుద్ధి నిల్చినవాఁడై, యింద్రియ నియామకుఁడై జ్ఞానమునొంది వడిగాఁ బరమశాన్తి నొందును.

సాధకునకుఁ బ్రణిపాత పరిప్రశ్న సేవలవలన జ్ఞానము గల్గును. ఈ మూఁడిఁటి సంసిద్ధిచే, జ్ఞానియైన పిదప, అన్నమయ కోశము నతిక్రమించి సహస్రారక్రియవలన శిరారోహణ మబ్బినచో మూటికి ననురూపమైన మూడు మనోమయావస్థలు గల్గును.

1. శ్రద్ధావాన్, 2. తత్పరః, 3. సంయతేంద్రియః. శ్రద్ధా - శ్రత్ - విశ్వాస (విగతశ్వాసము) ధా - ధరించుట, శ్వాసక్రియచే మనసును లేవఁగొట్టి లోపల ధరించుట పేరే శ్రద్ధ. (మనసునందే మనసు నుంచుట.) విగతశ్వాసము కుంభకము. ఈ యవస్థకు వచ్చినపుడే సాధకుఁడు శ్రద్ధావంతుఁడగును. శ్రద్ధావంతుఁడు కాఁగానే సూక్ష్మాతిసూక్ష్మ దర్శన శ్రవణ మననాది క్రియ యగును. వాని నన్నిఁటి నేకాగ్రముచేసి, తత్ - బ్రహ్మమునందు, అనఁగా బిందునాదములందు, పరః - రతుఁ డగును. ఇదే తత్పరావస్థ. ఇటులు చేయుటచే దర్శన శ్రవణ మననాది వృత్తి 'ఏకమందు' ఆకృష్టమగును. మఱి తమ తమ పనులను విడిచి యింద్రియ ములు సంయతములగును. అనఁగా నొండొంటిని జేరిపోయి యేకమగును. ఇదే సంయతేంద్రియావస్థ. దీని నొందిన సాధకునకు జ్ఞానసిద్ధి గలుగును. అనఁగాఁ జిత్త వృత్తి సమాప్తమై "అహం

జ్ఞానమయుఁ"డగును. ఈ జ్ఞానము గల్గిన క్షణమందే పరమశాన్తి (కైవల్యము - బ్రాహ్మీస్థితి) లభించును.

కనుక శ్రద్ధధానాద్యవస్థలు, ప్రణిపాత పరిప్రశ్న సేవాఫలములు. గాన సూక్ష్మప్రణిపాతమునకు మున్ను సైతము సాధకుఁడు శ్రద్ధావంతుఁడు, తత్పరుఁడు, సంయతేంద్రియుఁడు నగుచుండును. ఇవి కాకున్నం బ్రణిపాతాదులయం దధికారము లేదనుటే. స్థూలశ్రద్ధావంతుఁడు - గురువేదాన్తవాక్యములందు విశ్వాసియు, తత్పరుఁడునై, యా విశ్వాసనసహాయముతోఁడి క్రియానుష్ఠానముచే బ్రహ్మచర్య పరాయణుఁడగును.

"అజ్ఞశ్చా శ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకో ఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥"

శ్రద్ధాహీనుఁడును సంశయగ్రస్తుఁడునైనవాఁడు చెడును. సంశయాత్ముని కిహము లేదు. పరము లేదు. ఆనందములేదు. క్రియావంతుఁడు కానివాఁడే అజ్ఞుఁడు. వాఁడు మనసునందే మనసును నిల్పు నంతర్నివిష్టుఁడు కాఁజాలఁడు. గురువేదాన్త వాక్యములందు విశ్వాసములేని సంశయాత్మకుఁడు, ప్రణి పాతాది ప్రకరణముతోఁ గ్రియానుష్ఠానమందు ముందడుగు వేయలేఁడు. కనుకనే శ్రద్ధావత్వాద్యవస్థలు తెలియని యజ్ఞుఁడు, వాఁడే సంశయాత్ముఁడు. ఇయ్యిరువురు నాత్మగతియందుఁ భ్రష్టులై సంసారగతియందే పొరలుచుందురు. ఇందు సంశయాత్మునకు నిహపరములందు శాన్తియేలేదు. ఆనందమును లేదు. అంతరాకాశ మంధకారమయ మగుటచే, సంసారభ్రమణము తప్పదు.

శ్రద్ధ, ఆత్మస్వరూపజ్ఞానమునకుఁ బూర్వావస్థ. శ్రద్ధ కలుగనంతకాలము, ఆత్మరాజ్యమందుఁ జొచ్చు నాశయు లేదు. శ్రద్ధయన్నను నిశ్చయజ్ఞానమన్నను ఇంచుమించుగా నొక్కటే. సంశయముండునంతదాఁక నిశ్చయజ్ఞానము కలుగదు. ఒక్కసారి శ్రద్ధ ఉదయించెనా - మఱి యది పోదు. శ్రద్ధ యనునది జ్ఞానముయొక్క యొక పూర్వావస్థ. అదె సత్యబ్రహ్మము. (అమ్మ - పరమాత్మ) రూపముగా - నిస్సంశయరూపముగా వెలయును. శ్రద్ధాబలమునుబట్టి సాధన భజనాదులు సాగించు వారే ధన్యులు. అమ్మయొక్క వ్యష్టిశ్రద్ధామూర్తికి మ్రొక్కఁగా మ్రొక్కఁగా, సమష్టి శ్రద్ధామూర్తిమీదఁ జూపుపాఱి, సువిశాల శుభాకాశరూపమును నిస్తరంగమహోదధికల్పమునైన నీ మహాశ్రద్ధారూపమం దీ విశ్వము నిల్చియున్నదని తెలియును. ఆ నీ మహేశ్వర శ్రద్ధామూర్తి యొడియందే సకలజీవజగత్తు శోభిల్లుచున్నది. అట్టి నీ శ్రద్ధామూర్తి చరణములకు నమస్కారము.

పిదప వ్యష్టి సమష్టి శ్రద్ధాబీజమైన యాయవ్యక్తకారణ రూపిణీ శ్రద్ధ కు 'నమస్తస్యై' యనుచుఁ బ్రణమిల్లి, యొకసారి గుణాతీతస్వరూపమును జేరుదుము. అచట శ్రద్ధాశ్రద్ధ లుండవు. దాని సత్తపైనే శ్రద్ధ నిల్చియున్నది. శ్రద్ధారూపమున వెలయుచున్నను, దాని స్వరూపమునకు వ్యాఘాతము లేదు. దానిని లక్షించి పునః పునః ప్రణమిల్లుచున్నాము. అమ్మా! మా హృదయములయందు శ్రద్ధామూర్తితో వెలసి, జ్ఞానము నిచ్చి ధన్యులను జేయుము.

జ + ఞ + అ + న = జ్ఞాన. జ = జాయమాన (ఉత్పత్తి స్థితి నాశములు గలది - సర్వము) ఞ = శబ్ద స్పర్శ రూప రస గంధాదు

లందు, ఆ = ఆసక్తి, స = లేదో అనఁగా, ఉత్పత్తి స్థితి నాశములు గల దృశ్యజగద్వస్తువులం దాసక్తి లేకుండుటే జ్ఞానము. మఱియు మూర్ఛా మృత్యు నిద్రలనెడి యజ్ఞానము నాశ్రయింపని స్థితియే జ్ఞానావస్థ.

ఓం. యా దేవీ సర్వభూతేషు కాన్తిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 19

సర్వభూతములందును శోభారూపముగా నున్న దేవికిఁ బ్రణామము. పునఃపునః ప్రణామములు.

వ్యాఖ్య :- కాన్తి (సౌందర్య) రూపముతో సర్వమందును దల్లియే వెలయును. జీవుఁ డెంత కుత్సితుఁడే కానిమ్ము; ప్రత్యేక మందును గాన్తి యనెడి దొకటి కలదు. మనుజుఁ డా కాన్తి నింతయో యంతయో యనుభవింపఁగలఁడు. అంతే కాదు; పూలయందు, స్త్రీలయందు, శశియందు, శిశువులందు గాన్తి యేదే నొకవిధముగా నుండుటచేతనే, వానిని జూచునపుడు మన చిత్తములు వికసించును. అది యమ్మకాన్తియే. జీవదేహమందుఁ గాన్తిమూర్తితో నమ్మ యున్నంతకాలము నామె కాన్తిమూర్తి ప్రత్యక్షమగుచుండును. ప్రాణిదేహము నందేకాదు, వృక్ష లతా గుల్మపర్వత నదీ గ్రహ నక్షత్రాదులందంతటను నామె కాన్తిమూర్తి ప్రత్యక్షమగుచుండును. ఇదే మన యమ్మ వ్యష్టికాన్తిమూర్తి. ఈ వ్యష్టికాన్తిరూపిణికిఁ బ్రణామము.

క్రమముగా వ్యష్టివస్తువులను విడిచి, సర్వభూత మహేశ్వరి యొక్క మహాకాన్తివంకఁ జూపు పెట్టినపుడే, యీసర్వ జగత్తు

కాంతిమయము, సౌందర్యమయము, మధుమయమునగును. ఈ మన క్షుద్రబుద్ధి సాగినంతవఱకు మాతృకమనీయ కాన్తిఁ జూచియే మతిపోవు మనము, సర్వత్ర ప్రసరించియున్న రూపహీన కమనీయరూపమును జూచి, యనుభవించి యేమైపోవుదుమో ! మన యహంతాకాన్తి నట్టేటిలోఁ గలిసిపోవును. ఆ యరూప రూపసాగరమందు మునిఁగిపోయి, మన మెట్టి యనిర్వచనీయ భావమయత నొందుదుమో ! అది యిట్టి దనఁజాలము. ఏ రూపమును జూచి వ్రజాంగనలు మైమఱచిరో, ఏ రూపమును జూచి యాఁ బసులు సైతము మేఁతమాని, నీయందే చూపునిల్పినవో, ఏ రూపమును జూచి జడ యమునయుఁ బ్రాణమయియై యుబికి పాఱినదో, యది అమ్మా ! నీ రూపము కాదా ? ఆ మనోహరకాన్తి నొకసారి కన్నా రంగన్నవారికీ జగమున నీడు లేదు. ఆ లోభనీయకాన్తి మా జీవత్వమునే మఱపింపఁగలదు. విశ్వవ్యాపినియైన నీ యనంతకాన్తి మూర్తికి మా ప్రణామము.

పిదప నీ వ్యష్టిసమష్టికాన్తి పుట్టిన యవ్యక్తబీజమయిన కారణరూపకాన్తి మూర్తికి మా ప్రణామములు. ఇఁక నీ నిరంజన స్వరూపమును గుఱించి మాటిమాటికిఁ బ్రణమిల్లుదుము. అచటఁ గా న్తియన నేదియు లేకున్నను, గాన్తియన్నది దాని కాన్తియే. అది కాన్తిరూపమునఁ బ్రకాశించినను, వాని యవ్యయస్వరూపమునకు రవ్వంతయు వ్యయము కాదు. ఆ పరమకమనీయ పరమప్రేమా స్పద పరమాత్మస్వరూపమునకుఁ బునః పునః ప్రణామములు.

ఓం. యాదేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 20

సర్వభూతములందును సంపత్స్వరూపముతో నున్న దేవికి నమస్కారము. లక్ష్మీ శబ్దమునకుఁ బ్రాణశక్తి యని యర్థము. జీవదేహమందుఁ బ్రాణమున్నంతవఱకే యది లక్ష్మీ (శ్రీ) యుక్తము. లక్ష్మీ - సంపద, శోభ, సౌందర్యము, మున్నగునే యర్థమును జెప్పికొన్నను బ్రాణమనునది యొక్కటే వాని కాధారము.

అమ్మయే సర్వభూతములందును లక్ష్మీమూర్తితో వెలయు చున్నది. ఇంద్రియగ్రాహ్యము కాకున్నను, ఈ మూర్తి మన యను భవమునకు వచ్చుచుండును. జీవించియున్న వాఁడెవ్వఁడును బ్రాణాభావము ననుభవింపఁడు. జీవనమందు సదానుభవ యోగ్యము ప్రాణస్వరూపమే. ఇదె యమ్మ వ్యష్టిలక్ష్మీమూర్తి. అట్టి ప్రాణరూపిణీ తల్లికి వేనవేలు ప్రణామములు.

మన లోలోపల సదా ప్రాణరూపముతో ననుభూతయగు చున్నదే, యమ్మ వ్యష్టి లక్ష్మీమూర్తి. ఆ మూర్తికే తొల్త 'నమస్తస్యై' యనుచుఁ బ్రణమిల్లి, పిదప విశ్వవ్యాప్తి మహాప్రాణరూపముగా నున్న సమష్టిప్రాణమయమూర్తిని దర్శించి, ఒక్క ప్రాణసముద్ర మందలి విభిన్నతరంగములే జీవరూపముగా నుబుకుచున్నవి. బహుకాలమునుండి వీని నవమానించుచున్నాము. నేఁటినుండి మఱి యవమానింపరాదు. ఇపుడు శ్రద్ధాపూర్వకముగా నమస్కరించి, మన క్షుద్రప్రాణమును, ఆ మహాప్రాణసముద్రమందు ముంచి వేయుదము. దానివలన మన జీవత్వ మంతమొందును. పిదప

నా వ్యష్టి సమష్టి ప్రాణమునకుఁ గేంద్రమైన యా యవ్యక్తప్రాణ సత్తకుఁ బ్రణమిల్లి నిరంజనక్షేత్రమం దుపనీతులమై 'నమోనమ !' యనుచు మైమఱచి యాత్మలాభము నొందుదుము.

ఓం. యా దేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 21

సర్వభూతములందును వృత్తిరూపముతో నున్న దేవికి మా ప్రణామములు.

వ్యాఖ్య :- వృత్తి = కృష్యాది క్రియారూప జీవిక. చిత్తవృత్తి. అవ్యక్తచైతన్య మెపుడేని దేని నాశ్రయించి యున్నటులు వెలయునో, అనఁగా వ్యక్తభావము నొందునో, యపుడు దానిని వృత్తి యందురు. జీవికారూపవృత్తియుఁ జైతన్యముయొక్క యీ విశిష్టాభివ్యక్తికంటె వేఱేమియుంగాదు.

అమ్మయొక్క యీ వృత్తిస్వరూపమును మనము సదా యనుభవించుచునే యున్నాము. అనింద్యవృత్తిగానో అంతఃకరణ వృత్తిగానో, అమ్మయే యడరుచున్నది. కాని మన మెన్నఁడు నా మూర్తి నాదరింపలేదు. అది తల్లిరూపమే యని తలంపనైనలేదు. ఇపుడమ్మయే వృత్తిరూపమున యడరుచున్నదని యనుభవించు యోగ్యత కలిగినది. ఆ యకృతజ్ఞతకుఁ బ్రాయశ్చిత్తముగా 'నమస్తస్యై' యనుచుఁ బ్రణమిల్లుదుము. వ్యష్టివృత్తిరూపిణీ ! తల్లీ ! మా మ్రొక్కు లందుకొమ్ము.

ఇఁక సూక్ష్మమును లక్షించి (సమష్టి) చూడుఁడు. విశ్వమయమైన యొక యఖండవృత్తి యునెడి వస్తువున్నది. సృష్టిస్థితిప్రలయ

రూపముగాఁ దెలియు నా మహావృత్తిరూపిణి యీశ్వరీమూర్తియొక్క స్ఫురణము. ప్రతిజీవునిలోను భిన్న భిన్న వృత్తిరూపముగా వెలయుచున్నది. ఆ మహావృత్తి రూపిణికి సర్వేశ్వరికిఁ దల్లికి మా ప్రణామములు.

పిదప దృష్టి సమష్టివృత్తిప్రకాశమునకు, సూక్ష్మ తమావ్యక్త కారణమును; దాని విలయమునకును గేంద్రమైన మాత్రవ్యక్త కారణమూర్తికి మా మ్రొక్కు లర్పించి, తుదకు నిరంజనతత్త్వ మందుఁ జొత్తము. అచటఁ వృత్తియనుట కేమియు లేదు. అదివిశుద్ధ చిత్తే. అచటఁ జేరినచో నన్నివృత్తులును నంతరిం చును. గుణాతీతమగు నా స్వరూపమునకు 'నమోనమ' యనుచుఁ బ్రణమిల్లుదుము. అమ్మా ! వృత్తిరూపిణివైన నీవు స్థూల సూక్ష్మ రూపములను విడిచి విశుద్ధబోధాకార (బ్రహ్మాకార) మున వెలయునపుడే మా ప్రణామములు సార్థకము లగును.

ఓం. యా దేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 22

అమ్మ వృత్తిమూర్తికంటెఁ బలమైనది స్మృతిమూర్తి. ఏలన, దొల్త వృత్తిరూపముగా బయల్పడిన భావమే తర్వాత భావసంస్కార రూపముగాఁ జిత్తమున నిల్చును. అదే మఱలఁ జిత్తక్షేత్రమున నుబుకునపుడు స్మృతి యనఁబడును. అమ్మ స్మృతిరూపముతో మన జన్మ జన్మాంతరములందు రవ్వరవ్వంతగా నందిన జ్ఞానమును మొత్తముగా ధరింపఁజేయుచున్నది. ఒక్కొక్క మరణము తర్వాత,

ఆ జన్మమందుఁ బొందిన జ్ఞానము జాటిపోయి నచో మనము పూర్ణజ్ఞానము నొందు నాశయే యుండదు. మోక్షాస్వాద మెన్నటికిని దొరకదు. అనాదిగా నజ్ఞాననరకమందే మ్రగ్గుచున్నాము. మనల నజ్ఞానము నుండి విడిపించుటకే స్మృతిరూపముతో స్నేహమయి మాత ప్రతిజీవుని హృదయమందు నెల్లప్పుడును వెలయుచున్నది. కనుక స్మృతిరూపిణీమాతృ స్నేహమయాంకమందుండి, జన్మము తరువాత జన్మము ధరించి జ్ఞానరాశిని గూర్చుకొనుచున్నాము. దాని ఫలముగానే యొకనాఁడు మనము "అహం బ్రహ్మాస్మి" యనెడి చరమస్మృతికడకుఁ బోవుదుము. జీవత్వభ్రమము పూర్తిగా నణఁగును. వ్యష్టిస్మృతిరూపిణి మన యమ్మకుఁ బ్రణమిల్లి, మఱి యామె కృపచే సర్వభూత మహేశ్వరీసమష్టి స్మృతిమూర్తినిజేరి, యొక మహాస్మృతిమూర్తి యీ బ్రహ్మాండమును ధరించుచున్నదని కనుగొందుము. ఆ సమష్టిస్మృతి మూర్తిసముద్రమందలి తరంగములే యీ సర్వభూతములందలి విభిన్నస్మృతులని తెలిసికొని, దానికి మ్రొక్కుదుము. పిదప సర్వస్మృతి బీజరూపిణి యవ్యక్తకారణమూర్తికి మ్రొక్కి నిరంజనస్వరూపమును జేరికొందుము. మా జీవత్వస్మృతి లోపించి "అహం బ్రహ్మాస్మీతి స్మృతి" విడువకుండునపుడే, మాకు నీ నిర్గుణస్వరూపసంధానము లభించును. అచట స్మృతి యనుట కేమియు లేదు. దాని సత్తపైనే స్మృతిసత్త యున్నది. స్మృతిరూపముగా వెలసినను, దాని నిర్గుణత్వ మునకు రవ్వంతయు వ్యాఘాతము రాదు. అట్టి స్వరూపమునకు మా పునః పునః ప్రణామములు.

ఓం. యా దేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 23

సర్వభూతములందును దయారూపముతో నున్న దేవికి మా ప్రణామములు.

వ్యాఖ్య :- జీవుల దుఃఖములను జూచి వానిని దొలఁగించు నిచ్చ కే దయ యని పేరు. ప్రత్యేకజీవునియందు నింతో యంతో యా దయామూర్తి వెలయుచుండును. దానికి మా ప్రణామములు. అది వ్యష్టిదయామూర్తి. దయచూపునపుడు జరుగు పనివలన దయచూపిన వానియందును, జూపఁబడినవాని యందును తద్రూపముతోనున్న నీ మూర్తికి నమస్కరించి, దయయనెడి సాత్త్వికవృత్తితో జీవసమష్టియందున్న నీకుఁ బ్రణమిల్లుచున్నాము. ఈ విశ్వమందంతటఁ గానవచ్చుచున్న ఘనీభూతదయామూర్తి యమ్మదే. ఆ దయాసముద్రమందే మేమున్నాము. ఆ పరమేశ్వరీ మహాదయామూర్తికి మా ప్రణామములు. ఈ వ్యష్టి సమష్టి దయాస్ఫురణమునకుఁ గారణమైన దయామూర్తికిఁ బ్రణమిల్లి, యా నిరంజనక్షేత్రమందుఁ జేరుదుము. దాని సత్తవల్లనే దయ నిల్చినది. దయారూపముతో వెలయు దానికి మా పునఃపునః ప్రణామములు.

ఓం. యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 24

తుష్టిరూపముతో సర్వభూతములందు నున్న దేవికి మా ప్రణామములు.

ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తి యనువానివలన క్షణకాల మంతః కరణమునం దుదయించు భావమే అమ్మ తుష్టిమూర్తి. వ్యష్టి రూపముతో నిది ప్రతిజీవునియందుఁ దోఁచును. దానికి మా ప్రణామము. తరువాత నమ్మ నమష్టి తుష్టిమూర్తియెడఁ జూపువాఱఁగా, విశ్వమయమైన యొక తుష్టిసముద్రమున్నదని తోఁచును. జీవులు దానియంద విచరించుచున్నారు. శోకార్తుని యొజ్జియందును, రోగార్తుని పీడయందును, ఆఁకొన్నవాని యాఁకటిచిచ్చు నందును అమ్మతుష్టి మూర్తియే వెలయుచున్నది. జీవుఁ డేడ్చినను అది తుష్టిసంధానమునకుఁ గాకున్నచో నేడువఁడు. తెలిసియో తెలియకో సర్వజీవులు తుష్టినే సేవించు చున్నారు. తుష్టి సంధానమునకే యసంఖ్య జన్మమృత్యువుల యెడపెడ దెబ్బలను సహించుచున్నారు. అమ్మయొక్క యిమ్మహా పారమేశ్వరీ తుష్టిమూర్తికిఁ బ్రణామములు. గీత యం దమ్మయే చెప్పినది. (13-14)

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ ॥

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్తః స మే ప్రియః ॥"

సాధకుఁడు సాధనబలముచే 'నేను' నందుంజేరి సంకల్ప వికల్పాత్మక మనస్సును, నిశ్చయకరణాత్మకబుద్ధిని నొకచోట స్థిరపెట్టును. అపుడు వాని యంతఃకరణమందు భూతాది విషయక విరోధిభావమును లోపించి క్రమముగా సర్వమందును 'నేను' అనెడి జ్ఞానము గలుగును. నాకుఁ బ్రియతమవస్తువు 'నేనే' అనెడి

భావవికాస మేర్పడును. తన కష్టమును దాను సహింపఁజాలనటులే, సర్వమందును గరుణారసపూర్ణుఁడై, నేనునందుఁ జేర్చివేయును. కనుక 'నాది' యనుట కేమియు మిగులదు. అపు డే యహంకార మునుం బొడమదు, గాన సుఖ దుఃఖములనెడి వృత్తియు నుండదు. సర్వము సమానమగును. కేవల క్షమయు సంతుష్టియు మిగిలిపోవును. తొలుత నుండిన ద్వైతభావము తొలఁగి, యిపుడు ద్వైతాద్వైత వర్జితమైన యవస్థ వచ్చును. ఇదే యోగి యవస్థ. ఇపుడే యపారమైన యాత్మవికాసము గలుగును. గురువాక్యములను విశ్వసించిచేయు సాధనఫలముగా, నీ యవస్థ నొందినవాఁడే నాకుఁ బ్రియుఁడు. ఏలన, నాతఁడు 'నేను' దక్క మఱేమియు లేనివాఁడు.

సర్వవ్యాపక మాతృతుష్టిమూర్తి సంధానము నొందనివాఁడు నిత్యసంతుష్టుఁడు కాఁజాలఁడు. అమ్మా! నీవు మహా తుష్టిస్వరూపవై వెలసి ప్రారబ్ధవశమున దురాశాజనితమైన యసంతుష్టిని దొలఁగించి మా యీ ప్రణామములను సార్థక మొనరింపుము. మేము నీ కారణతత్త్వమందుఁ బ్రవేశింపఁగలము. ఈ తుష్టి యావిర్భవించిన నీ యవ్యక్తకారణమూర్తికి మా ప్రణామములుచేసి నిరంజనసత్తను జేరుదుము. అచటఁ దుష్టి, యసంతుష్టి, యనునవి లేవు. దాని సత్తపైనే తుష్టి సత్త యున్నది. తుష్టిరూపమున వెలయుచున్నను, దాని కెట్టి వెల్తియు రాదు. ఆ నీమూర్తికి మాటిమాటికిం బ్రణామములు.

ఓం. యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా।
ఓం నమస్తస్యై ..... 25

సర్వభూతములందును మాతృరూపముతో నున్న దేవికి మా ప్రణామములు.

వ్యాఖ్య :- అమ్మయే సర్వజీవులను గర్భమందుఁ దాల్చి యుంచి, వానిని వ్యక్తావస్థకుఁ దెచ్చుటకుఁ దపఃక్లేశ మొందుచున్నది. (ఇచ్ఛాశక్తి ప్రయోగము చేయుననుట.) అపుడు జీవుఁడనెడి పేరితో నొక పృథక్సత్త ప్రతీతమగును. ఆ అని బ్రసవించి స్తన్యదానముతోఁ (ఖండ ఖండ విషయజ్ఞానముతో) బరిపుష్టులను జేయుదువు. అమ్మా ! జన్మమృత్యు పరంపరలందును నీ సంతానమును తెప్పవేయక చూచుచు జీవుల మిథ్యాహంతనుదొలఁగించి జ్ఞానస్తన్యము నిచ్చుచుఁ బోషించి, క్రమముగా మాతృసత్తయందు విశ్వాసులను జేసి జీవకర్తృత్వమును మఱపించి, నీలో జేర్చికొని, మాతాపుత్రసంబంధము లేని యొక యజ్ఞేయతత్త్వమందుఁ జేర్చుదువు. ఇదే నీ సుప్రకట మాతృమూర్తి. ఇటులు నీ స్థూల సూక్ష్మకారణ నిరంజన స్వరూపమున నీ మాతృత్వమును వెలయింపఁ జూచు నీకుఁ బునః పునః ప్రణామములు చేయుచున్నాము. స్థూలముగా (వ్యష్టిగా) మా కొక్కరికి మాతగా వెలయుదువు. సూక్ష్మముగా (సమష్టిగా) మా కందఱకు (విశ్వమునకు) నీవే మాతవు. కారణముగా మమ్మును విశ్వమును గర్భమందుఁ దాల్చిన మాతవు. తురీయముగా 'నేను' 'విశ్వము' అనెడి మాట లేని కేవలాత్మ స్వరూపమాతవు. ఇన్ని విధముల మాతృత్వమొందిన నీకు మా ప్రణామములు.

ఓం. యా దేవీ సర్వభూతేషు భ్రాన్తిరూపేణ సంస్థితా ।
ఓం నమస్తస్యై ..... ..... ..... ..... ..... ..... 26

సర్వభూతములందును భ్రాన్తిరూపముననున్న దేవికి మా ప్రణామములు. పునః పునః ప్రణామములు.

వ్యాఖ్య :- సత్యవాక్ప్రచారమును జేయుటకు దర్శనకారు లెవ్వరును బ్రచారముచేయ సాహసింపలేదని తోఁచును. దేవీమాహాత్మ్యమందలి సర్వాంశములను విడిచి, యీ రెండు మంత్రములు (మాతృరూప, భ్రాన్తిరూప) లోకమునకు వాస్తవముగాఁ దెల్పిన సత్యము సాటిలేనిది. భ్రాన్తియనుచుఁ గొందఱెగురఁగొట్టఁ జూచు రూప మమ్మదే. మన యొకనోరు, ఒక కలము, ఒక మనసు, అను నీ క్షుద్రసాధనములతో నీ రెండు మంత్రముల వ్యాఖ్యానించు టెట్లు ? భారతదేశమం దింటింట నీ దేవీమాహాత్మ్యము పఠింపఁబడుచున్నది; కాని యీ రెండు మంత్రముల తాత్పర్యము మనసున కెక్కినపుడే చక్కఁగా దానిని దెలియఁగలరు. దుర్బలులకు బలమును, హతాశుల కాశ్రయమునైన యిట్టి యభయవాణి జీవుని మర్మమర్మములను గదల్చునది మఱియొకటి కానరాదు. వేదములందును వేదాన్తములందును భాషావరణమందు మఱుఁగుపడిన సత్యమును, దేవీమాహాత్మ్యమందలి (సప్తశతి యందలి) యీ రెండు శ్లోకములే తెల్పియఁజూపినవి.

వినుఁడు - అమ్మరూపము భ్రాన్తియెట్లగును ? రజ్జువు నందు సర్పభ్రాన్తిని బోలి, నిర్గుణమును నిరుపాధికమునైన బ్రహ్మమందు జగద్భ్రాన్తి కలుగుచున్నది. మరేమి యనఁగా; రజ్జువే యగును సర్పము

కానట్లే (రజ్జువుగా నెన్నఁడును సర్పము లేనటులే) బ్రహ్మము జగత్తుకాదు. (బ్రహ్మముగా నేనాఁడును జగత్తులేదు.) ఈ విషయమందాలోచించినచో భ్రాన్తియెవరిది ? అనునప్పుడు నీవు చేయు జిజ్ఞాసదే యందురు. బ్రహ్మమందు భ్రాన్తిలేదు. అది నిర్మలము, చిత్ స్వరూపము. జీవుఁడే భ్రాన్తుఁడు. సరే; రజ్జువు జడపదార్థము. దానియందు సర్పమనెడి యధ్యాసయగు నపుడు కూడ రజ్జువునందు సర్పజ్ఞానము లేదు. ఇది కేవల సత్యము. కాని విచారించి చూడుఁడు, రజ్జువు చేతనము (బోధస్వరూపవస్తువు) అగుచో సర్పాధ్యాస మన్నదియు ఆ బోధమందుఁ బ్రతిభాసింపదా ? అవశ్యము ప్రతిభాసించును. ఏలన - బోధముచే గ్రహింపఁబడు నదే ప్రకాశితమగును. ఇదే బోధస్వరూపము; కనుకనే రజ్జుస్థానీ భ్రమము చిద్రూపమగుటవలన దానియందు సర్పస్థానీయ జగత్తుయొక్క యధ్యాసమగును. అదియు బ్రహ్మముయొక్క ప్రకాశమువల్లనే ప్రకాశితమగును. మఱియు వాస్తవముగా మనుష్య మాత్రుని యనుభవము నిట్టిదే.

ఆధునిక మాయావాదులు కొంద ఱిమ్మాటను మన్నింపరు. వారు బ్రహ్మముయొక్క కేవలాస్తిత్వాంశము, మాయ యొక్క జీవత్వాంశము నను రెంటిదే యధ్యాస మందురు. సరే; వారి మాటను మన్నించియే జిజ్ఞాసను జేయుదము. చైతన్యశూన్యము, అస్తిత్వభాగ మగునా ? ఏనాఁడునుంగాదు. అస్తిత్వము చైతన్యము భిన్నవస్తువులు కావు. కనుకనే జగద్రూపముగాఁ గానవచ్చుదానిని, వేయిసారులు భ్రాన్తియన్నను ఆ భ్రాన్తి బ్రహ్మము (చైతన్యము)

యొక్క ప్రకాశముచేతనే ప్రకాశితమగుచున్నది. బ్రహ్మమం దేయవస్థయం దేది ప్రకాశితమగునో, యది బ్రహ్మముకంటె వేఱేమియుం గాదు. కనుకనే భ్రాన్తియును బ్రహ్మమే. ఇవి యన్నియు విచారవాక్యములు. ఇదంతయు మస్తిష్క ధర్మ విచారము. ఆచార్యులు, భాష్యకారులు, ఏ యవస్థను జేరినపుడు జగత్తును మిథ్యారూపముగా నెంచిరో దాని యథార్థ్యము ననుభవింప నేరని కొంద ఱమాయావాదులచేతఁ బడి, యాచార్యుల యనాక్షిప్త దిగ్విజయవాణియు నేఁ డాక్షేపయోగ్యమైపోయినది. ఇదే యాక్షేపవిషయము. మనము భగవద్భాష్యకారులకు నమస్కరింతము. వారు నిజముగా జగద్గురురూపమున నవతరించిరి.

అమ్మా ! ఈ జగత్తు ఈ దేహము నుండునంతదాఁక నీ యనిర్వచనీయ భ్రాన్తిమూర్తియు నుండఁగల దనుకొనుచున్నాము. భ్రాన్తియే లేనపుడు ఈ జగన్నాటకమే లేదు. జ్ఞానమయివైన నీవు భ్రాన్తిమయివయియే, యీ యనిర్వచనీయ జగల్లీలలను జరుపుచున్నావు. మేము భ్రాన్తిని భ్రాన్తియే యనుచు నెగురఁగొట్ట నెంచుచున్నాము. కనుకనే భ్రాన్తి చేతినుండి విడివడకున్నాము. అమ్మా ! రేవగళ్లు నిన్ను మఱచి, మమ్ము మేము మఱచి వినశ్వరవిషయములందుఁ జిక్కువడుచున్నాము. ఈ మఱుపు నీవే; భ్రాన్తియు నీవే. నీవు నిన్ను భ్రాన్తిరూపమున వెలయించు కొనునంత దాఁక నీ యథార్థ స్వరూపమును బయలుపెట్టు సామర్థ్య మెవ్వరికిం గలుగదు. నిన్ను నీ వాత్మరూపముగాఁ బ్రకటించికొన్న నాఁడు, నీ యీ భ్రాన్తిమూర్తియే మా జగదజ్ఞాన భేదజ్ఞానములను మఱ

పించును. భ్రాన్తియేలేక జగత్తును మఱచు టెట్లు ? ఈ కేలి ధూళిమాలిన్యము, మన నడుమ నగు నెడము మున్నగు నవన్నియు నీ వేదో యొకనాఁడు భ్రాన్తిరూపముతోఁ దొలఁ చెదవని యాశించు చున్నాము. అమ్మా ! నీవు మా హృదయమందెల్లప్పుడు భ్రాన్తి మూర్తితో నిల్చియున్నావు. కనుకనే యొకనాఁ డెప్పుడో నిశ్చయ ముగా, నన్నియు విడిచి నిన్నే చేరుకొందుము. ఆ దిన మింకెంత దూరమున్నదో ?

అమ్మయే ప్రతిదినము మూడవన్థలుగా విశేషించి భ్రాన్తిమూర్తితో వెలయుచున్నది. చూచుచునే యున్నాము గాని తెలియలేకున్నాము. జాగ్రదవస్థయందలి యహంతామమతలు స్వప్న రాజ్యమందుఁ బ్రవేశింపఁగానే మఱుఁగగుచున్నవి. అక్కడఁ జేరఁగానే క్రొత్త యహంతామమతలతో విచరించుచున్నాము. పిదప సుషుప్తిలోఁ జొచ్చునపుడు జాగ్రత్స్వప్న కథలన్నియు మఱచు చున్నాము. అపుడు దేని నంటని 'నేను' ఒక్కటే, ఏ యవ్యక్తక్షేత్ర మందుఁ జేరునో తెలియదు. ఈ విధముగాఁ బ్రతిదినము భ్రాన్తి మూర్తితో నమ్మదర్శన మగుచునే యున్నది. కనుక నేదో యొకనాఁడు సర్వము మఱచి యమ్మనే పొందుదమనెడి యాసతో నడుముగట్టు కొని కూరుచున్నాము. మేమేవిధముగా నన్నియు మఱచి యమ్మను జేరుకొందుమో తెలియదు. అమ్మయే మమ్ముఁ దనలోఁ జేర్చుకొనును.

ప్రియతమసాధకులారా ! అమ్మను వెదకుచు మీ రేడఁ బరుగెత్తుచున్నారు ? చూడుఁడిదియే యమ్మ మీలో భ్రాన్తి రూపముతో నజ్ఞానరూపముతో వెలయుచున్నది. జాగరణము

నుండి స్వప్నము; స్వప్నమునుండి సుషుప్తి; మఱల సుషుప్తి నుండి జాగరణమునవెడి మూడవస్థలవలననే, అమ్మను (ఆత్మను) ప్రత్యక్షము చేసికొని, యనుభవించుచున్నాము. దానిని భ్రాన్తియని, తుచ్ఛమని యెగురఁగొట్టవలదు. అమ్మఁగా నెఱిఁగి సరళశిశువుగా నాదరించి, అమ్మా ! యంచు నాత్మనివేదన మొనర్పుఁడు. భ్రాన్తిమూర్తియే యాత్మమూర్తితోఁ బ్రకటితయై మిమ్ము సర్వభ్రాన్తుల పారమునకుఁ గొనిపోవును.

వేదా న్తమతమందు భ్రమము రెండు విధములు - 1. సంవాది 2. విసంవాది అభిలషించిన వస్తువు నొందుటకు వ్యాఘాతముకానిది సంవాదిభ్రమము. ఎటులంటేని, మఱికాన్తిని జూచి, తొలుత నెవ్వఁడేని భ్రమమొందినను, దానిని లక్షించి పరుగెత్తిపోయి తత్ఫలముగా మఱినొందఁగల్గును. ఇది సంవాది భ్రమమునకు దృష్టాన్తము. ఇఁక, జపాకుసుమము (మంకెనపూవు) నో, తళుకుగల యేదే నెఱ్ఱనిదానినో చూచి పద్మరాగమనెడి భ్రమమునొంది యన్వేషించినచో, బద్మరాగమణి లభింపదు. జపాపుష్పమే లభించును. ఇదె విసంవాది భ్రమమునకు దృష్టాన్తము. ఈ జగత్తును బ్రహ్మరూపముగాఁగని భ్రమమొందినను, ఆ భ్రమమే జీవుని బ్రహ్మత్వమందుఁ జేర్చును. ఇది విసంవాదిభ్రమము. ఇక యజ్ఞేయకారణముచే జగత్తున బహుకాలమునుండియు విసంవాదిభ్రమమువేం సాగివచ్చుచున్నది. అమ్మ విసంవాది భ్రమమూర్తితో నడరుచుఁ జాలకాలమువఱకు జీవులను, అభీష్టవస్తువునకు దవ్వులనే యుంచినది. కాని యీసారి యమ్మ హృదయ్ము ముప్పొంగినది. మన యభీష్టవస్తువును జిక్కించు నెడఁ

గేవలానుకూల సంవాదిభ్రమమూర్తితో నావిర్భవించినదా ? లేదు లేదు. కనుకనే యీ యోజనము. దీనివలన నేఁడు సత్యప్రతిష్ఠా విజయధ్వని విసంవాదిభ్రాన్తిని దవ్వు దొలి నిద్రాణమైన దేశమును మేలుకొలిపి మెల్లమెల్లఁగా భ్రాన్తి పరపారమైన సత్యము సమీపమునఁ జేర్చుటకుఁ బ్రయాసపడుదము.

భ్రాన్తిరూపిణీ ! తల్లీ ! నీ చరణములకుఁ బ్రణమిల్లుట చేతనే మా భ్రాన్తి తొలఁగును. మఱియు మేము సర్వావస్థల యందును నిత్యశుద్ధబుద్ధాత్ములమని తెలియఁగల్గుదుము. గానఁ దొల్త నీ వ్యష్టిభ్రాన్తిరూపమునకుఁ బ్రణమిల్లుచున్నాము. మా ప్రత్యేకాంతర మందును గల నీ విశిష్టప్రభావ భ్రాన్తి మూర్తిచేతనే మేము నిన్ను మఱచుచున్నాము. నీ యీ మూర్తిచరణములకు మాటిమాటికిఁ బ్రణమిల్లి, యవ్యక్తక్షేత్రమందుఁ జేరుదుము. అచటి భ్రాన్తిబీజరూపమునకుఁ బ్రణమించి, యొక్కసారిగా నిరంజనక్షేత్ర మందుఁ జేరుదుము. అచట భ్రాన్తియూసేలేదు. దాని నాశ్ర యించియే భ్రాన్తియున్నది. అది భ్రాన్తిరూపమునఁ బ్రకాశించినను స్వయంభ్రాన్తము కాదు. ఆ నీ విశుద్ధబోధమయ స్వరూపమును లక్షించి యసంఖ్య ప్రణామములు చేయుదుము. అమ్మా ! మా భ్రాన్తిని బాపుము.

ఓం. ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా ।
భూతేషు సతతం తస్యై వ్యాప్తి దేవ్యై నమోనమః ॥ ఓం. 27

శ్రోత్రాదులైన పదునొకండింద్రియములకును, క్షిత్యాదులైన పంచభూతములకును, నధిష్ఠాత్రివి (అనుగ్రహించుదానవు),

ప్రేరణము చేయుదానవు. అనఁగా, అధిభూతాధ్యాత్మాధి దేవతల పరమార్థరూపవు నీవే. వస్త్రమునందు దారమువలెను, మణులందు సూత్రమువలెను, సర్వభూతములందు ననుస్యూతయై ప్రకాశించు వ్యాప్తి దేవికి నీకు నిరంతర ప్రణామములు.

వ్యాఖ్య :- చక్షురాదీంద్రియములకును, భూ జలాది భూతపాణికిని నధిష్ఠానరూపముతో నమ్మయే యడరుచున్నది. వేర్వేఱింద్రియములకు నధిష్ఠాతృ దేవతలు వేర్వేఱుగాఁ జెప్పఁబడినను, వారు ఒక్క చైతన్యరూపముతో సాధకులకుఁ గాన వత్తురు. ప్రసంగవశమున నింద్రియాధిష్ఠాన దేవతలఁ బేర్కొందుము.

(శ్రోత్రమునకు దిక్కులు; త్వక్కునకు వాయువు; చక్షువునకు సూర్యుఁడు; రసనకు వరుణుఁడు; ఘ్రాణమునకు అశ్వినులు; వాక్కున కగ్ని; పాణి కింద్రుఁడు; పాదమునకు విష్ణువు; పాయువునకు మైత్రుఁడు; ఉపస్థమునకుఁ బ్రజాపతి; మనసునకుఁ జంద్రుఁడు; బుద్ధి కచ్యుతుఁడు; అహంకారమునకుఁ జతుర్ముఖ బ్రహ్మ; చిత్తమునకు శంకరుఁడు.)

ఈ చైతన్యశక్తులు శ్రోత్రాదీంద్రియరూపములఁ బ్రకాశించును. ఆ శక్తులే మీదఁజెప్పిన దిగాదినామములతోఁ బ్రసిద్ధములు. ఇటులే క్షిత్యాదిరూపమున వెలయు చైతన్యశక్తులే భూతాధిష్ఠాన దేవతలు. ఈ భూతేంద్రియాధిష్ఠానచైతన్యము భిన్నోపాధులతో విశిష్టసంబంధమునొంది, విభిన్న నామములతోఁ బేర్కొనఁబడినను, వాస్తవముగా నొక్కయఖండచైతన్యసత్తకంటె వేఱేమియుం గాదు. అదే మనయమ్మ సర్వవ్యాప్తి చిన్మయమూర్తి.

అమ్మా! ఈ విశ్వమందెచటఁ జూచినను నీ మహేశ్వర వ్యాప్తి మూర్తి కానఁబడును. ఒక యఖండఘనచైతన్య సత్తవిశ్వమందంత టను నిండియున్నది. మేము దాని గర్భము నుండియే పుట్టి, యందే నిల్చి, యందే చేరిపోవుదుము. నీ యీ వ్యాప్తిమూర్తి నెల్లపుడును గను సాధకుల మనఃసంకోచమును, మతిసంకీర్ణతయుఁ దప్పక తొలఁగును. అట్టి నీచరణముల కసంఖ్య ప్రణామములు.

ఓం. చితిరూపేణ యా కృత్స్న
మేతద్వ్యాప్య స్థితా జగత్ ।

ఓం నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం
ఓం నమస్తస్యై నమోనమః ॥ ఓం. 28

చితిరూపముతో (జీవరూపముతో) సమస్త జగత్తున వ్యాపించి యున్న దేవికిఁ బ్రణామములు.

వ్యాఖ్య :- ప్రకాశికా టీకా - "చితిశ్చైతన్యం । తన్మయో జీవ ఇత్యర్థః । తదుక్తం వేదాన్తే - అవిద్యోపహితం చైతన్యం జీవ ఇత్యర్థః"। గీతాసుచ "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మామికాం । జీవసంజ్ఞాం మహాబాహూ యయేదం ధార్యతే జగత్ ॥" ఏతేన ర చిజ్జడాత్మకం సమష్టిరూపం జగత్ త్వమేవేతి ప్రతిపాదితమ్ । నను "విష్ణోస్తు త్రీణిరూపాణి పురుషాఖ్యాన్యథో విదుః । ప్రథమం మహతః సృష్టి ర్ద్వితీయం తత్త్వ సంస్థితం । తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా ప్రముచ్యతే" ఇతి సాత్వత గ్రంథోక్తత్వాత్ ॥

గీత :- ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ ।
క్షరః సర్వాణి భూతాని కూటస్థో ఽక్షర ఉచ్యతే ॥

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

యస్మాత్క్షర మతీతో ఽహ మక్షరాదపి చోత్తమ ।
అతో ఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం ।
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ॥

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ ।
ఏతద్ బుద్ధ్వా బుద్ధిమాఽస్యాత్ కృతకృత్యశ్చభారత ॥

ఇతి గీతాసూక్తత్వాచ్చ । పురుషస్యైవ జీవత్వం కథం ప్రకృతేర్జీవత్వముచ్యతే ? ఇతి న వాచ్యమ్ । ప్రకృతిర్నామ బ్రహ్మణ ఏవ సగుణమూర్తిభేద ఇతి ప్రాగుక్తమేవ । పుం స్త్రీ భేదశ్చ జడమాత్రవిషయకత్వేనా స్పష్టమ్ । చిదంశత్వాభావస్తవ ఏవ । అతఏవ జ్ఞానిజనానుభవో ఽపి । తథా వ్యక్తముక్తమ్ ప్రథమే ।

"తద్వీక్ష్య పృచ్ఛతి మునౌ జగదుత్తరాస్తే ।
స్త్రీపుం భిదా న తు సుతస్య వివి క్తదృష్టేః ॥" ఇతి.

అతిఏవ శ్రీ బలరామః ప్రకృతిత్వేనోక్తోదశమే । ఏతౌ హి విశ్వస్యచ బీజయోనీ రామో ముకుందః పురుషః ప్రధానమ్ । బీజం నిమిత్తం । ముకుందః పురుషః యోనిః స్సమవాయకార్ణ్ణం । రామః ప్రధాన మిత్యర్థక్రమస్య బలవత్త్వాత్ । ప్రధానత్వేన ప్రకృతిం వదన్తి ।

ఇత్యాథర్వణ శ్రుతౌచ । ప్రకృతిపదం పారిభాషిక ముక్తం । న తు స్త్రీసంస్థానాత్ । పురి శయనాత్పురుష పదమపి తథా శ్రుతిసిద్ధమ్ ॥

నను భవతు :- తథాపి జడాయాః ప్రకృతేః కుత శ్చేతనమ్ ? అత్రోచ్యతే - చిత్ప్రకృతి పక్షే ఽపి వాదిభేద మతే సత్త్వోద్రేకాత్ చేతనత్వమ్ । యదుక్తం గీతసు । "సత్త్వం జ్ఞానం రజః కర్మ" ఇత్యాది । సత్త్వోద్రేకత్వాత్ । గుణసామ్యే ఽపి పురుషేక్షా వశాదేవేతి । సమం జన్నలమితి । ప్రపంచేన । ప్రాగంతఃకరణ విశేష శక్తితయోక్తమ్ ॥

పంచోపచార చితి పూజనవిధిః

లం. చిత్యైనమః గంధం సమర్పయామి ।

హం. చిత్యైనమః పుష్పం సమర్పయామి ।

యం. చిత్యైనమః ధూపం సమర్పయామి ।

రం. చిత్యైనమః దీపం సమర్పయామి ।

వం. చిత్యైనమః అమృతాత్మకం నై వేద్యం సమర్పయామి ।

సం. సోమాత్మకం శ్రీ చిత్యైనమః<br>
తాంబూలం సమర్పయామి ॥

ఇంతకు మున్ను చేతనారూపయైన యమ్మకుఁ బ్రణామము చేయఁబడినది. అది విశిష్టచేతనమే. అనఁగా, ఇంద్రియాది కారణవర్గమువలన ననుభూతమగుచున్న చైతన్యము మఱి యీ మంత్రమందు నిర్గుణచైతన్యమును లక్షించి చితి శబ్దము ప్రయోగింపఁబడినది. చితి శబ్దముచే సాంఖ్యులకుఁ బురుషుఁడు, వేదాన్తులకు బ్రహ్మము, ఉపనిషత్తులకు ఆత్మ, మఱి మనకు అమ్మ,

తోఁచఁబడును. ఇచటఁ జితి నిర్గుణయే యైనచో "ఏతద్వ్యాప్యస్థితా జగత్'' అనుటెట్లు సంగత మగుననియు, జగద్వ్యాపిత్వ ధర్మముండుటచేఁ జితికి నిర్గుణత్వమెట్లు సంభవమగుననియు శంక కలుగవచ్చును. దీనికి బదులు సెప్పుటకు మున్ను. చితి వస్తువు శక్తిమాత్రమే. పతంజల దర్శనము సైతము, ఇది తెల్పుటకే చితిశక్తి శబ్దప్రయోగము చేసినది. ("పురుషార్థ శూన్యానాం గుణానాం ప్రతి ప్రసవ కైవల్యం స్వరూప ప్రతిష్ఠావా చితిశక్తి రితి" 4-34) అని చెప్పుట యుచితము. పక్షాంతరమున సాంఖ్యశాస్త్రము జడప్రకృతిపరిణామ మునకు హేతువును జెప్పునపుడు పురుషుని సాన్నిధ్యమాత్రముచే నుపకారమని చెప్పియున్నను, కార్యము వలన నది నిర్గుణపురుషుని శక్తిస్వరూపమే చెప్పఁబడినది. బుద్ధిశాలురు పాఠకులు వివేచించి చూడుఁడు. ఏమన - దేని సాన్నిధ్యమున జడప్రకృతిచేఁ దనవలెఁ బనిచేయఁగడఁగెనో యది వస్తుశక్తిగాక మఱేమైనఁ గాఁగలదా ? సరే; ఇపుడు వేదాన్తశాస్త్రమును జూడుఁడు. అందు సైతము, "జన్మాద్యస్య యతః" అనుచుఁ జిద్వస్తువుయొక్క శక్తిరూపత్వమే ప్రకాశించినది. జగన్మిథ్యయే కానీ, సృష్టికల్పనా మాత్రమే కానీ, దాని యాశ్రయము మాత్రము బ్రహ్మమే. మఱి యొకదానికి ఆశ్రయ మీయఁగలది; అనఁగా మఱియొకదాని కాశ్రయ స్వరూపమైనది, శక్తికంటె వేఱేమియుం గాఁజాలదు. 'ఆత్మవస్తువు యథార్థముగా శక్తిస్వరూపమే యైనచో, దానికి నిర్గుణత్వముండదే' - అనఁగలరు. ఉత్తరమును వినుఁడు. చిద్వస్తువునందు ఎట్టి క్రియాశీలతయుఁ గనఁబడనపుడే, యది నిర్గుణ మనఁబడును. ఎట్టి క్రియావికాసమును లేనిదానిని శక్తి యనుటెట్లు ? క్రియాశీలతయే

శక్తి స్వరూపము గదా; యందు రేని నిజమే. సత్యమే నిర్గుణ స్వరూపమందు సైతము, అవ్యక్తముగా సూక్ష్మతమక్రియాశక్తియై యున్నది. బ్రహ్మము నిర్గుణావస్థయందు సైతము స్వప్రకాశము, అనఁగా దన్నుఁ దాను బ్రకాశింపఁ జేసికొను చున్నది; అనఁగాఁ దన యాత్మ రసానుభవము చేయుచున్నది. ఇదియును శక్తితక్క మఱేమియుం గాదు; మఱియు నిది బాహుళ్యవిషయము. అనుభవ సంపన్నులైన సాధకులు, బుద్ధివల్లఁ బరమాత్మానుభవము చేయఁ గడఁగునంతదాఁక, ఆత్మ బుద్ధిప్రకాశముగా శక్తినే పరిచయము చేయుచుండును. అగుఁగాక - ఆత్మశక్తియని తెలిసికొంటిమి. జడజగత్తునందు, శక్తికంటె శక్తిమంతుఁడు భిన్నుఁడు గానే చూడఁబడుచున్నాఁడు. కాని, యాత్మక్షేత్రమునందు, శక్తి శక్తిమంతులు అభిన్నవస్తువులే. కేవల భాషయందు మాత్రమే విభిన్నత. కనుకనే యీ చితిశక్తికి వేఱొక యాశ్రయ మక్కఱలేదు. ఈ సిద్ధాన్తము నాదరించుటచేతనే శ్రుతివాక్యదర్శన పురాణాదులకుఁ బరస్పరవిరోధము కలుగదు. నిర్గుణ స్వరూపమువలన జగత్సృష్టి యెట్లగుననెడి యాశంకయు సుగమముగాఁ దొలఁగిపోవును.

మఱియు 'శక్తిహీనమైన యొక యవస్థయుఁ గలదు.' అను మాటను ప్రమాణింపఁదలఁచినచో దానికిని నిర్గుణముపైనే చోటీయ వలయును. అది వాఙ్మనసుల కతీతము, కనుకనే దాని స్వరూప మును వివరించుటయందు వేదవేదాన్తములు మూగలైపోయినవి. అపుడు "ఏకమేవా ద్వితీయమ్" మున్నగు మాటలతోను, లేక 'నేతి నేతి' యని నోరితోనో ప్రతిపన్నము చేయు ప్రయత్నము, ఆ నిర్గుణపర్యంతమే కనుక మనో వాగగోచరమైన యొక సత్తె కలదనియు, అది నిర్గుణముకాదు, సగుణమునుం గాదనియు

నాదరింపరు. ఆ యజ్ఞేయతత్త్వము యొక్క మహత్త్వము, నిర్గుణమనియు సగుణమనియు రెండు విధములఁ గానవచ్చును. సగుణస్వరూపము యొక్క మహత్త్వము, ఈశ్వరత్వము జీవత్వము అని రెండువిధములఁ గానవచ్చును.

స్వరూపముచే నిర్గుణమైన చితిశక్తి సగుణభావము నెటు లొందును ? మఱి సగుణముగాం బరిపక్వమైనను, దాని నిర్గుణ త్వమున కించుకంతయు వ్యాఘాతము లేదు; అను నీతత్త్వము మున్ను వ్యాఖ్యానింపఁబడినది.

జగత్తొక శక్తిమాత్రమే యనుట సర్వవాది సమ్మతము. నామరూపములును వ్యవహారగతమైన యనంతవైచిత్ర్యములు నున్నను, జక్షుష్మంతుఁడు, ఒక శక్తికంటె వేఱేమియు లేదని కనుగొనును. అతఁడు జలమును మంచుగడ్డను జలముకంటె భిన్నముగా భావింపఁడు. కుండలములను స్వర్ణముకంటె వేఱుగాఁ జూడఁడు. కుండను జూచి మట్టికంటె వేఱని తలంపఁడు. అట్లే, యీ నామరూపాత్మక జగత్ప్రపంచము చక్షుష్మంతున కొక యఖండ చితిశక్తిగానే ప్రతిభాసించును. ఈ విశ్వము చితిశక్తివల్లనే యైనది. మఱి చితిశక్తియందే యున్నది. చితివస్తువు బోధముకంటె వేఱేమి యుంగాదు. బోధము ఆనందము అభిన్నవస్తువులు, కనుకనే జగత్తానందమయమని పలుసారులు చెప్పితిమి. మఱి చెప్పు చున్నాము. జగత్తు ఆనందమందే పుట్టినది; ఆనందమందే దాని స్థితి; ఆనందమునందే దాలయము. కేవలము చూపునందే

తారతమ్యము. అమ్మ దయచే జ్ఞాననేత్రము విడినపు డెల్లరకు నీ జగత్తానందమయముగానే కనంబడును.

అమ్మా ! స్థూలమందు వ్యష్టిచితిశక్తిరూపముతో నామరూప విశిష్టయై ప్రకాశింతువు. ఆ నీ చిన్మయేశ్వరమూర్తికిఁ బ్రణామము. పిదప స్థూల సూక్ష్మముల కతీతమైన యవ్యక్త కారణరూప చిచ్ఛక్తికిఁ బ్రణామము. మఱి వాఙ్మనసుల కతీతమైన నిరంజనస్వరూపమును లక్షించి పునఃపునః ప్రణామములు.

సాధకా ! ఒక్కసారి కనువిచ్చి చూడుము. మన యమ్మ చితిశక్తిరూపముగా సర్వజగత్తున వ్యాపించియున్నది. అమ్మను విడిచి యేడను నేమియు లేదు. నీ వేమి చూచినను, యేమి యోచించినను నంతయుఁ జితిరూపిణి యమ్మయే.

ఓం. స్తుతా సురైః పూర్వ మభీష్టసంశ్రయా
త్తథా సురేంద్రేణ దినేషు సేవితా ।
కరోతు సా నః శుభహేతు రీశ్వరీ
శుభాని భద్రాణ్యభిహంతు చాపదః ॥ ఓం. 29

ఓం. యా సాంప్రతం చోద్ధతదైత్యతాపితై
రస్మాభి రీశా చ సురై ర్నమస్యతే ।
యా చ స్మృతా తత్క్షణమేవ హన్తి నః
సర్వాపదో భక్తివినమ్రమూర్తిభిః ॥ ఓం. 30

వ్యాఖ్య :- మహిషవధ సందర్భమునఁ దాము చేసిన సేవలను, దా మొందిన యుపకారములను దలంచిన దేవతలు విశ్వాస కృతజ్ఞతలను జూపుచున్నారు. అట్టి విశ్వాసమున్నచో జీవుఁ

డెన్నఁడును విపత్తులకు వెఱవఁడు. కింకర్తవ్యవిమూఢుఁడు కాఁడు. అమ్మ సర్వశక్తిమయి యనెడి విశ్వాసమే జీవునిఁ బరమభక్తునిగా మార్చును. దాని ఫలముగా విపద్భయము తొలఁగును. అమ్మను యథార్థముగా భక్తివినమ్రమూర్తియై స్మరింపఁగల్గెనే నపుడే సర్వవిపత్తులుతొలఁగి భక్తి ప్రభావముచే నమ్రమూర్తులగుదురు. అనఁగా, అహంబోధము చక్కఁగా సడలిపోవును. ఇది సత్యము. అమ్మ యీశ్వరీమూర్తిని సత్యముగా నెంచఁగల్గినపుడు జీవుని జీవభావీయ విపత్తి తొలఁగును.

ఇట్టి దృష్టాన్తము లిపుడుం గనుచున్నాము. గొడవలకుఁ జిక్కినవాఁడు కాతరబుద్ధితో భగవంతుని స్మరించి వానివలన విడివడుచున్నాఁడు వ్యాధితుఁడు భగవంతుని చరణములందుఁ దన్నర్పించుకొని రోగవిముక్తుఁ డగుచున్నాఁడు. ఇదంతయు భక్తివినమ్రమూర్తివల్ల నగు ఫలము. అది యెటింగి క్రమముగా, జీవభావీయాహంత తగ్గిపోయి, యీశ్వరభావీయా హంత వికసించును. సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు నైన పరమేశ్వరుని స్మరించుటచే, నింతయో యంతయో యీశశక్తి జీవునందుఁ జేరును. దాని ఫలముగా సర్వాపదలు తొలఁగును.

బహుత్వప్రతీతి యున్నంతవఱకు సాధకుఁ డాపదలకుఁ జిక్కక తప్పదు. బహుత్వవిలయమై యేకత్వప్రతీతి కానంతదాఁక జీవుఁడాత్మస్వరూపమును గుర్తింపలేఁడు. గీతలందు - ఒక్క యఖండవస్తువునకు శరణాగతుఁడగుటకే సర్వధర్మములును విశేషించి యుపదేశింపఁబడెను. శరణాగతభావమువల్లనే - భక్తివిన మ్రామూర్తి తోడి ప్రణామమువల్లనే యా వస్తువు (భగవంతుఁడు) సులభుఁడు.

పూర్వచరిత్రములందు (మధుకైటభ మహిషాసురవధ కథలందు) బ్రహ్మాదికృత స్తవరూపమున, అమ్మ మాహాత్మ్యము, అమ్మ కరుణాళుత, అమ్మ సర్వశక్తిమత్త్వము మున్నగునవి వర్ణింపఁబడినవి. ఈ స్తోత్రము ప్రణతిప్రధానము. ఇందు శ్రీమాతను క్షుధాతృష్ణా నిద్రాఛాయా భ్రాన్త్యాది భావరూపిణిగాఁ జూచి, పునఃపునః ప్రణామములు చేయుటచే జ్ఞానవికాసమగుచున్న కొలఁది, "నేను" అనునది యొక దురపనేయాజ్ఞాన మాత్రమనియు, ఈ యజ్ఞానము నుండి విముక్తుఁడగుటకే సద సత్తులుపస్థితము లైనవనియు నెఱుంగఁగలఁడు. మఱి, దానిని మాతృబోధముగానే దర్శించి, యా యహంతను మాతృచరణములందె యణఁపఁగడ ఁగును. ఈ విధముగా సాధకుని జ్ఞానమున్నతభూమిక కెక్కుచున్నకొలఁది, అజ్ఞాన మణఁగుచుండును. జ్ఞానప్రాప్తియనగా - అజ్ఞానమింకను నెంతయధికమో యెఱుంగఁ గలుగుటే. అజ్ఞాన స్వరూపము నెఱుంగుచున్న కొలంది జ్ఞాన చరణమునందవనతుఁడై పోయి సర్వసంశయములవలన విముక్తుఁ డగును. అందుచేతనే దేవతలు పునఃపునః ప్రణామము లాచరించి యభీష్టమునొందు దారిని సుగమము చేసికొనిరి.

ఈ తరువాత శుంభవధాంతమున మనము చూచు నారాయణీస్తుతియు నిటులే ప్రణతిప్రధానము. ప్రణతియే సాధనా రహస్యము. భక్తిపూర్వకముగాఁ బ్రణతుఁడు కాఁజాలినంతనే యన్నియుఁ బ్రాపించును. దేవతాగణము మాతృవక్షమునందుండి, జ్ఞానస్తవ్యముచేఁ బరిపుష్టమయిన సంతానము గనుక సర్వభావము

లతోఁ బ్రణతమైనది. మఱి మనమో, దేహాత్మ బోధ విశిష్టజీవులము. క్షుద్రతర కీటాణువులము. మన తల లేవిధముగాను వంగనొల్లవు. మనము మన మిథ్యాహంతను గౌరవించుకొన్న కొలఁదియు దాని నవమానించుచునే యున్నామన్నమాట. యెట్లును దెలియఁజాల కున్నాము. కనుకనే మన కీ దుర్దశ. ఇపుడును మనదేశమున స్వధర్మనిష్ఠులైనవారు బ్రాహ్మణులను జూచినంతనే తలవంచి ప్రణమిల్లుదురు. అదేల చేయుచున్నారు ? ఒకప్పు డీ బ్రాహ్మణులు తమ యహంతను విశ్వేశ్వరీచరణములం దర్పించినవారు. దాని ఫలముగా వారి కులపాంసుల సంతానము సైతము నేఁటిదాఁక, హిందుజాతి ప్రణామముల నందుకొనుచున్నది. ఔరా ! ఇమ్మాటఁ దలంచు కొనినంతఁ గన్నీరుట్టును. మాతృచరణప్రణతుఁడైన బ్రాహ్మణుఁ డొకప్పుడు వెన్నుని ఱొమ్ముఁ దన్నంగలంత వీర్యవంతుఁడును శక్తిమంతుఁడునై, యటులుచేసియు రవ్వంత చలింపలేదు. వారు విష్ణుత్వమును సైతము అతితుచ్ఛముగాఁ దలంచునంతగా మాతృసత్తయందు విశ్వాసవంతులై యుండిరి. ఇపుడువారి వంశధరులమాట యేమిచెప్పను ? విచారించిన ఫలమేమి ?

ఈ స్తవమందు దేవతలు తొల్త, అమ్మయొక్క విష్ణుమాయా మూర్తికిఁ బ్రణమిల్లుటతో నారంభించి క్రమముగా - చేతనా నిద్రా క్షుధా ఛాయా శక్తి తృష్ణా క్షాంతి జాతి లజ్జా శాంతి శ్రద్ధా కాంతి లక్ష్మీ వృత్తి దయా తుష్టి మాతృ బుద్ధి స్మృతి భ్రాన్తుల రూపముగాఁ దల్లిని బ్రత్యక్షము చేసికొని పునః పునః ప్రణమిల్లిరి. సత్యముగా-నా రూపములన్నియు అమ్మవే యనెడి నమ్మకము మనకు లేదు. కావుననే యమ్మ (ఆత్మ) చరణములకుఁ బ్రణతులము కాఁజాల

కున్నాము. ఐనను సత్య ప్రణామము చేయలేకున్నాము. కనుక మాతృకృపకు దవ్వయి పోవుచున్నాము. ఆ చేతనా బుద్ధి నిద్రాది రూపములతో మన లోనే వెలయుచున్న యమ్మను లక్షించి ప్రణమిల్లవలయును.

ప్రథమఖండమందు సత్యప్రతిష్ఠావిషయము చెప్పఁబడినది. ద్వితీయఖండమందు, ఉపదిష్ట ప్రాణప్రతిష్ఠాఫలముగాఁ బ్రత్య క్షానందస్వరూపముతో నుద్భాసించినది. ఒక్క యఖండానంద మయబోధమే, మునుజెప్పిన బుద్ధి నిద్రాది రూపములతో మనలను స్నేహాలింగనబద్ధులను జేసి యుంచినది, యని తెలియఁ గల్గినపుడే యజ్ఞానము తొలఁగును. రుద్రగ్రంథి (జ్ఞానమయ గ్రంథి) విడిపోవును.

పూర్వోక్తప్రణామము వట్టి ప్రణామము కాదు. అది యున్నత భూమికాసాధనము. స్థూల సూక్ష్మకారణ కారణాతీత నిరంజన సత్తలయెడ లక్ష్యముంచి, ప్రణమిల్లఁగల్గుటచేతనే జ్ఞాన సంకీర్ణత తొలఁగును. ఇదె తత్త్వజ్ఞానము. ద్వితీయఖండమందు క్షిత్యాది తత్త్వప్రణామరూపముగా ననుభవించు టుపదేశింపఁ బడినది. ఇచట సాధన మఱింత సూక్ష్మముగా ముందునకు నడచినది. కనుక నొక్కొక్కవృత్తిని బట్టుకొని ప్రణతిసహాయముచే నఖండజ్ఞాన సముద్రమున మున్గుటకైన యుపాయము వర్ణింపఁబడినది. ఆ యఖండానందమయానుభూతి విషయము "సారాయై సర్వకారిణ్యై" యనెడి మంత్రవ్యాఖ్యయందుఁ జెప్పఁబడినది. ఆ యనుభూతియే వ్యష్టి బుద్ధి నిద్రాదిరూపముగా నభి వ్యక్తమగుటఁ దెలిసి ప్రథమప్రణామము చేయఁబడినది. అనఁగా మొదటి 'నమస్తస్యై'

మంత్రము యొక్క తాత్పర్యమే ఆ యా వ్యష్టి ప్రకృతియొక్క విభిన్నవృత్తులనానందస్వరూపముగ ననుభ వించుట. మఱి యా వ్యష్టివృత్తులను సూక్ష్మసమష్టితత్త్వ మునకుఁ గొనిపోయి - అనఁగా నీశ్వరత్వమునకుఁ జేర్చి ద్వితీయ ప్రణామము చేయఁబడినది. ఈశ్వరత్వోపలబ్ధియే యీ రెండవ 'నమస్తస్యై' మంత్రముయొక్క రహస్యము. తరువాతఁ గారణ (అవ్యక్త) క్షేత్రసంధానము, అన్నిటికిం దుదిదైన సర్వభావాతీత మందయిన లక్ష్యము. ఇదే మూడవ నాల్గవ ప్రణామముల రహస్యము.

సరిగా నీవిధముగాఁ బ్రణామము చేయఁగల్గుటే యీ భూమికయొక్క సార్థకత. అనుభవములేని సాధకుఁడు దీనిందెలియ లేఁడు. కాని శ్రీగుఃరు కృపచే ననుభూతి నొందినవారి విషయమున సంశయము లేదు.

ఇది శ్రీమార్కండేయపురాణాంతర్గత దేవీమహాత్మ్యమందు
శుంభాసురనిధనమును గోరిన దేవతలు చేసిన స్తుతికి
శ్రీకాకుళవాసి, శ్రీ శ్రియానందనాథుఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ వ్రాసిన వ్యాఖ్య

శ్రీ పరదేవతార్పణము

శ్రీమాత్రే నమః

ఓం నమశ్చండికాయై

# సాధన సామగ్రి

## శుంభవధానంతరము దేవకృత దేవీస్తుతి.

## (నారాయణీ స్తుతి)

ఓం. ఋషిరువాచ ఓం.

ఓం. దేవ్యా హతే తత్ర మహాసురేంద్రే
సేంద్రాః సురా వహ్నిపురోగమాస్తామ్ ।
కాత్యాయనీం తుష్టువు రిష్టలాభా
ద్వికాసివక్త్రాస్తు వికాశితాశాః ॥ ఓం. 1

ఋషి పలికెను :- ఆ యుద్ధమందు దేవిచే మహాసుర శ్రేష్ఠుఁడు శుంభుఁడు చంపఁబడఁగా, అగ్ని ప్రముఖులైన యింద్రాది దేవతలు, తమ కోర్కి నెఱవేఱినందులకు వికసించిన తమ మోములచే దిక్కులను భాసింపఁజేయుచుఁ గాత్యాయనీ దేవిని బొగడిరి.

వ్యాఖ్య :- విశుద్ధబోధమందు నిల్చినపుడు ద్వైత ప్రతీతి లేమిచే, స్తవాదులు కేవల మసంభవములైనను, వ్యుత్థితావస్థ యందు (బోధమునుండి లేచిన తర్వాత) బాధితాను వృత్తి న్యాయముగా, మఱల దేహాద్యనాత్మప్రతీతి తలసూపును. కనుక నట్టియపుడు స్తుతు లసంభవములు కావు. సరిగదా, సంభవ మగుటయే స్వాభావికము.

శుంభుఁడు చంపఁబడెను. ఇంద్రియాధిష్ఠానచైతన్యవర్గ మనెడి దేవతల కోర్కి నెఱవేఱినది. అపహరింపఁబడిన వారి యజ్ఞభాగములు చేఁజిక్కినవి; గాన దేవతలకు మేరలేని యానంద మయ్యెను. ఇపుడు విశిష్టచైతన్యములయ్యును, ఆనందచైతన్యముతోఁ గూడ నఖండానంద స్వరూపలాభము నొంద సమర్థులైరి.

ఇంద్రుఁడే దేవతాముఖ్యుఁడైన, నిచట నగ్ని దేవునే ముందుంచుకొనిరి. అగ్ని వాగింద్రియాధిపతి. వాక్యసమష్టి మాత్రమే స్తుతి. కనుక వాగధిష్ఠితచైతన్యమును ముందు పెట్టినచో స్తుతి చక్కఁగా సంపన్నముకాఁగలదు అని నిశ్చయించి యింద్రాదిదేవతలు వహ్ని దేవునే స్తుతినేతగాఁ జేసిరి. వాగధిష్ఠానదేవత ప్రసన్నుఁడు గాకున్న స్తోత్రపాఠాదులు సత్యప్రాణమయములు కావు.

దేవతల పుష్కలస్తోత్రధ్వని దెసలను బవిత్రము చేసినది. విశుద్ధసత్త్వగుణ శుభ్రప్రభచే దిఙ్మండల ముద్భాసించినది. దేవతలు భక్తివినమ్రదేహులై కాత్యాయనిని స్తుతించిరి. కాత్యాయని జగదీశ్వరి. కత్యులనఁగా బ్రహ్మవిత్పురుషులు. వారికి ముఖ్యాశ్రయమగుటచే మన యమ్మ కాత్యాయని. ఈమెయే సగుణబ్రహ్మము. స్తవాదులు సగుణబ్రహ్మమునకే యగును.

ఓం. దేవి ప్రసన్నార్తి హరే ప్రసీద
ప్రసీద మాతర్జగతో౽ఖిలస్య ।

ప్రసీద విశ్వేశ్వరి పాహి విశ్వం
త్వ మీశ్వరీ దేవి చరాచరస్య ॥ ఓం. 2

ఓ దేవీ ! శరణాగతజనదుఃఖహారిణీ ! నీవు ప్రసన్నవగుము. సకలజగజ్జననీ ! ప్రసన్నవగుము. ఓ విశ్వేశ్వరీ ! ప్రసన్నవగుము. అమ్మా ! నీవీ విశ్వమును రక్షింపుము. నీవే స్థావరజంగమముల కధీశ్వరివి.

వ్యాఖ్య :- ప్రసన్నులైనవారి దుఃఖములఁ దొలంతువు. నీవే ప్రాపని నీ యభయచరణ శరణము నొందువారలు ఎట్టి దురాచారులేకానీ; ఎంతటి మూఢులేకానీ; నీవే స్వయముగా వారి సర్వవిధ దుఃఖములను, భయదీనతలను దొలఁగింతువు. అమ్మా ! నీవు మా యెడఁ బ్రసన్నవగుము. మేము నీ చరణములందే శరణు జొచ్చుటెందులకో నీ వెఱుఁగుదువు. నిన్నే ముఖ్యాశ్రయముగాఁ దెలిసికొని, నిర్విచారముగా నీయొడి యందు, అమ్మా ! యనుచు దూఁకి దాగియుండునంతటి మనో బలము విశ్వాసము మాకు లేవు. అయినను నీవు మమ్ము నీ యాశ్రితులనుగాఁ జేకొనుము. మఱి యే పార్థివవస్తువు నాశ్రయించి మిథ్యాభిమానకల్పితమైన 'నేనుఁ' బోషించుకొందుము ? దేనిచే సర్వమును వీడి నీకే శరణాగతులము కాఁగలమో యదే చేయుము. నీవు ప్రసన్నవగుము.

సర్వజగత్తులకు నీవే తల్లివి; కనుక మా యెడ నీవు ప్రసన్నవయియే యుందువు. మేము కేవల కుపుత్త్రులమే యగుదుముగాక. నీవు మాత్రము కుమాతవు కాఁజాలవు. మేము నిష్కపటముగా, అమ్మా ! యని నిన్నుఁ దలంపను తెలియలేము.

కనుక మమ్ము విడువలేవు. తొలఁగఁద్రోయలేవు. నీవు మా యమ్మవు. నీవు ప్రసన్నవైననే మా కోర్కులెల్లఁ దీఱును. అమ్మా! యెన్ని జన్మజన్మాంతరములనుండియో నీ ప్రసన్నతకొఱకే, యెన్నో యెడపెడదెబ్బలను, ఎన్నో నలుగుఁబాటులను సైఁచుచు వచ్చుచున్నాము. కాని నీవు నిత్యప్రసన్నవు, నిత్యతృప్తవు కదా; మా కిన్ని యనుభవము లేల పెట్టుచున్నావు ? బహుభావములతో నీ యాత్మ ప్రకాశమును గాంచునంతసేఁపు, నీ ప్రసన్నత నెటు లెఱుంగఁగలము ? అమ్మా! నీ నోర వెలువడు నొక్కమాట వినుటకే యెంతకాలమునుండియో మా నిరాశను మాలోనే దాచికొని నీ మొగవంకనే చూచుచున్నాము. ఎన్ని దెబ్బలకో యోర్చి, తెలిసియో, తెలియకో, కపటముతోనో, ఇచ్ఛతోనో, అనిచ్ఛతోనో, అమ్మా ! యనుచు స్మరించుచున్నాము. ప్రసన్నవగుమమ్మా! ఏదీ, ఒక్కసారి 'నేను' అనేకనుగాను 'ఏకనే' యనుమమ్మా ! నీ శ్రీముఖమున వెడలు నమ్మాట యొక్కటి వినఁగల్గినచో మా బ్రతుకులు ధన్యము లగును. అనాది జన్మములనుండి యున్న జీవత్వబంధనము విడిపోవును. నీ ప్రసన్నతను దెలియఁజూపుము.

అమ్మా! నీవు విశ్వేశ్వరివి. నీవే యీ విశ్వమును రక్షింపుము. ఈ విశ్వము నిన్నుఁజూడదు; నీ సత్త ననుభవింపఁజాలదు. బహిర్ముఖముగాఁ బరుగులెత్తుచున్నది. కనుకనే నీ ప్రసన్నతను దెలియఁజాలదు. దినదినమునకును ధ్వంసమువంకకే ముందడుగు వేయుచున్నది. అమ్మా! రక్షింపుము. ఏల రక్షింపవు ? ఈ తీవ్రమైన బహిర్గతివలన నీ విశ్వమును రక్షింపుము. ధ్వంసము వలన రక్షింపుము. ఈ విశ్వమున కధీశ్వరివి నీవేకదా, ఏల రక్షింపవు ? ఈ స్థావర

జంగమాత్మకమైనదాని కంతటికి నీవే నీయంత్రివి. నీ జగ్తును నీవు రక్షింపకున్న నింకెవరు రక్షింతురమ్మా ! ప్రతిజీవుని యందలి శుంభుని (అస్మితను) వధించి విశ్వమును ధ్వంసాభి ముఖము కాకుండఁ గాపాడుము.

ఓం. ఆధారభూతా జగతస్త్వమేకా
మహీస్వరూపేణ యతః స్థితాసి ।
అపాం స్వరూపస్థితయా త్వయైత
దాప్యాయ్యతే కృత్స్నమలంఘ్యవీర్యే ॥ ఓం. 3

నీవే జగదాధారస్వరూపవు. ఏమన నీవే మహీస్వరూపముతో నున్నావు. మఱియు జలరూపముగానుండి విశ్వమును తృప్తిపఱచు చున్నావు. అమ్మా ! నీ వీర్య మలంఘనీయము.

వ్యాఖ్య :- అమ్మా ! ఆధారశక్తిరూపిణివి, నీవే జగద్ధాత్రివి. ఆ నీమహనీయమూర్తిని జూచియే కొంచెము తెలియఁగల్గు చున్నాము. మహీరూపముతో మృత్తికారూపముతో సర్వపదార్థము లను దల్లివలె గుండె నిడుకొనియున్నావు. మార్పులేదు. వికల్పము లేదు. ఏ యనాదికాలమునుండియో, నీ వీ మట్టిరూపముతో మన్నేకూర్చుకొని యీ జగత్తునుధరించి యుంచినావు. ఇంతెకాదు. జలమయమూర్తితో సర్వజీవులను దనుపుచున్నావు. సస్యాదిరూపవై యాఁకటిని, జలరూపవై దప్పిని నివారించి, మాకు మాతృత్వ పరిచయముఁ గలిగించు చున్నావు. పాలుత్రాగు చంటిబిడ్డలను దల్లివలె గుండెను నిల్పుకొని మా యాఁకలిదప్పులను దీర్చు

చున్నావు. ఇటులు ప్రత్యేక జీవునిం దన్పుచున్నావు; పెంచు చున్నావు. నీ సాటిలేని ప్రభావము నెల్లరెఱుఁగుదురు. నీ యా వీర్య ప్రభావమును, ఈశ్వరాదులును గడవలేరు. నీ వలంఘ్యవీర్యవు.

నీ రూపము 'స్వ'. నీవే యాత్మవు, అయినను నీవు మహీ స్వరూపవు, జలరూపవు; సర్వభేదాతీతాత్మవు నీవే యైనను, స్వగతభేదవిశిష్టవై క్షితిజలాది రూపములతో జగములను దాల్చుట సాకుట మున్నగుపనులను నెఱవేర్చుచున్నావు. అమ్మా! నీ వీర్యము నిజముగా నలంఘనీయమే.

ఓం. త్వం వైష్ణవీ శక్తిరనంతవీర్యా
విశ్వస్య బీజం పరమాసి మాయా ।
సమ్మోహితం దేవి సమస్తమేతత్
త్వం వై ప్రసన్నా భువి ముక్తి హేతుః ॥ ఓం. 4

నీవు వైష్ణవీశక్తివి; నీ వనంతవీర్యవు; నీవే యీ విశ్వబీజము, నీవే పరమయైన మాయవు. దేవీ ! నీవీ సర్వజీవజగత్తును మోహపెట్టుచున్నావు. మఱి నీవే ప్రసన్నవై యీ జగజ్జీవులకు ముక్తి హేతువవై యున్నావు.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు సర్వవ్యాపినియైన వైష్ణవీ శక్తివి. జగత్పాలనకారిణివి. స్థితిమహాశక్తివి. ఈ విశ్వమునకుఁ జెందిన ప్రతిపరమాణువును నీ యందే నిల్చియున్నది. నీ వనంతవీర్యవు. నీ వీర్యవిభవమునకు హద్దులేదు. నీవు సర్వవ్యాపక వైష్ణవీశక్తి రూపమున నీ సంతానము నెదుటఁ బ్రకాశించునపుడు, నిజముగా

ననంతవీర్యవుగానే వెలయుదువు ఆ నీ వీర్యప్రభావము నతిక్ర మించు టయు, నింత యనుటయు నసంభవముగానే తోఁచును. ఈ విశ్వరూపముతో నిన్ను నీవు వెలయించుకొని, యనంత వీర్యవైష్ణవీ శక్తిపేరఁ బరఁగుటే కాదు; విశ్వబీజముగాను, సృష్టి ప్రబంధమున కాదిమకారణముగాను, నీవే యున్నావు. బీజరూపముగా నీవు పరమవును, వైష్ణవీరూపగా నీవు మాయవును, ననఁబరగుదువు. అమ్మా ! సృష్టి ప్రపంచరూపముగా - వ్యక్త విశ్వ రూపముగా నీవుమాయవును, సృష్టియొక్క యవ్యక్త రూపముగా నీవు పరమా - మాయవు, ననఁబడుదువు. సాంఖ్య శాస్త్రము నీయీ 'పరమా' స్వరూపమునే 'మూలప్రకృతి' యన్నది.

అమ్మా ! నీ యీ ద్వివిధ స్వరూపమందు నీ రెండు విధములైన వీర్యమును గనుగొనుచున్నాము. నీవు మాయా మూర్తితో వెలసి, అనఁగా వ్యక్తప్రపంచరూపముతో నిన్ను నీవు బయల్పెట్టుకొన్నపుడు "సమ్మోహితం దేవి సమస్తమేతత్" మఱి నీవు పరమా - మూర్తితోఁ బ్రకటవైనపుడు "త్వం వై ప్రసన్నా భువి ముక్తిహేతుః" అమ్మా ! ఒక మూర్తితో నీవు భోగదాయినివి. రెండవమూర్తితో నీవు మోక్షదాయినివి. మాయాస్వరూపమున నీ సమస్తమును మోహపెట్టుచున్నావు. స్వకీయస్వరూపానుభవమును గానీయవు. అప్పుడే జీవులు, నానా విధముల నీ మాయికమూర్తిని జూచి దీని నాయత్తపఱచుటకుఁ బరుగులెత్తుదురు. రూపరసాదుల యెడను, గామకాంచనాదుల యెడను, ముగ్ధులగువారు ప్రత్యక్షము గానే నీచే సమ్మోహితులగుదురు. మఱియు నీకు శరణాగతులుగాక యనేక విధముల సాధనానుష్ఠానములను జేయువారు సిద్ధిశక్తులు,

యశస్సు, ప్రతిష్ఠ మున్నగు వానిలో నేదేనపేక్షించి ముగ్ధులగుదురు. మాయావి మనుష్యుఁడు దుర్బలమనుష్యుని సమ్మోహన మంత్ర ముచే నావిష్టునిఁ జేసియుంచునటులే, యనాదికాలము నుండి నీవును జీవులను మోహావిష్టులను జేసి యుంచుచున్నావు. వారెట్టులును నిన్నుఁ గోరఁజాలరు. నీవు ముస్తాబుచేసి యిచ్చిన యాటబొమ్మలను బట్టుకొనియే తమ బ్రతుకు ధన్యమైన దనుకొందురు. నిన్నుఁ గోరుటచే నగు ప్రయోజనమేమో, యదియుం దెలియఁజాలరు. ఇట్టిదే యజ్ఞేయమోహము. ఈ తీరున వెలయు నీ వజేయవు. నీవు గాక మఱెవ్వరేని, ఈ మోహరూపమును ధరించి వచ్చినను, బెద్ద ప్రయత్నముతోఁ గఠోరతతో వారిని నిజముగాఁ బరు గెత్తింపఁగలము. కాని, యజేయము నలంఘ్యమునైన వీర్యము గల నీవే మోహరూపముతో నిల్చి, జీవుఁ డాత్మదర్శనము చేయఁగల చూపు నడ్డగించి యుంచుచున్నావు. అమ్మా ! ఎంతకాలమిటులు గానుఁగుటెద్దులను జేసి త్రిప్పెదువు ? త్రిప్పితివి, పో; ఒక్కసారి నీ సంతానము కంటిగంతలు సడలించి కనులు తెఱవనిమ్ము. అది నిన్నుఁజూచి జీవనము సార్థకము చేసి కొనును.

అమ్మా ! ఈ సమ్మోహినీమూర్తితో నున్న నీవే, ఈ విషయవేషముతో నున్న నీవే, కామ కాంచనాది వేషముతో వచ్చి మమ్ములను మోహపెట్టుచున్నావని తెలిసికొన్నంతనే నీవు ప్రసన్న వగుదువు. మాచేఁ జిక్కుదువు. చిక్కితివా - నీ మోహినీమూర్తి తొలఁగును. నీ నిత్యప్రసన్నమూర్తియే వెలయును. అపుడు మాకెట్టి య్యాపదయు నుండదు. అపుడు నీవే 'పరమా' ప్రకృతిరూపముతో,

జననీరూపముతో నెయ్యమున జీవులను గుండె కత్తుకొని ముక్తి మందిరమునఁ జేర్తువు. కనుకనే దేవతలు నీ స్తవముఁ జేయు నపుడు, ఒకవంక నీ విశ్వమోహినీ మూర్తిని జూచి "సమ్మోహితం దేవి సమస్త మేతత్" అనుచున్నారు. ముక్తి నిచ్చు నీ ప్రసన్నమూర్తిని జూచి "త్వం వై ప్రసన్నాభువి ముక్తిహేతు" అనుచు నీచరణములందే ప్రణతులగుచున్నారు. అమ్మా! ప్రసన్న వగుము. నీవు నిత్యప్రసన్న మూర్తితో మమ్మెల్లపుడును వక్షమందు ధరించియే యుంచు కొన్నావని మాకెఱిఁగింపుము. దేవతలవలెనే మేమును అమ్మా! అమ్మా! యనుచు ముక్తి మందిరమందుఁ జేరుకొందుము.

ఓం. విద్యాః సమస్తా స్తవ దేవి భేదాః
స్త్రియః సమస్తాః సకలా జగత్సు ।
త్వయైకయా పూరిత మంబయైత తత్
కా తే స్తుతిః స్తవ్యపరాపరోక్తిః ॥ ఓం. 5

దేవీ ! యీ జగత్తునందలి సర్వవిద్యలు నీ భేదములే. అనఁగా నీ విభిన్నమూర్తులే. ఈ జగత్తునందలి స్త్రీలెల్లరు నీ యంశములుగానే యున్నారు. నీ వొక్కతెవే మాతృస్వరూపముతో నీ విశ్వమంతట నిండియున్నావు. గాన మఱి నీ స్తుతి యన నెట్టిది ? నీవు స్తవ్యమునకుఁ బరవైయున్నావు. వాక్కులకును బరవై యున్నావు. స్తవ్యవిషయకమైన పరాపరవాక్య రూపస్తుతియు నీయెడఁ గేవలాసంభవమే.

పూర్వ శ్లోకరూపమంత్రమున, అమ్మ ప్రసన్నతచేతనే సాధకుల ముక్తిమార్గపుఁ దెఱిపి యని చెప్పఁబడినది. అమ్మ ప్రసన్నయైనపుడు సాధకుఁ డీ జగతి నేవిధముగాఁ గనునో యిందుఁ జెప్పుచున్నాఁడు.

వ్యాఖ్య :- ఓ దేవీ ! ప్రకాశశీలా ! క్రీడనశీలా ! "జగత్సు సమస్తా విద్యాః" ఈ జగత్తునం దన్నియు విద్యలే. "యా తదక్షర మధిగమ్యతే సా విద్యా" "దేనివలన నా యక్షరపురుషుఁడు తెలియఁబడునో యదే విద్య" యని యుప నిషత్తు. అనంత జగత్తులందు, అనంతకోటి బ్రహ్మాండములందన్నియు విద్యలే. అమ్మా ! యథార్థ ముముక్షువులును, నీ ప్రసన్న మూర్తిని గాంచినవారును, దర్శనసౌభాగ్యము నొందిన వారును, సర్వత్ర నీ విద్యాస్వరూపమును జూతురు. అవిద్యా నామముతో లోకమునఁ బ్రసిద్ధమైనదియును విద్య తక్క మఱేమియును గాదు. విద్యయే స్వల్పభావములతో వెలయునపుడు, అవిద్య యనఁబడును. అమ్మా ! నీ తత్త్వమును దర్శించిన సంతానము మాత్రమే యీ విషయము ననుభవింపఁగలదు. కనుక వారలు 'విద్యాః సమస్తా' యని సమస్తరూపిణీ విద్యామూర్తివైన నీ చరణములందే ప్రణతులై పడుచున్నారు.

ఇపుడొక ప్రశ్నము :- సమస్తము విద్యలే యైనచో, శాస్త్రము దేనిని అవిద్యాపదముతో నిర్దేశించినది ? అని - ఇదిగో, యీ ప్రశ్నమునకు నుత్తరముగానే దేవతలు "తవ దేవి భేదాః" అనిరి. 'అవిద్య' యనునదియు విద్యారూపిణివైన నీ భేదమే. విభిన్న మూర్తి మాత్రమే. అమ్మా ! 'అవిద్య' యని మేమనుకొనుచున్నదియు నీ విభిన్న (వేఱొక) మూర్తియే. ఏకవు, అద్వితీయవు, సర్వభేదరహితవు నైన నీవే బహుమూర్తులతో సమస్త జగద్రూపముగా నిత్యము నున్నావు.

అమ్మా! ఈ జగత్తు నీ స్వగతభేదమే. కనుకనే దేవతలయెదుర నంతయు విద్యారూపముగానే యుద్భాసించినది. కనుకనే వారు, అవిద్యగా - విద్యావిరోధిగా దేనినిం గనలేదు.

"స్త్రియః సమస్తాః" సమస్తరూపముగాఁ దోఁచుచున్నదే స్త్రీ; అనఁగా శక్తియే, విశుద్ధచైతన్యస్వరూపవైన నీ వొక్కతెవే పురుష రూపముగాను, సమస్తరూపముగాను - జగద్రూపముగాను బ్రతీతి గోచర వగుచున్నావు. అదియంతయు స్త్రీ, అదియంతయు నీ ప్రకృతి. నీ శక్తి; నీ యిచ్ఛ; నీ వ్యవహారము. (సకారము బ్రహ్మ వాచకము; తకారము జగద్వాచకము; రేఫము తేజోవాచకము. ఈకారము శక్తివాచకము - విశుద్ధరజ్ఞానస్వరూప బ్రహ్మసమ్మిత శక్తియే జగద్రూప.) శక్తి శక్తిమంతునితో సత్యముగా నభిన్నగా (వేఱుగాక) నున్నటులే, యీ ప్రకృతిరూపజగత్తు పరమపురుషుఁ డవైన నీచే సర్వవిధముల నాలింగితమై యున్నది. వైష్ణవభాషలో నిదే రాధా కృష్ణుల నిత్యమిలనము.

అమ్మా! ఈ సమస్తము సకల - నీ కళతోనే నీయంశముతోనే నిత్యము నున్నది. సత్తారూపముతో, చైతన్యరూపముతో, 'అస్తి, భాతి' రూపముతో, నీ కలయే యంతట నున్నది. కావుననే దేవతలు సమస్తరూపముగాఁ బ్రతీతి గోచర మగుచున్న దంతయు, నీ కలయే యనిరి. (స = బ్రహ్మము, కలా = శ్రేష్ఠశక్తి, కాఁగా బ్రహ్మశక్తి.) నీ కళతోఁ గూడిలేకున్నచో - నీసత్తా చైతన్యములచే నుద్భాసితము కాకున్నచో, సమస్తమనుట కేమియు లేదు. నీవు నిత్యపూర్ణవు.

అనంతవు. నీయం దంశాంశిభేదము లేదు. అయినను విశిష్ట ప్రతీతి యున్నంతవఱకు దానిని, అంశమే యందురు. కనుకనే శ్రుతియు, నీ జగత్తును నీ యేకాంశముగా నున్నదనుచు వర్ణించినది.

అమ్మా ! ఈ విధముగా జగుత్తును మాతృరూపముగాఁ గాంచి, సత్యప్రతిష్ఠ చేసి, తల్లియొడిగా సత్తావిషయమును దలంపుము. చూడు జగత్తుగా నొక్కటే యఖండసత్త యున్నది. "చెట్టున్నది; పండ్లున్నవి; పూవులున్నవి; నేనున్నాను; నీవున్నావు; వాఁడున్నాఁడు;" అను నీ ఖండఖండములుగా నున్నవనియు, నొక యఖండమైన 'అస్తి' యొక్క పరిచయమునే కలిగించుచున్నవి. ఆ యఖండసత్తగా నున్న దే చితిశక్తి. అదే అయ్య; (పురుషుఁడు). అదే యమ్మ; ఈ సత్త యజ్ఞేయ (తెలియఁబడనిది) యయ్యును 'జ్ఞ' స్వరూపమే. అగ్రాహ్య యయ్యును గృహీతృస్వరూపమే. మనము విశిష్టభావముతో దానిని దెలియఁగోరునపుడు, అఖండసత్తతోడనే యొకశక్తి, అనఁగా స్త్రీమూర్తి కానవచ్చును. 'వృక్షము' అనుచోట వృక్షశక్తి యున్నది. 'ఇతఁడు పురుషుఁడు' అనుచోటను నింతే. అంతట నిటులే, కాని యా శక్తి పురుషునిదే, మఱేమియుండాదు. సత్తాశక్తిమతి. లేదా, శక్తియే సత్తామయి.

సరే; ఇపుడు చూడు. అది చెట్టు, ఆ నామరూపాకారముతో నాకారితమైన శక్తి - అమ్మ, యీ జగత్తున నిండి యున్నది. జీవుఁడా ! చూడుము. ఏ దిక్కునను దల్లిగాక, మఱెక్కడను నేమియు లేదు. ఇపుడు నీవును "త్వయైకయా పూరిత మంబయైె తత్" అనుము. ఈ విధముగాఁ జూడఁగల్గిన యెడల, నామె ప్రసన్నత ననుభవింపఁ

 

గలవు. మాతృప్రసన్న తను దెలియఁగల్గినచో 'భువి ముక్తి హేతుః' అయమ్మ యొక్కతెయే, యీ జగత్తున ముక్తిహేతువని తెలియఁ గల్గుదువు. ఆ యమ్మయే నిన్నొడిలో నిడుకొని ముక్తి మందిరమునఁ జేర్చి ధన్యునిఁ జేయును.

ఇటులు స్తుతించి దేవతలు విశ్వమయ మాతృమూర్తి వర్ణనము చేసిరి. అపుడు బాధ్యులై యామెతో 'కా తే స్తుతిః' నిన్ను స్తుతించు టెట్టిదమ్మా ? ఏమన అంతయు నీవే. నీవు తక్క నెక్కడను నేమియు లేదు. కనుక నీవు 'స్తవ్యపరా' స్తుతింపఁదగినదానికిఁ బరపారమందున్నావు. అనఁగా స్తుతిచేత నీ స్వరూపము - ఆరోపితగుణవర్ణనము కాదు. ఏమన నీవు దానికిఁ బైదానవు. ఇంతేకాదు. స్తుతియోగ్య వాక్కు లేవీ ? మఱియు "నీవు పరోక్తిః" వాక్యములకును బరపారమందున్నావు. అవాఙ్మానసగోచరవు. "న తత్ర వాగ్గచ్ఛతి". కనుక నెటు చూచినను మాకు నీ స్తుతి కేవల మసంభవమే. మఱి యటులుంగాదు. వాగ్విశుద్ధికొఱకు మేము నీ స్వరూపమహిమములను బాలకులవలె నెటులో కీర్తింపఁ బ్రయాసపడుచున్నాము క్షమింపుమమ్మా !

ఓం. సర్వభూతా యదా దేవీ స్వర్గముక్తి ప్రదాయినీ ।
త్వం స్తుతా స్తుతయే కావా భవన్తు పరమోక్తయః ॥ ఓం. 6

అమ్మా ! నీవే సర్వస్వరూపవు, ద్యోతనశీలవు, స్వర్గ మోక్షముల నిచ్చుదానవు, నిత్యస్తుతవు నైనపుడు నీ స్తవమెట్లు సంభవము ? ఆ స్తుతి పరమోక్తులు - యథార్థవాక్యములు, దేనివల్ల నగుచున్నవో, యదియు నీవే.

వ్యాఖ్య :- మనుష్యుల విషయమున నారోపితగుణవర్ణనము పేరే స్తుతి. నీయం దెట్టి గుణాభావమును లేదే. అటు లయినపుడుకదా గుణముల నారోపించి వర్ణించుటగును. దేవతా పక్షమున స్వరూపవర్ణనమే స్తుతి. నీ విషయమున నదియు నసంభవమే. ఏమన, నీ స్వరూపమును నీవుతక్క నెవరెఱుంగుదరు ? ఎవ్వరుం దెలియలేరు. తెలిసికొనుటకు రెండవదేమియు లేదు. "వేత్తాసి వేద్యంచ" "స వేత్తి విశ్వం నహి తస్య వేత్తా" నీ స్వరూపము నెఱింగినవాఁడు మఱియొకఁడు లేఁడు; కనుక నన్ని విధముల చేతను నీ స్తుతి యసంభవము. నీవు సర్వస్వరూపవు; ద్యోతన శీలవు. నీవు స్వభావముచేతనే స్వర్గముక్తిదాత్రివి. స్వభాముచే నీవు నిత్యస్తుతవు. గాన మఱి నీ స్తుతి యెట్లు కాఁగలదు ? మాటలకును మనసునకు నందవు. కనుక నీ విషయమున మేమేమి పల్కిన నది పరాపరోక్తి కాఁజాలదు.

ఓం. సర్వస్వ బుద్ధిరూపేణ జనస్య హృది సంస్థితే ।
స్వర్గాపవర్గదే దేవి నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 7

దేవీ ! నారాయణీ ! నీవు సర్వజీవుల హృదయమందు బుద్ధిరూపముతో నున్నావు. స్వర్గమోక్షముల నిత్తువు. నీకు నమస్కారము.

వ్యాఖ్య :- అమ్మా ! నిన్ను మేము స్తుతింపలేము కనుక (ప్రణామానుభవమును జేయలేము, గనుక) ప్రణామాభినయమును జేయుచున్నాము. యథార్థ ప్రణామము నెపుడు చేయఁగల్గుదుమో, యది నీవే యెఱుఁగుదువు. నీకు మ్రొక్కఁగా మ్రొక్కఁగా నీ

పరమధామమందు (కైవల్యధామ మందు) మాకుఁ జోడెన్నఁడు దొరుకునో, యది నీవే యెఱుఁగుదువు. ప్రణామము. జేయఁగా, జేయగా మఱి మఱలి యీ దేహేంద్రియమనస్సుల కెప్పుడు రామో, యది నీవే యెఱుఁగుదువు. అమ్మా! మేము యథార్థప్రణామము చేయులేకున్నను ప్రణామము నభినయింపఁ బ్రయత్నించు చున్నాము. పోనీ; నీకు నచ్చిననాఁడే మాచే యథార్థప్రణతి చేయించి యందుకొమ్ము.

అమ్మా! నీవు సర్వజీవులలోను బుద్ధిరూపముననున్నావు. అది నిశ్చయాత్మికవృత్తి. దానియం దొకవంక జగత్సంస్కారము లుగాను, రెండవవంక నిర్గుణాత్మయొక్క ప్రతిచ్ఛాయా పరిగ్రహ పూర్వకముగాను, సర్వజీవులలో నీ వున్నావు. ఆ బుద్ధి రూపముగా నీవే యున్నావు. నిన్ను బుద్ధిరూపనుగా నెఱుంగుటకే బ్రాహ్మణులు (ద్విజులు) మూడుసందెలందును, "ధియో యోనః ప్రచోదయాత్" అనుచు నీయెదుట ధీభిక్షమును గోరుచున్నారు. ఈ బుద్ధియు సత్త్వగుణప్రధానమై నిర్మలమైనపుడే, దాని యొకవైపు స్వర్గము (అనఁగా జ్ఞాన వైరాగ్యైశ్వర్యములు), రెండవవైపు అపవర్గమును (ముక్తిస్వరూపమును) ఉద్భాసించును. జీవన్ముక్తసాధకుఁడీ బుద్ధియందు స్థిరుఁడై, ఒక వంకస్వర్గభోగముయొక్కయు, రెండవ వంక జగద్భోగసత్త యొక్కయు, అపవర్గముయొక్కయు నాభాసము ననుభవించును. కనుక నారాయణివైన నీవు ప్రతినరునందును, బ్రతిజీవునందును బుద్ధిరూపముగా నున్నావు. "నరాణాం సమూహః నారం, తదేవ అయినం యాస్యాః సా నారాయణీ" నరసముదాయము నాశ్రయముగాఁ జేసికొని యున్నది నారాయణి, ఇచట 'నర' శబ్దము సర్వభూతోపలక్షకము - నీవు నారాయణివి. మేము

నరులము. అమ్మా ! కాయ మనోవాక్కులతో నీ చరణములకు మేము చేయు ప్రణామము నందుకొనుము.

ఓం. కలాకాష్ఠాదిరూపేణ పరిణామప్రదాయినీ ।
విశ్వస్యోపరతౌ శక్తే నారాయణి నమోఽస్తుతే ॥ ఓం. 8

నీవు కలాకాష్ఠాదిరూపముతో (కాలపరిచ్ఛేద రూపముతో) జగత్పరిణామసాధనమును జేయుదువు. నీవే జగత్సంహారకారిణీ శక్తివి. నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- అమ్మా ! కాలమూర్తితో నీవు సదా యీ విశ్వము యొక్క పరిణామమును (పరివర్తనమును) సంధానించుచున్నావు. కలాకాష్ఠాదులు నీయా యఖండకాలమూర్తి యందలి విభాగములు. పదునెన్మిది నిమేషము లొక కాష్ఠ; ముప్పది కాష్ఠ లొక కల. ఈ విధముగా ముహూర్తదివస సప్తాహ పక్ష మాసర్తువత్సర యుగ కల్పాదులన్నియు నీ కాలమూర్తి విభాగములే. నీ కాలమూర్తి యఖండము నపరిచ్ఛిన్నము నైనను, మేము దాని సత్తననుభవించు టకై, పై విధముగా నెన్నో పరిచ్ఛేదములు చేసివైచితిమి. ఆ పరిచ్ఛిన్న కాలరూపముతో నీ వీ జీవజగత్తుయొక్క పరివర్తనమును సంధానించు చున్నావు. ఇక్కాలరూప పరిణామమును లోపలనే చేసి, విశ్వము యొక్క యుపరతిని (ప్రలయమును) సంధానించు చున్నావు. బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులైన యీశ్వరులనుగూడఁ బ్రలయమొనర్చు దానవు నీవే. నీ కీ విశ్వప్రలయ మొక చిన్నపని. అమ్మా ! నీ వపార శక్తిసంపన్నవు య్యును బ్రతినరునందును నారాయణీమూర్తితో వ్యష్టి

మాతృ మూర్తితో నున్నావు. నీవు సమగ్రజగత్తునకును దల్లివయ్యును బ్రతినరునకుం దల్లివి, కనుక నీవు నారాయణివి. నీకుఁ బ్రణామము.

ఓం. సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 9

అమ్మా! నీవు సర్వమంగళములకును మంగళకారిణివి. నీవు శివవు - మంగళమయివి; సర్వాభీష్టసాధికవు. నీవు శరణ్యవు; (ఆశ్రయణీయువు). నీవుముక్కంటివి. నీవు గౌరివి; నీవు నారాయణివి. నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- మంగళశబ్దమున కనేకార్థములు. తలఁచిన తలఁపు సిద్ధించుట పేరు మంగళము. ఎల్లర కేది మంగళమో యదే మాంగల్యము. (మంగళ్యము -స్వార్థమందు యప్రత్యయము.) లేదా ఈ జగమునం దెన్ని మంగళము లున్నవో, ఆ యన్నఁటికిని మంగళవిధిని జేయునదే సర్వమంగళమంగళ్య. లోకమందు మంగళము లెనిమిది - బ్రాహ్మణుఁడు, గోవు, హుతాశనుఁడు, హిరణ్యము, ఘృతము, ఆదిత్యుఁడు. జలము, రాజు. మన యమ్మ ఈ యన్నిఁటికిని మంగళవిధానకారిణి. ఆమెయే సర్వమంగళమంగళ్య.

ఇదిగాక, సర్వమంగళమంగళ్య యనఁగా, మనకు మఱియొక యర్థము తోఁచును. సర్వమును మంగళమే. సర్వమునకును మంగళవిధాయిని. సర్వరూపములతోఁ గానఁబడునది, మిథ్య యగునా ? భ్రాన్తి యగునా ? జడమగునా ? అది 'చిత్' కంటె మఱేమియుంగాదు. చైతన్యవికాసముండటచేనే జీవుఁడు జీవితావస్థయందు మంగళస్వరూపుఁడు కనుకనే జీవించియున్న

మనుష్యుని పేరి ముందే, మంగళసూచకమైన 'శ్రీ' శబ్దము ప్రయోగింపఁబడును. గతప్రాణుఁడైన మనుష్యుఁడు అమంగళుఁడని యెల్ల రెఱుఁగుదురు. సర్వమును జిత్స్వరూపముగా వెలయునపుడు, సర్వమును మంగళమయమే యగును. అపుడు అమంగళ మనుట కేమియు లేదు. మంగళములకు మంగళ విధానము చేయు దానినే, మంగళమయప్రకాశముచే సర్వమును వెలయించుదానినే, 'సర్వమంగళమంగళ్య' యందుము. ఆ సచ్చిదానందమయియొక్క యనుప్రవేశముచేతనే (శ్రుతి - తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్.) సర్వమునకు మంగళమయత్వము గల్గును. అది సర్వమంగళవిధాయిని యయ్యును, దాను మంగళమయియే. కావున దేవతలు 'శివే' యని సంబోధించిరి. అమ్మా! జీవుఁడు నిన్నిట్టి భావముతో నెల్లప్పుడును, మంగళమయ మంగళదాయకరూపనుగా నెఱుఁగునప్డే వానియెడ సర్వాభీష్టసాధికా రూపవై వెలయుదువు. వాని యభీష్టములు తప్పక సిద్ధించును. అపుడాతఁడు పూర్ణకాముఁడై నీలోఁ జేరిపోవును.

అమ్మా! నీవే శరణ్యవు. జీవునకు ముఖ్యాశ్రయణీయవు. త్ర్యంబకా ! (త్రిణేత్ర - త్రినయన) చంద్ర సూర్యాగ్నులనెడి ముక్కనులతో, స్థూలసూక్ష్మకారణములనెడి త్రివిధ ప్రకాశములతో నిత్యము విరాజిల్లుచున్నావు. కాల సూచకములైన సూర్యచంద్రాగ్నులు నీ కవయవభూతములు (కనులైనవి), అనుటచేనీవు కాలాతీతవు; కాలస్వరూపిణివి. మఱియు, స్మృతికల్పన, ఆశ యనెడి భూతభవిష్యద్వర్తమానము లనెడి త్రయమును జూచు త్రినేత్రములతో విశిష్టవై (అనగా భూత వర్తమాన భవిష్యద్ జ్ఞానస్వరూపిణివై)

నీవే నిత్యమున్నావు. అమ్మా నీవు గౌరివి. అతిమనోహరవు; అతి సుందరివి; అతి సౌమ్యవు. నీవు నారాయణివి. నీకుఁ బ్రణామము.

ఓం. సృష్టిస్థితి వినాశానాం శక్తిభూతే సనాతని ।
గుణాశ్రయే గుణమయే నారాయణి నమోఽస్తుతే ॥ ఓం. 10

అమా ! నీవు సృష్టి స్థితి వినాశములు చేయు శక్తి స్వరూపిణివి. నీవు మూడుగుణములకు నాశ్రయస్వరూపిణివయ్యును స్వయముగా గుణమయివి. నీవు నారాయణివి. నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- చైతన్యమయియైన మహాశక్తియే నీ స్వరూపము. అది యీ జగత్తునందలి ప్రత్యేక పదార్థమందును, బ్రతిక్షణమందును నీ సృష్టిస్థితిప్రలయమూర్తిని జూచుటచేతనే యనాయాసముగాఁ దెలియఁగలము. నిన్నుఁ బట్టుకొనుటకుఁ (నిన్నుఁ దెలియుటకు) ఏదే నుపాయమున్నదా ? యనుచో నది యీ త్రివిధప్రకాశమే. నీవు సనాతనివి; నీవు నిత్యవు; అవ్యక్త స్వరూపవయ్యును, సృష్టి స్థితి ప్రలయమూర్తులతో సర్వత్ర వెలయుచున్నావు. ఇది శాస్త్రపురాణతంత్రాదులందు వర్ణితము. మహాకాళి నుండియే బ్రహ్మవిష్ణుశివుల జన్మమయ్యెను. అమ్మా ! నిజముగా నీవల్లనే సృష్టిస్థితిప్రలయములనెడి త్రివిధశక్తులు వెలయు చున్నవి. ఇమ్మూడు శక్తులు వాస్తవముగా భిన్న శక్తులుకావు. ఒక్క మహాచితి శక్తియొక్క త్రివిధస్పందనములే. ఆ శక్తికి స్వరూపమేమిటిది ? అది కేవల మవ్యక్తమయ్యును, నీ త్రివిధస్పందనములచేతనే దాని సత్త తెలియఁదగియున్నది. అమ్మా ! నీ యా యవ్యక్తశక్తిస్వరూపము, ఏ విధముగా వ్యక్తభావము నొందినదో, యీ వైపు లక్ష్యముంచియే

దేవతలు నిన్ను గుణాశ్రయువు, గుణమయువు ననిరి. సత్త్వ రజస్తమస్సు లనెడి మూడుగుణముల (అవస్థల) నాశ్రయించియే, నీ యీ త్రివిధస్పందన మున్నది. లేదా - స్వేచ్ఛాకృతములైన యీ నీ త్రిశక్తులే త్రిగుణములనెడి పేరఁ బ్రసిద్ధములు. ఇమ్మూఁడు గుణములు నీ యాశ్రయముచేఁ బ్రకాశించునపుడు, నీవే గుణ మయివయి నారాయణీమూర్తితో మమ్ముల నొడియందుంచు కొని యుందువు. అమ్మా! నీకుఁ బ్రణామము. ఈ గుణమయావస్థనుండి మమ్ములను దప్పించి, నీ యా సనాతనస్వరూప మందు ఈ సృష్టి స్థితి ప్రలయములనెడి మూడు సుడులు లేని చోటికిం దీసికొనిపొమ్ము. అమ్మా! అచ్చటికే కొనిపో.

ఓం. శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే ।
సర్వస్యార్తిహరే దేవి నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 11

అమ్మా ! నీవు శరణాగతులు, దీనులు, ఆర్తులు నైన జనులను రక్షించుచుందువు. నీవు సర్వముయొక్క యార్తిని హరించు దేవివి. నారాయణవి. నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- జీవుఁడేనాఁడు నీ చరణములందుఁబడి శరణమనునో. నీ యభావమందు దీనుఁడగునో, నీ యెడఁబాటుచే నార్తుఁడగునో, ఆనాఁడే మున్ను జెప్పిన, నీ త్రిగుణమయ త్రిశక్తిమయ స్వరూపము నెఱుంగఁగలవాఁడగును. అమ్మా! ఆనాఁడే నీవును నిజముగాఁ బరిత్రాణ పరాయణమూర్తితో వెలసి జీవుని భయార్తులను దవ్వు తొలఁగించి రక్షింతువు. అపుడే వాని జన్మ మృత్యువులనెడి సంసారార్తి పూర్తిగా నివర్తిల్లును.

అమ్మా! నీ చరణములందు శరణు చొచ్చుటచేతనే, జీవుఁడు నీ మొదటిశక్తిని, అనఁగా సత్త్వగుణమయస్వరూపము నవధరింపఁ (స్థిరీకరింప) గలఁడు. నీ వొక్కతెవే యాశ్రయ మనియు, నీ సత్తవల్లనే జగత్సత్తయనియుఁ దెలియఁగల్గునపుడే, సత్యముగా సర్వధర్మపరిత్యాగపూర్వకముగా, నీకు శరణాగతుఁడగును. నీ సత్త్వమయస్వరూపానుభవము చేయఁగలఁడు.

మఱియు నపుడే జీవునందు దీనత తోఁచును. అనంతైశ్వర్యమయివియు, అనంత బ్రహ్మాణ్డాధీశ్వరివియు నైన నీ లీలా విలాసదర్శనము చేయుటచేతనే జీవునకుఁ దన దీనత చక్కఁగాఁ దేటపడును. "నే నెంత దీనుఁడను; ఎంత లేమికిఁ జిక్కినాఁడను" అని దానిచే జీవుఁడు తెలియఁగలఁడు. మా యమ్మ యనంత బ్రహ్మాణ్డముల కధీశ్వరి, యని తెలిసికొనుట పేరే, నీ రెండవ శక్తిని, అనఁగా నీ రజోగుణమయస్వరూపము నెఱుంగఁగల్గుట. జీవుఁడు తన దీనతను యథార్థముగా ననుభవింపఁగల్గునపుడే, అమ్మ యైశ్వర్యబోధము గలుగును. మాత్రైశ్వర్యానుభూతి తన దీనతాప్రతీతికి హేతువు - అనుట మేలు. అమ్మా! జీవ సంతానమునకు నీ చిత్ స్వరూపమును విశేషించి యనుభవము చేయించుటకే రజోగుణమయమైన నీ యీశ్వరీమూర్తి వికాసము.

దాని తరువాత ఆర్తి. అమ్మా! నీ నిరవచ్ఛిన్నమైన యానందమయస్వరూపము ననుభవించుటకే జీవున కార్తి గలుగును. ఈ జగత్తున నే వస్తువునందు నానందము లేదు. ఆనందఖనివి నీ

వొక్కతెవే యని తెలియఁగల్గుటకైన బాహ్య లక్షణమే జీవుని యార్తి. నీ ప్రభావమువలనఁ గలుగు విరహ వేదనయే యథార్థమైన యార్తి. ఈ యార్తభావము గలిగి నపుడే జీవుఁడు, నీ యానందస్వరూపము యొక్క - తమోమయ మూర్తియొక్క - సాక్షాత్కరము నొంది ధన్యుఁడగును. మఱి నిరానందము నావలిగట్టున జేరిపోవును.

అమ్మా ! మే మెపుడు "నిరాశ్రయం మాం జగదీశ రక్ష" యనుచు నేకాంతనిరాశ్రయజ్ఞానముతో - అనఁగా "నీ యేకాశ్రితుఁడను (నిన్నే యాశ్రయించితిని)" అనెడి మాట చక్కఁగా నెఱుంగఁగల్గునపుడే, నీ సత్ స్వరూపము మాకుఁ దెలియును. (మా యెదుట నుద్భాసించును.) మేము సత్యమందుఁ బ్రతిష్ఠితుల మగుదుము. మఱియు బ్రహ్మాండమయమైన నీ యనంతైశ్వర్య భండారమును బ్రత్యక్షము చేసికొని మ్మా దీనతను జక్కఁగా ననుభవింపఁగలుగుదుము. తరువాత మా కుత్తరాధి కారము గలిగి, నీ యా యైశ్వర్యసత్త నొందుటకై (తెలియుటకై) లాలసుల మగుదుము. అపుడే నీ చిత్స్వరూప ముద్భాసించును. అపుడంతటను నిన్నుఁ బ్రాణరూపముతో (చైతన్య రూపనుగా) దర్శించి మేము ప్రాణమందుఁ బ్రతిష్ఠితుల మగుదుము. అది మొదలు తుట్టతుదకు, ఈ పుట్టుసావులు, దేహధారణము, చాంచల్యము యథార్థముగా మాలో నొక యార్తిని బుట్టించును. అపుడే నీ వానందఘన మూర్తితో నిత్యము వెలయుచున్నావని కనుగొందుము. నీయందును మా యందును, అనందాభావము చాంచల్యము నేనాఁడును లేదు. నీవును మేమును నిత్యస్థితులమై నిత్యానందమయులము. మా

యమ్మా! నారాయణీ! ఆర్తిహారిణీ! ఆర్తత్రాణపరాయణా! నీకుఁ బ్రణామము.

అమ్మా! మమ్ములనీ విధముగానే, తొల్త శరణాగతులను, దీనులను, ఆర్తులను జేయుచునే మఱల సత్యమందును బ్రాణమందును ఆనందమందును బ్రతిష్ఠింపుము. మా ప్రణామము సార్థకమగును. అమ్మా! మాయందీ మూడు లక్షణములను గానఁబడనంతదాఁక నీ పరిత్రాణ పరాయణమూర్తిని బ్రత్యక్షము చేసికొను నాశయే లేదు. గాన నీ వీ యకృతి సంతానమును, ఆత్మప్రకాశయోగ్యముగాఁ జేసికొమ్ము, శరణాగత దీనార్తమునుగాఁ జేయుము.

ఓం. హంసయుక్త విమానస్థే బ్రహ్మాణీ రూపధారిణి ।
కౌశాంభః క్షరికే దేవి నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 12

ఓం. త్రిశూల చంద్రాహి ధరే మహావృషభవాహిని ।
మహేశ్వరీస్వరూపేణ నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 13

ఓం. మయూర కుక్కుటవృతే మహాశక్తిధరే ఽనఘే ।
కౌమారీరూప సంస్థానే నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 14

అమ్మా! నీవు హంసలు పూన్చిన విమానమందుండి బ్రహ్మాణీస్వరూపమును దాల్చి, కమండలువునందున్న దర్భలచే బవిత్రమైన నీటితో మార్జనము చేసితివి. నారాయణీ! నీకుఁ బ్రణామము. నీవు త్రిశూలముఁ జంద్రుని సర్పములను ధరించి మహావృషభముపై నెక్కి మాహేశ్వరీరూపముతో నావిర్భవించితివి.

నారాయణీ ! నీకుఁ బ్రణామము. నీవు నెమిలి వెన్నుననుండి, కోడి పుంజులచేఁ జుట్టఁబడి, మహాశక్తినిదాల్చి, కౌమారీరూపముతో వెలసితివి. నారాయణీ ! నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు బ్రహ్మణివి. విరాణ్మనో రూపముతో వెలయుచు, ఈ విశ్వకల్పనముఁ జేయుదువు. జీవ భావీయ వ్యష్టిమనస్సే నీ హంసయుక్తవిమానము. కమండలువు నందలి కుశపూతజలము సురక్షితముచేసితివి. విరాట్కర్మాశ యమునుండి సంకల్పశక్తి ననుప్రేరణము చేయునటులే, జీవ కర్మాశయమునుండి కర్మస్ఫురణము చేయుదువు. నీవు జీవులను గర్మసమ్ముఖీనులను జేయునపుడు, జీవులు కర్మముల నభిమానింతురు. నీ యీ కౌశాంభఃక్షరణము లేకున్న జీవునకుఁ గర్మ పిపాస తొలఁగదు. నీవు స్వయంప్రకాశవు, నారాయణివి. నీకుఁ బ్రణామము.

అమ్మా ! నీవు మాహేశ్వరీమూర్తితోఁ ద్రిపుటీజ్ఞాన మనెడి త్రిశూలమును, మనోరూపచంద్రుని, కుండలిని యనెడి సర్పమును ధరించి, ధర్మమనెడి మహావృషభము నెక్కి యావిర్భవించితివి. నీవు ప్రతి నరునియందును నీ విధముగానే వెలయుము. నారాయణీ ! నీకుఁ బ్రణామములు.

అమ్మా ! నీవు మయూర కుక్కుట వృతవు. దీనికి మఱి యొక యర్థమేమనఁగా - కుక్కుట శబ్దమునకు = పుచ్ఛము, శ్రేష్ఠము అని. కనుక మయూరపుచ్ఛమందు - శ్రేష్ఠమయూరముపైని శోభించుదానవు. జీవుఁడు మయూరధర్మము గలవాఁడైనపుడు, అనఁగా - కుటిల వృత్తులనెడి పాములను జంప నుద్యమించు

నపుడు, శ్రేష్ఠమయూర శోభితుఁడై, కౌమారీరూపమున నావిర్భవించి, దేవసేనను నడుపు భారమును వహించి, యసురకుల వినాశమును జేయ నుద్యతుఁడగును. అపుడు జీవసంతానము, అసుర భీతివలనఁ దొలఁగును.

మఱియొక భావము - ప్రలీనజగత్తు పరమాత్మయందు, మయూరాండ రసన్యాయముగా నుండి, (మయూరాండమందుఁ బరిత్యాజ్యభాగ ముండదు. శైవాగమము లిట్లే వర్ణించెను.) ఇచ్ఛాస్పందము కాఁగానే, చిత్ర విచిత్ర మయూరమును బోలి జగత్తు ప్రకాశించును. అట్టి విచిత్ర జగదధిష్ఠాత్రి అమ్మయే యనుట నీ కౌమారీతత్త్వము బోధించును.

మఱియు, అమ్మా ! నీ వనఘవు, కనుక నీదర్శనముచే జీవుఁడును ననఘుఁడగును. భేదజ్ఞానమే యఘము. ద్వైత ప్రతీతియే యథార్థపాపము. అమ్మా ! నీ దర్శనముచే జీవుని ద్వైతప్రతీతి విలయమొందును. జీవుఁడు బ్రహ్మానుభూతి చేయును. జీవత్వమనెడి పాపము పూర్తిగా నశించిపోవును. నీవు నారాయణివి. నీకు ప్రణామము.

ఓం. శంఖచక్ర గదా శార్ఙ్గ గృహీత పరమాయుధే ।
ప్రసీద వైష్ణవీరూపే నారాయణి నమోఽస్తుతే ॥ ఓం. 15

ఓం. గృహీతోగ్ర మహాచక్రే దంష్ట్రోద్ధృత వసుంధరే ।
వరాహరూపిణి శివే నారాయణి నమోఽస్తుతే ॥ ఓం. 16

ఓం. నృసింహరూపేణోగ్రేణ హంతుం దైత్యాన్ కృతోద్యమే ।
త్రైలోక్య త్రాణసహితే నారాయణి నమోఽస్తుతే ॥ ఓం. 17

అమ్మా ! నీవు శంఖ చక్ర గదా శార్ఙ్గములనెడి యాయుధ ములను ధరించిన వైష్ణవివి. ప్రసన్నవగుము. నారాయణీ ! నీకుఁ బ్రణామము.

నీవు వరాహరూపముతో భీషణమహాచక్రమునుదాల్చి, కోఱచే వసుంధర నుద్ధరించితివి. మంగళస్వరూపిణీ ! నారాయణీ ! నీకుఁ బ్రణామము.

నీవు మహోగ్ర నరసింహరూపముతో దైత్యకులముల నిహత మొనర్పఁగడఁగితివి. నీవు ముల్లోకములను రక్షించు దానవు, నారాయణివి; నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- వైష్ణవీ, వారాహీ, నారసింహీ, యనెడి యీ నీ మూడు రూపములచేతనే, మేము విష్ణుశక్తిస్వరూపమైన నీ విశేషాభివ్యక్తిని గనఁగల్గుచున్నాము. మహాప్రాణరూపిణివి, మహాస్థితి శక్తివైన నీవు శంఖ చక్ర గదా శార్ఙ్గ ధనస్సులను. దాల్చి, అనఁగా - వ్యక్తము, అవ్యక్తము నాదమయమునైన యీ సంసారచక్రమును, స్నేహమయ ప్రణవాకర్షణముచే దిన దినమును మోక్షాభిముఖిని జేయుదువు. సూరిజనులు రేవగల్లుఈను నీ యీ విశ్వవ్యాపి పరమపదమును ప్రకాశవ్యాపి దృక్ఛక్తినివలెఁ జూచుచుందురు. సాధకులును, ఆచమన క్రియా సహాయముతో దమ వ్యష్టిభావ మును నీ పరమపదముతోనే సంబంధవిశిష్టమును జేయుటకై ప్రయాసపడుచుందురు. శ్రుతి ॥ "తద్విష్ణోః పరమంపదం సదా పశ్యన్తిసూరయః । దివీవ చక్షురాతతం" అనెడి మంత్రముతో "పుండరీకాక్ష" (పుండరీకం - హృదయపుండరీకం, అక్ష్ణోతి -

వ్యాప్నోతీతి పుండరీకాక్షః) నామోచ్చారణముతోఁ ద్రిరాచమనము పూర్వర్షి వ్యవహారము. (ఆచరితము). నీవు నారాయణివి; ప్రతినరుఁడును నీ కాశ్రితుఁడే; నీకుఁ బ్రణామము.

అమ్మా ! నీవు వారాహీమూర్తితోఁ బ్రలయపయోధి జలమందు మునిఁగి యీ వసుంధరను నీ కొమ్ముతో నుద్ధరింపకున్నచో, నీ చరాచరము తన యజ్ఞానమనెడి చీఁకటిలో నెంత కాలము గాఢముగా నిద్రించియుండునో ! దీని నెవరు నిర్ణయింపఁగలరు ? జీవసమూహము కామకర్మమయమైన యీ స్థూలభావము నవలంబించియే, తెలిసియో తెలియకో మంగళము వైపు - మోక్షమువైపు, మందంజవేయును. ఇది నీ కృపయే; నీవు మంగళమయివి నారాయణివి; నీకుఁ బ్రణామము.

. అమ్మా ! యీ వారాహీమూర్తితో స్తవ్యవు. నీ నారసింహ మూర్తిని మేము తలంప, అబ్బ ! అది యెంత యుగ్రరూపమమ్మా ! దైత్యకులము నిహతమగుటచే హిరణ్యకశిపుని స్థూలదేహము వఱకును నీవు గోళ్లచే ముక్కముక్కలు చేసి వైచితివి. ముల్లోకము లను, అసురాత్యాచారమునుండి తప్పుకొన్నవి.

అమ్మా ! ఒకనాఁడు నీవు ప్రహ్లాదుని ప్రబల సత్యజ్ఞాన ప్రభావముచే జడస్ఫటికస్తంభమును భేదించి నీ చైతన్యమయ స్వరూపము నుద్భాసింపఁజేసితివి. మఱి యీ యజ్ఞజడత్వయుగ మందు; అనుభూతిహీన ప్రాణహీన మృతకర్మానుష్ఠాన యుగ మందు, నీవొక్కసారి సత్యమూర్తితో దర్శనమిమ్మా ! జీవుని జడబుద్ధి

యనెడి స్ఫటికస్తంభమును భేదించి చైతన్య మయాత్మస్వరూపము భాసిల్లఁజేయుము. జీవుని సంశయములు నమసిపోవును. జడత్వ మోహములను విడిచి చైతన్యమందుఁ బ్రతిష్ఠితుఁడగును. మఱియు సత్యప్రాణానంద ప్రవాహము వచ్చి జగత్తును ముంచివేయును. జగత్తు మఱల యథార్థముగా దేవతలువలెనే నిన్ను సర్వత్ర సర్వదా నారాయణీమూర్తితోఁ గాంచి 'నమో ఽస్థితే' యని ప్రణతమగును. అమ్మా ! ఈ యాశాపూర్తి నీ సంతానమున కెప్పుడగునో.

ఓం. కిరీటిని మహావజ్రే సహస్రనయనోజ్జ్వలే ।
వృత్రప్రాణ హరేచైంద్రి నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 18

ఓం. శివదూతీ స్వరూపేణ హతదైత్య మహాబలే ।
ఘోరరూపే మహారావే నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 19

ఓం. దంష్ట్రాకరాళ్ళవదనే శిరోమాలా విభూషణే ।
చాముండే ముండమథనే నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 20

అమ్మా ! నీవు కిరీటధారిణివియు, మహావజ్రధారిణివియు, సహస్రనయన శోభితవునై వృత్రప్రాణములను హరించిన యింద్రాణివి, నీవు నారాయణివి. నీకుఁ బ్రణామము.

నీవు శివదూతీరూపమున దైత్య సేనలను వధించితివి. నీవు భయంకరరూపవు; ఘోరనినాదినివి. నారాయణివి. నీకుఁ బ్రణామము.

ఓ చాముండా ! నీవు దంష్ట్రాకరాళముఖవు; నీ భూషణము ముండమాల; నీవు చండముండాసురుల జంపితివి. నారాయణీ ! నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- అమ్మా! నిర్మల జ్ఞానరత్న స్వరూపకిరీటము నీ శిరోభూషణము. కావున నీవు కిరీటినివి. మఱి నీవే మహా వజ్రధారిణివి. శ్రుతియు - "మహద్భయం వజ్ర ముద్యతం" అన్నది. నీవు మహద్భయమనెడి వజ్రము నెత్తి యుంతువు. నీవలని భయముచేతనే సూర్యుఁడుదయించును; వాయువు వీచును. అగ్ని మండును; మృత్యువు పరుగెత్తును. నీ చండశాసనము చేతనే యింద్రాదులు దిక్పాలనము చేయుచున్నారు, ఈ విశ్వము నియంత్రిత మగుచున్నది. అమ్మా! నీ వజ్రధారిణీ రూప మిది.

నీవు వేయికన్నులతో వెలయుదువు. అనఁగా నీ కన్నుల సంఖ్యములు. అమ్మా! నీవు విశ్వతశ్చక్షువవు. ప్రత్యేక జీవుఁడును, బ్రత్యేకపరమాణుపర్యంతమును నీ యా చక్షువుల చేతనే, యా దృష్టి చేతనే యుద్భాసితమగుచున్నది. నీ కగోచరమైనది, యప్రత్యక్షమైనదియు నేదియు నెచటను లేదు. నీ నెయ్యపు బిడ్డఁడైన మనుజునకు, "అబ్బాయీ! సత్యమునుండి తొలఁగిపోయి, యసత్యము నాశ్రయించి, నాకుఁ జాటుపెట్టి యే పనియుఁ జేయకుమా." యని చెప్పి వేయుము. అమ్మా! నీవు విశ్వత శ్చక్షూరూపముతో నున్నావు. లోలోపలిచోట నీ సర్వ ప్రకాశక దృష్టి ప్రసరించుచునే యుండునన్న మాట మఱువకుండునపుడే, యట్టి యసత్యమార్గమును ద్రొక్కలేరు. ఎల్లరు సత్యనారాయణు లగుదురు. ఎల్లరహృదయముల చిక్కులును విడిపోవును.

అమ్మా! నీవు వృత్రప్రాణహారిణివైన యింద్రాణివి. అనాత్మజ్ఞాన మనెడి వృత్రాసురుఁడు నీ వజ్రపాతముచేతనే చచ్చెను.

బ్రాహ్మణుని యెముకచేఁ జేయఁబడినది. తనువు దాల్చిన బ్రహ్మమే బ్రాహ్మణుఁడు. జగత్తును ముఖ్యముగా ధరించువాఁడు. ఇట్టి బ్రాహ్మణుని యెముక (సారవద్భాగము) కాకున్నచో నీ వజ్రము నిర్మితముకాదు. బ్రాహ్మణుని స్థూల శరీరమందలి క్షుద్రతమ భాగమువఱకును, నిర్మలబ్రహ్మజ్ఞానాంశా లోకముతో వెలయును. అది విశుద్ధము గనుకఁ గేవలము బ్రహ్మజ్ఞానముచేతనే జగత్తును ధరించునట్టి బ్రాహ్మణుని భౌతిక దేహమునకుఁ జెందిన యెముక సైతము, ఆసురభావములను నశింపఁజేయఁగలది. జగన్మంగళ సాధనమందు సమర్థము. ఇక్కథను బోధించుటకే నీవు బ్రాహ్మణాస్థితో వజ్రమును నిర్మించి యసురులను జంపుటయ్యెనా ? నిజముగా, అమ్మ బ్రాహ్మణాస్థి లేక యసురఘాతక వస్తువును నిర్మింపదు. కనుకనే లోకములో నింతదాఁక బ్రాహ్మణుఁడొక్కఁడే యసురఘాతనమందు సమర్థుఁడుగా నున్నాఁడు. బ్రహ్మజ్ఞానమున కాచార్యుఁడుగాను, ఆసురికభావముల నణఁగఁద్రొక్కువాఁడుగాను, బ్రహ్మజగత్తునం దొక్క బ్రాహ్మణుఁడే యున్నాఁడు. బ్రాహ్మణుఁడే నీ యీ సృష్టి ప్రపంచమునకు గౌరవకేతనము. అమ్మవు నీవే, యనెడి మాట నీ యీ బ్రాహ్మణసంతానముచేతనే జగమునందు బ్రచారితమై ప్రతిష్ఠితమైనది. ఇంద్రాణీ ! నీవు నారాయణివి; నీకుఁ బ్రణామము.

అమ్మా ! నీవు చండముండులను గెడపిన చాముండా దేవివి. కోఱలచే భయంకరమైన నీ ముఖమండలమునందు ద్వైతప్రతీతులనెడి దైత్యకులముప్రవేశించి, సాధకునకు అద్వయ జ్ఞాన ప్రకాశమనెడి నుపయోగమును గల్గించినది. నీవు ఏఁబది నరముండము

లను మాలఁగూర్చి తాల్చితివి. ఏఁబది మాతృకా వర్ణములనెడి నరశిరోమాల నీ కంఠదేశమందుఁ బడి మిగుల శోభించినది. నారాయణీ ! నీకుఁ బ్రణామము.

అమ్మా ! నీ వీ విధముగా బ్రాహ్మీ మాహేశ్వరీ కౌమార్యాదులైన యెనిమిదిశక్తుల రూపమున వెలసి మా యెనిమిది పాశములనెడి దైత్యులను విలయమొనర్చితివి. మఱి, అణిమాద్యష్టైశ్వర్యముల యెడనైన కోరిక నణఁగించితివి. అతిదుర్లభ మైన యీశ్వరత్వమునొందు దురాశనుసైతము తొలఁగించితివి. మమ్ములను అద్వయతత్త్వమందు, విశుద్ధజ్ఞానస్వరూపమందుఁ జేర్పుము. అమ్మా ! నీ యీ యష్టవిధ శక్తి ప్రకాశము జీవత్వ పాశముల నెన్మిదిటిని ఛేదించి, ఈశ్వరత్వముయొక్క అష్టైశ్వ ర్యములను దృణముగాఁ దోఁపించి, ముక్తిపేరి హిరణ్మయ మందిరమునకుఁ గొనిపొమ్ము. నీవు ప్రతినరునియందు నీ విధముగా స్నేహమయ జననీరూపముతో వెలయుము. వెలయుచున్నావు కావుననే నారాయణివి. నీకుఁ బ్రణామము.

ఓం. లక్ష్మి లజ్జే మహావిద్యే । శద్ధే స్వధే ధ్రువే ।
మహారాత్రి మహా ఽవిద్యే నారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 21

ఓం. మేధే సరస్వతి వరే భూతి బాభ్రవి తామసి ।
నియతే త్వం ప్రసీదేశేనారాయణి నమో ఽస్తుతే ॥ ఓం. 22

నీవు లక్ష్మివి; లజ్జవు; మహావిద్యవు; శ్రద్ధవు; పుష్టివి; స్వధవు; ధ్రువవు; మహారాత్రివి; మహా ఽవిద్యవు; అమ్మా ! నీవు మేధవు; సరస్వతివి; వరవు; భూతివి; బాభ్రవివి; తామసివి; నియతవు; నీవు ప్రసన్నవగుము. నీకుఁ బ్రణామములు.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు లక్ష్మివి. శ్రీం బీజరూపిణివి. సర్వలక్షణసంపన్నవు. సర్వదా భక్తుల నాకకంటఁ జూచు దానవు. సౌందర్యరూపిణివి; సంపద్రూపవు. అమ్మా ! నీవు లజ్జవు. హ్రీం బీజము శరీరముగాఁ గలదానవు; హ్రీం లజ్జా బీజము. అది నీ స్వరూపము. నీవు నిందితకార్య వైముఖ్య రూపవు. (లోకనిందిత కార్యములయెడ నగు సంకోచమే లజ్జ.) అమ్మా ! నీవుమహావిద్యవు - కాలీ తారా బగలా భువనేశ్వరీ త్రిపురసుందరీత్యాది దశమహా విద్యలు నీ స్వరూపములే. శ్రేష్ఠ బ్రహ్మవిద్యవు. అమ్మా ! నీవు శ్రద్ధవు; సత్యనిష్ఠ, గురువేదా న్త వాక్యములందుఁ జెదరని విశ్వాసమునై యున్నావు. అమ్మా ! నీవు పుష్టివి. పంచకోశ పరిపూర్ణతా స్వరూపవు. జగత్పోషణ శక్తిస్వరూపవు. అన్నమయాది పంచకోశము లకు నన్నముపెట్టి పోషించు అన్నపూర్ణేశ్వరివి. అమ్మా ! నీవు స్వధవు; శ్రాద్ధాది పితృకృత్యరూపవు (శ్రాద్ధక్రియయంతయు బ్రహ్మవిద్యా బోధక మంత్రసమూహఘటితము). బ్రహ్మవిద్యా స్వరూపిణి అమ్మరూప మది యనిరి. అమ్మా ! నీవు నీవు ధ్రువవు. నిశ్చలవు. శాశ్వతివి. అంతట నిండియున్న దానవు గనుక ధ్రువవు. నిశ్చలవు. శాశ్వతివి. అంతట నిండియున్న దానవు గనుక ధ్రువవు. ధ్రువము = ఓంకారము. కావునఁ బ్రణవస్వరూపిణివి. ప్రణవవాచ్యవు.

పైని జెప్పిన హ్రీంకారము శాక్తప్రణవము, ఓంకారము బ్రహ్మప్రణవము, హ్రీంకార ముభయాత్మకము, కావుననే లజ్జా ధ్రువములనెడి హ్రీం ఓంకారములు రెండును బ్రహ్మసమ్మితయైన యమ్మకుఁజెల్లును. 'శక్తి శక్తిమతో రభేదః' శ్రుతి. అమ్మా ! నీవు మహారాత్రివి, ప్రలయరూపవు, అజ్ఞానరూపవు. నీవు మహా ఉవిద్యవు,

అనాత్మ ప్రత్యయరూపవు. కావుననే జగత్తు నవిద్యామోహిత మును జేయుచున్నావు. అమ్మా ! నీవు మేధవు, ధారణావతీబుద్ధివి. ఇంద్రియాదులచే జీవుఁడు గ్రహించినది, విస్మృతము కాకుండు శక్తియే మేధ. బ్రహ్మ విద్యా ధారణారూప సామర్థ్యము. (అందులకే శ్రీ శంకరాచార్యులు "బ్రహ్మాహమస్మీతి స్మృతిరేవ మేధా" యనిరి.) అది నీ స్వరూపము. శ్రుతి ॥ "మేధా దేవీ జుషమాణా న ఆగాత్ విశ్వాచీ భద్రా సుమనస్యమానా " అన్నది. జన్మజన్మాంతరముల నుండి విస్మరింపఁబడిన 'అహంబ్రహ్మాస్మి' యను మహావాక్యార్థము తలంపునకు వచ్చుటే మేధ. అది జరిగినప్పుడే మేధాజననమైన దనవలయును. అమ్మా ! నీవు సరస్వతివి, విశుద్ధజ్ఞానరూప బ్రహ్మవిద్యవు. మఱి, పరా పశ్యన్తీ మధ్యమా వైఖరీరూప వాఙ్మూర్తివి. సరస్వతి - సరస్సులు (చెరువులు) గలది = నది. మూలాధార మందుఁ బరావాగ్రూపముననుండి, సంకల్పము కలుగఁగానే, పశ్యన్తీ మధ్యమా వైఖరీ రూపములతో నుచ్చరించునది (మీదికి నడుచునది). అపుడు నది తాఁబుట్టినచోటి నుండి పాఱుచు ననేక సరస్సులలోఁ గలిసి పాఱిపోవుచుండుటచే 'సరస్వతి' యనఁబడి నటులే, పరావాగ్రూపిణి యమ్మయు వ్యష్టియందు చ్చరించునపుడు సరస్సులుగా భావింపఁబడిన స్వాధిష్ఠానాద్యనేన కేంద్రములందుఁ జేరిపోవుచుండును గాన వాగ్రూప బ్రహ్మశక్తియు (నాదబ్రహ్మ స్వరూప) సరస్వతి యనఁబడెను. అమ్మా ! నీవు వరవు, శ్రేష్ఠవు, శ్రేష్ఠవరప్రదవు. వరము = మోక్షము; తత్స్వరూపవు. అమ్మా ! నీవు భూతివి, సత్త్వగుణ స్వరూపవు. నీవు వా (బా) భ్రవివి - రజోగుణ

స్వరూపవు. నీవు తామసివి-తమోగుణ స్వరూపవు. నీవు నియతవు-నిశ్చయాత్మక వృత్తిరూపవు. అమ్మా ! నీవు ప్రసన్నవగుము. నీవు ఈశవు = ఈశ్వరివి. సర్వసమర్థవు, అమోఘ సంకల్పవు. సకల నియంత్రివి. సృష్ట్యాది పంచకృత్య పరాయణ వయ్యును, బ్రతినరునందును విశిష్టభావముతో, నారాయణీమూర్తితో వెలయుదువు. అమ్మా ! నీ చరణములకుఁ గోటి ప్రణామములు.

ఓం. సర్వస్వరూపే సర్వేశి సర్వశక్తి సమన్వితే
భయేభ్యస్త్రాహి నో దేవి దుర్గేదేవి నమో ఽస్తుతే ॥ ఓం. 23

ఓ దేవీ ! నీవు సర్వస్వరూపవు, సర్వేశ్వరివి, సర్వశక్తులతోఁ గూడినదానవు. మమ్ములను భయమువలన రక్షింపుము. దుర్గాదేవి ! నీకుఁ బ్రణామము.

వ్యాఖ్య :- అమ్మా ! దేవతలు నిన్ను స్తుతించునపుడు బ్రాహ్మి మున్నగు నీ యెనిమిది శక్తులను, లజ్జ మున్నగు నీ విశేష స్వరూపములను లక్షించి మఱి మఱి నీకుఁ బ్రణామములు చేసిరి. దీనప్రాణముతో నీ ప్రసన్నతను బ్రార్థించిరి. ఇపుడు "సర్వస్వరూపే, సర్వేశి" యనుచు నీ ప్రసన్న తా లక్షణముం గొనియాడుచున్నారు. నీవు ప్రసన్నవైతే, నీ మూడు స్వరూపములను జీవునకు బోధపడును. ఇపుడు వారు స్మరించి ప్రణమిల్లుచున్నారు.

అమ్మా ! నీవు సర్వస్వరూపవు. మాకుఁ గానవచ్చున దంతయు, అనఁగా మే మెల్లప్పుడు ననుభవించునదంతయు, నీ బహుత్వము (సర్వత్వము) అంతయు నీ మొదటి స్వరూపము.

ఇదే నీ స్థూలదేహము. నీ యీ సర్వస్వరూపమూర్తిని. యథార్థముగా, నీ స్థూలదేహముగాఁ గ్రహింపఁగల సంతానమునకే, నీ రెండవ స్వరూపమైన సర్వేశ్వరీమూర్తి దర్శనమగును. ఈ బహుత్వ సృష్టి స్థితి ప్రలయములను జేయు నీ సర్వేశ్వరీ మూర్తితో, నీవు వారి కాత్మప్రకాశము చేయుదువు. ఇదే నీ సూక్ష్మశరీరము. ఈ మూర్తియందే నీ సంతానము నీ యీశ్వరీమూర్తిని సాక్షాత్కరించు కొని, జీవత్వ క్షుద్రత్వ మోహమునుండి రక్షింపఁబడును. (అవి తొలఁగుననుట.) అపుడు నీవు నీ మూడవమూర్తియైన సర్వశక్తిసమన్విత స్వరూపమును దెలియఁజూపుదువు. సర్వవిధములగాను నే శక్తి ప్రకాశించుచున్నదో, సర్వముయొక్క సృష్టి స్థిత్యాదులు చేయుచు సర్వేశ్వరియై యేశక్తి వెలయుచున్నదో, అవన్నియు నెచ్చోట సమన్వయించునో, ఎచ్చోట శక్తి యనుచు నెట్టి వికాసమును లేకున్నను సర్వశక్తిసమన్వయ స్థాన మేదో, యదే నీ మూడవ స్వరూపము. సర్వరూపములతో దేని ప్రతీతి యగుచున్నదో, యది శక్తి తక్క మఱేమియుఁ గాదు. అమ్మాట మేమింతకు మున్నే తెలియఁ గల్గితిమి. ఈ సర్వశక్తిసమన్వితస్వరూపమునే నీ 'కారణ' మందురు. అదే బ్రహ్మము, పరమాత్మ, నిరజంనము మున్నగు పేళ్లతో వ్యవహరింపఁబడును. ఈ నీ మూడు స్వరూపములును సత్యములే. శ్రుతి శిరోవాక్యములు, ఈ నీ మూడు స్వరూపముల కథను సమము గానే కీర్తించినవి. భగవద్గీతయు క్షరాక్షర పురుషోత్తమ రూపములుగా నీమూడు స్వరూపముల నుల్లేఖించినది (15-26, 27). ఇట్లుండగా, ఆధునిక వ్యాఖ్యాతాదులు, నీ

నిర్గుణస్వరూపమునుమాత్రమే సత్యమనుచు స్వీకరించి, తక్కు రెండు స్వరూపములను మిథ్య యందురు. దానిచేతను హాని లేదు. అమ్మా ! నీ సత్యమైన నిరంజనస్వరూపమునందు జగత్తనుట కేమియు లేదు, గాన జగదీశ్వరుఁడనుటకు నేమియు లేదు. ఉండఁజాలదు. ఆచార్య భాష్యకారులు, ఈ స్వరూపమును విశేషించి తెలుపుటకే, ప్రాణపణమునఁ దక్కు రెండు స్వరూపముల యకించిత్కరత్వమును బ్రతిపాదించిరి. ఉండనీ.

అమ్మా ! నీవు మాకుమాత్రము త్రివిధస్వరూపముల తోను సత్యవు. తుల్యరూపమున "భయేభ్యస్త్రాహి నో దేవి" నీవు మమ్ము భయములనవలన రక్షింపుము. మా యెల్లర భయములను దొలఁగింపుము. జనన మరణ క్లిష్టులును, అల్పజ్ఞులును, నిరాశ్రయులునైన జీవుల భయము నెడలింప, నీ వొక్కతెవె సమర్థవు. అమ్మా ! నీవు దుర్గవు. దుర్గ + ఆ = దుర్గా; దుర్గ పదమునకు - దైత్యుఁడు, మహావిఘ్నము, సంసారబంధము, కుచ్ఛితకర్మము, శోకము, దుఃఖము, నరకము, యమదండము, జన్మము, మహాభయము, రోగము అని యర్థములు. తుది - ఆకారము - హంతృవాచకము, పైని జెప్పిన యన్నిటిని బోఁ గొట్టును. గాన "దుర్గా" యైనది. యామల తంత్రమందు, దుర్గా శబ్ద నిర్వచనము - "ద్ + ఉ + ర్ + గ్ + ఆ = దుర్గా" ద్ - దైత్యనాశకము; ఉ - విఘ్ననాశకము; ర్ - రోగనాశకము; గ్ - పాపనాశకము; ఆ - భయరిపునాశకము; ఆ - శక్తివాచక మునుం గాన, దేవీపర్యాయ దుర్గాపదమ్మును స్మరించినను, ఉచ్చరించినను, వినినను, పైని

జెప్పిన ఫలములు గలుగునని పరమేశ్వరుఁడు తన శక్తినిగూర్చి యనిన మాట. మఱియు "దుఃఖేన గమ్యతే ఇతి దుర్గా" అతికష్ట ముచేఁ దెలియఁబడునది. అమ్మా! నీవు దుర్గవు. దుర్గతిహారిణివి. మా యీ జీవత్వమనెడి దుర్గతిని దొలఁగింపుము. నీకుఁ గోటి ప్రణామములు.

ఓం. ఏతత్తేవదనం సౌమ్యం
లోచనత్రయ భూషితమ్ ।
పాతు నః సర్వభూతేభ్యః (భీతిభ్యః)
కాత్యాయని నమోఽస్తుతే ॥ ఓం. 24

అమ్మా! నీవు లోచనత్రయ విభూషితవు. ఈ నీ ముఖ మండలము, సర్వ (భీతుల) భూతములవలన రక్షించుఁగాక.

వ్యాఖ్య :- అమ్మా! త్రిలోక ప్రకాశకములును త్రికాలదర్శులు నైన ముక్కనులతో నొప్పుదానవు. కేవలానంద స్వరూపమును, సర్వమనోహరమునైన ముఖమండలము, సర్వ భూతములవలన మమ్ము రక్షించుఁగాక. ఆనందస్వరూపవు నీవొక్కతెవే, యీ స్థూలమందు సర్వరూపములతోను, సూక్ష్మము నందు సర్వేశ్వరీ రూపముతోను, కారణమందు సర్వశక్తి సమన్విత నిరంజన స్వరూపముతోను నిత్యము ప్రకాశింతువు. ఈ మాట సాధకుఁడు నీ కృపచేఁ జక్కఁగా ననుభవింపఁగల్గునపుడే, వానికి సర్వభూత భ్రమము తొలఁగిపోవును. సర్వభూతములనెడి యజ్ఞానము తొలఁగిపోవును. సర్వభూతములనుటకు మఱే మియులేదు. ఆనందరూపిణివి నీవే సర్వభూత రూపముతో నభి వ్యక్తవైతివనెడి యనుభవము చేయఁగల్గుట చేతనే భూతభయము పూర్తిగాఁ

దొలఁగును. అమ్మా! యెల్లరను సర్వభూతములవలన రక్షింపుము. ఆనంద వస్తువొక్కటే సర్వభూతరూపమునఁ బ్రకటిత మైనదని, మామర్మ మర్మములందును నాటింపుము. అమ్మా ! నీవు కాత్యాయనివి. కత్యుల (బ్రహ్మవేత్తల) కేకాన్తశ్రయణీయవు. కత్యయన మహర్షికివలెనేమాకును బ్రసన్నవగుము. నీకుఁ బ్రణామము.

ఓం. జ్వాలాకరాళ మత్యుగ్ర మశేషాసురసూదనమ్ ।
త్రిశూలం పాతునో భీతే ర్భద్రకాళి నమోస్తుతే ॥ ఓం. 25

ఓం. హినస్తి దైత్యతేజాంసి స్వనేనాపూర్వ యా జగత్ ।
సా ఘంటా పాతు నోదేవి పాపేభ్యోనః సుతానివ ॥ ఓం. 26

ఓం. అసురాసృగ్వసాపంక చర్చిత స్తే కరోజ్జ్వలః ।
శుభాయ ఖడ్గోభవతు చండికే త్వాం నతావయమ్ ॥ ఓం. 27

ఓ భద్రకాళీ ! అగ్నిశిఖలచే భీకరమైన, అత్యుగ్రమైన, అసురనాశనకారియైన నీ త్రిశూలము మమ్ము భయములవలన రక్షించుఁగాక. తన ధ్వనిని జగత్తుననించి యసురకుల తేజస్సును నశింపఁజేయు 'అనః' మాతృసదృశమైన నీ ఘంట మమ్ములను బుత్త్రులవలె రక్షించుఁగాక. అసురుల నెత్తురు, వస (మాంస మందలి జిడ్డు - శుద్ధమాంసస్య యఃస్నేహః సా వసా పరికీర్తితా) అనువాని పంకముతోఁ బూయఁబడి నీచేత వెలయు ఖడ్గము మంగళములను మాకిచ్చుఁగాక. ఓ చండికా ! నీకుఁ బ్రణామము.

ఇమ్మూడు మంత్రములందును త్రిశూల ఘంటాధ్వని ఖడ్గములనెడి ముత్తైఱఁగుల యస్త్రములవలన భయత్రాణమును

మంగళమును బ్రార్థింపఁబడినవి. త్రిపుటీజ్ఞానము, అనాహత నాదము, అనాత్మబోధకనాశప్రజ్ఞ, యను నిమ్మూఁడును విశేషించి యసురభావ వినాశకములు. దీనితో దేవతాగణము మంగళప్రార్థన మును జేసినది.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు స్వయముగా మా రక్ష చేయు చున్నావు. నీ యస్త్రశస్త్రసమూహము సైతము మమ్ము లను బిడ్డలనువలె రక్షించుఁగాక. అవియే యింతకు మున్ను అసుర భావములను నశింపఁజేసి జీవత్వ మహాబంధనమువలన మమ్ము లను విడిపించినవి. అవియే సమస్త ప్రారబ్ధక్షయ పర్యంతము నిట్టులే యసురాత్యాచారముల వలన మమ్ము రక్షించుఁగాక. అమ్మా! నీవు చండికామూర్తితోఁ బ్రకటిత వగునపుడే యస్త్రశస్త్రము లును నీ విభిన్నశక్తులును మమ్ములను రక్షింపను, అసురకుల మున్ను నశింపఁజేయను, నుద్యమించును. కనుకనే నీచండికా మూర్తిని లక్షించి మఱిమఱి "చండికేత్వాం నతా వయమ్" అని ప్రణతుల మగుచున్నాము.

సాధకా ! ఈ విధముగా నస్త్రశస్త్రములను బ్రార్థించుట యస్వాభావికము కాదుసుమా. వైదికయుగమందలి సత్యదర్శు లయు సరళప్రాణులైన ఋషులయు హృదయముల నిట్టి పవిత్రభావము తనంతనే పుట్టెడిది. దీనిచే వారు సంకీర్ణహృద యులు, బద్ధజీవులు, నని తలఁపరాదు. ఇక్కాలమున నిష్కామ శబ్దముయొక్క స్వరమొకటి లేచినది. అది తామసిక ప్రకృతి గల జీవుల సోమరితనమునే సూచించును. నిష్కామమన నేమియో యథార్థానుభవము లేనివారలే, సరళబుద్ధితోఁ బ్రార్థనము

చేయఁగలరు. అజ్ఞుని సకామవ్యక్తిప్రార్థనము కాఁజాలదు. ప్రార్థనము వల్లనే యీ జగము సృష్టింపఁబడినది. ప్రార్థనమునందే యీ జగము నిల్చియున్నది. ప్రార్థనమువల్లనే యీ జగము మఱల నానందమయ సత్తయందుఁ జేరిపోవుచున్నది. సృష్టిస్థితి ప్రలయములు, జీవజగత్తులు, బంధన ముక్తులు సమస్తమును బ్రార్థనామూలక ములే. ప్రార్థనము భిక్షకాదు. ప్రకృష్టమైన యర్థనము= కోరిక, కల్గునపుడే కామనలన్నియు సిద్ధించును. ఈశ్వరసత్త యందుఁ గేవల శ్రద్ధగలిగి, ఈశ్వరుని శక్తిమత్తయందుఁ జెదరని నమ్మకము కలవారలే ప్రార్థనము చేయఁగలరు. సరిగాఁ బ్రార్థింపఁ గల్గుటచే దాని సఫలత తప్పకగును. ప్రార్థనముచే సాధన కింతయు దెబ్బరాదు. ప్రార్థనమే యథార్థసాధనము.

ఓం. రోగా నశేషా నపహంసి తుష్టా
రుష్టాతు కామా నఖిలా నభీష్టాన్ ।
త్వా మాశ్రితానాం న విపన్నరాణాం
త్వా మాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాన్తి ॥ ఓం. 28

అమ్మా! నీవు సంతోషించి యశేషరోగములను దొలంతువు. నీవు రోషించితేని సర్వాభీష్టములు చెడును. నిన్నాశ్రయించినవారికెట్టి యాపదయు నుండదు. నిజముగా నిన్నాశ్రయించినవారల నితరు లాశ్రయింతురు.

వ్యాఖ్య :- అమ్మా! నీ తుష్టియు రుష్టియు రెండును మాకు శుభకరములే. నిత్యతుష్టమైన నీ సంతోషమును మే మనుభవింపఁ గల్గునపుడు, అనఁగా అమ్మవు నిత్యప్రసన్నవునైన నీ ప్రసన్నత మాకుఁ

ప్రతీతిగోచరమైనపుడే, మాసర్వరోగ విముక్తియగును. స్థూల దేహమును బట్టి రోగములు మూడు విధములు.

1. ఆధ్యాత్మికములు - వాత పిత్త శ్లేష్మాదులవలన నగునవి.
2. ఆధిదైవికములు - శీతోష్ణ వాత వర్షాదులవల్ల నగునవి.
3. ఆధిభౌతికములు - ౼ ౦ఘ్రు తస్కరాదులు, దంశ మశకాదులు ౦ ౦ణముగా నగునవి.

సూక్ష్మదేహమున కగు రోగములు మానసికములు. ఇష్టవియోగము, అనిష్టప్రాప్తివలన నగునవి.

కారణదేహ రోగములు - అజ్ఞానము, ఆత్మవిస్మృతి రూపమైనవి.

ఈ మూడు విధములైన రోగములను లక్షించియే దేవతలు "రోగానశేషా౯" అనిరి.

అమ్మా ! నీ ప్రసన్న తానుభవముతోనే యీ రోగము లెల్ల నశించును. నీ తుష్టిమూర్తిని ప్రత్యక్షము చేసికొనుటచే నగు ఫలమిది. అమ్మా ! ఇమ్మాటలయందు నమ్మకము లేని వారికి, నీ నోరితోనే "నాయనా ! ఇవి యర్థవాదములు కావు. యథార్థముగానే సర్వరోగములు తొలఁగును" అని చెప్పి వేయుము. నిక్కముగా మనుష్యుడు భగవత్సత్తాప్రసన్నతలను లక్షింపఁగల్గునపుడే తనకు సర్వవిషయములందును శుభాభ్యుదయములగునని తెలిసికొన వలయును.

అమ్మా౹ నీవు రోషించితే సకల కామనలు సర్వాభీష్టములు చెడిపోవును. మంత్రమందు 'కామ-అభీష్ట' శబ్దములు సమానార్థక

ములుగాఁ గానవచ్చునుగాని, ఇపుడు (వర్తమానమున) కామింపఁ బడునది - కామమనియు, మున్ముందు (భవిష్యత్తున) ఇచ్ఛింపఁ బడునది అభీష్టమనియు నెఱుంగునది.

అమ్మా ! మనుష్యుఁడు నీ ప్రసన్నతను లక్షించునపుడే; నీ రోషరక్తనయనములను జూచి వెఱచునపుడే వాని సర్వకామ్యములు, అభీష్టములు చెడును. స్థూలదృష్టిచేత నీ యీ రోషలక్షణ మవశ్యభీకరమైనను, రవ్వంత ధీరముగాఁ జూచినచో, మాకుఁ జక్కఁగాఁ దోఁచిన దేమన-నీవు రోషించి మా కామ్యాభీష్టములను నష్టపఱచునపుడే, మేము యథార్థమంగళ మార్గమందు ముందంజ వేయుదుమని. అనేక విధములయిన కామనలు, సంకటములు ననెడి రోగములవలన మమ్ము విడి పించుటకే నీకుఁ జండికా మూర్తితో వెలయు పనిపడుచున్నది. అమ్మా ! మా కామ్యాభీష్టము లను జెఱపకున్నచో, మే మెన్నఁటికి నీ జీవత్వాంధకారమునఁ బడియే యుందుము. రుష్టమూర్తితో నీవు మా సంకీర్ణహృదయముల యందలి కామనలను దొలఁగింపకున్న చో మాకు నీ హిరణ్మయ మందిర సంధానము కాదు-కన్కనే అమ్మా ! నీ తోషరోషములు రెండును మాయెడ నిత్యమంగళదాయకములే, యనుచున్నాము.

మఱియు "త్వామాశ్రితానాం న విపన్న రాణామ్" నిన్నా శ్రయింపఁగల్గినచో, నీకు శరణాగతుఁడైనచో, జీవుని కెట్టి విపత్తియు రాదు. నీ తుష్టిచే నభీష్టలాభము, నీ రుష్టిచే నభీష్టనాశము, ననెడి రెండింటను శుభమే. అమ్మా ! నీవీ రెండు విధములుగాను

వెలసియే, యింత వైచిత్ర్యము నింత మాధుర్యమును జూపుదువు. నిన్నాశ్రయించినవారి కెట్టి యాపదయు నుండదు, సరిగదా, విశేషించి వారితరుల కాశ్రయ మీయఁగలవార లగుదురు. అనేక జీవులు వారి నాశ్రయించి తమ యభీష్టములను నెఱవేర్చి కొందురు. ఇదే నీ విశేషత. (ఈ మంత్రమందలి 'నరాణాం' అనుమాట నరనారీబోధకము, ఏకశేషద్వంద్వము.)

ఓం. ఏతత్కృతం యత్కదనం త్వయాద్య
ధర్మద్విషాం దేవి మహాసురాణామ్ ।
రూపై రనేకై ర్బహుధాత్మమూర్తిం
కృత్వాంబికే తత్ప్రకరోతి కాన్యా ॥ ఓం. 29

ఓ దేవీ ! నీవు నీ యనేక మూర్తులతో వెలసి ధర్మద్వేషులైన మహాసురులను యుద్ధమందు నశింపఁజేయుటనెడి యిప్పని, నీవుగాక యింకెవరు చేయఁగలరమ్మా !

వ్యాఖ్య :- అమ్మా ! ఏకవు, అద్వితీయవు, విశుద్ధ బోధ స్వరూపవు నయ్యు, ననేక రూపములతో నిన్ను వెలయించుకొని - బ్రాహ్మీ మాహేశ్వరీ వైష్ణవీ కౌమారీత్యాద్యనేక శక్తి రూపములతో వెలసి, ధర్మవిరోధులైన యసురభావములతోఁ బోరితివి. ఇట్టి నీ మహిమము నొప్పుకొనక, కేవలము నీ నిరంజన స్వరూపమును మాత్రమే యంగీకరించి బహుధా ప్రకటితము లైన నీ మూర్తులను మిథ్యలని యెగురఁగొట్టఁజూతురు. కాని, యెంతదాఁక జగత్ప్రతీతి యుండునో, యంతదాఁక నీ బహురూపముల నెగురఁగొట్టుట కుపాయములేదని వారెఱుఁగరు. "రూపం రూపం ప్రతిరూపో బభూవ" యనుచు నుపనిషత్తే నీ సర్వరూప బహురూపముల

నొప్పుకొన్నది. తమ బుద్ధి కొలఁతతో నీ మహిమ పరిమాణము నెఱుంగఁగోరినచో, నీ యేకత్వ బహుత్వ సమన్వయము నెన్నఁడును జేయఁజాలరు. నీవొక్కతెవేయయ్యు ననేకరూపములతో విరాజిల్లుదువు. "కాన్యా - అన్యాకా" నిన్ను విడిచిన మఱెవ్వరున్నారు ? నీవు గాకమఱెవ్వరున్నారు ? లేరు, ఉండఁజాలరు. "ఏకమేవా ద్వితీయమ్" ఇది సత్యమే; ఈ యద్వితీయ వస్తువుతక్క, ఆగంతుక నూతనవస్తువొకటి వచ్చి, ఆత్మమూర్తిని బహుధా ప్రకటించుకొనఁ జాలదు. ఒక్కరూపముతోనే నీవుండి, బహురూపములతో సైత మీ వేయుందువు. విశేషమేమనఁగా బహురూపములతో వెలుయుచున్నను, నీ యేకత్వ మఖండముగానే యుండును. కుండ, కూజా, మూకుడు, మూస, మున్నగు వేర్వేఱు రూపములతో వేర్వేఱు నామములతోఁ బరిచితమయ్యును మృత్తికాత్వము సర్వత్ర యఖండముగానే యుండును. మన బుద్ధి హీనమగుటచేత, నేకత్వబహుత్వముల సమన్వయము మీమాంసితము కాదు. కాఁజాలదు. కాని ఏకవయ్యును నీ వనేకవు. మఱి బహు- అనేకవయ్యును నీ వేకవు. "ఏకో బహుధా ప్రకరోతి రూపమ్" ఒక సాధారణయోగిపురుషుఁడు, స్వేచ్ఛతోఁ దన్ను విభాగించుకొనియు - అనేక రూపములతో - ననేకావస్థలతో నేకకాలమందే కనఁబడుచుండియుఁ దన యేకత్వము నఖండముగానే యుంచికొనఁగల్గుచున్నాఁడు. (ఈనాఁడు నట్టి మహాత్ముల నెందఱినో చూచుచున్నాము.) మఱి జగదీశ్వరివి నీవు. సగుణరూపములతోఁ బ్రకటితవయ్యును, నీ నిర్గుణత్వము నఖండముగానే యుంచికొనఁగల్గుదువనిన, నందు వింతయేమున్నది ? యోగీశ్వరేశ్వరివి. కనుకనే దేవతలు

"అనేకరూపై రాత్మమూర్తిం బహుధా కృత్వా" యనిరి. ఒకటయిన యాత్మమూర్తివినీవే, యనేకముగాఁ బ్రకటిత వగుదువు. ఆత్మరూపమున నీ వేకవు, అద్వితీయవు. ఈశ్వరరూపమున స్వగతభేదమయివై బహురూపవు. నీవు ధర్మద్వేషులయిన మహాసురులతోఁ బోరి వారినిజంపి మమ్ముఁ గాచితివి. అమ్మా! నీ చరణములకుఁ గోటి ప్రణామములు.

ఓం. విద్యాసు శాస్త్రేషు వివేకదీపే
ష్వాద్యేషు వాక్యేషు చ కా త్వదన్యా ।
మమత్వగర్తే ఒతి మహాంధకారే
విభ్రామయత్యేత దతీవ విశ్వమ్ ॥ ఓం. 30

అమ్మా ! ఒకవైపు - విద్యలందు, శాస్త్రములందు, వివేకదీపములైన యాద్యవాక్యములందును; ఇఁక రెండవ వైపు - అంధకారమయమైన మమత్వమనెడి సుడిగుండము నందును, ఈ విశ్వమును మఱల మఱల ద్రిప్పుచున్నవారు నీవుగాకమఱెవ్వరు ? (అందులకు నీవొక్కతెవే సమర్థవు.)

వ్యాఖ్య :- ఈ విశ్వమును విద్యా - అవిద్యారూపములయిన, ఊర్ధ్వాథోభావములతో నీవే పరిభ్రమింపఁజేయు చున్నావు. ఒకవైపు విద్య = బ్రహ్మవిద్య, తత్సారభూతములైన వేదములు, ఉప నిషత్తులు. రెండవవైపు అవిద్య = మమత్వమనెడి మోహాంధకార గర్తము. అనఁగా - పూర్ణాజ్ఞానము; అను నీ రెండు పక్షములుగాను, "కా త్వదన్యా" నీవుగాక మఱెవ్వరున్నారు ? అమ్మా ! నీవే అనాత్మపదార్థములకు ద్రష్టవై, వానియందు మమత్వబుద్ధిని

నెలకొల్పి, ఆత్మజ్ఞాన హీనమును, అంధకారమయమునైన సుడియందు, అనేక జాన్మంతరముల నుండి భ్రమణము చేయుచున్నావు. మఱి నీవే ఆత్మ - స్వప్రకాశ రూపవై నిన్ను నీ వెఱుంగుటకుఁగా, ననేక శాస్త్రపాఠములు, వేదాధ్యయనము, మఱి వివేకఖ్యాతికై యనేకములైన యుపాయముల నిర్ధారణమును జేసి పరిభ్రమించుచున్నావు. అమ్మా! ఒక వంక - ఆత్మను విస్మరించిన యజ్ఞానశిశువవుగాను, మఱి యొకవంక - నిన్ను వెదకికొనుటకుఁ గాను అనేకాధ్యవసాయములు చేయు పురుషుఁడవు గాను నీవే కనవచ్చుచున్నావు.

అమ్మా ! నీవు సర్వప్రకాశరూపిణివైన చిన్మయివి. నీకు రవ్వంతయైన నావరణములేదు. నీవు విద్యావిద్యలకు రెండింటికి నీశ్వరివి. విద్యావిద్యలు రెండును వేఱుకావు. వాఙ్మనసుల కగోచరవయ్యును, విద్యావిద్యల రెండిఁటిచే వేర్వేఱుగా నీ విశ్వమును బరిభ్రమింపఁజేయుచున్నావు. ఒకవైపు ఈశ్వర రూపముతో సర్వభూతముల హృదయములందు నధిష్ఠించి యుండి, మాయావశములైన సర్వభూతములను బరిభ్రమింపఁ జేయుచున్నావు. రెండవవైపు జీవరూపమున, అజ్ఞానివలె ఆ భ్రమణయంత్రమునందు నీవే నలిగిపోయి, హాహాకారము లొనర్చుచున్నావు. ఒక వంక నుజ్జ్వల ప్రకాశ వివేకదీపమవు. రెండవవంక మహాంధకార మమత్వగర్తమవు. రెండు దిక్కులును నీవు లేకున్నఁ బరిస్ఫుటములే - కాని నీవుగాక మఱి యెుండు లేనేలేదు. "కా త్వదన్యా" ఎచ్చటను నీ లేమియేలేదు. తల్లీ ! నీ యీ యానందలీల చిత్రము ! ధన్యము !

అమ్మా ! 'విభ్రామయతీ' యను మాటవలన, మేము నీ యెడ నొక విచిత్ర రహస్యమును గనుగొందుము. నీవు స్వయం విభ్రాన్తవు. నీ స్వరూపమును మఱచి యా రూపముతో నిన్ను వెలయించుకొని, మఱల నారూపమునే విభ్రాన్తము చేయుచున్నావు. మఱపించుచున్నావు. నిన్ను నీవే మఱచి యజ్ఞానాంధకారమునందుఁ బడుచున్నావు. లేదా, వివేకదీపమును వెల్గించి నిన్ను నీవే వెదకికొని వెలిఁబెట్టఁ బ్రయత్నించుచున్నావు. నిత్యజ్ఞానమయివైన నీ యీ లీల బహు విచిత్రము.

ఓం. రక్షాంసి యత్రోగ్రవిషాశ్చ నాగా
యత్రారయో దస్యుబలాని యత్ర ।
దావానలో యత్ర తథాబ్ధిమధ్యే
తత్ర స్థితా త్వం పరిపాసి విశ్వమ్ ॥ ఓం. 31

అమ్మా! రాక్షసులుండుచోట, ఉగ్రవిషసర్పములుండుచోట, దొంగలగుంపు లుండుచోట, అడవియందుఁ గారు చిచ్చుండుచోట, బడబానలపూర్ణమైన సంద్రము నడుమను, నీవే యుండి విశ్వమును రక్షింతువు.

వ్యాఖ్య :- నీవీ విశ్వమును మునుజెప్పినట్లు విభ్రాన్తము చేయుచున్నావు. అంతేకాదు. అంతటను నీవే యడ్డు లేక యథాయోగ్యముగా విశ్వరక్షణము చేయుచున్నావు.

అమ్మా ! విషయప్రలోభనమును, ఉగ్రవిషసర్పములనెడి ద్వేష హింసాదులును, అరిబలమనెడి కామక్రోధాదులును, దొంగలనెడి దర్పదంభాభిమానములును, దావాగ్ని యనెడి శోక దుఃఖాదులును, దుస్తరసముద్రమనెడి సంసారము అను వీని

వలన విశ్వమును రక్షించువారు నీవుగాక మఱెవ్వరును లేరు. అజ్ఞానమువలని పూర్ణావరణ ముండుచోట, ఆత్మాస్తిత్వము పూర్ణముగా నష్టమగుననెడి బెదరుగలచోట, నెన్నఁడుం దప్పని మృత్యుకరాళకృష్ణచ్ఛాయ క్రమ్ముచోట, అమ్మా ! నీవు పరిపాలినీ మూర్తితో స్నేహమయమాతృమూర్తితో నీ నెయ్యపు బిడ్డలైన జీవులను రక్షింతువు. విశ్వరక్ష యొనర్తువు. మఱియు స్థూలజగత్తునను మును జెప్పిన రాక్షస శత్రుసర్ప దస్యు దవానల బడబానల పూర్ణదుస్తర సముద్రాదులందు, ఘోరాపదల యందుఁబడిన నీ నెయ్యపు సంతును నీ వెంతటి దివ్యభావముతో, వింతగొల్పు నుపాయముతో రక్షించుచున్నావో, యది చూచియు మూఢులమైయున్న మేము నిన్నెఱుంగఁగోర కున్నాము; ఎఱింగినను నీ సత్తాప్రకాశముఁ గోరము; గ్రహింపము. గ్రహించినను బూర్ణవిశ్వాసము నిల్పలేకున్నాము. "సత్యముగా నీవున్నావు. సత్యముగా జీవులను నీవు రక్షించుచున్నా" వని నిస్సంశయముగా నంగీకరింపకున్నాము. మే మంగీకరింప కున్నను మమ్ముల నీవు రక్షించుచున్నావు. ఇందు సందియము లేదమ్మా !

పక్షాంతరమున - మునుజెప్పిన యాపదలందుఁబడియు మా దృష్టిచే రక్షితులము కాకుండలేదు. అవియు నీ స్నేహమ యాంకమునఁ జిరమునుండియు రక్షితములే. దీనియందును నెట్టి విచారము సంశయము నక్కఱలేదు. ఏమన, "తత్ర స్థితా త్వమ్" నీ వచ్చట నున్నావు. ఈ విపత్సంకులస్థానమందు, అవినాశ స్థాన మందు, కాలమందును నీ వొక్కతెవే యున్నావు. కనుకనే జీవులనెడి స్నేహ... [illegible] ...లయందుఁబడి సాధారణ దృష్టితో

వినష్టమైనదన్నను, హాని యింతయు లేదు. నీ శాన్తి మయాంకమందే చోటు దొరుకును. అమ్మా! నీ వంతట నున్నావు. సర్వమును రక్షించు జననివి. కనుక రక్షా వినాశములు రెండు నున్న స్థలములందును, "విశ్వం పరిపాసి" ఇది ధ్రువసత్యము. నిన్నీ విశ్వరక్షాకరమూర్తితో సర్వత్ర యున్న దానినిఁగా జూడఁగల్గువారలే, మఱెట్టి వినాశమును విపత్తును బొందరు.

"తత్ర స్థితా త్వం పరిపాసి" యను మాటయందు గొంత సాధనరహస్యమున్నది. శ్రద్ధమై వినునది. హిరణ్యకశిపునియానచే సలసల మరుగునీటిలో వేయఁబడిన ప్రహ్లాదుఁడు, "అనలవిహారీ, హృదయవిహారీ" మున్నగు నామములతో బిగ్గఁబిలువక, వైకుంఠనాథాది నామములతో భగవంతు నుద్దేశించి యఱచెను. మఱియుఁ కురుసభయందు దుశ్శాసనునిచే వస్త్రహరణమగువేళ ద్రౌపది, ప్రాణనాథాది శబ్దముల నుపయోగించి మొఱపెట్టక ద్వారకానాథాది నామములతో భగవంతుని బిల్చినది. ఉభయత్ర భగవంతునిరాకకుఁ గొంత తడవైనది. ఏమన - ప్రహ్లాద ద్రౌపదులు "తత్ర స్థితా త్వం పరిపాసి" యను కథారహస్యము నా సమయ మందుమఱచిరి. భగవంతుఁడు సర్వత్ర విరాజిల్లు చున్నాఁడు. అగ్ని రూపమున నాతఁడే, వస్త్రరూపమున నాతఁడే, సర్వజీవుల హృదయమందును బ్రాణపతిరూపమున నాతఁడే విరాజిల్లు చున్నాఁడు. కనుక జీవుఁ డెచ్చట నెట్టి గొడవలోనే పడనీ, అచ్చటనే యా విపద్రూపముగా సైతము అమ్మయే సిద్ధముగా నుండుననెడి దృఢవిశ్వాసముంచి యమ్మను స్మరింపఁ గల్గినచో, జీవుఁడు వెంటనే గొడవవల[illegible] గలఁడు. అమ్మ సర్వదా సర్వత్ర

సన్నిహితయై యుండుననెడి దృఢవిశ్వాసము నెలకొన్నచో, మఱెట్టి యాపదవల్లను విచలితుఁడు కాఁ బనిలేదు.

ఓం. విశ్వేశ్వరీ త్వం పరిపాసి విశ్వం
విశ్వాత్మికా ధారయసీతి నిత్యమ్ ।
విశ్వేశవంద్యా భవతీ భవన్తి
విశ్వా శయా యే త్వయి భక్తినమ్రాః ॥ ఓం. 32

అమ్మా! నీవు విశ్వేశ్వరివి గాన విశ్వమును రక్షింతువు. విశ్వమే నీ శరీరము గాన, నీవు విశ్వమును ధరించుచున్నావు. నీవు విశ్వేశులకును వందనీయవు. నీకు భక్తితో నమ్రులగువారు సైతము విశ్వమున కాశ్రయస్వరూపు లగుదురు.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు మునుజెప్పిన రాక్షసాదులనెడి వృత్తులనుండియు జీవుల నలౌకికోపాయములచే రక్షింతువనుట యం దింతయు వింతలేదు. అమ్మా ! నీవు విశ్వేశ్వరివి - ఈ విశ్వమున కధిపతివి. దేనికే నధిపతులైనవారు దానిని రక్షింత్రుకదా. అపుడు దేవతాగణము "విశ్వేశ్వరీ త్వం పరిపాసి విశ్వమ్" అని యేల యన్నది ? విశ్వేశ్వరిగా నిన్ను నెఱుంగువారలే, యీ విశ్వమును నీ వాక్కతెవే రక్షింతువని తెలిసికొనఁగలరు. మఱియు నీ విశ్వము న్నీ యందే ధరించియుంచితివి. ఇందును వింతలేదు. ఏమన - నీవు విశ్వాత్మికవు. 'ఏకో ఽహం బహుస్యామ్' అని నీవే బహురూపములతోఁ బ్రకాశించుచున్నావు. ఈ విశ్వమే నీ శరీరము, కనుక దీనిని ధరించి యుంచుటయు నీ స్వభావమే.

ప్రసంగవశమున నీ విశిష్టాద్వైతవాద సంబన్ధమున రెండు మాటలు చెప్పుట కేవల మన్యాయముకాదు. ఆ మతము నను సరించువారు, ఈ విశ్వమే భగవంతుని శరీరము. మన యీ స్థూల శరీరము - మనసు, బుద్ధి, ఆత్మ యనువాని సమష్టి యైనట్లే యీ వ్యక్తవిశ్వము విరాణ్మనస్సు, సమష్టిబుద్ధియను వానితోఁగూడిన పరమాత్మయొక్కటే, యుపాస్యము లభ్యము నందురు. సాధనజగత్తునం దీ మతము విశేషాదరణీయము, పరిగ్రాహ్యము నైనదె. ఇది యుపనిషద్విరుద్ధమునుగాదు. ఉపనిషత్తులును బలుచోట్ల నీ విశ్వమును బరమాత్మయొక్క స్థూల శరీరమన్నవి; గాని యీ మతమందలి యొకమాట విశేషించి విచారింపఁదగినది. విశిష్టాద్వైతవాదులు ఈ పరిదృశ్యమాన (కానవచ్చు) జడాంశమును, ఒక్కదెబ్బతోఁ అచిత్తత్త్వమనిరి. అచిచ్ఛబ్దార్థము జడమేయన్నచో, నిది శ్రుతివిరుద్ధము. ఏమంటే శ్రుతి, యీ జడాంశమునుగూడ బ్రహ్మస్వరూపముగానే కీర్తించినది. అచిచ్ఛబ్దముచే చిత్ యొక్క స్వల్పప్రకాశమని యర్థ స్వీకారముచేసి, ఈషదర్థమందు నఞ్ సమాసము చేసినచో నెట్టి సంశయమునకును దావుండదు.

అది యుండనిండు - అమ్మా ! నీవు విశ్వేశగణము, విశ్వాధిపతిగణము, ఈశ్వరగణము అనఁగా బ్రహ్మాదిదేవతా బృందము సదా నీకు వందనమాచరించును. దేవతలు సర్వతోభావముతో నీకు శరణాగతులే. అట్లగుటచేతనే వారు విశ్వాధిపత్యము నొందిరి. గాన "త్వయి భక్తి నమ్రాః" నీకు భక్తితో నతులగువారే, నిక్కముగా విశ్వమున కాశ్రయస్వరూపు -లగు

దురు. విశ్వమండలి జనులు వారి యాశ్రయమునొంది జ్ఞాన భక్తులను శాంతిని బొందఁ బ్రయత్నింతురు.

ఓం. దేవి ప్రసీద పరిపాలయ నో ఒరి భీతే
ర్నిత్యం యథాసురవధా దధునైవ సద్యః ।
పాపాని సర్వజగతాం చ శమం నయాశు
ఉత్పాతపాక జనితాంశ్చ యహోపసర్గాన్ ॥ ఓం 33

ఓ దేవీ ! నీవు ప్రసన్నవగుము. ఇప్పుడసురులను వధించి మమ్ములను శత్రుభయమువలన సద్యోవిముక్తులను జేసినటులే, నిత్యమును నీ మా శత్రుభయమును బోఁగొట్టి కాపాడుము. మఱియు సర్వజగత్తుల పాపములను, ఉత్పాత పరిణామరూపమైన యుపసర్గములను శాన్తింపఁజేయుము.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు ప్రసన్నవగుము. నీవు నిత్యమును మాయెడలఁ బ్రసన్నవే యని సర్వవిధముల మాకెఱిఁగింపుము. మఱియు "అధునైవ" ఇప్పుడే యసురులను జంపి మమ్ము భయవిముక్తులను జేసినట్లే నిత్యము పిలిచినపుడెల్ల నీవు, మా యొక్క బహు "నేను" లనెడి యజ్ఞానము చేతనైన మా శత్రు భయమును అనఁగాఁ గామాది రిపుల చేతనైన ముసుఁగును దొలఁగించి పాలింపుము.

అమ్మా ! ఒక్కసారి చూడుము. నీ నెయ్యపు సంతు కామాది శత్రువుల యుత్పీడనముచే నలిగిపోవుచున్నది. అదె వినుమమ్మా ! శత్రువుల యత్యాచారముచే నుత్పీడనము నొంది యుపద్రవము నొంది యెంత ఘోష పెట్టుచున్నదో ! కొందఱు నిన్నుఁ గఱిన

పాషాణముగా నెంచి తిరస్కరించుచున్నారు. కొందఱు శత్రుభయ
మువలనఁ బరిత్రాణమెందుటకై కఠోరనియమములను,
బలువిధములైన యోగకౌశలాది సాధనములను జేయుచున్నారు.
శత్రుభయభీతమైన యీ నీ సంతానమును రక్షింపుము. నీవు వారితో
"మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" నాకు శరణాగతు
లగుట చేతనే మీ శత్రుభయము నశించునని చెప్పివేయుము.
అంతే కాదు. "పాపాని సర్వజగతాం చ శమం నయాశు" సర్వ
జగత్తుల పాపములనెడి సంస్కారములసైతము వడిగా శాంతింపఁ
జేయుము. జీవునకుఁ బాపబోధ మెందుకగును ? "నేను కర్త"
ననుకొనుచునే కర్మము లాచరించును గానఁ, గర్మఫలమనెడి
పాపము నేనుతోఁ గూడియుండును. సాధారణభాషలో దేనిని
బుణ్యమందురో, అదియుఁ బాపమం దిమిడియున్నదే.

అమ్మా! జీవుఁడు నీకు శరణుజొచ్చినచోఁ గొలఁది నాళ్ళలోనే
వాని కర్తృత్వజ్ఞానము (నేనే కర్తనను తెల్వి) అంతరించిపోవును, గానఁ
బాపము - కర్మఫలము మఱేమియు మిగులదు. కనుక, అమ్మా!
యని నినుఁబిల్చు ముద్దుబిడ్డలకు, "నాయనలారా ! 'అహం'
అనునదే పాపముచుఁడీ ! అహం బోధమును విడువుఁడు.
మీరు'నేను' అనుచున్నది 'నేను' మీ యమ్మను. నన్ను విడిచి మఱల
మీరు 'నేను' కాఁబోకుఁడు. నాయెడ లక్ష్యముంచి నాకే శరణాగతుల
రగుఁడు. అపుడు చూడుఁడు. కొలఁదినాళ్ళలోనే మీ సర్వ
పాపములును దొలఁగును" అని నీవే చెప్పి వేయుమమ్మా !

"ఉత్పాతపాక జనితాంశ్చ మహోపసర్గాన్" ఉత్పాతములు - ఉల్కాపాతము, ధూమకేతూదయము, సూర్య పరివేషము - (సూర్యుని చుట్టు నల్లనిమండలము) మున్నగు నీ యుత్పాతముల పాకము - ఫలపరిణామము - దాని వలన నగు నుపసర్గములు - దుర్భిక్షము, మహామారి, అకాలమృత్యువు, నీటివెల్లువలు, పిడుగుపాట్లు, తుపానులు మున్నగునవి జీవుల పాపములకుఁ బ్రత్యక్ష ఫలములు. అహంబోధముతోఁ బనులు చేయునపుడు బహిర్ముఖమైన జీవబృందము వివిధములైన యిట్టి యుపసర్గము లందుఁ బడును. అమ్మా ! జగత్తునం దీ పాపమును దొలఁగింపుము. ఉపసర్గములను శాంతింపఁజేయుము. ఆనందమయివైన నీ సంతానము మఱల నానందము నొంది, యమ రత్వసంధానము నొంది, విషయోపసర్గముల బారినుండి తప్పి పరిత్రాణ మొందును గాక.

ఓం. ప్రణతానాం ప్రసీద త్వం దేవి విశ్వార్తిహారిణి ।
త్రైలోక్యవాసినా మీడ్యే లోకానాం వరదా భవ ॥ ఓం. 34

ఓ దేవీ ! విశ్వార్తిహారిణి ! నీకుఁ బ్రణతులైనవారి యెడఁ బ్రసన్నవగుము. ముల్లోకములం దెల్లరచేఁ గొనియాడఁ బడఁదగిన తల్లీ ! ప్రసన్నవగుము.

వ్యాఖ్య :- అమ్మా ! నీవు స్వయంప్రకాశరూపిణివి. నీవు విశ్వముయొక్క సకలదుఃఖములను హరించుదానవు. నీ పాలనమువల్లనే జీవుల సర్వదుఃఖములు తొలఁగును. ప్రణతుల యెడఁ బ్రసన్నవగుట నీ స్వభావము. యథార్థముగా నీకుఁ బ్రణతులైనవారే నిత్యప్రసన్నమూర్తిని దర్శింపఁగలరు. అమ్మా !

నేఁడు మేమును నీ చరణములకుఁ బ్రణతులమైతిమి. అహంత యనెడి మా నిక్కినతల నేఁడు నీ యడుగుల వ్రాలినది. నీవే వ్రాల్చితివి. కనుక నిపుడు "ప్రసీద" ప్రసన్నవు కాకతప్పదు. అగుదువు. అమ్మా! ముల్లోకములందలివారు సుర నర గంధర్వాదులు, ఎవరి కెంత సాధ్యమో, యంతగాఁ దమ వాణిని విశుద్ధ మొనర్చుటకు, దాము విశుద్ధులగుటకు నీ గుణగానము చేయుదురు. కనుక నీవు ముల్లోకములకును స్తుత్యవు. నీ వెల్లరకును వరదానము చేయుము. నీవు లోకములకు వరదవు. గాన, నీ వరదాయనీమూర్తితో నిలువుము. ఇపుడు నీ సంతానము నిర్భయ ముగా, నిష్కపటముగా నీ యిచ్చు వరముల నందుకొని ధన్యము కాఁగలదు. లోకము మఖల నీ సత్యప్రకాశముచే నుద్భాసితమగును.

ఓం. దేవ్యువాచ ఓం.

ఓం. వరదాహం సురగణా వరం యం మనసేచ్ఛథ ।
తం వృణుధ్వం ప్రయచ్ఛామి జగతా ముపకారకమ్ ॥ ఓం
35

దేవి పలికెను :- ఓ దేవతలు ! నేను వరదాయినిని. జగదుపకారకమైన వరమేదియైననుఁ గోరుకొనుఁ డది యిచ్చెదను. వేలుపులు చేసిన స్తోత్రపాఠఫలముగా మన యమ్మ మిగులఁ బ్రసన్నయైనది. వరదాయినీమూర్తితో నావిర్భవించి జగన్మంగళవిధాయకమగు వరమిచ్చుటకుఁ బూనుకొన్నది.

వ్యాఖ్య :- సాధకా ! నిజముగా నటులే యైనది. అగుచుండును. ఇపుడు, విశ్వాసములేని యీ జగమందు సైతము, ఈ విధముగా సత్యముగా వచ్చి జగన్మంగళమును సాధించును.

ఏమన - సంతానము జగదాత్మయం దేకీభూతమైనపుడు, జగన్మంగళసాధనమే మన యమ్మ ముఖ్యలక్షణమగును. వ్యక్తిగతమైన సంకీర్ణ స్వార్థమందు లక్ష్యముండదు, గాన నిష్కామ సాధక సాధన ఫలముగానే జగన్మంగళము సాధితమగును.

ఇట్టి నిష్కామకర్మల కర్మవిభాగసంబంధమున శాస్త్రకారులన్నది వ్రాయుట యప్రాసంగికముకాదు. "ఆత్మజ్ఞపురుషుల కాప్తసుహృత్తులయిన వారికి, వారి సుకృతమందు వంతు గలదు. వారిని ద్వేషించువారు వారి దుష్కృతములను గొందురు" అని శ్రుతి. ఇది పుత్త్రాదులైన యుత్తమాధికారులకు ధనవిత్తాదులు సంక్రమించునటులే యగును. రుక్మాంగదుఁడు చేసిన నిష్కామైకాదశీవ్రతఫలముగాఁ దనవారలెల్లరు నరకమునుండి స్వర్గమునకుఁ జేర్పఁబడిరి. ఒక గృహస్థుఁడు చేయు నిష్కామకన్యాదాన ఫలముగా నతని వంశీయు లిటు వదితరములవారు, నటు వది తరములవారు నరకగతులైన నుద్ధరింపఁబడి శాశ్వతబ్రహ్మలోకావాప్తి నొందుదురు. అని కన్యాదానవేళ కాన్యాదాతృ సంకల్పవాక్యములేకద. రావణుఁడు చేసిన దుష్కృతముల ఫలమును, వానివంశమువారేకాక, లంకారాజ్యమువారెల్లరుఁ బంచికొని యనుభవించిరి. ఉండనీ; ఉపనిషత్తు, అభ్యుదయకాములైన యాత్మజ్ఞపురుషుల పూజ నుపదేశించినది. ఈ విధముగా విశ్వమంగళసాధనముచేయుటకై యాత్మజ్ఞపురుషులు పుట్టుదురు.

ఓం. దేవా ఊచుః ఓం.

ఓం. సర్వబాధాప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి ।
ఏవమేవ త్వయాకార్య మస్మద్వైరి వినాశనమ్ ॥ ఓం.36

దేవతలనిరి - అమ్మా ! అఖిలేశ్వరీ ! నీ విపుడు మా యరికులమును నశింపఁజేసినట్లే, ముల్లోకముల బాధలను నశింపఁజేయుము. ఇంతే మా కోరిక.

వ్యాఖ్య :- అఖిలేశ్వరీ ! కొన్నాళ్లయి విశ్వమందన్నియు బాధలే, యనుచు నొక యార్తధ్వని లేచినది. అన్ని విధముల బాధలను బాపకున్నచో నిన్నొందుట (నిన్నుఁ దెలియుట) కాదు. ఆహా ! యెట్టి మర్మపీడాకరవాణి వినఁబడుచున్నది ! కాని కొలఁదిమంది మాత్రమే సర్వమును విడుచుట కనుచున్నాము. అటులు చేయఁగలవార లన్నియు బాధలే యనుచున్నారు. ఇఁకఁ గృతకార్యులు కానివారును, సర్వమును మాతృలాభమును కంతరాయమే యని ఘోషించుచున్నారు. వాస్తవముగా సర్వమును (వారనుకొన్న వన్నియు) బాధలు కావు. సర్వవిధముల నీవే విరాజిల్లుచున్నావనెడి సత్యమందుఁ బ్రతిష్ఠితుఁడగుటచేతనే జీవుఁడు నీ సర్వాతీత స్వరూపము ననుభవింపఁగలఁడు. అమ్మయే సర్వమునై యున్న దని, తెలియనంత దాఁక, జీవునకు మాతృలాభవిషయమున సర్వము నంతరాయముగానే నిల్చును. కనుకనే 'అమ్మా ! జగత్తునందు సత్య ప్రతిష్ఠచేయుము. నీ వొక్కతెవే సర్వరూపములతో సత్యరూపముతో నిన్ను వెలయించుకొనుచున్నావని, ప్రత్యేక జీవుఁడును హృదయము నందు స్వర్ణాక్షరములతో నంకితమొనర్చుకొనునట్లు చేయుము. ఏ బాధలు నుండవు. అమ్మగుండెయే సర్వవిధముల, దన సంతానమును ధరించుటకై సిద్ధమని, నీ సంతానమునకు మర్మమర్మముల నాటఁదెలుపుము.

సర్వము సత్యప్రతిష్ఠిత మగును. లోకమున సర్వదుఃఖరోదనములు తొలఁగిపోవును. జగత్తు యథార్థకల్యాణము నొందును.

ఓం. దేవ్యువాచ ఓం.

ఓం. వైవస్వతే ఽన్తరే ప్రాప్తే అష్టావింశతిమే యుగే ।
శుంభోనిశుంభశ్చైవాన్యా వుత్పత్స్యేతే మహాసురౌ ॥ ఓం 37

ఓం. నందగోపగృహే జాతా యశోదాగర్భ సంభవా ।
తతస్తౌ నాశయిష్యామి విన్ధ్యాచల నివాసినీ ॥ ఓం.38

అమ్మయన్నది - వైవస్వతమన్వంతరమందు, ఇరువది యెన్మిదవ యుగమున మఱల శుంభ నిశుంభులనెడి పేళ్లతో నిరువురు మహాసురులు పుట్టుదురు. అపుడు నేను నందగోపునింట యశోదాగర్భమునందుఁ బుట్టి వింధ్యాచలమునందుండి యా యసురులను నశింపఁజేయుదును.

వ్యాఖ్య :- దేవతలచేఁ బ్రార్థింపఁబడి త్రైలోక్యమునకు సర్వబాధాప్రశమన వరము నిచ్చుటకుఁ బూని, యమ్మ యిచట ననేక రహస్యములను వెల్లడించినది. దేవీమాహాత్మ్యమందు వర్ణింపఁబడిన మాడురహస్యముల నమ్మ తానే వ్యక్తపఱచినది. దేవీవాక్యములుగా నీ యధ్యాయమందుఁ బదునాలుగు మంత్రము లున్నవి. అమ్మ కృపాపూర్వకముగా సాధకుని మోహావరణముఁ దొలఁగించినపుడే యా మంత్రముల రహస్య నిర్ణయము కాఁగలదు.

ప్రియసాధకా ! రమ్ము; మనమిపుడు "అమ్మా ! ఈ రహస్యమంత్రముల యథార్థతాత్పర్యము మాకు హృదయంగ

మము చేయుమా" యని యమ్మ యడుగులంబడి యడిగి కొందము. "అంధేనైవ నీయమానా యథాంధాః" అను న్యాయమున భ్రాంతమార్గమునఁ బడకుందుము గాక. 'జయ మాతా' నీ వుద్భాసింపుము.

వైవస్వతమనవు - ఏడవ మనువు. ఒక మనువు నధికారము చెల్లు కాలము మన్వంతరము. డెబ్బదియు నొక్క మహాయుగము లొక్క మన్వంతరము. సత్య త్రేతా ద్వాపర కలియుగములు నాలుగుం జేరి యొక మహాయుగమగును. పదునాలుగు మన్వంతరము లొక కల్పము - ఒక్కసారిగాఁ బ్రలయమగును. వర్తమాన కల్పముపేరు శ్వేతవరాహము. ఇక్కల్పమందగు డెబ్బదియొక్క మహాయుగములలో నిరువది యేడు కడచిపోయినవి. ఇరువదియెనిమిదవ మహాయుగమందు, సత్యత్రేతా ద్వాపరయుగములు కడచినవి. ఇపుడు కలియుగము నడుచుచున్నది. దీని యాయుఃపరిమాణము నాల్గులక్షల ముప్పది రెండువేల వర్షములు. దానిలో 5065 వత్సరములు మాత్రమే జరిగినవి. ఇచట మనము ప్రసంగవశమున భారతీయ కాల గణనమునెడ సాధారణుల దృష్టి నాకర్షించుచున్నాము. సత్యతాకాల నిర్ణయము చేయుటకై నాలుగైదు వేలో, పది యిరువది వేలో సంవత్సరములు మాత్రమే సిద్ధాన్తము చేయువారు దయచేసి మున్ను వ్రాసిన కాలగణనాప్రణాళిక నొక్కసారి లక్షింపవలయును. "భారతవర్షము అధఃపతితమై పోయినది. భారతము చిరకాలము పరాధీనమై చిరదాస్యము చేసినది" యనువారు, ఒక్కసారి లెక్కవేసి చూచినచో భారతవర్షమునకు నిర్దిష్టమైన యహాయుః

పరిమాణమునుబట్టి యొకటి రెండు వేల యేండ్లెంత యల్పమో, ఎంత క్షుద్రమో - బిందుసదృశము కాదా ? కనుక భారతదుర్దశను జూచి శంకించి కలఁతనొంద హేతువు లేదు. కొంతకాలమైన తర్వాత నిట్టి యవస్థనగు శోచనీయకథలు నాయనమ్మ కతల క్రిందనే లెక్కింపఁబడును. ఇమ్మాట లిచట నప్రాసంగికములైనను వీని యాలోచనమువలన మేలే కలదు. దుర్బలచిత్తుల హృదయ మందు నూతనోత్సాహము, నూతనబలము, ఆశ, సంచరింపఁజొచ్చును. మఱియొక గొప్ప యుపకారము. జీవుని యహంకారము నశిం చును. ఔరా ! అనంతకాలసముద్రమందు మేమెంత క్షుద్రులము ! మా యునికి యెంత యల్పము ! అను నిట్టి విచారమువలన జీవుని యహంకారము విడిపోవును.

మంత్రమందుఁ జెప్పబడినది - అమ్మ యన్నది - "వైవస్వతమన్వంతరమందు, ఇర్వదియెన్మిదవయుగమున మఱల శుంభనిశుంభుల పేరి యసురు లిర్వురు పుట్టుదురు. నేను నంద గోపు నింట యశోదకడుపునఁ బుట్టి వింధ్యాచలమునందుండి, ఆ శుంభనిశుంభులను నాశమొనర్తును."

ఇచట - అమ్మ చెప్పిన కాలము లెక్కనుబట్టి యీ వర్తమానయుగమే విశేషించి లక్షింపఁబడును. ఇది దేవీ మాహాత్మ్య మునందలి, స్వారోచిష - అనఁగా రెండవమన్వంతరమునకుఁ జెందిన యుపాఖ్యానము. ఆ కాలమునుబట్టి చూడ వర్తమాన కాలము బహుదూరభవిష్యత్తు, గాన, ఈ మంత్రమందు "ఉత్పత్స్యేతే" అనునది భవిష్యద్బోధక క్రియాపదముగా నున్నది. వర్తమానమునఁ బెక్కండ్రు మనుష్యులు శుంభనిశుంభులచేత, అనఁగా - అస్మితా మమతలచేత జయింపఁబడినవారలే. మన

యమ్మ యశోదాగర్భసంభూతయై నంద గోపు నింట వెలసి యీ యిర్వురిని నశింపఁజేయును.

నందగోప - ఆనందమయబ్రహ్మాభిముఖియైన మనస్సు. "గాః పాతీతి గోపః" గోశబ్దార్థము ఇంద్రియములు. ఇంద్రియములను బాలించునది మనస్సు. కావున 'గోప' యనఁబడెను. మనస్సనెడి గోపుఁడు నందుఁడు. అనఁగా, ఆనందస్వరూపాత్మకు అభిముఖుఁ డగునపుడే వాని పేరు నందగోపుఁడు. సర్వవిధముల నాత్మాభిముఖ మనస్సు నాశ్రయించియే శక్తివికాస మగును. అనఁగాఁ బ్రజ్ఞాప్రభావము వెలయును. దానిచేతనే అస్మితా మమతలు నశించును. అదే నందగోపగృహమందుఁ బుట్టుటగాఁ జెప్పఁబడినది. అదే 'యశోదాగర్భసంభవ'. 'యశ + దా' యశోదా; యశస్సు నిచ్చునది. మాతృలాభముకొఱకుఁ, దీవ్రాధ్యవసాయశీలుఁ డగుటచేతనే, మన యమ్మ తొలుదొల్త యశోదామూర్తితో జీవునిఁ దన యంకమందుఁ జేర్చుకొనును. అపుడు వానికిఁ దెలియకయే వాని యశస్సు నలుదిక్కులఁ బ్రాకును. సంతానము "రూపందేహి, యశోదేహి" యని కోరినది, గాన జగన్మాత యశోదారూపమున వెలసి నందా శక్తిని బరిపోషించినది. యశోదయొడియందుఁ బెరిగిన యానంద మయశక్తియే శుంభనిశుంభుల వినాశమును జేయునది. ఈమె పేరే నందాశక్తి. ఈమె వింధ్యాచలవాసిని. వింధ్యాచలమే హృదయదేశము. హృదయమందలి యానందమయశక్తిచేతనే యస్మితా మమతలు నశించుటగును. తంత్రశాస్త్రమునందు సుమేరుపర్వతము మస్తకముగాను, వింధ్యాచలము హృదయము గాను, కులపర్వతము మూలాధారముగాను నిర్దేశింపఁబడినది.

మొత్తపుమాట యేమనగా - అమ్మ చెప్పినది "ఈ యుగమందు సైతము జీవుఁడు విశేషించి సత్యచ్యుతుఁడైపోవును. నా సంధానము నొందక యహంకార విమూఢుఁడై పోవును. అప్పుడే నేను జీవహృదయమందు యశోదాగర్భ సంభవనై నందాశక్తిగా వెలసి, వాని యహంకారము నడంచి వానిని సత్యలోకమందుఁ జేర్చెదను." ద్వాపరయుగమందును మన యమ్మ శ్రీకృష్ణుఁడుగా నందగోప గృహమందు యశోదాగర్భసంభవయై నందాశక్తి రూపమునఁ దన్ను వెలయించుకొని, శిశుపాలాదులైన యసురుల నశింపఁజేసి, ధర్మరాజ్యమును బ్రతిష్ఠింపఁజేసినది.

మూర్తిరహస్యమందు, ఈ నందాదేవియే విష్ణుశక్తి (లక్ష్మి)గా వర్ణింపఁబడినది. "కమలాంకుశ పాశాబ్జైరలంకృత చతుర్భుజా। ఇందిరా కమలా లక్ష్మీః సాశ్రీరుక్మాంబుజాసనా॥" యని. ఈ విష్ణుశక్తి యన్నదే మధుకైటభ వధమందునుం జెప్పఁబడినది. ఆ ప్రథమచరిత్రమందు నందాశక్తియు, రక్తదంతికయు బీజములుగా నుల్లేఖింపఁబడినవి. రక్తదంతికావిషయము రాఁబోవు మంత్రమునఁ దెలియఁగలదు. విష్ణురూపమున వెలసి యా మధుకైటభులఁ జంపిన యా శక్తియే, యీ యుగమున నందాశక్తిరూపమునఁ బ్రతిజీవుని హృదయమందును నావిర్భవించి శుంభ నిశుంభులను (అస్మితా మమతలను) జంపును.

సాధకా ! వినుము - శక్తి వస్తువు, అదృశ్యము, అగమ్యము కారణస్వరూపము. ఇది కార్యరూపమున - దృశ్య రూపమునఁ దనను బ్రకటించుకొనుచుండు. సాధారణముగా నా కార్యమే

శక్తిమంతుఁడుగా వ్యవహరింపఁబడును. చూడుము - ఒక చెట్టున్నది. అది స్వయముగా (తానే) నొక శక్తి మాత్రమైనను, దానిని 'వృక్షము' అని వ్యవహరించుచున్నాము. అనుభవించుచున్నాము. వాస్తవముగా నీ శక్తి శక్తిమంతులకు భేదమే లేదు. అటులే యొక యఖండమహాశక్తి - చితిశక్తి (బ్రహ్మము) ఒక భావముతోఁ దన్నుఁదా వెలయించుకొన్నపుడు, అట్టి భావముతోనే విభిన్న రూపములతోఁ బరిచితమగుచుండును. దీనిచే దాని యేకత్వమునకు నింతయు హానిలేదు. కనుకనే యీ దేశజనులు ముప్పదిమూడుకోటుల దేవతల దర్శనము చేసినను, అద్వైతవాదులే. ఈ ధన్యదేశజనులు, తా మే స్థల మందైనను, ఏ రూపమందైనను, ఎట్టి శక్తివికాసము నైనను గాంచినపుడు, దాని నొక జడశక్తి మాత్రముగా నెన్నక, దేవతగానే భావించి, ఈశ్వరుఁడుగానే గౌరవించి, పూజించునట్టి శక్తివాదులును, జైతన్యదర్శులునై యున్నారు. ఇతరదేశ జనులు తామీ వైజ్ఞానికతను, ఆధ్యాత్మికతను దెలియఁజాలకుండుటచేఁ దఱుచుగాఁ 'బ్రతిమాపూజకులు, విగ్రహారాధకులు' నని పరిహాసము చేయుదురు. అంతమాత్రాన మనకు రవ్వంతయైన క్షోభములేదు. ఈ ప్రతిమాపూజకులే, ఈ విగ్రహారాధకులే, లోకమున మొట్టమొదట, 'తత్త్వమసి' మున్నగు మహావాక్యములతో, అద్వయజ్ఞాన విజయదుందుభిని మ్రోగించినవారు. మఱియు నవిశ్వాసపూర్ణమైన, యీ యుగమందు సైతము, ఈ దేశమువారు పలుదేవతల పూజలు చేయుచునే, యభీష్టఫలముల నొందుచు నద్వయజ్ఞానాధికారులై యున్నారు. అది యట్లుండె.

మఱల నిపుడు దేవీమాహాత్మ్య పాఠకులఁ దలపించు చున్నాము. - ఈ గ్రంథమందు సర్వదేవ దేవతల యాధ్యాత్మిక రహస్యమే వివరింపఁబడినను, వారి విశిష్టమూర్తుల ననాదరింప లేదు. ఈ నందాశక్తి మున్నగువానికి విశిష్టమూర్తులుండనే చాలవు. ఇపు డీ దినములలో నట్టి మూర్తులు కానరావని, యెవ్వరును విచారింపఁ గారణము లేదు. "సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" యనెడి సత్యవాక్యమందు లక్ష్యముంచుటచేతనే, మూర్తామూర్తవిషయకమైన సంశయము తొలఁగిపోవును.

ఓం. పునరప్యతి రౌద్రేణ రూపేణ పృథివీతలే ।
అవతీర్య హనిష్యామి వైప్రచిత్తాంస్తు దానవాన్ ॥ ఓం. 39

ఓం. భక్షయంత్యాశ్చ తానుగ్రా వైప్రచిత్తా న్మహాసురాన్ ।
రక్తాదన్తా భవిష్యన్తి దాడిమీ కుసుమోపమాః ॥ ఓం. 40

ఓం. తతో మాం దేవతాః స్వర్గే మర్త్యలోకే చ మానవాః ।
స్తువన్తో వ్యాహరిష్యన్తి సతతం రక్తదన్తికామ్ ॥ ఓం. 41

మఱల నే నతిభీషణాకారముతో భూమిపై నవతరించి వైప్రచిత్తులనెడి దానవులను జంపుదును. ఆ దానవులను నమలుటచే నా దన్తములు దానిమ్మపూలవలె నెఱ్ఱఁబడును. అపుడు స్వర్గమందలి దేవతలును, మర్త్యమందలి మానవులును విడువక స్తుతించుచు నన్ను రక్తదన్తికా నామముతోఁ గీర్తింతురు.

వ్యాఖ్య :- వేదవిద్ బ్రాహ్మణులు విప్రులు. "వేద పాఠా ద్ధవే ద్విప్రః" చిత్తమందు వేదమును = అమ్మ సంవేదన ప్రకాశము నొందువారలే విప్రులు. వారి చిత్తమే విప్రచిత్తము. ఈ విప్రచిత్తములందు వెలయు వృత్తులకే వైప్రచిత్తములని పేరు. అవె దానవగణముగాఁ జెప్పఁబడినది. దీని నణఁచుటకు, అమ్మ యుగ్రరూపమున వెలయు పనిపడును. ఏమన - ఆత్మ సంవేదనసంపన్నులైనవారి చిత్తము బహువీర్యశాలి యగును. ఆ వృత్తుల విలయమొనర్చుటకై యమ్మ యుగ్రరూపమున వెలయు పనిపడును.

ఇంతకుమున్ను యోగుల నిర్మాణచిత్త విషయము చెప్పఁబడినది. యోగశాస్త్రమందొక సూత్రమున్నది. "నిర్మాణ చిత్తాన్యస్మితా మాత్రతః" అనఁగా నిర్మాణచిత్తము, అస్మిత యందే ఘటింపఁబడును. అనఁగా జిత్తవిలయమైన తర్వాత మఱల నభినవచిత్త నిర్మాణమగును. ఉద్దేశ్యము విశ్వహితము = లోకైషణ, విశ్వమంగళమునకై యోగిపురుషులు, అభినవ కర్మాశయమును ఘటించుకొందురు. అవియు విప్రచిత్తాసురులనఁబడును. మా యమ్మ సమయమును బట్టి యావిర్భవించి వానిని గూడ విలయమొనర్చును. ఏమన అవియును గైవల్య విరోధులే.

ఈ విప్రచిత్తాసురులను వినాశ మొనర్చుటకై పరాప్రకృతియొక్క రజోగుణాత్మకమైన చిత్ప్రవాహరూపముతో, అమ్మ విశేషించి యాత్మప్రకాశము చేయవలసివచ్చును. ఇంతకుమున్ను నందాశక్తి నామముతో జెప్పఁబడినదే మఱల వైప్రచిత్తులనెడి భీషణాసురులను నశింపఁజేసి రక్తదంతికా నామముతోఁ

ప్రసిద్ధయగును. దంతములే భావరాశిని విలయమొనర్చు శ్రేష్ఠసాధనము. ఆ యతిసూక్ష్మములును, ఉచ్చ తమములునైన వృత్తులు సంహరింపఁబడవలసి వచ్చునపుడు, నిజముగాఁ బ్రలయముపేరి రక్తవర్ణ కరాళదంతపంక్తితోడి నోరు తెఱచి భావములను గ్రసించుచున్నదని మనసునఁ దట్టును. గీతయందలి విశ్వరూపసందర్శనమున, అర్జునుఁడును నరిగా నిట్టులే దంష్ట్రాకరాళ ముఖమందు సర్వభావ విలయమును గాంచెను. "యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః" మందు నగ్గి యందు మిడుతలంబోలి రాజన్యవర్గ విలయమందును, ఇచట దానిమ్మపూలవంటి యెఱ్ఱనిదంతముల సమూహముచే వైప్రచిత్తాసురకుల భక్షణమును, నొక్కభావమునే వెల్లడించును. అనఁగాఁ దాత్పర్య మొక్కటే.

ఇది మొదలు దేవతలును మానవులును నందాశక్తిని రక్తదంతికయని స్తుతింపఁగడఁగిరి. అమ్మ యెప్పు డెట్టి భావముతో నెట్టికార్యమును సంపన్నముచేయునో, అపుడు దేవతలు మనుష్యులు, అమ్మ నట్టి భావముతో నట్టిపేరితో స్తుతించు చుందురు. ఇంతకుమున్ను మధుకైటభవధమునకు, నందారక్త దంతికా బీజశక్తులే శక్తిబీజములుగా వర్ణింపఁబడినవి, అచట విప్రచిత్త విలయరూపముగా నేమియుం జెప్పఁబడకున్నను బహుత్వస్పృహానాశమే సర్వచిత్తవిలయమునకు బీజస్వరూపమైనదని యెఱుంగవలయును. బహుభావముల కోరిక నివృత్తి యగుటచేతనే తక్కిన యాసురికభావముల విలయమగును. ఈ రక్తదన్తికాదేవి యావిర్భవించుటచే విప్రచిత్తులనెడి యసురులును యోగుల నిర్మాణచిత్తసర్వస్వము నష్టమైపోదురు. నిర్మాణచిత్తమూలమందే

యా బహుత్వస్పృహ సూక్ష్మ భావముతో నుండుననెడి మాట నంగీకరింపకుండుటకు వీలు లేదు. అవి బంధనజనకములు కాకున్నను భేదజ్ఞానము తప్పక యున్నదే. అగుఁగాక. ఈ బహుత్వ స్పృహను బూర్తిగా విలయ మొనర్చియే సాధకునిఁ గైవల్యపద మందుఁ బ్రతిష్ఠించుటకై నందాశక్తి, అమ్మయొుక్క రక్తదంతికామూర్తితో నావిర్భవించును.

ఓం. భూయశ్చ శతవార్షిక్యా మనావృష్ట్యా మనంభసి ।
మునిభిః సంస్తుతా భూమౌ సంభవిష్యామ్యయోనిజా ॥ ఓం. 42

ఓం. తతః శతేన నేత్రాణాం నిరీక్షిష్యామి యన్మునీన్ ।
కీర్తయిష్యన్తి మనుజాః శతాక్షీ మితి మాం తతః ॥ ఓం. 43

నూతేండ్లు వ్యాపించు వఱపుచేఁ బృథివి జనశూన్యమగు నపుడు, నేను మునులచే స్తుతింపఁబడి, అయోనిజనై బువిఁ బుట్టుదును. అపుడు నేను నూఱు కనులతో మునులను జూతును, గాన నన్నపుడు జనులు శతాక్షీనామముతోఁ గీర్తింతురు.

వ్యాఖ్య :- ఇంతకుమున్ను నందారక్తదన్తికలు బీజములుగాఁ బ్రథమచరిత్ర రహస్యము వ్యాఖ్యానింపఁబడినది. ఇపుడు మధ్యమచరిత్ర రహస్యవర్ణన ముపక్రమింపఁబడును.

దేవి యనుచున్నది :- నేను మఱల నావిర్భవింతును. నూతేండ్ల విడువకుండు వఱపుచే జగము జలశూన్యమగును. ఆనందమయ్యపరమాత్మరసము, అభావము వలనచే జీవజగత్తు

శుష్కమును ప్రాణహీనమునైన సాధనాకం కాళమును (ఎముక గూడును) బట్టుకొని సాగుచుండును. మునులను బ్రాహ్మణులును అట్టి ధర్మగ్లానిమయావస్థయందు మర్మపీడితులై నన్ను స్తుతింతురు. అపు డాకస్మికముగా "భూమౌ సంభవిష్యామి" భూమినుండియే నేను బ్రకటిత నగుదును. భూమియొక్క, అనఁగా భౌతికపదార్థముల యొక్క (వానియెడ నంటిన) జడత్వ జ్ఞానమును దిరోహితమొనర్చి, చిత్సత్తను సత్యమును బ్రతిష్ఠింతును. అపుడు నేను ముని గణములను - మననశీల సాధకులను శతనేత్రములతోఁ జూతును. అనఁగా మననశీల సాధకులు నన్ను విశ్వతశ్చక్షువునుఁగా విశవ్యాపి దృక్ (దృష్టి) శక్తిరూపనుగా దర్శింతురు. అపుడు మానుష లానందముతో నిండి, నన్ను శతాక్షీనామముతోఁ గీర్తింతురు. అపుడు వారెటు చూచిన నటే, నా దివ్యదృష్టిని స్నేహమయవిలోకమును గాంతురు. గాన శతాక్షీనామకీర్తనము జేయకుండఁజాలరు. అపుడు నేను భూమి నుండి - అనఁగా జడపదార్థములందు, విశేషించి సత్యరూపమునఁ జైతన్య రూపమునఁ బ్రకాశించి యంతటను నానత్త నుద్భాసింపఁ జేయుదును. దానిచే మనుజులు (మనసంతానము) నావిశిష్ట ప్రకాశము నెల్లెడను గాంచి మహా హర్షము నొందుదురు.

ఓం. తతో ఽహ మఖిలం లోక మాత్మ దేహ సముద్భవైః ।
భరిష్యామి సురాః శాకై రావృష్టేః ప్రాణధారకైః ।
శాకంభరీతి విఖ్యాతిం తదా యాస్యామ్యహం భువి ॥ ఓం.

44

ఓ దేవతలు ! అపుడు నా దేహమునుండి పుట్టినట్టియుఁ బ్రాణధారకములైనట్టియు శాకములచే, ననావృష్టియందు నంత

కాలము సమస్తలోకములను నేను భరింతును (ప్రతిపాదింతును). అపుడు శాకంభరి యనుపేర నేనే పరఁగుదును.

వ్యాఖ్య :- దేవి యన్నది :- వేలుపులార ! ఆ శతాక్షిని నేనే మఱల శాకంభరీ నామముతోఁ బ్రసిద్ధ నగుదును. ఏమన - అనావృష్టి వేళ, నా దేహమునుండి పుట్టి ప్రాణములను నిల్పు శాకములచే సర్వలోకములను గాపాడుదును. (నాగోజీ భట్టు శాకంభరీమూర్తి యావిర్భవించు కాలమును నల్వదవ మహాయుగ మని నిరూపించెను. అనఁగా వర్తమానయుగమును బట్టి, పదునొకండు మహాయుగములు కడచిన తర్వాత నా సమయము వచ్చును. ఇపుడు 28వది + 11 = 39 మహాయుగములు చన్నపిదప, నలువదవ మహాయుగమందిక్కాలము వచ్చుననెను.) అపుడు బహుకాలము వఱపు వ్యాపించును, గాన అన్నాభావమగును. అప్పుడు బిడ్డనెయ్యముచేఁ గలఁగిన మన యమ్మ, తన శరీరమునఁ బుట్టిన శాకములచే వఱపున్నంత కాలము జీవసంతానమును బోషించును. అట్టి దుఃఖసమయము రాకకుఁ జాల గడుపు కలదు.

ఇఁక మనము దీని యాధ్యాత్మికార్థమును దెలియఁ బ్రయత్నింతము. "ఆత్మదేహ సముద్భూత" శాకశబ్దముచే, క్షితితత్త్వముయొక్క రసము - జీవనశక్తిగాఁ దెలియునది. ఆత్మకు క్షితియే దేహము. దానినుండి పుట్టిన ప్రాణధారక శాకములే యనావృష్టివేళ జీవుని రక్షించును. తాత్పర్య మేమనఁగా - వాన కురియకుండునంతదాఁక అనఁగా, ఆనందమయ బ్రహ్మజ్ఞానధారచే సమగ్రవిశ్వము ముంచివేయఁబడ నంతదాఁక - జీవుఁ డానంద మయబ్రహ్మసత్తయందుఁ బూర్ణప్రతిష్ఠితుఁ డగు కానంతదాఁక, అమ్మ

శాకంభరీమూర్తి దేహమందుఁ బుట్టిన ప్రాణధారక శాకములచే జగత్తును బోషించును. అనఁగాఁ బ్రాణప్రతిష్ఠ చేయించి త్రితాప సంతప్త జీవుల హృదయమందు శాంతి స్రోతో మార్గముఁ దెఱచి వేయఁ బ్రయత్నించును.

సారాంశము వినుఁడు - అమ్మ యనుచున్నది. జగత్తునం దట్టి సమయ మొకటి వచ్చును. అనావృష్టిచే - బ్రహ్మరసధార లేమిచే, జీవులు కడుదుఃఖితులు సంతప్తులు నగుదురు. మఱల స్థూలజగత్తునం దాత్మరస సంధానము కానపుడు - ఆత్మను జగదతీతము, అజ్ఞేయము, అప్రాప్యమునైన వస్తువుగా నెంచి, పరిత్యజించి జీవులు కేవల బహిర్ముఖులై పోవునపుడు, నేను శాకంభరీమూర్తితో నావిర్భవింతును. ఈ విశ్వమే నా దేహమను మాట జీవులకుఁ దెలియఁజెప్పుదును. అపుడు వారే యీ నా విశ్వదేహమందుఁ బ్రాణధారక శాకసంధానము నొందుదురు (శాకములు పుట్టుటఁ గన్గొందురు.) విశ్వమందలి ప్రత్యేక పదార్థము ప్రాణమయము. చైతన్యవస్తు వొక్కటే యీ విశ్వమున కుపాదానము, అనుట జీవుల కప్పుడే యనాయాసముగాఁ దెలియఁగలదు. అపుడు వారేకడఁ జూచిన నాకడనే ప్రాణధారక శాకములు కానఁబడును. అనఁగాఁ జైతన్యసంధానము నొంది వారే పరిపుష్టులగుదురు.

ఒక్కమాటలోఁ జెప్పివేయుదము - ప్రాణహీనులై జడత్వ ముగ్ధులై సంసారసంతప్తులైన మనుష్యులకు మఱలఁ బ్రాణప్రతిష్ఠచేయుటయే, అమ్మ శాకంభరీమూర్తి కార్యము. జడపదార్థములందును జైతన్యదర్శనమే. శాకములచే జీవనము

నిల్పుకొను రహస్యము, అగుఁగాక; అమ్మ శాకంభరీమూర్తితో మనకుఁ బ్రాణప్రతిష్ఠ చేయును. ఈ శాకంభరియే మధ్యమ చరిత్రకు శక్తిగా వర్ణింపఁబడినది. శాకములచే జీవులను భరించుట - యనఁగాఁ బోషణము చేయుటచేతనే, అమ్మ యిచ్చట నీ నామముతోఁ జెప్పఁబడినది. ఈ శాకంభరీ శబ్దమునకు మఱొక యర్థము చెప్పఁగలము. కఠోపనిషత్తు - "యస్యబ్రహ్మ చ క్షత్రంచ ఉభేభవతి ఓదనమ్" ఇత్యాది మంత్రమందు జీవుల యన్నమును, మృత్యువుయొక్క యుపసేచనమును పప్పు పచ్చడి కూరలుగాను, అనఁగా శాకముగాఁ గీర్తింపఁబడినది.

ఓం. తత్రైవచ వధిష్యామి దుర్గమాఖ్యం మహాసురం ।
దుర్గాదేవీతి విఖ్యాతం తన్మేనామ భవిష్యతి ॥ ఓం. 46

అప్పుడచటనే నేను దుర్గముఁడనెడి మహాసురుని జంపుదు; నప్పటినుండియు నాకు దుర్గాదేవీనామము ప్రసిద్ధమగును.

వ్యాఖ్య :- అమ్మ యనుచున్నది. ఆ శాకంభరీమూర్తితోనే దుర్గముఁడనెడి యసురునిఁజంపి దుర్గాదేవీ నామము నొందుదును. బహుదుర్గమమైనదియు, దురూహమైన యుపలబ్ధి గలదియు, శ్రుతిచేఁ గత్తి దారుపై నడుచుటవంటిదని నిర్దేశింపఁబడినట్టియు, దుర్విజ్ఞేయమునైన యాతత్త్వమును, సులభ లభ్యముగాఁ జేసి వేయుటకే, నేను శాకంభరీశక్తిరూపమున నావిర్భవింతును. ప్రాణప్రతిష్ఠచేసి యాత్మసంధానమైనపుడు, జీవుల దుర్గము - అనఁగా జీవత్వమనెడి దురవస్థ యనాయాసముగాఁ దొలఁగిపోవును. ఇందువలన నపుడు, శాకంభరినైన నేనే దుర్గాదేవీనామముతో విఖ్యాత నగుదును. దుర్గశబ్దము పైని చెప్పిన సార్థకమైన ఆ ధాతువు

చేరుటచే దుర్గాశబ్దనిష్పత్తి యైనది. కాఁగా దుర్గతిహారిణి జనని యని యర్థము. ఈ దుర్గయే మధ్యమచరిత్రమునకు బీజము. దుర్గతి హరణమే దేవి యుద్దేశ్యము, కనుకనే మధ్యమచరిత్ర యుపోద్ఘాతము నందు శాకంభరీ శక్తి దుర్గాబీజముల విషయము వ్రాయఁబడినది.

ప్రాచీన గ్రంథములందు "దుర్గాదేవీతి విఖ్యాతం తన్మే నామ భవిష్యతి" అను నంశము లేదు. ప్రాచీన టీకాకారులు సైతము దీనిని వ్రాయలేదు. పుస్తకమందు వ్రాయఁబడకున్నను, అమ్మ దుర్గారూపముతోఁ బ్రతి జీవునందును నావిర్భవించుట కను చున్నాము. జీవుఁడు దుర్గతుఁడై దుర్గమాసురుని యత్యాచారము పీడింపఁగా, ఆత్మజ్ఞానమువైపు ముందడుగు వేయనోపనపుడే, మన యమ్మ దుర్గాదేవీరూపముతో నావిర్భవించి, దుర్గమాసురునిఁ బడఁగొట్టి తన నెయ్యపుబిడ్డల దుర్గతిని హరించును. మఱి యాత్మజ్ఞానమార్గమును జూపును. కావుననే భారతదేశమునందును, విశేషించి వంగ దేశమందు బహుపూర్వకాలమునుండియు దుర్గాపూజ విరివిగా నడుచుచున్నదని, మనకుఁ దెలియును. ఇపుడే యవిశ్వాసయుగమందు, ఈ శ్రద్ధాహీన యుగమందు సైతము, మనుజులు దుర్గాపూజ చేసి "భూతాని దుర్గా భువనాని దుర్గా స్త్రియో నరాశ్చాపి పశుశ్చ దుర్గా । యద్యద్ధిదృశ్యం ఖలుసైవ దుర్గా దుర్గాస్వరూపా దపరం నవిద్యతే ॥" యనుచు, సర్వత్ర దుర్గా స్వరూపమునే చూచుచు ధన్యులగుచున్నారు.

ఓం. పునశ్చాహం యదా భీమా రూపం కృత్వా హిమాచలే ।
రక్షాంసి క్షయయిష్యామి మునీనాం త్రాణకారణాత్ ॥ ఓం.

ఓం. తదా మాం మునయస్సర్వే స్తోష్యన్త్యా నమ్రమూర్తయః ।
భీమాదేవీతి విఖ్యాతం తన్మేనామ భవిష్యతి ॥ ఓం.48

మఱల నే నతిభయంకరమూర్తితో హిమాచలమందు అవతరించి మునులను రక్షించుటకై రాక్షసులను జంపుదును. అపుడు వినమ్రులై మునులు నన్నుఁ గీర్తింతురు. అపుడు నా పేరు భీమాదేవి యని ప్రసిద్ధమగును.

వ్యాఖ్య :- లక్ష్మీతంత్ర ప్రమాణానుసారముగా నీ భీమాదేవ్యవతారకాలము, వైవస్వతమన్వంతరమందు ఏఁబదవ మహాయుగము. ఇక్కాలమురాకకుఁ గడుం గడువున్నది. ఇపుడు సాగుచున్నది యిర్వదియెన్మిదవ మహాయుగము. ఇఁక నిరువదియునొక మహాయుగములు కడచిన తర్వాత భీమావిర్భావకాలము వచ్చును. కాని, అమ్మవారి యీ భీమామూర్తి, ఈ యుగమందే యపుడపుడు మనకు, బ్రత్యక్షమగుచున్నది. కొన్నాళ్లక్రిందటనే భూపశ్చిమభాగమందు మన యమ్మ భీమామూర్తితోఁ బుట్టి రాక్షసప్రకృతిజీవులను బహుసంఖ్యముగా వినాశమొనర్చినది. జడత్వముగ్ధులైన జీవులు, ఒకరి నోటిముద్దను మఱియొకరు లాగికొనఁబోవునపుడే, మన యమ్మ రాక్షసీప్రకృతితో నట్టివారిని దన యొడిలోనికి లాగికొనుట కనుచున్నాము. అట్టి జీవుల వినాశమునకయియే, యమ్మకు అప్పుడప్పుడు భీమామూర్తితో - భయంకరీమూర్తితో నావిర్భవించు పనిపడుచుండును.

సరే; ఆధ్యాత్మికదృష్టితోఁ జూతము. మునుల పరిత్రాణము కొఱకే యీ భీమావతారమని తెలియుచున్నది. మననశీల సాధకులు (మునిగణము) రాక్షసప్రకృతిచేఁ బీడింపఁ బడునపుడే, అమ్మ యిట్టి

భయంకరమూర్తితోఁ బుట్టును. హిమాచలమం దమ్మ యావిర్భవించును. జడత్వవిమూఢమైన జీవగణమే హిమాచల మనఁబడును. జీవులు కేవల జడత్వమందే ముగ్ధులగునపుడు - జడత్వమునందున్నతినొందు సాధనమే జీవిత ముఖ్యలక్ష్యముగా నెంచునపుడే, అమ్మ భీమామూర్తితో వెలసి, దుర్భిక్ష మహామారీ రాష్ట్రవిప్లవ జలప్లావన ప్రబల వాయు భూకంపాదిరూపమున వెలసి రాక్షసప్రకృతి జీవుల వినాశమొనర్చి, మననశీల సాధకులను రక్షించి, లోకమున మఱల సత్యధర్మప్రతిష్ఠ చేయును. ఇట్టి భీమామూర్తితో నావిర్భవించునపుడు విశ్వహితమునకై ధృతియుతమైన మునిగణము నమ్రమనూర్తులతో నమ్మను స్తుతించును. అమ్మయు వారి స్తవమునకు సంతోషించి యా భయంకరమూర్తిని విడుచును. మఱలఁ బ్రశాంతమూర్తితో నాత్మప్రకాశముచేసి, జగత్తునందలి యాశాంతిని దొలఁగించును.

ఓం. యదారుణాఖ్య స్త్రైలోక్యే మహాబాధాం కరిష్యతి ।
తదాహంభ్రామరంరూపం కృత్వాసంఖ్యేయషట్పదం ॥ ఓం. 49

ఓం. త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురం ।
భ్రామరీతి చ మాం లోకా స్తదా స్తోష్యన్తి సర్వతః ॥ ఓం. 50

అరుణుఁడను పేరి యసురుఁడు ముల్లోకముల కత్యంత పీడ గల్గించునపుడు, నేను లోకహితమునకై లెక్కలేని తుమ్మెదల గుంపుతోఁ గూడినదాననై భ్రామరీరూపమును దాల్చి యా యరుణాసురుని వధింతును. అపుడు లోకులు నన్ను భ్రామరి యని స్తుతింతురు.

వ్యాఖ్య :- లక్ష్మీతంత్ర వాక్యానుసారముగా, అమ్మ భ్రామరియై యవతరించు కాలము, వర్తమానమన్వంతరమున, అరువదవయుగము. ఈ యుగమున మఱి ముప్పదియునొక్క యుగములు గడవఁగా నక్కాలము వచ్చును. అది బహుదూర భవిష్యత్తుమాట. అక్కాలకల్పన మిపుడు చేయనులేము. ఈ మూర్తి స్వరూపము "తేజోమండల దుర్ధర్షా భ్రామరీ చిత్రకాన్తి భృత్ । చిత్రభ్రమర పాణిః సా మహామారీతి కథ్యతే" అని చెప్పఁబడినది. లెక్కలేని తుమ్మెదలచేఁ జుట్టఁబడీ విచిత్రమైన తుమ్మెదలు చేతఁగల యీ మూర్తి యరుణుఁడనెడి యసురుని జంపును.

ఇపుడు మనము దీని యాధ్యాత్మికరహస్యము నెఱుంగఁ బ్రయత్నింతము. ఆత్మజ్ఞానోదయమునకుఁ బూర్వావస్థయే యరుణుఁడనెడి యసురుఁడు. సూర్యోదయమునకు ముందుగ అరుణోదయమగునటులే జ్ఞానసూర్యుఁ డుదయించుటకు మున్నే చిదాభాసుఁడనెడి యరుణుఁడుదయించును. వానిని జూచి, యదే చరమజ్ఞానముగాఁదలంచు సాధకులు, ఈ యరుణాసురునిచేఁ బీడింపఁబడుట కన్గొందురు. ఉత్తమ చరిత్రమందు శుంభాసురుఁడనఁబడినవాని మఱియొక పేరే, అరుణాసురుఁడు. ఈ యరుణాసురుఁడు యథార్థముగానే త్రైలోక్యమునకు మహాబాధకుఁడు, ఉత్పీడకుఁడు. 'అహం' ను ఆత్మగానే ముస్తాబుచేసి అనేక కర్తృత్వభోక్తృత్వాది వ్యాపారముల కాశ్రయుఁడై యుండును, గావున మన యమ్మ భ్రామరీరూపముతో - భ్రమ వినాశినీ రూపముతో - ఆవిర్భవించి చిదాభాసుని యాత్మత్వ భ్రమమును నశింపఁజేయును. అన్నమయాది షాట్కౌశిక దేహము పేరే (ఆఱుకోశములతోఁ గూడినది) షట్పదము. ఇచటఁ

బదమనఁగా స్థానము. అనాత్మవస్తువులయం దాత్మ భ్రమ. మీ యాఋస్థానములందే తలసూపుచుండును, గానఁ జిన్మయి యమ్మ షట్పద పరివృతారూపముతో భ్రామరీనామముతోఁ బేర్కొనఁదగినది. పరమాత్మ అమ్మస్వరూపముతో వెలసి, తొలఁగింపరాని యీ భ్రమమును దొలఁగించు సాధనము చేయును. అనఁగా జ్ఞానాభాసమనెడి త్రిలోకపీడకుఁడగు నరుణాసురుని నశింపఁ జేయును. అపుడు సర్వలోకములును విశుద్ధ చైతన్యసంధానము నొంది, నిరవచ్ఛిన్నానందసత్తయందుఁ బ్రతిష్ఠితము లగును. భ్రమవినాశినియైన యమ్మను గొనియాడును. కనుకనే మంత్రమందు "భ్రామరీతి చ మాం లోకాస్తదా స్తోష్యన్తి సర్వతః" అని దేవీవాక్యము కానవచ్చును. ఋషిచ్ఛందన్సులం దీ భ్రామరీదేవియే, యుత్తమచరిత్రమునకు బీజముగాను వ్రాయఁబడినది. భీమాదేవీరూపముతో రాక్షసీ ప్రకృతిని విలయమొనర్చిన యామెయే, చిదాభాసుఁడనెడి యరుణాసురుని గూర్చి భ్రామరీనామమునఁ బరఁగినది. ఆనంద ప్రతిష్ఠయే యుత్తమ చరిత్రమందుఁ బ్రతిపాద్యవిషయము.

ఇపుడు మనము సంక్షేపముగాఁ బూర్వోక్తమంత్రముల సారమర్మము నెఱుంగఁజూతము. మొదటి నందాశక్తి, రక్తదంతికా బీజము; ఇవి మధుకైటభవధము సత్యప్రతిష్ఠా - బ్రహ్మగ్రంథిభేదము, అను దాని సూత్రము. రెండవ శాకంభరీ శక్తి, దుర్గాబీజము. ఇవి మహిషాసురవధము - ప్రాణప్రతిష్ఠా - విష్ణుగ్రంథి భేదము యొక్క సూత్రము. అటులే మూడవ భీమాశక్తి, భ్రామరీబీజము; ఇవి శుంభనిశుంభవధము - ఆనందప్రతిష్ఠ - రుద్రగ్రంథి భేదము యొక్క సూత్రము.

1. మధుకైటభవధము :- సత్యప్రతిష్ఠా - బ్రహ్మగ్రంథిభేదము. వీని సూత్రము :- నందాశక్తి - రక్తదంతికాబీజము.

2. మహిషాసురవధము :- ప్రాణప్రతిష్ఠా - విష్ణుగ్రంథిభేదము. వీని సూత్రము :- శాకంభరీశక్తి - దుర్గాబీజము.

3. శుంభనిశుంభవధము :- ఆనందప్రతిష్ఠా - రుద్రగ్రంథిభేదము. వీని సూత్రము :- భీమాశక్తి - భ్రామరీబీజము.

దేవీమాహత్మ్యమున వర్ణింపఁబడిన మూడురహస్యములకు నిమ్మూడును సంక్షేప వివరణములు.

కడచిపోయిన యుగములందే యివి (ఈ శక్తులు) తమ స్వరూపములను వెలయించిన వనుటేకాదు. వర్తమానమందును ప్రత్యేకసాధకుని హృదయమందు నిట్టులే, యిట్టి భావములతోనే, అమ్మ యావిర్భవించుచున్నది. మఱి భవిష్యత్తునందును మన యమ్మ తన నిట్టులే వెలయించుకొనును. ఇదే యమ్మ చేసిన ప్రతిశ్రుతి (వాగ్దానము).

వర్తమాన సాధనయుద్ధమందు, అమ్మ యే మూర్తులతో, నేయే యసురులఁ జంపినదో, భవిష్యత్తునందు నటులే చేయును. అప్పుడు మూర్తుల నామరూపములయందును, అసురుల నామములందును, గార్యప్రణాళియందును, భిన్నత కానఁబడును. మును జెప్పిన మంత్రములవలన నిట్టి తాత్పర్యము గుర్తింపఁబడును. బహుదూర భవిష్యత్కాలమందు సత్య సత్యముగానే జీవసమూహము, నేఁటి జీవులనుబట్టిచూడ నధిక మూఢులును బహువిభిన్న ప్రకృతిసంపన్నులు నగుదురు. అపుడాసురికవృత్తులు యథార్థముగానే వర్తమానకాలమునుబట్టి చూడ మఱింత

భీషణతరములుగా నుండును. అప్పుడజ్ఞానము జీవజగత్తును మఱింతగాఁ గప్పివేయును. ఈ విధముగా నజ్ఞానాంధకారము మిగుల దట్టమైపోవునపుడు, జ్ఞానమయి యమ్మయు నధికసులభ యగును. కనుకనే భవిష్యద్యుగమున, నన్నిటికంటె ముందు, నందామూర్తితో శుంభనిశుంభవధమును, మఱల శాకంభరీమూర్తితో స్వదేహజాతములైన శాకములచే దేశరక్షయు, దుర్గారూపముతో దుర్గమాసురవధమును జేసి, భీమామూర్తితో రాక్షసులను జంపి, మునులఁ గాచుటయు, భ్రామరీ రూపముతో నరుణాసుర వధమును, మంత్రములందుఁ గనుచున్నారము. ఇదే మనయమ్మగారి భవిష్యత్కర్మ సూచీపత్రము.

ఓం. ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి ।
తదా తదావతీర్యాహం కరిష్యా మ్యరిసంక్షయమ్ ॥ ఓం.
55

ఇతి శ్రీమార్కండేయ పురాణే
సావర్ణికమన్వంతరే దేవీమాహాత్మ్యే దేవ్యాః స్తుతిః
ఏకాదశో ఽధ్యాయః.

ఈ విధముగా దైత్యులవలని యుత్పీడన మగునపుడెల్ల నేనవతరించి శత్రుసంక్షయ మొనర్తును.

వ్యాఖ్య :- ఇదే దేవి యుపసంహారవాక్యము. దేవతా బృందము త్రైలోక్యమునకును సర్వబాధాప్రశమన మనెడి వరమును బ్రార్థించెను. అమ్మయు సర్వ మీయఁగడగి, యనిన మాటవల్ల నుదూర భవిష్యత్కాలమందు సైతము, ఎన్ని విధముల యుత్పీడనములగునో యవి యన్నియు వెల్లడించినది. తుట్టతుదను అసురపీడ కలుగునపుడెల్ల నీ విధముగానే నవతరించి యరిసంక్షయమును జేసి వేయుదునన్నది. ఆత్మజ్ఞానము నొందు

దారిని, ఎన్ని విధముల యుత్పీడనములేని వచ్చిపడనీ, మాతృచరణములం దేకా న్తశరణాగతులైన బిడ్డల కగు బాధా విఘ్నములను దొలఁగించు పనిని, అమ్మ తనపైనే పెట్టుకొన్నది. ఇదే మనయెడ ముఖ్యమైన యాశావాణి. మనకు ధీరతఁగొల్పు పూటమాట. గీతయందు భగవానుఁడు (శ్రీకృష్ణరూపిణి అమ్మ) సైత మిమ్మాటనే మాటిమాటి కనెను. ఆత్మసమర్పణము చేయు యోగి యొక్క సర్వభారములు నొక్క యమ్మ యొడియందే యుంచఁబడినవి. కనుకనే వారు నిశ్చింతులై పూర్ణానందమయులై, యమ్మ యొడియందే నగ్నశిశువులై కూరుచుందురు. వారి కెన్నివిధముల బాధలేరానీ, యమ్మ యవితానే తొలఁగించును.

వర్తమాన భవిష్యత్కాలములందును భూతకాలము నందును, దీని కన్యథా కాఁజాలదు, కాలేదు.

సాధకా ! రమ్ము, మనమును "శరణాగత దీనార్త పరి త్రాణ పరాయణే। సర్వస్యార్తిహరే దేవి నారాయణి నమో ఽస్తుతే" అనుచు మాతృచరణములకు శరణాగతుల మగుదము. అమ్మ మనకగు నత్యాచారములవలనఁ గాపాడి, మనల నానాంద మయు బ్రహ్మస్వరూపమందుఁ బ్రతిష్ఠితులను జేసివేయును. అమ్మ యిచట "అవతీర్యాహం" అనుచు, జేసిన యవతార తత్త్వాభాసము ముందటి యధ్యాయమందు "ఏవం భగవతీ" మున్నగు మంత్రముల వ్యాఖ్యయందు బాగుగా వ్యక్తపడును.

ఇతి నారాయణీస్తుతిః ఏకాదశో ఽధ్యాయః

పరదేవతార్పణమస్తు



# ఫలశ్రుతి

## ద్వాదశాధ్యాయము

ఓం. దేవ్యువాచ ఓం.

ఓం. ఏభిః స్తవైశ్చ మాం నిత్యం
స్తోష్యతే యః సమాహితః ।
తస్యాహం సకలాం బాధాం
శమయిష్యా మ్యసంశయః ॥ ఓం. 1

దేవియనెను - ఎవ్వఁడు సమాహితుఁడై యీ స్తవములతో నన్ను నిత్యమును స్తుతించునో, వాని సర్వబాధలను నేను నిస్సంశయముగా శమింపఁజేయుదును.

వ్యాఖ్య :- దేవతలు కోరిన వరము లిచ్చి, యమ్మ సాధారణముగాఁ గొన్ని యుపదేశించినది. ఆ యుపదేశములనే ఫలశ్రుతి యుందుము. అమ్మ మొదటిమాట, "ఏభిఃస్తవైః" మధుకైటభవధమందు బ్రహ్మదేవుఁడు చేసిన స్తవము "త్వం స్వాహా" ఇత్యాదికము, మహిషాసురవధమందు ఇంద్రాదులు చేసిన స్తవము, దేవీదూత సంవాదమందు "నమస్తస్యై" స్తుతి, శుంభవధాన్తమందు నారాయణీ స్తుతి; ఈ సర్వస్తవములను గుర్తించియే మంత్రమందు "ఏభిః స్తవైః" అన్నది.

"సమాహితః" చిత్తము సమాహితమైనప్పుడే తప్పక స్తవాది పాఠఫలము లభించును. ఆ యవస్థమందు జ్ఞాతృ జ్ఞేయాది

త్రిపుటీజ్ఞానము సైతము లయించును. ఇచ్చట నట్టి సమాహిత దశమాట చెప్పఁబడలేదు. ఇచటి సమాహిత పదముచే, అమ్మవైపే చిత్తము స్థిరపఱచుట యని యెఱుఁగ వలయును. అమ్మయెడ దృష్టి నిలిపి చిత్తవృత్తిని మాతృముఖిగాఁ జేసి, స్తుతివాక్యములను సరియైన యర్థబోధముతో - "అర్థానుయాయి భావముతో" రసికుఁడై యథాసాధ్యముగా మాతృమహత్వకీర్తనము చేయ గల్గినచో, సమాహితావస్థతో స్తుతిపాఠ మగును. మహత్త్వకీర్తన మన్నను, నామకీర్తన మన్నను నొక్కటే. అమ్మ మహత్త్వము కీర్తింపఁబడని పేరే లేదు. హరి, కృష్ణ, రామ, దుర్గా, శ్యామా, శివా, శంకర, మున్నగు నే నామస్మరణోచ్చారణము చేయఁబడనీ, ఆ నామముయొక్క యథార్థభావమందు అభినివేశము చేయుటచేతనే చక్కఁగాఁ బ్రత్యేకనామమును మహత్త్వమును దెలుపునదే, యని తెలిసిపోవును. బీజాక్షరములును దమలో గంపెడర్థమును, విత్తు తనలో వృక్షమును వలె, నిమిడ్చికొనియున్న నామములే. నామముతోనే సత్యార్థ జ్ఞానమనెడి సద్గురుని యావిర్భవమైనచో నిజముగా నా నామములు ప్రాణమయములును మహత్త్వమయములునై యభీష్ట దేవతను దగ్గరకుఁ దెచ్చిపెట్టును. కనుకనే సాధకులు చేయు నామకీర్తనముతోనే నామము ననునరించియుండు భావము రసమయమగును. కావున నన్నిటికంటె ముందు మంత్రచైతన్య విషయమున నభిజ్ఞత నొందియుండుట - పూర్ణమైన యర్థ జ్ఞానము నొందుట - సాధకున కింతయుం దప్పనిది. మంత్ర చైతన్యము కలుగనంతదాఁక జపస్తుతి పూజోపాసనములన్నియు ప్రాణహీనములే యనుకొమ్ము. అపు డవి

అనుష్ఠానమాత్రముతోఁ బర్యవసించును. (ఈ "సాధన సామగ్రి" తొలుమూటయందును, నా "దేవపూజారహస్య" మందును మంత్రచైతన్య వ్యాఖ్యను జదువునది.)

సమాహితచిత్తముతో స్తోత్రపాఠము చేయఁగలవారినే అమ్మ సత్యముగా స్వయముగా సర్వబాధలను దొలఁగించి కాపాడును. ఏమి చేయును ? ఎటులు చేయును ? సమాహిత చిత్తముతో, సత్యార్థజ్ఞానముతో, సరళప్రాణముతో నీ వనుచుందువే - "ధ్వాంతారిం సర్వపాపఘ్నం" అని యిట్లనుచునే చేయుచుండఁగా, అజ్ఞానాంధకారము తొలఁగుటయు, పాపక్షయ మగుటయు నీ చిత్తమందే పొడకట్టును. క్రమముగా నదే సంధారితమగును. ఏమనఁగాఁ జిత్తమందుఁ జక్కఁగా నాటుకొన్న భావము ఫలరూపమున వెలయును. చిత్త మెట్టి భావముతో ఘటితమగునో, అట్టిఫలమునే సరిగా నది తెచ్చును. ఈ విషయము యుక్తిచేఁ దెలియఁజెప్పుట కాదు. దీని ఫలము ప్రత్యక్షము. అది ప్రత్యక్షమగునప్పుడే దాని సత్యత ననుభవింపఁగలరు. ఊరక నోరితోఁ జెప్పినఁ బనికాదు. పనిచేసినచోఁ దప్పక ఫలము కలుగును.

ఓం. మధుకైటభ నాశం చ మహిషాసుర ఘాతనమ్ ।
కీర్తయిష్యన్తి యేతద్వ ద్వధం శుంభనిశుంభయోః ॥ ఓం. 2

ఓం. అష్టమ్యాం చ చతుర్దశ్యాం
నవమ్యాం చైకచేతనః ।

స్తోష్యన్తి చైవ యే భక్త్యా
మమ మాహాత్మ్య ముత్తమమ్ ॥ ఓం. 3

ఓం. న తేషాం దుష్కృతం కించి ద్దుష్కృతోత్థా న చాపదః ।
భవిష్యతి న దారిద్ర్యం న చై వేష్ట వియోజనమ్ ॥ ఓం. 4

ఏకాగ్రచిత్తముతో, అష్టమీ నవమీ చతుర్దనులందు మధుకైటభనాశమును, మహిషాసురనిధనమును, శుంభనిశుంభ వధము ననెడి నా యుత్తమమాహాత్మ్యమును గీర్తించువారికిని, భక్తియుతులై వినువారికిని నెట్టి దుష్కృత్యములుగాని, దుష్కృత ములవల్ల నగు నాపదలుగాని యుండవు. లేమి యుండదు. ఇష్టవియోగము జరుగదు.

వ్యాఖ్య :- పూర్వమంత్రమందుఁ గేవల స్తవపాఠ ఫలము తెలుపఁబడినది. ఈ మంత్రములందు సమగ్ర దేవీ మాహాత్మ్య పాఠఫలమును శ్రవణఫలమును గీర్తింపఁబడినవి. అష్టమీ చతుర్దశ్యాదుల యాధ్యాత్మికార్థము కీలకస్తోత్రమందుఁ జెప్పఁబడినవి. ఈ మంత్రములందు వ్రాయఁబడిన ఫలశ్రుతి యర్థవాదము కాదు. చెప్పినంతఫలము యథార్థముగా నబ్బును. సాధకుఁడు దేవి చెప్పిన రెండుమాటలయందు లక్ష్యముంచ వలయును.

దేవి "ఏకచేతసః, భక్త్యా" అన్నది. మొదటిది - దేని యం దెట్టిభేదములును లేవో అది "ఏకము" - ఏకవస్తువు. చిత్తమును దాని కభిముఖముగా నుంచవలయును. ఇఁక రెండవది - భక్తిపూర్వకముగా స్తోత్రపాఠమును జేయవలయును. దేవీ

వాక్యములందుఁ జెదరని విశ్వాసమును చిత్తమును దేవి కభి ముఖముగాఁ జేయుటయు, అను రెండు నున్నపుడే దేవీమాహాత్మ్య కీర్తనమువల్లను శ్రవణమువల్లను యథార్థఫలమబ్బును; దుష్కృతాదులును దొలఁగును.

విశేషమేమనఁగా - మనమింతవఱకు దేవీ చరిత్రత్రయము నేభావముతో నాలోచనము చేసితిమో, యాతత్త్వమును స్థిరపఱచి యెవ్వరేని జండీపాఠమును జేసినను వినినను, వారిలో యథార్థమాతృస్వరూప ముద్భాసించును. వారి కే దుష్కృతము లుండవు. కనుకనే వానివలని యాపదలును సంభవింపవు. ఇఁక దారిద్ర్యము మాట - అభావజ్ఞానముపేరే దారిద్ర్యము (లేదని తోఁచుటే). "పూర్ణమదః పూర్ణమిదం" సత్తయందు నిల్చినవారలకు, అభావబోధముండనే చాలదు. కనుక మంత్రమందు, 'భవిష్యతి న దారిద్ర్యం' అని చెప్పఁబడినది.

"న చైవేష్ట వియోజనమ్" ఇష్టవస్తువుతో నెడబాటు కాదు. పరమాత్మవస్తు వొక్కటే యిష్టము. దానితోడి వియోగ మేనాఁడునుం గాదు. ఇపుడొక సందేహము - పరమాత్మతతో నెన్నఁడే నెవ్వని కేని వియోగమగునా ? దేవీమాహాత్మ్య పాఠ శ్రవణఫలముగా నిట్టి యిష్టవియోగము కలుగదనుటవల్ల లాభమేమి ? యని యాశంక. సరే, దానికి బదులేమనఁగా - పరమాత్మతో నెన్నఁడు నెవ్వరికిని, ఎడబాటు కాఁజాలదను వారలే సమాహితచిత్తముతో భక్తితో దేవీమాహాత్మ్యపాఠ శ్రవణము లొకప్పుడు చేసినవారలనియుఁ జేయువారలనియుఁ దెలియఁ గల్గుదుము.

జ్ఞానికి, అజ్ఞానికి, ధార్మికునకు, అధార్మికునకు, నిష్టవస్తు వొక్కటే, అది యాత్మ. కామినీకాంచనములే తమ క్లిష్టమని తలంచువారలు సైతము, కొంచెము ధీరముగా విచారించినచో, ఆత్మకుఁ బ్రీతిని గూర్చుటకొఱకే కామినీ కాంచనములం దాసక్తుల మగుచున్నామని తెలియఁగల్గుదురు. లోకమం దెవ్వఁడును జాగతికవస్తువుకొఱకై యాత్మను గోరఁడు. ఆత్మ కొఱకే పార్థివవిషయాన్వేషణమును జేయును. కనుకనే, ఆత్మ యొక్కటే యిష్టదేవుఁడు. దానితో దేవీమాహాత్మ్య తత్త్వాధిగాములైన సాధకుల కెక్కాలమందును వియోగము కలుగలేదు. కలుగఁజాల దందురు.

మఱి సాధారణముగా - ఇష్టవియోగ మనఁగానే పార్థివములైన యేవస్తువులో, ప్రియజనమో, ఇదివఱకుండి యిపుడు లేకుండుటే యని తలంచినను, హానిలేదు. ఏమనఁగా, దేవీమాహాత్మ్యతత్త్వము నెఱిఁగిన సాధకగణము, చచ్చిన ప్రియజనమునో, నష్టమైన ప్రియవస్తువునో, ఇచ్ఛామాత్రముగానే తమ హృదయమందుఁ జూతురు. ఛాందోగ్యమునందు నిమ్మాటయే చెప్పఁబడినది. కనుకఁ గార్యముచేఁ దత్త్వదర్శులైన సాధకుల కెట్టి యవస్థయందును నిష్టవియోగము కాదు.

మఱియు, "నచైవేష్ట వియోజనమ్" అను వాక్యమున కర్థము, "ఇష్టవియోగజన్యదుఃఖము కాదు." అది చెప్పుట చమత్కారమైన యర్థము. శ్రుతియు "తరతి శోక మాత్మవిత్" ఆత్మజ్ఞ పురుషుఁడు శోకమును దాటును. అనఁగా శోకము వాని నంటదని యర్థము.

ఓం. శత్రుతో న భయం తస్య దస్యుతో వా న రాజతః ।
న శస్త్రానలతోయౌఘాత్క దాచి త్సంభవిష్యతి ॥ ఓం. 5

శత్రువులు, దస్యువులు, రాజు, శస్త్రము, అగ్ని, జల ప్రవాహము అనువానివలన, దేవీమాహాత్మ్యపాఠకులకు నే నాఁడును నెట్టి భయమును గలుగదు.

వ్యాఖ్య :- సాధారణముగా దీని జాగతికార్థ మెల్ల రెఱింగినదే. రెండవ యర్థము చూడుఁడు - దేవీమాహాత్మ్యమును భక్తితో సమాహితచిత్తముతోఁ బఠించినను విన్నను శత్రుదమన మగును; దస్యుదళన మగును; శస్త్రాగ్ని జలప్లావ నాదులైన విపత్తులు తొలఁగును. ఇఁక రెండవవైపు చూడుఁడు - పాఠకులకు ఆత్మజ్ఞానప్రాప్తియు నగును. దాని ఫలముగాఁ గామ క్రోధాది శత్రువు లెట్టి యనిష్టముఁ గలిగింపఁజాలరు. వివేక ధనమును హరించు మోహమనెడి దొంగబాధ యుండదు.

ఆత్మసాక్షాత్కావము కానంతదాఁకఁ బ్రబలప్రారబ్ధ సంస్కారవశమును సాధననుండి భ్రష్టుఁడగుననెడి శంకయుండును అనియే సాధకులనేకులు శంకింతురు. గుప్తసంస్కారము లనెడి దస్యులు దురాక్రమణముచేసి, వారి యతికఠోర సాధనాలభ్య జ్ఞానమును, జ్ఞానమును, భక్తిని, సిద్ధిని పెనఁగి లాగికొందురను నదే దస్యుభీతి. అది పరమాత్మసాక్షాత్కారపక్షమున నగుబాటు మాత్రమే. ఏమన, అమ్మ తక్క మఱెచ్చట నేమియు లేదని వారెఱుఁగుదురు కదా. సత్యదర్శిసాధకుల కింత భయమేమి ? పతన మేమి ?

ఆ వెనుక రాజభయము మాట - ఇంద్రియవర్గమునకు రాజు మనస్సు. దానివలనను భయమింతయు లేదు. ఉండదు. మనశ్చాంచల్యము, విషయాభిముఖిత్వము, ఆత్మవిత్పురుషుల యెడ నర్థహీన కార్యస్వరూపములే యైపోవును. లేదా, మనస్సు చంచలముగానే యుండనీ, స్థిరముగానే యుండనీ, ఆత్మాభిముఖియే కానీ, విషయాభిముఖియే కానీ, దానివలన ఆత్మకు వచ్చినదేమి ? 'నేను' ఆత్మ, అమ్మను. మఱి నాకు రాజభయమున (మనశ్చాంచల్యమున) నగునదేమి ? 'నన్నుఁ' దెలియలేని వారు నన్ను (నేనును) బట్టుకొనలేనివారుమాత్రమే, మనశ్చాంచల్య కారణమున సాధన భజనములు సాగకున్నవందురు. ఆ చాంచల్యముతోనే విడువక కొంతసేపు అమ్మను (ఆత్మను) జూచుచున్నచో అరగడియలోఁ జాంచల్యమడఁగి ధన్యులగుదురు.

"న శస్త్రానలతో యౌఘాత్" ఈ వాక్యము గీత (2-23) యందలి "నైనం ఛింద న్తి శస్త్రాణి నైనం దహతి పావకః। న చైనం క్లేదయం త్యాపః" మను దానితో సమానార్థము గల వాక్యమే. శస్త్రాగ్ని జలౌఘములవలన దాని కించుకంతయు బాధలేదు. గీతయందలి, యుపదేశ శిక్షాశ్రవణముల ప్రత్యక్షత, అనుభవము, ఆనందము నీ దేవీమాహాత్మ్యమందుఁగలవు.

ఓం. యస్మా న్మమైత న్మాహాత్మ్యం పఠితవ్యం సమాహితైః ।
శ్రోతవ్యంచ సదాభక్త్యాపరంస్వస్త్యయనం హితత్ ॥ ఓం. 6

సమాహిత చిత్తముతో భక్తితో నా యీ మాహాత్మ్యమును సర్వదా చదువుటయు వినుటయు సర్వమంగళజనకము నిశ్చయము.

వ్యాఖ్య :- ఐహికసుఖములను గోరువారును, పారలౌకిక స్వర్గభోగాదులను గోరువారును, ముముక్షువులు నెల్లరును భక్తిపూర్వకముగా నేకాగ్రచిత్తముతో నీ దేవీమాహాత్మ్యమును జదువుటయు, వినుటయు శ్రేయస్కరము. ఒకసారి చదివి యెత్తిపెట్టినంత మాత్రాన సాఫల్యము లేదు.

అమ్మ యేమన్నది ? "సదా పఠితవ్యం శ్రోతవ్యం చ" సర్వదా చదువవలయు, వినవలయు నన్నది. పలుసారులు చదువఁగాఁ జదువఁగా, వినఁగా వినఁగా, నీ చండీతత్త్వము నీ జీవనమందుఁ బ్రత్యేక కార్యముతోను సమన్వయించును. అవును; నీ జీవనగతి యాత్మాభిముఖియై దేవీమాహాత్మ్యమందుఁ జెప్పఁబడిన సాధనలు నీ జీవితయాత్రయందే యనుష్ఠింపఁబడుచుండుట నీవే తెలిసికొనఁగలవు. నానాఁటికి నసురులతో యుద్ధము సాగుచునే యుండును. అపుడే నీవు 'సదా' శబ్దమును బ్రయోగించి, దేవి సాధకుల నెక్కడికిఁ బొమ్మనెనో తెలిసికొందువు. అదే పరమ స్వస్త్యయనము. అనఁగా శ్రేష్ఠకల్యాణము. జాగతికములైన సర్వవిధకల్యాణములును దేవీమాహాత్మ్యపాఠ శ్రవణములవలనఁ జేకూరును. కనుకనే యమ్మ స్వస్తి లాభమున కిదొక్కటే యుపాయ మన్నది. దీనిచేఁ బాఠకులెవ్వరును, వేదవేదాంతాదులను విడిచిపెట్టి, కేవల దేవీ మాహాత్మ్యపాఠ శ్రవణములనే చేయవలయును; కాకున్న శ్రేయమబ్బదు, అనుకొనవలదు. అట్టి యర్థము లేదు. ఎవరేని యథార్థకల్యాణకారియైన శాస్త్రగ్రంథము నాశ్రయించినపుడు వేదవేదాంతమే కానిమ్ము; దర్శనపురాణాదికమే కానిమ్ము; దానివలన హాని లేదు. సర్వశాస్త్రములందును జెప్పఁబడిన దొక్కటే మాట.

ఒక శాస్త్రమునకు మఱియొక శాస్త్రముతో విరోధము లేదని తెలియఁ గల్గినపుడే, శాస్త్రపాఠము సార్థకమగును. వేదశాస్త్రములును బ్రహ్మమును భిన్నములు కావు. కనుకనే వేదమునకును బ్రహ్మమని యొకపేరు. "వేదస్తత్త్వం తపోబ్రహ్మ" (కోశము) వేదాది శాస్త్రములకును వ్యక్తిత్వమున్నది. అవి చైతన్యమయములైన జనములే. శాస్త్రరూపిణి యమ్మ కరుణించి, శ్రద్ధాళుపాఠకుని హృదయమందుఁ దాత్పర్యమును వెలయించును. అపుడే పాఠకుడు శాస్త్రరహస్యము నవధరింపఁగలఁడు. కనుకనే యా శాస్త్రముయొక్క విశిష్టకృప నొందుటకై కడుశ్రద్ధతో శాస్త్రగ్రంథమును బూజించి శాస్త్రపాఠము చేయుమని యుపదేశింతురు.

(నా వ్రాసిన "శాస్త్రసాధనము" చదువునది.)

శాస్త్ర మనఁగానే వేదోపనిషత్తులనియే తెలియవలయును. తక్కిన శాస్త్రముల తాత్పర్య మెంతగా వేదము ననురించి యుండునో యంతగా వాని గౌరవము సురక్షితమగును. శ్రుతివిరుద్ధవాక్య మెన్నడును గైకొనదగియుండదు. చూడఁగానే శ్రుతివిరుద్ధముగాఁ దోఁచు వాక్యమునకు శ్రుతి ననుసరించు నొక యర్థము చెప్పఁగలవేమో ప్రయత్నింపుము. ఆ ప్రయత్నము సఫలమగుట పేరే పరమస్వస్త్యయనము. పరమకల్యాణము. శాస్త్రవాక్యములకు ఏకార్థవాచకత హృదయంగమ మగుటచేతనే సంశయచ్ఛేదమనెడి పరమకల్యాణము ప్రాప్తించును. ఈ దేవీమాహాత్మ్యమందు, ఇట్టి సర్వశాస్త్రసమన్వయము పరివ్యక్తమగుటే గొప్పవిశేషము. కావున దీని పాఠ శ్రవణములు యథార్థముగా స్వస్త్యయనములే.

వ్యావహారిక జగత్తునందు సైతము, గురుపురోహితులు, శిష్యులైన యజమానుల శాంతి పుష్టి కార్యములకై దేవీమాహాత్మ్యపాఠ (చండీస్తోత్రపాఠ) మనెడి స్వస్త్యయనమును జేయుదురు.

ఓం. ఉపసర్గా నశేషాంస్తు మహామారీ సముద్భవాన్ ।
తథా త్రివిధముత్పాతం మాహాత్మ్యం శమయేన్మమ ॥ ఓం. 7

ఓం. యత్రై తత్పఠ్యతే సమ్య గ్నిత్యమాయతనే మమ ।
సదా న తద్విమోక్ష్యామి సాన్నిధ్యం తత్ర మే స్థితమ్ ॥ ఓం.8

నా యీ మాహాత్మ్యము మహామారీ జనితములగు సర్వోపసర్గములను, త్రివిధోత్పాతములను దొలంచును. ఏ యింట నా యీ మాహాత్మ్యము నిత్యము పఠింపఁబడునో, ఆ యింటిని నేను విడువను.

వ్యాఖ్య :- దేవీమాహాత్మ్యపాఠమువలన మహామారియు, దానిచే నగు నుపసర్గములును శమించును. మహామారీ శబ్ద సాధారణార్థము జనపదధ్వంసకవ్యాధి (ప్లేగ్). ఉత్పాతోప సర్గముల విషయము నారాయణీస్తుతియందు జెప్పఁబడినది. మొత్తపుమాట యేమనఁగా - సమాహితచిత్తముతో భక్తితో దేవీమాహాత్మ్యమును జదువుటచే మూడు విధములైన యుత్పాతములు, మూడు విధములైన యుపసర్గములు, మహామారియు నణఁగిపోవును. ఆధ్యాత్మికార్థమున మహామారీపదముచేఁ బునః పునర్మృత్యువని తెలియవలయును. జననమరణ భయముచేతనే నానావిధములైన యుపద్రవములు వచ్చును.

మఱియు మరణము గల్గుటచేతనే మఱల జన్మగ్రహణ మనెడి భౌమనరకభోగము - ఆధ్యాత్మికాది త్రివిధతాపములు తప్పకగును. దేవీమాహాత్మ్యపాఠశ్రవణములు (ఆత్మసాక్షాత్కార ముచే) ఉత్పాతోపసర్గ ప్రశమహేతుస్వరూపము లగును.

నిత్యము చండీపాఠమగునింట మన యమ్మ నిత్యసన్నిహి తయై యుండును. ఇది సాధారణార్థము. ఆధ్యాత్మికభావనుచే, ఆయతనశబ్దార్థము భోగాయతనక్షేత్రమైన దేహము. అమ్మ, భోగాయతనక్షేత్రమందు నా మాహాత్మ్యము లెస్సగాఁ బఠింపఁ బడునో, యన్నది; అనఁగా అనగా దేవీమాహాత్మ్యపాఠకుని లోను వెలిని సదా, అమ్మ వెలయునని యర్థము. గీతా రాజగుహ్య యోగమందును, సరిగా నిట్టిమాటలే చెప్పఁబడినవి. 'యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్'.

(నా "రాజవిద్యాగీత" వ్యాఖ్య చూచునది.)

అగునమ్మా ! చండీపాఠమగుచుండుచోట నీవు నిత్యము సన్నిహిత నగుదు నంటివి. మఱి, చండీపాఠము కానిచోట నీవు సన్నిహితవు కావా ? వినుము - 'నేను' అన్నది లేని యాయతన మొకటి యున్నదా ? వాస్తవముగా లేనేలేదు. గనుక, ఆయతన మేదియు నాకు అసన్నిహితము కాఁజాలదు. చెప్పెడి దేమనఁగా - నేను సదా సన్నిహితనై సర్వత్ర యుందునను మాట, భక్తితో నా భజనముచేయు - అనఁగా లెస్సగా దేవీ మాహాత్మ్య పాఠశ్రవణములను జేయువారే యెఱుంగఁగలరు. సాధకా ! నీవీ మంత్రార్థమును జక్కఁగాఁ దెలిసికొంటివా ?

ఓం. బలిప్రదానే పూజాయా మగ్నికార్యే మహోత్సవే ।
సర్వం మమైతచ్చరిత ముచ్చార్యం శ్రావ్యమేవ చ ॥ ఓం. 9

ఓం. జానతా జానతా వాపి బలిపూజాం తథా కృతాం ।
ప్రతీచ్ఛిష్యామ్యహం ప్రీత్యా వహ్నిహోమం
తథా కృతమ్ ॥ ఓం. 10

బలిపూజా యాగయజ్ఞాదులైన యగ్ని కార్యములందును, మహోత్సవములందును నా యీ సర్వచరిత్ర కథాపాఠ శ్రవణాదులను జేయువలయును. తెలిసియో తెలియకో బలిపూజా హోమాదులు చేయఁబడునపుడు నే నా సర్వకార్యములను బ్రీతితో నందుకొందును.

వ్యాఖ్య :- పూజా హోమాది విధ్యుక్తకార్యము లందును మహోత్సవాదిలౌకిక కార్యములందును, దేవీమాహాత్మ్య పాఠశ్రణములను దప్పక చేయవలయును. దానిచే వైధ లౌకిక కర్మములు నిర్విఘ్నములుగా సుసంపన్నములగును. ఇది యీ మంత్రమునకు సాధారణార్థము. నేఁటికిని భారతభూమియందు సర్వత్ర యీ వ్యవహారము సాగుచునేయున్నది.

ఆధ్యాత్మికభావముతోఁ జూతుము. బలిప్రదాన పూజా హోమాది వైధకార్యములును, మహోత్సవాది లౌకికకార్యములును, నావైపు (అమ్మవైపు - ఆత్మ వైపు) లక్ష్యముంచి చేయఁబడునే, నవి సుసంపన్నములును శుభఫలప్రదములు నగును. ఏమనఁగా "అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవచ" (గీత. 9-24) ఒక్క నేనే సర్వయజ్ఞకర్మముల భోక్తను, ప్రభువను, నా వైపే

లక్ష్యముంచి కార్యములు చేయుటచే నవి శివమయములుగానే పరిణమించును. నేనే శివుఁడను. కర్మము గాను, అనుష్ఠానముగాను, కర్తృరూపముగాను, కర్మఫల రూపముగాను నేనే నిత్యము వెలయుదుననుట స్థిరపఱుచుకొని కర్మానుష్ఠానము చేయుటచే, సర్వకార్యములవలన నా చరిత్ర కథల యనుశీలనమగును. తత్ఫలముగాఁ గర్మములు సుసంపన్నము లగును.

సర్వకర్మములవలన, నొక్క నా పూజయే యగునని తెలిసినవారే జ్ఞానులు, విధిజ్ఞులు. వారినిగుర్తించియే "జానతా" యని ప్రయోగింపఁబడినది. ఈ విషయమందొక యాత్మ సంవేదనమునుం గలదు. "యోగ ధ్యాన జపార్చాది నామసంకీర్తనాని చ । అహందేవ వియుక్తాని వితలాన్యాహ బ్రహ్మవిత్" యోగము, ధ్యానము, జపము, పూజ, నామసంకీర్తనము నను వానిలో నహందేవయుక్తుఁడు కానంతదాఁక, నవియన్నియు వికలములే. అనఁగా - అతిసామాన్య ఫలదాయకములే. మఱియు వైధ కర్మాదులను జేయునపుడు, ఇట్టి లక్ష్యముతో నెడసినవారిని· గుఱించియే 'అజానతా' యనెడి పదము ప్రయోగింపఁబడినది.

దేవి, "తెలిసినవాఁడు, తెలియనివాఁడు నను నిర్వు రధికారులు చేసిన కర్మములను నేను బ్రీతితో నందుకొందు" నన్నది. ఏమనఁగా 'నేను' గాక మఱెక్కడను నేదియునులేదు. ఆ 'నేను' నకుఁ దక్క యజ్ఞభాగముల నందుకొను నధికారము మఱెవ్వరికిని లేదు. నేను యందఱి కర్మములను బ్రీతితో నందుకొందును, గాని కొంచెము విశేషతయున్నది. జ్ఞానులైనవారే, అనఁగా నా యెడ లక్ష్య

ముంచి కర్మానుష్ఠానము చేయువారు మాత్రమే, నేను బ్రీతితో గ్రహింతునని తెలిసినవారు. ఇఁక నజ్ఞానులు, అనఁగా నా యెడ లక్ష్యముంచక కర్మములను జేయువారు, నేను బ్రీతిపూర్వకముగా యజ్ఞభాగములను గ్రహింతునని తెలిసికొనఁజాలరు. జ్ఞానులు పత్ర పుష్పఫల జలహవిరాదులు నన్నుద్దేశించి యర్పించునపుడు, ఆ యర్పణకాలమందే వానిని బ్రీతితో గ్రహించుటను బ్రత్యక్షము చేసికొనఁ గల్గుదురు. కనుకఁ గర్మానుష్ఠానకాలమందే వారికిని దృప్తియగును. ఇఁక నజ్ఞానిజనులు, ఆ సౌభాగ్యము లేకుందురు. అగుఁగాక, రెండుస్థలములందును నేను మాత్రము ప్రీతిసహిత పరిగ్రహణము చేయుటయందు సందియము రవ్వంతయు లేదు. "ప్రతీచ్ఛిష్యామ్యహం ప్రీత్యా".

బలిసంబంధమందును నొకటి రెండుమాటలు - అప్రా సంగికములు కావు. మాంసప్రియులైనవారు మేఁకలు మొ॥ బలులిత్తురు - వారిపక్షమందదే విహితము. ఉచ్ఛృంఖలముగా (కట్టుబాటులు లేక) వృథా మాంసభోజనము చేయించుటకే శాస్త్రము బలిదానములను జెప్పలేదు. రాజసికపూజయందీ బలిదానము నిషిద్ధముకాదు; గాని సాత్త్వికప్రకృతిగలవారలై, మత్స్యమాంస పరిత్యాగులై, సర్వజీవులను నొక్కప్రాణముగానే చూచువారి పక్షమున, ఛాగాది పశుబలిదానము కేవల మసం భవము. (నా "దేవపూజారహస్య" గ్రంథమున బలిదాన రహస్యమును జదువ నది.)

మఱియొకశ్రేణికిఁ జెందిన సాధకులు నిర్విచారముగాఁ బశుబలిదానము చేయుదురు. వారు తమ బిడ్డలను సైతము,

చెదరని హృదయముతో దేవి నుద్దేశించి బలిదానము చేయనోపు దురు. వారి జోలి మన కేల ? మంత్రమందు బలిశబ్దమునకుఁ బూజోపహారములని యర్థము చెప్పుటయే సర్వసమంజసము.

ఓం. శరత్కాలే మహాపూజా క్రియతే యా చ వార్షికీ ।
తస్యాం మమైత న్మాహాత్మ్యం శ్రుత్వాభక్తిసమన్వితః ॥ ఓం. 11

ఓం. సర్వబాధా వినిర్ముక్తో ధనధాన్య సుతాన్వితః ।
మనుష్యో మత్ప్రసాదేన భవిష్యతి న సంశయః ॥ ఓం. 12

శరత్కాలమునఁ జేయఁబడు నా మహాపూజయందు భక్తితో నీ నా మాహాత్మ్యపాఠ శ్రవణములను జేయు మనుజుఁడు నా ప్రసాదముచే సర్వబాధలు తొలఁగి ధనధాన్య సంతానవంతుఁ డగును.

వ్యాఖ్య :- ఈ దినములందును భారతదేశమునం దనేక స్థలముల శరత్కాలీనమహాపూజ జరుగుచున్నది. గాని, మంత్ర మందుఁ జెప్పఁబడిన ఫలము నొందువారు కడుం గొలఁది మందియే. దీని కొక్కటే కారణము - వారు సమాహితచిత్తముతో భక్తితో యథావిధిగా మహాపూజ చేయకుండుటయే. ముఖ్యమైనమాట - మనుష్యులు ధనధాన్యయుక్తులగుదురనెడి దేవీవాక్యమందు విశ్వాసము నిల్పలేదు. సంశయము నవిశ్వాసము నుండుటచేతనే, యీ యుగమందు వైధకర్మము లేవియు నాశానురూపఫలముల నీయకున్నవి.

శరత్కాలము :- ఇది క్షితితత్త్వమును ప్రకటించు ఋతువు. ఈ దేశమున ఋతువులు సైతము తత్త్వవిశేషములను

సూచించును. ప్రసంగవశమున నిది వినుఁడు. శరదృతువు క్షితితత్త్వము. వర్షర్తువు (అప్తత్త్వము). గ్రీష్మర్తువు తేజస్తత్త్వము. వసంతర్తువు వాయుతత్త్వము, హేమంతర్తువు వ్యోమతత్త్వము. కార్తికమాసము, శరదృతువునందలి ఆగ్రహాయణ (మార్గశిర) మాసము, శరదృతువునం దంతర్గతము. (ఇది సౌరమానమునుబట్టి వ్రాసినది.) ఎప్పుడేతత్త్వముయొక్క విశేషమభివ్యక్తమగునో, అప్పుడీ విశ్వప్రకృతియందలి ఆ తత్త్వ క్రియ విశేషించి వెలయును. సరే. ఇపుడు మనము శరత్కాల కథను గైకొందము. ఈ శరత్తున క్షితితత్త్వముయొక్క - ఘనీభూత జడత్వముయొక్క విశేషాభివ్యక్తి యగును. ఈ శరత్కాలీయ పూజను జేయువారు, అనఁగా జడత్వాధిపత్యముగల యిక్కాలమందుఁ జైతన్యమయియైన, యమ్మయొక్క విశేష ప్రతిష్ఠను జేయువారు, అనుష్ఠాన ప్రయత్నములను జేయువారు - పూజయందు - పఠన శ్రవణ బలిదాన హోమములనెడి నాలుగంగములను నడుపువారు మాత్రమే మహాపూజానుష్ఠాతలు. మహాపూజాంగములుగా దేవీమాహాత్మ్య పాఠశ్రవణములు చేయుదురు. వారు సర్వబాధలవలన - ఆసురికవృత్తులవలని యుత్పీడనమువలన విముక్తులగుదురు. ధనధాన్య సుతాన్వితులగుదురు. ప్రేమ (భక్తి) యనెడి ధనము, విశ్వాసమనెడి ధాన్యము, నిర్మలజ్ఞానమనెడి పుత్త్రులను బడసి సుఖింతురు. అమ్మను బూజించి సమాహితులై చండీపాఠ శ్రవణములను జేయువారికిఁ బ్రేమ ధన (భక్తి) దారిద్ర్య ముండదు. విశ్వాసమనెడి ధాన్యముతో (ఖాద్యసంభారముతో) వారి హృదయాంగణ మెల్లపుడును నిండియుండును. మఱియు,

జ్ఞానమయ పుత్త్రజన్మ సౌభాగ్యము నొంది పునః పునర్జనన మృత్యువు లనెడి నరకమునుండి తొలఁగుదురు.

ఓం. శ్రుత్వా మమైత న్మాహాత్మ్యం తథా చోత్పత్తయః శుభాః ।
పరాక్రమం చ యుద్ధేషు జాయతే నిర్భయః పుమాన్ ॥ ఓం. 13

ఓం. రిపవః సంక్షయం యాన్తి కల్యాణః చోపద్యతే ।
నందతేచకులంపుంసాంమాహాత్మ్యంమమశ్రుణ్వతామ్ ॥ ఓం. 14

దేవీ మాహాత్మ్యమందు దేవియొక్క వివిధములైన శుభోత్పత్తుల - అనఁగా మంగళకరములైన యావిర్భావముల వర్ణనము చేయఁబడినది. మహారాజు సురథుఁడు "కథముత్పన్నా" యని తొల్తఁ బ్రశ్నించినదానికిఁ బదులీయఁబడుచున్నది.

వ్యాఖ్య :- మహర్షి మేధసుఁడు పలువిధములైన దేవి యావిర్భావములను వర్ణించెను. ఈ దేవి యుత్పత్తివివరణమును సమాహితచిత్తముతోఁ జదువుటచేతను, వినుటచేతను, యుద్ధ పరాక్రమము లభించును. అనఁగా, అనురీవృత్తులను మట్టుపెట్టఁగల సామర్థ్యము గలుగును. నిర్భయత్వమనెడి లాభమొకటి కల్గును. ఆత్మ యొక్కటే యభయము. శ్రతియు మాటిమాటికి నభయస్వరూపమైన యా యాత్మలాభమునే యుపదేశించినది. "అభయం వై ప్రతిపద్యస్వ" "వత్స ! నీవు అభయమును, అమృతస్వరూపము నైన యాత్మ నొందుము" అని యుపనిషత్తులందుఁ జెప్పఁబడిన యభయవాణియే, దేవీ మాహాత్మ్యమందును, బలుతావులఁ గనఁబడును; వినఁబడును. అది తెలియఁజూపుటకే, యింత యుద్ధవర్ణనము.

సరే; మంత్రమందు దేవీమాహాత్మ్యశ్రవణము చేయువారికి రిపుక్షయమగునని యున్నది. రిపుక్షయమనఁగా - కామక్రోధాది శత్రుదమనమని యెఱుంగునది. పక్షాంతరమున - ఆ శత్రువులయెడ సాధకులకుఁగల విద్వేషము తొలఁగి సర్వత్రాత్మ దర్శన ఫలముగా రాగద్వేష విముక్తులై విషయములను, నిర్వికారముగా భోగించు సామర్థ్యము గలుగును. "కల్యాణం చోపపద్యతే" - మంగళము నొందుదురు. ఆత్మజ్ఞానమే యథార్థమైన కల్యాణము. ఆత్మజ్ఞానము కలుగుటచే జనన మరణరూపమైన యమంగళము పూర్తిగాఁ దొలఁగిపోవును. "నందతే చ కులం" కుల మానందించును. ఆత్మజ్ఞపురుషుఁడు (వంశమందు) కులమందుఁబుట్టినచో, ఆ కులమందలి యూర్ధ్వతన పురుషులు, ఆనందముతో నృత్యము చేయుదురు. ఏమన, వారి ముక్తిమార్గము సుగమమగును. మఱియు, ఆ కులమందలి యధస్తనపురుషులు ఆత్మజ్ఞపురుషుల కృపచే శుభాశీర్వాదముచేఁ బరమకల్యాణము నొందుదురు. సాధారణుల పక్షమున - కేవల దుర్లభములైనవి వారి కులమందు, అప్రయత్నలభ్యము లగును. కావున నాత్మజ్ఞాని యొకవంశమందు వెలసినచో నందలి యూర్ధ్వతనులు, నధస్తనులు నైనవార లానందితు లగుదురు. "కులం పవిత్రం జననీ కృతార్థా వసుంధరా పుణ్యవతీ చ యేన."

ఓం. శాంతికర్మణి సర్వత్ర తథా దుఃస్వప్నదర్శనే ।
గ్రహపీడాసు చోగ్రాసు మాహాత్మ్యం శ్రుణుయాన్మమ ॥
ఓం. 15

ఓం. ఉపసర్గాః శమం యాన్తి గ్రహపీడాశ్చ దారుణాః ।
దుఃస్వప్నంచ నృభిర్దృష్టం సుస్వప్న ముపజాయతే ॥
ఓం. 16

శాంతికార్యములందును దుఃస్వపదర్శనమందును ఉగ్రగ్రహ పీడలయందును, నాయీమాహాత్మ్యమును వినవల యును. దానిచే నుపర్గములెల్ల నుపశమించును. దారుణ గ్రహపీడలు తొలఁగును. నా మాహాత్మ్యము వినువారు కాంచిన దుఃస్వప్నములు సుస్వప్నములుగాఁ బర్యవసించును. (ఇచట నొక గ్రహ శబ్దమునకు సూర్యాదిగ్రహములని గ్రహింపవలయును.)

వ్యాఖ్య :- దేవీమాహాత్మ్యశ్రవణమున నివియే ఫలములు. ఇంతకు ముందటి రెండు మంత్రములందును 'శ్రుత్వా - శ్రుణ్వాతాం' శబ్దములచేఁ గేవల శ్రవణకథయే చెప్పఁబడినది. సాధకా ! శ్రవణమే మొట్టమొదటి ప్రధానసాధనము. ఎవని శ్రవణ మెంత విశుద్ధమును సత్యావగాహియు నగునో, వానికా ఫలమంతగా శీఘ్రలభ్యమును సునిశ్చితము నగును. శ్రవణమే మనన నిదిధ్యాసములకు శ్రేష్ఠసాధనమని శ్రుతియే చెప్పినది. శ్రవణము విశుద్ధము కాక, మననము విశుద్ధము కాఁజాలదు. మననము సరిగాఁ గాకున్నచో నిదిధ్యాసనఫలము వ్యర్థమగును; గనుక నెవని శ్రవణ మెంతెంత విశుద్ధముగానుండునో, వాని కా ఫలమును నంత సునిశ్చితముగా నుండును. ఈ శ్రవణము సరిగా, నే యుపాయముచే నగును ? - అన్నింటికిని ముందుగా శ్రోత (వినువాఁడు) వినయవంతుఁడును, శ్రద్ధావంతుఁడును దప్పక కావలయును. తరువాత వక్త (చెప్పెడివాఁడు) ఆత్మతత్త్వము నుపదేశించువాఁడు, భ్రమ ప్రమాదములు లేనివాఁడును, సంశయచ్ఛేదిపాండిత్యము కలవాఁడునై యుండవలయును. సౌభాగ్యవశమున, ననేకజన్మ పుణ్యఫలముగా నట్టి వక్తయు, శ్రోతయుఁ గూడినపుడచ్చట నిస్సంశయము ఫలావాప్తి సిద్ధముగా నుండును. ఈ

యిరువురియందును బైని జెప్పిన యోగ్యతలు లేనియెడల శ్రవణసాధనము ఫలింపదు. చెప్పెడివాఁడు మూఁగవాఁడు, వినెడివాఁడు చెవిటివాఁడు నైనచో నెంత యందమో, యంతే యందము. ఉభయులును గ్లేశితులే యగుదురు.

సరే; మంత్రమందు వ్రాయఁబడినది - శాన్తికర్మమందు, దుఃస్వప్నదర్శనమందు, ఉగ్రగ్రహపీడలయందు, నీ దేవీ మాహాత్మ్య శ్రవణము చేయుదురు. సాధకా ! చూడుము; నీ కెప్పుడును శాన్తి లేమియే, ప్రతినియతదుఃస్వప్నమును గాంచుచున్నావు విషయములనెడి గ్రహములు నిన్ను రేవగళ్ల పీడించుచున్నవి. యథార్థశాన్తిని గోరుదువేని, దుఃస్వప్నపీడ తొలఁగఁ గోరుదువేని, దారుణగ్రహపీడ కాకుండఁగోరుదువేని నా మాహాత్మ్యమును వినుము. వినుటచేతనే మనన నిదిధ్యాసములగును. అపుడు నీ కాత్మజ్ఞానముగల్గి ధన్యుఁడవగుదువు. నీకపు డెడ తెగని శాన్తి గలుగును. ఇంద్రియోత్పీడనమును, సంసార దుఃస్వప్నమును దొలఁగిపోవును. నా మాహాత్మ్య శ్రవణఫల మిదే.

ఓం. బాలగ్రహాభిభూతానాం బాలానాం శాన్తికారకం ।
సంఘాతభేదే చ నృణాం మైత్రీకారకముత్తమమ్ ॥ ఓం. 17

ఓం. దుర్వృత్తానా మశేషాణాం బలహానికరం పరం ।
రక్షోభూత పిశాచానం పఠనాదేవ నాశనమ్ ॥ ఓం. 18

ఓం. సర్వం మమైత న్మాహాత్మ్యం మమ సన్నిధికారకమ్ ॥ ఓం. 19

నా యీ సమస్త మహాత్మ్యపాఠము నా సాన్నిధ్యమును సంపాదింపునది. కావుననిది బాలకుల బాలగ్రహపీడను శాన్తింపఁ

జేయును. మనుజులయందగు నన్యోన్య వివాదములను దొలఁచి మైత్రిని గలిగించును. దుర్వృత్తుల బలము నణంచును. రాక్షస భూతపిశాచముల నశింపఁజేయును.

వ్యాఖ్య :- ఇమ్మూఁడు మంత్రములందును మూడవది హేతువుగాఁ జెప్పఁబడినది. దాని కారణము ముందుగా నెఱుంగవలయును. నామాహాత్మ్యము నా సాన్నిధ్యమును గల్గించునని చెప్పఁబడినది. దేవీమాహాత్మ్యపాఠ మగుచోట, నమ్మ సన్నిహితయగునని - అమ్మ సాన్నిధ్యము గల్గుటచే, అనఁగా విశుద్ధచైతన్యాత్మ ప్రకాశించుటచేతనే సర్వవిపత్తులును, విఘ్నము లును దొలఁగును. బాల శబ్దార్థము శిశువు - అనఁగా నజ్ఞానము. వానిపై నగు గ్రహాక్రమణము. అనఁగా, అజ్ఞానమువల్ల నగు దుఃఖాదులన్నియుఁ దొలఁగును.

"సంఘాతభేదే చ నృణాం మైత్రీకారక ముత్తమమ్" జీవుల పరస్పర భేదజ్ఞానములు తొలఁగును. మైత్రి కలుగును. అమ్మ (ఆత్మ) యొక్క తెయే సర్వమందును సమభావముతో వెలయునని, మనుష్యుఁ డపు డెఱుంగును. ఆత్మయే మనుష్య మాత్రునకుఁ బ్రియతమము. అది సర్వత్ర విరాజిల్లును; గనుక భేదజ్ఞాన ముండఁజాలదు. పరస్పర మైత్రీభావము తనంతనే పుట్టును.

"దుర్వృత్తానాం బలహానికరం" - అనచ్చారిత్రులు బలహీనులగుదురు; అనఁగా, అసద్భావము నొందిన జీవుల ప్రకృతి బలహీనమైపోవును ఒక్కసారిగా నశింపదు. దేహముండునంతదాఁక జీవప్రకృతి యుండనే యుండును, గాని బలహీనమైపోవును. రాక్షస పైశాచికవృత్తులడఁగును. భూత ప్రకృతి అనఁగా భూతముల

యందైన యాసక్తి. అనఁగా భూత భౌతిక పదార్థములయందైన నిత్యత్వబోధము కూడ లయించును. "రక్షోభూత పిశాచానాం నాశనం" అనఁగా నిదే తాత్పర్యము. గ్రహగణవిషయము - సూర్యుఁడు ఆత్మరూపమునఁ, జంద్రుఁడు మనోరూపమున, కుజుఁడు (మంగళుఁడు) బలశక్తి క్రోధరూపమున, బుధుడు వాక్కు స్మృతిరూపమున, బృహస్పతి విద్యాబుద్ధి జ్ఞాన ధర్మ సుఖరూపమున, శుక్రుడు కామ కామనారూపమున, శని మందగతిరూపమున, రాహువు అతృప్తభోగహరణరూపమున, కేతువు అనుభూతిహీన గగన కుసుమములఁబోలు ననంతకల్పనలరూపమున నభివ్యక్తులగు చుందురు. విశేషయోగాయోగము లగునపుడు, జైమిని మతముచేఁ గేతువు కైవల్యకారకుఁడే, కాని పూర్ణముక్తినిచ్చువాఁడు బృహస్పతియే.

ఓం. పశు పుష్పౌఘ ధూపైశ్చ గంధదీపై స్తథోత్తమైః ।
విప్రాణాం భోజనైర్హోమైః ప్రోక్షణీయై రహర్నిశమ్ ॥ ఓం.20

ఓం. అన్యైశ్చ వివిధై ర్భోగైః ప్రదానై ర్వత్సరేణ యా ।
ప్రీతిర్మే క్రియతే సాస్మిన్ సకృత్సు చరితే శ్రుతే ॥ ఓం.21

పశు పుష్ప ధూప గంధ ద్రవ్య దీపాదులతోఁ బూజయు, బ్రాహ్మణభోజన హోమాభిషేకాదులును, నానావిధ భోగ్య వస్తుప్రదానములు అను వీనితో నొక సంవత్సరకాలము ప్రతిదినము నన్ను సేవించినచో నేనెంతగాఁ బ్రసన్న నగుదునో, యంతగా నా చరిత్రనొక్కసారి నమ్మిగా వినుటచేతనే ప్రసన్నుఁడగుదును.

వ్యాఖ్య :- అమ్మ యనుచున్నది - బాహ్యకర్మానుష్ఠానమును బట్టి చూడఁగా శ్రవణమున నగు ఫలమే యధికమని, యనేక విధముల యుత్కృష్టోపచారములతోడి పూజయు బ్రాహ్మణ భోజనాభిషేక భూరిదానాదులగు వైధకర్మ నియమములతో దీర్ఘకాలము చేయు ఫలముగా మనుష్యుఁడు చిత్తశుద్ధిని స్వస్వరూప జ్ఞానమును, నా సమీపస్థితియు నెంతగాఁ బొందగల్గునో, యంత చిత్తశుద్ధిని, అంత జ్ఞానమును, అంత సమీపస్థితిని - సమాహితుఁడై శ్రద్ధాళుఁడై నా చరిత్ర మాహాత్మ్యముల నొక్కసారి వినినంతనే పొందఁగల్గును. సద్గురు ముఖమున నద్వైతజ్ఞానరహస్యముల వినుటచే, నజ్ఞానాంధ జీవునకును క్షణకాలము కొంత ప్రబుద్ధభావము వచ్చును - "నేనెవరు ? జగత్తనఁగా నేమి ? ఈశ్వరుఁడనఁబడువాఁ డెవ్వడు ? అతనితో నాకెట్టి సంబంధ మున్నది ? అతని నెఱుంగుటచే నా కేమి లాభము ?" ఈ మున్నగుతత్త్వవిషయకపరీక్షాజ్ఞానము కేవల శ్రవణఫలముగానే లభించును. ఈ తత్త్వవిషయక పరీక్షాజ్ఞానమే మాతృప్రీతితోఁ బరిచయము గలిగించును. ఆత్మ, తాను బ్రకాశించుచోట నిట్టిభావముతోనే, తన ప్రీతిని వెలయించును.

పూజాహోమాదులు, భూరిదానాదులు, దీర్ఘకాలము చేయు ఫలముగా నగు చిత్తశుద్ధి, దీని నెఱుంగఁజాలినంతనే కలుగును. శ్రీశంకరాచార్యులు కర్మకాండమును బట్టి చూడఁగా, శ్రవణ మననాదులకే యధిక ప్రాముఖ్యమును బలమును సూచించిరి. అగును. తత్త్వజ్ఞానశూన్యమై ప్రాణహీనమైన కర్మకాండ దీర్ఘ కాలానుష్ఠానమునుబట్టి చూడ, నొక్కసారి తత్త్వజ్ఞానోపదేశ శ్రవణము చేయుటచేత ఫల మధికమే. ఇందు సందియము లేదు. మఱియు

నీ కర్మకాండానుష్ఠానమును బట్టి చూడఁగా, శ్రద్ధా భక్తి తత్త్వజ్ఞాన ధారణవముల కుపయోగించు ధీవికాశ మగుననుటయుఁ గడునత్యము. సరే, కర్మకాండమును విడిచి కేవల శ్రవణ మననములే చేసినచో నదికాదా ? యనెడి జిజ్ఞాస కలుగవచ్చును - కాదు; కర్మకాండమే శ్రవణ మనన సామర్థ్యమును బుట్టించునది. ఎవ్వనికైనను గర్మకాండమును విడుచు యథాయోగ్యత వచ్చినపుడైనను, లోకశిక్షణమునకై వానికి విధివిహితమైన కర్మముల సమిష్ఠించుట నింధనీయము కాదు. సరిగదా, మిగులఁ బ్రయోజన కారియే. ఏమనఁ గర్మకాండమే, ఈ హిందుజాతియొక్క ముఖ్యవిశిష్టత. అది లోపించినను, అది నిష్ప్రయోజనమని విడిచినను, ఆ ఫలము జననవూజమందు వ్యాపించి, కొలఁదిదినములలోనే యీ దేశముకూడ మ్లేచ్ఛదేశముగాఁ బరిణమింపఁగలదు. కావున నట్టి యాశంకలు చేయుట యన్యాయము. సాధకా ! నీవు యథార్థముగాఁ గర్మకాండముతోఁ బైకెక్కుటయినను, ఆ తత్త్వజ్ఞానమనెడి గోడపై నిల్చియుండి ప్రాణమయ కర్మానుష్ఠానమును జేయుము. గీతయందు శ్రీగురుఁ డన్నాఁడు : "కర్తవ్యమనుచు నేమియు లేకున్నను, గేవల లోకస్థితిరక్షకై శాస్త్రవిహిత కర్మానుష్ఠానము చేయుటే యుచితము' ' అని.

"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తుమర్హ సి ॥"

జనకాది కర్మిజనులు కర్మముచేతనే పూర్ణసిద్ధి నొందిరి. ముఖ్యముగా లోకసంగ్రహమునెడ, నిగా యుంచి, నీకుఁ గర్మ మాచరించుటే యుచితము. జన్మము నిచ్చువాఁడు జనకుఁడు.

ప్రాణాయామాదికమనెడి నాఁగేటిని సాగించి కర్మక్షేత్ర (శరీర) మనెడి పొలమును దున్ని, సీతయనెడి శుద్ధబుద్ధి నొందినవాఁడే జనకుఁడు. అతఁడే యుంజానయోగి - అనఁగాఁ బరమాత్మతో నైక్యమొందుటకై యోగాభ్యాసము చేయువాఁడు. "జనకా దయః" అనుటచే శుద్ధబుద్ధి లభించిన పూర్వసాధకు లెల్లరును గర్మముచేతనే సంసిద్ధిని, అనఁగా బ్రాహ్మీస్థితి నొందిరి." అని యర్థము చేసికొనునది, యని శ్రీగురుఁడనెను.

లోకసంగ్రహము - అనఁగా భూలోకము మొదలు సత్యలోక పర్యంతమైన లోకము లేఁడును దేనియందు సంగ్రహింపఁబడునో - అనఁగా దేనియందు, మూలాధారమందలి భూలోకములయమై స్వాధిష్ఠానమందు భువర్లోకముతోఁ జేరి, తర్వాత భువర్లోకమును జేర్చికొని మణిపురచక్రమున స్వర్లోకమందును, స్వర్లోకము అనాహత మహర్లోకమందును, మహర్లోకము విశుద్ధ జనోలోకమందును, జనోలోకము ఆజ్ఞయందలి తపోలోకమందును, తపోలోకము సహస్రార సత్యలోకమందును, నీ విధముగా లయయోగము చేసి, చేరఁగాఁ జేరఁగా, నొక్కటే యైన సత్యబ్రహ్మమందు శేషించిపోవును. దానియందు దృష్టి యుంచి యతిసావధానయై కర్మములు చేయవలయును.

గమనింపు - ప్రాణాయామముచేత మాత్రమే యా లోకసంగ్రహము చేయఁగల దృష్టి స్థిరపడును. (ముందు 25వ శ్లోకము చూచునది.) ఏ విధముగా దృష్టి నిల్పి క్రియచేయుటో యనుదాని ప్రథమప్రకరణము శ్రీగురుదేవునిఁ జేరి నిర్ణయించు కొనవలయును. తరువాత, క్రియాయోగమునందు నిజబోధముచేఁ గ్రమముగా నన్నియుం దెలియును.

"సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥"
(గీత. 3.25)

ఓయి ! భారతా ! "భాయాం రతః భారతః" (ఆత్మ ప్రకాశమందాసక్తికలవాఁడు భారతుఁడు.) అవిద్వాంసులు కర్మమునం దాసక్తి గలవారలై చేయునటులే, విద్వాంసులును లోకసంగ్రహమును జేయఁగోరి అనాసక్తులై కర్మము (యోగము) చేయవలయును.

బుద్ధిచేఁ జలింపజేయఁబడినవారై, జీవులు తమ యింద్రియసుఖములనే వెదకుచుందురుగాని, విచారబుద్ధి నాశ్రయింపకుండుటచే, ఆ సుఖస్వరూపము నెఱుఁగఁజాలరు. వారే యవిద్వాంసులు. ఇఁక విచారబుద్ధినవలంబించి, వైరాగ్యముతో విషయానందమును విడిచి పరమానందమునొందఁ బ్రయత్నించువారే విద్వాంసులు. అవిద్వాంసులు "ధనందేహి యశోదేహి పుత్రాన్దేహి రిపూన్జహి" మున్నగు వాసనలయం దాసక్తులై, కఠోరమైన యుద్యమముతోఁ గర్మమాచరించునట్లే విద్వాంసులును సరిగా, నట్టి యుద్యమముతోనే తగులము (ఆసక్తి) పూర్తిగా విడిచి కర్మములు చేయునపుడు, లోకసంగ్రహము చేయఁగలరు. అనఁగా మూలాధారాది స్థానములనుండి వృత్తుల నాకర్షించుకొని లయయోగముచే సత్యబ్రహ్మమందు నిల్వఁగలరు.

గమనింపు - విచారబుద్ధి లేకుంటచే సుఖస్వరూపము తెలియఁబడనందున, అవిద్వాంసు లాసక్తితోఁ జేయు కఁ విధానమందు, వారు విషయములనే యీశ్వరునిపేర నారాధింతురు.

అట్టివారు కర్మఫలముగా భోగదేవి చేతనే యాకర్షింపఁబడి భోగమందే యాసక్తులై, యట్లే యుండి, యథార్థసుఖచ్ఛాయయు ననుభవింపఁజాలరు.

దేశపక్షమున వారే యథార్థ మంగళజనకులు. ఉన్న దేదో యది పాడుచేయకు. రక్షించుటకుఁ బ్రయత్నింపుము. మృతకర్మములను బ్రాణమయములుగాఁ జేయుము. అవశ్యము కల్యాణప్రాప్తి యగును.

ఈ మంత్రమందుఁ గావవచ్చునది - అమ్మ యనుచున్నది. "ప్రీతి ర్మే క్రియతే" నాకుఁ బ్రీతిగల్గించుట యగును. అమ్మ కింతయు నప్రీతి లేదు. ఆమె నిత్యప్రీత; నిత్యతృప్త; అపుడామెకుఁ బ్రీతి గల్గించుట ననేమి ? వాస్తవముగా నామె కప్రీతి యింతయు లేదనుట సత్యమేయైనను, ఆమె ప్రీతియగు తత్త్వమును శ్రద్ధాభక్తులతో దేవీమాహాత్మ్యమును జదువువారు, వినువారు, మాత్రమే హృదయంగమ మొనర్చుకొందురు.

ఓం. శ్రుతం హరతి పాపాని తథారోగ్యం ప్రయచ్ఛతి ।
రక్షాం కరోతి భూతేభ్యో జన్మనాం కీర్తనం మమ ॥ ఓం.22

ఓం. యుద్ధేషు చరితం యన్మే దుష్టదైత్య నిబర్హణం ।
తస్మిన్ శ్రుతే వైరికృతం భయంపుంసాం నజాయతే ॥ ఓం 23

ఓం. యుష్మాభిః స్తుతయో యాశ్చ యాశ్చ బ్రహ్మర్షిభిః కృతాః ।
బ్రహ్మణాచ కృతాస్తాస్తు ప్రయచ్ఛన్తిశుభాంమతిమ్ ॥ ఓం. 24

నా యావిర్భావ వివరణములను వినుటచేతను, గీర్తించుట చేతను మనుజుల పాపములు తొలఁగును. ఆరోగ్యము గలుగును.

భూతరక్ష యగును. యుద్ధములయందు దుష్టదైత్యులను గూర్చిన నా చరిత్రములను మహత్త్వమును వినుటచే మనుజులకు శత్రుభయ ముండదు. దేవతలారా ! మీరు నన్ను స్తుతించిరి. బ్రహ్మర్షులు స్తుతించిరి. బ్రహ్మయు స్తుతించెను. ఆ స్తవములను బఠించినవారికి శుభమతి లభించును.

వ్యాఖ్య :- ఫలశ్రుతి వాక్యములందు ఒక విధమైన కథయే పలుసారులు వ్రాయఁబడినది. ఈ పునరుక్తినిఁ గన్న యల్పబుద్ధులు తప్పక సంశయింతురు. మన మిప్పుడు మంత్రమందలి కొన్ని మాటల యర్థమును జూతము.

"పాపాని హరతి" పాపములను హరించును. అనాత్మ బోధముపేరే పాపము. ఆత్మకంటె నతిరిక్తముగా నెన్నఁడేని దేనియేని ప్రతీతియున్నంతవఱకుఁ బాపమే. ఈ మాతృమహాత్త్వ మాతృస్వరూప శ్రవణ మననములను బలుసారులు చేయుటచే "ఆత్మైవేదం సర్వమ్" అనెడి జ్ఞానము గల్గును గాన, వారి సర్వపాపములును దొలఁగిపోవును.

"ఆరోగ్యం ప్రయచ్ఛతి" పునః పునర్భవవ్యాధి తొలఁగి యారోగ్యము గలుగును. "భయం న జాయతే" అభయా మృత స్వరూపాత్మజ్ఞాన ప్రాప్తి కాఁగా మృత్యుభయము పూర్తిగా నెడసి పోవును. "రక్షాం కరోతి భూతేభ్యః", దీని తాత్పర్యము మున్నే చెప్పఁబడినది. ఇదిగాక, అమ్మ మఱొక్కటి యన్నది. ఎవ్వఁడేని సమగ్ర దేవీమాహాత్మ్యపాఠశ్రవణములం దసమర్థుఁడయ్యెనేని, వాఁడు కేవల స్తోత్రపాఠశ్రవణములను జేసినచో, వానికి శుభమతి అనఁగా, ఆత్మజ్ఞానధారణోపయోగియైన బుద్ధి యబ్బును. (ధీ = ప్రజ్ఞ; "జ్ఞానస్య తిస్రో భార్యాశ్చ బుద్ధిర్మేధాస్మృతి స్తథా" సర్వవ్యవహార

 

హేతువు జ్ఞానము. బుద్ధి రెండు విధములు - అనుభూతి, స్మృతి. అనుభూతి నాలుగువిధములు - ప్రత్యక్షాదులు. మేధా ధారణావతీ బుద్ధి. అతీతానుస్మృతి మేధ. తత్కాలగ్రాహిణి మతి.)

ఓం. అరణ్యే ప్రాన్తరేవాపి దావాగ్ని పరివారితః ।
దస్యుభిర్వా వృతః శూన్యే గృహీతోవాపి శత్రుతః ॥ ఓం.25

ఓం. సింహవ్యాఘ్రానుయాతో వా వనే వా వనహస్తిభిః ।
రాజ్ఞా కృద్ధేన చాజ్ఞప్తో వధ్యో బంధనతో ఒపి వా ॥ ఓం. 26

ఓం. అఘూర్ణితో వా వాతేనస్థితః పోతే మహార్ణవే ।
పతత్సు వాపి శస్త్రేషు సంగ్రామే భృశదారుణే ॥ ఓం. 27

ఓం. సర్వబాధాసు ఘోరాసు వేదనాభ్యర్ధితో ఒపి వా ।
స్మర న్మమైె తచ్చరితం నరో ముచ్యేతసంకటాత్ ॥ ఓం. 28

ఓం. మమ ప్రభావా త్సింహాద్యా దస్యవో వైరిణ స్తథా ।
దూరాదేవ పలాయన్తే స్మరత శ్చరితం మమ ॥ ఓం. 29

అరణ్యమందును బ్రాంతరమందును బడినపుడును, దావాగ్నిచేఁ జుట్టుకొనఁబడినపుడును, నిస్సహాయస్థితిలో నున్నప్పుడును, దస్యులచేతను శత్రువులచేతను ముట్టడింపఁబడి నపుడును, అడవిలో సింహ వ్యాఘ్ర వనగజాదులు వెంటాడి నపుడును, కోపించిన రాజుచే వధవెూ చెఱయెూ సిద్ధమై నపుడును, మహాసముద్రముపై నావయాత్ర చేయునపుడు, సుడిగాలి రుమ్ముమ్మనపుడును, భయానక యుద్ధముందు శస్త్రములు

వచ్చిపడునపుడును, సర్వవిపత్తులందును, పీడలు గల్గునపుడును, నా యీ చరిత్రమును స్మరించినంతనే సంకటములవలన విడువఁబడును. నా ప్రభావముచే సింహాదులు దస్యులు శత్రువులును దూరమునుండియే పాఱిపోవుదురు.

వ్యాఖ్య :- అమ్మ చరిత్ర కథలను జదువుటచేతను, వినుటచేతను, నగు ఫలములు మున్ను వర్ణింపఁబడినవి. ఇపుడు శ్రవణ కీర్తనములం దోపికలేక యథార్థ కాతరభావముతో, మాతృ పవిత్రచరిత్రములను స్మరింపఁగల్గినను మనుజుఁడు మున్ను జెప్పిన విపత్తులవలనఁ బరిత్రాణము నొందఁగలఁడు. సంసారమందు మనుజుల కే యే కారణములచే నధీరత వాటిల్లునో తెలుపుచు, నిచట అడవిప్రాంతరము, దోపిడికాండ్రు, కాఱుచిచ్చు మున్నగు ననేక కథలను జెప్పినది. గీతలందు భగవానుఁడు సైతము, "అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్" (9-13) ఈ మనుష్యలోకము అనిత్యము అసుఖమయము. సంసారముయొక్క యనిత్యతము, నసుఖము మనుష్యుని సదా యధీరునిఁ జేయు చుండును. అట్టి కాతరావస్థ యందును జీవుఁడు భగవంతుని స్మరించునేని, గాతరతకు హేతుభూతములైన విపత్తులు తప్పక తొలఁగి రక్షణము నొందును. విశేషించి జీవుఁడు భగవత్సత్తయందు విశ్వాసము గలవాడగును. జీవుఁడు కాతర రోదనము చేయుచోట, మన యమ్మ సుప్రకటముగా నావిర్భవించును.

జీవుఁడా ! చూడుము. నీకేమి సుఖమున్నది ? నీయవస్థలను గుర్తించియే మన యమ్మ యిచట "అరణ్యే ప్రాంతరే వాపి" మున్నగు మాటలన్నది. చూడుము. నీ సంసార మొక యరణ్యము,

ప్రాంతరవము కాదా ? బంధుబాంధవు లనేకులు నిన్ను జుట్టియున్నను నీవొక్కఁడవే సుమా. సంసారప్రాంతర మందుఁబడి, సుగమునుగోరి యాశామరీచికలయెడ ముగ్ధుఁడవై సదా మోస పడుచున్నావు. మఱియుఁ జూడుము. నీ నాల్గు వైపుల నశాన్తి యనెడి దావాగ్ని మండుచున్నదో లేదో; నీ శాంతి యని భ్రమించి సంతసించుచున్నది. కొంచెముగా లక్షించినపుడు, శాంతిగా నశాంతియేయున్నదని కనుగొందువు. నీ సాధువృత్తులు, బహిర్ముఖ విషయలోలుపవృత్తులు ననెడి దొంగలగుంపు నిన్ను దోచుకొను చున్నదో లేదో చూడు. నీవు నీ మిత్రులుగా నెంచుచున్న కామక్రోధాది మిత్రరూప శత్రువులు, నీ శాంతి నేటిగట్టునఁ బెట్టి పాఱిపోవుచున్నారో లేదో, చూడు. సింహ వ్యాఘ్రాది హింసక జంతువులనెడి దుర్దమనీయ ప్రవృత్తులచే నీవు సదా వెంబడింప బడుచున్నవో లేదో, చూచుకో. నీవు, ఏకాకివి, అసహాయుఁడవు నగుదువో కాదో చూచుకో. ఆ పైని జూడుము, రాజక్రోధము - ఈశ్వరుఁడై విశ్వమునకు రాజైనవాని యానచే నీవు వధ్యుఁడవు = మరణ మార్గమందు ముందడగు వేయుచు (బద్ధుఁడవై) సంసార శృంఖలములచే బద్ధుఁడవైతివో లేదో చూచుకో. మఱియుఁ జూడుము. ఈ సంసార మహార్ణవమందుఁబడి, నీ జీవననౌక అదృష్టవాయువుచే నెల్లపుడు సుడివెట్టఁబడుచున్నదో లేదో, చూడుము. ప్రవృత్తి నివృత్తులతో నీకు నిత్యము నగుచున్న యుద్ధమందు గాయపడుచున్నావో లేదో, చూచుకో, మఱియు శారీరక మానసిక వ్యాధులవలని యాతన నీ వెంతగా ననుభవించు చున్నావో, చూడు. ఈ విధముగా నీవు ఘోరసంకటమందుఁ

బడియున్నావు. నీ యిప్పటి బ్రతుకును బాగుగాఁ బర్యాలోచించి చూచుకో. నీ పడు సంకటమును జూచి యార్తుఁడవగుము. అధీరతతో నొక్కసారి నన్ను స్మరింపుము. నీవు స్మరించు ముహూర్తమందే, సంకటములవలనఁ బరిత్రాణము నొందుదువు. సంకటపరిత్రాణాస్వాదము మాటిమాటికి దొరకునా ? ఇదిగో, ఎవని జీవితమందు మునుజెప్పిన సంకటము లింత వఱకుఁ గలుగలేదో, వానికి నన్ను స్మరించు సుయోగము పట్టలేదన్నమాటే. బిడ్డా ! జీవుఁడా ! నిన్నుఁ గడుంబ్రేమించు నేనే, నిన్నిట్లు సంకటాపన్నుంజేసి, నన్ను స్మరించు సుయోగమును గృపతోఁ గూర్తును. నేఁడో రేపో మఱికొన్నాళ్లకో నిశ్చయముగా నీ కిట్టి సుయోగముపట్టును. అట్టి శుభయోగము పట్టినపుడు, నన్ను స్మరించుట మఱువకుమా. స్మరింపఁగలవాఁడే సంకటపరిత్రాణమును గ్రమముగా నా దర్శనమును బొందఁగలవు. ఇదే నా శేషవాణి. (తుదిమాట.)

ఓం. ఋషి రువాచ ఓం.

ఓం. ఇత్యుక్త్వా సా భగవతీ చండికా చండవిక్రమా ।
పశ్యతామేవ దేవానాం తత్రైవాంతర ధీయత ॥ ఓం. 30

ఋషి పలికెను :- చండవిక్రమశాలిని భగవతి యాచండిక, దేవతలు చూచుచుండఁగానే వారి సమ్ముఖమందే యంతర్హిత యయ్యెను.

వ్యాఖ్య :- నిజముగా మన యమ్మ, చూచుచుండఁగానే యంతర్హితయైనది. అవును. అమ్మ నిరవచ్ఛిన్న, గాన నామె నడ్డగించుటకుఁగాని, పట్టుకొనుటకుఁగాని, యధికార మెవ్వరికిని

లేదు. స్వేచ్ఛతో వెలయును. స్వేచ్ఛతో మఱుఁగును. ఆమె యావిర్భావ తిరోధానములయెడ వ్రేలెత్తి చూపుటకు నెవ్వరికిని సామర్థ్యము లేదు. హక్కులేదు. కాని, అమ్మ చండవిక్రమ చండికామూర్తితో నావిర్భవించునపుడే జీవుఁడు యథార్థముగా ధన్యుఁడగుననుట మఱువకు. అపుడే వాని జీవత్వము తుదముట్టును. పెద్దయాచకుని మూడిండ్లును గూలిపోవును. అపుడు జీవుఁడు స్వరూపసంధానము నొంది, జీవత్వమోహము పూర్తిగా నశించి, పరిత్రాణము నొందును. పరమాత్మానుభవమువల్ల నైన విశిష్టానందమును భోగించు సుయోగము పట్టును. అమ్మ కృపచే, అస్మితా మమతలు (శుంభ నిశుంభలు) విలయమగుటచే, తదనుసారులు ఆసురీభావములు తమంతనే యదృశ్యములగును.

సాధకా ! ఇట్లే యగును; విశుద్ధజ్ఞానస్వరూపము ఆత్మ ప్రకాశము కాఁగానే, అజ్ఞానమును, అజ్ఞనజన్యములైన సర్వద్వైత భావములును మఱి కానరావు. తరువాత వ్యుత్థితావస్థయందు మున్ను బాధింపఁబడిన (తొలఁగిన) యజ్ఞానము యొక్కయు, దాని కార్యములయొక్కయు, ననువర్తనము కొంచెముండును. అనఁగా దాని ఛాయలు కొంచెముండును. కాని జీవన్ముక్తతకు రవ్వంతయుఁ దఱుఁగురాదు. హానిలేదు. జ్ఞానోదయమునకు మున్ను, జ్ఞానాభాస మునుబట్టి జీవుఁడు జగద్భోగమును జేయునటులే, ఆత్మజ్ఞానము నొందిన పిమ్మట సైతము, అజ్ఞానాభాసముఁబట్టి, పూర్వబాధిత జగత్తునందు (అనాత్మ వస్తువులయందు) యథేచ్ఛముగా విచరించును. తర్వాత ప్రారబ్ధకర్మక్షయము కాఁగా, అనఁగా

దేహావసాన మందు జీవుఁడు కైవల్యముక్తి నొందును. బ్రహ్మమందు విలీనుఁడైపోవును. "నసపురావర్తతే, నసపునరావర్తతే" యన్నది, శ్రుతి.

అవతారవిషయమున నొకటి రెండు మాటలు :- అవతారమే, అవతరణము. విశుద్ధచిత్స్వరూపాత్మ, శుద్ధబుద్ధియం దవతరించును. జీవుఁడు విశుద్ధబుద్ధిస్వరూపమున నిల్వఁగల్గునపుడు, దానియందే యాత్మస్వరూప ముద్భాసించును. ఆత్మ బుద్ధియం దుద్భాసించు టయే యథార్థమైన యవతారము. దీనిచే దాని నిర్గుణత్వమున కింతయు హానిలేదు. అది స్వరూపముచే నిర్గుణముగా నుండియు, స్వచ్ఛదర్పణమందుఁ బ్రతిబింబించిన సూర్యుఁడువలెనే నిర్మల బుద్ధియం దుద్భాసించును.

సమష్టిబుద్ధియం దుద్భాసించు నాత్మ - హిరణ్యగర్భుఁడు, ఈశ్వరుఁడు; సత్యసంకల్పుఁడు, సర్వకాముఁడు, ప్రేమమయుఁడు, స్నేహమయుఁడు, దయామయుఁడు, ప్రభువు, విభువు, నియంత యైన యతఁడు (ఆత్మ) ఏదే నొక్క వ్యష్టిబుద్ధియం దుద్భాసించి, విశ్వకల్యాణసాధనము చేయునపుడే, అవతార మనఁబడును. ఏదే నొక దేశమం దనేకులు ఆసురికవృత్తులచే నుత్పీడితులయి, శాంతి నాశించి జ్ఞానపిపాసచేఁ గలఁగి, యధీర ప్రాణముతోఁ బ్రార్థించు నపుడు, తత్ఫలముగా దయాధారమైన పరమేశ్వరుఁడు, ఏదే నొక జీవుని బుద్ధియందుఁ దనను వెలయించుకొనును. యథార్థపిపాసు జనసంఘము ఆ సత్యదర్శి సంస్పర్శములోనికి వచ్చి ధన్యమును, కృతార్థము నగును.

ఈ యవతారతత్త్వసంబంధమున గీతా చండీపాఠములు రెండే యైకమత్యమును వెల్లడించినవి.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" ॥ (గీత)

యన్నది. ఇఁక జండీపాఠము (సప్తశతి)

"ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి ।
తదా తదావతీర్యాహం కరిష్యా మ్యరిసంక్షయమ్ ॥"

అన్నది. (11-55)

దుష్కృతివినాశము, ధర్మసంస్థాపనము నను రెండు గీత యందుఁ జెప్పఁబడిన యవతారకార్యములు. మఱి, ఆత్మ స్వరూపప్రకాశమును, అరిసంక్షయమును దేవీమాహాత్మ్యమందుఁ (చండీసప్తశతీపాఠము) జెప్పఁబడిన యవతార కార్యములు. మొదటఁ జెప్పబడిన యవతారముచే ధర్మప్రతిష్ఠ యగును. ఆత్మప్రతిష్ఠచేతనే యథార్థ ధర్మరక్షయు, జగత్పరిపాలనము నగును. ఎచ్చట నెన్నియవతారము లావిర్భవించునో, వానిచేత నేదో విధముగా నీసత్యము కానఁబడును. అవతారములన్నియుఁ జిన్మయి మన యమ్మయే. అమ్మగాక మఱియొక యవతారము యొక్క సంభావనయే లేదు. చైతన్యమయి యమ్మయే మానవ శరీరమున నవతారరూపముతో నభివ్యక్తయగును. యథార్థమైన "అహమ్" (నేనే) అవతరించును. కనుక నింతకుమున్ను మన యమ్మ తన శ్రీముఖముతో నన్నది : "అవతీర్యాహమ్" "నేనవతరించి యజ్ఞాన మనెడి యరికులమును క్షయింపఁ జేయుదు" నని.

ఇచటఁ బ్రసంగవశమున నొక్కమాట - యథార్థ పిపాసువు, యథార్థముముక్షువు నైనవాని హృదయమందు, అమ్మ చెదరని విశ్వాసరూపముతోనే యవతరించును. (ఇది యనుభూతము.)

ఎవ్వని హృదయమందేని దృఢవిశ్వాసమును, అవ్యాజ భక్తియు నుండునేని వానికి శ్రేయోలాభము సునిశ్చితము. శ్రీశంకరాచార్యులకును అవతారమందు విశ్వాసముండెను. వారి శ్రీభాష్య భూమికయందు, అవతారకథ చెప్పునపుడు, "దేహవానివ జాతవానివ లోకానుగ్రహం కుర్వన్నివ" యని యుల్లేఖించిరి, దేహాదిసంఘాతరహితుఁడైనవానియందు శుద్ధ బోధస్వరూప పరమేశ్వరుని మాయా (శక్తి) ప్రభావముచేత, దేహవిశిష్టుఁడైన వానివలెనే ప్రతీతుఁడగును. మాయిక జీవ బృందము అతని సమీపింపనైనఁజాలదు.

పరమాత్మయే జీవుల కల్యాణమునకై యవతారరూపమునఁ దన్నుఁ దా వెలయించుకొనుననెడి మాట నంగీకరించి విశ్వసించుటచేతనే జీవునకు శ్రేయోలాభమగును.

ఇది

శ్రీమార్కండేయపురాణాంతర్గత దేవీమాహాత్మ్యమున

శుంభవధానంతరము, దేవతలు చేసిన స్తుతికి

శ్రీకాకుళవాసి, శ్రీ క్రియానందనాథుఁడు

ఈశ్వర సత్యనారాయణశర్మ వ్రాసిన వ్యాఖ్య.

శ్రీ పరదేవార్పణము.

## ప్రథమ ఖండమందు బ్రహ్మకృత
# దేవీస్తుతి

ఓం. బ్రహ్మోవాచ ఓం.

ఓం. త్వం స్వాహా త్వం స్వధా త్వం హి
వషట్కారః స్వరాత్మికా ।
సుధా త్వమక్ష రే నిత్యే
త్రిధా మాత్రాత్మికా స్థితా ॥ ఓం. 1

అర్థమాత్రా స్థితా నిత్యా యానుచ్చార్యా విశేషతః
త్వ మేవ సా త్వం సావిత్రీ త్వం దేవి జననీ పరా ॥ 2

త్వయైవ ధార్యతే విశ్వం త్వయైతత్ సృజ్యతే జగత్
త్వయై తత్పాల్యతే దేవి త్వమత్స్యం తే చ సర్వదా ॥ 3

విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితిరూపా చ పాలనే,
తథా సంహృతిరూపాంతే జగతో ఽస్య జగన్మయే ॥ 4

మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః
మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ ॥ 5

ప్రకృతిస్త్వం చ సర్వస్య గుణత్రయ విభావినీ,
కాలరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రిశ్చ దారుణా ॥ 6

త్వం శ్రీస్త్వమీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్బోధలక్షణా,
లజ్జా పుష్టి స్తథా తుష్టి స్త్వం శాన్తిః క్షాన్తి రేవ చ ॥ 7

---

ఇందుఁ గల నాలుగు స్తుతులకు, ఫలశ్రుతికి ప్రతిశ్లోకమునకు ఆద్యంతము లందు "ప్రణవము" (ఓం) చేర్చి పఠించవలయును.

ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా,
శంఖినీ చాపినీ బాణ భుశుండీ పరిఘాయుధా ॥ 8

సౌమ్యా సౌమ్యతరాశేష సౌమ్యేభ్యస్త్వతి సుందరీ
పరా పరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥ 9

యచ్చ కించి త్క్వచిద్వస్తు సదసద్వాఖిలాత్మి కే,
తస్య సర్వస్య యా శక్తిః సాత్వం కిం స్తూయసే తదా ॥ 10

యయా త్వయా జగత్స్రష్టా జగత్పాతాత్తియో జగత్,
సో ఒపి నిద్రావశం నీతః కస్త్వాం స్తోతు మిహేశ్వరః ॥ 11

విష్ణుః శరీర గ్రహణ మహ మీశన ఏవ చ,
కారితాస్తే యతో ఒతస్త్వాం కఃస్తోతుం శక్తిమా న్భవేత్ ॥ 12

సా త్వమిత్థం ప్రభావైః స్వై రుదారైర్దేవి సంస్తుతా,
మోహయై తౌ దురాధర్షా వసురౌ మధుకైటభౌ ॥ 13

ప్రబోధంచ జగత్స్వామీ నీయతా మచ్యుతో లఘు,
బోధశ్చ క్రియతామస్య హంతుమేతౌ మహాసురౌ ॥ 14

ఇది శ్రీ మార్కండేయ పురాణాంతర్గత దేవీమహాత్మ్యమందు
ప్రథమచరిత్రమున, మధుకైటభవధమును జేయింప
విష్ణుని మేల్కొల్పి యోగనిద్రారూపిణిని
దేవి నుద్దేశించి బ్రహ్మ చేసిన స్తుతి



## మహిషాసుర వధానంతరము

# శక్రాదికృతస్తుతి

ఓం. ఋషి రువాచ ఓం.

ఓం. శక్రాదయః సురగణా నిహత ఽతివీర్యే
తస్మిన్ దురాత్మని సురారిబలే చ దేవ్యా,
తాం తుష్టువుః ప్రణతినమ్రశిరోధరాం సా
వాగ్భిః ప్రహర్షపులకోద్గమ చారు దేహాః ॥ ఓం

దేవ్యా యయా తత మిదం జగదాత్మ శక్త్యా
నిఃశేష దేవగణ శక్తిసమూహ మూర్త్యా,
తా మంబికా మఖిల దేవమహర్షి పూజ్యాం
భక్త్యా నతాఃస్మ విదధాతు శుభాని సా నః ॥ 2

యస్యాః ప్రభావ మతులం భగవా ననంతో
బ్రహ్మాహరశ్చ నహి వక్తు మలం బలం చ,
సా చండికాఖిల జగత్పరిపాలనాయ
నాశాయ చాశుభయస్య మతిం కరోతు ॥ 3

యా శ్రీః స్వయం సుకృతినాం భవనే ష్వలక్ష్మీః
పాపాత్మనాం కృతధియాం హృదయేషు బుద్ధిః,
శ్రద్ధా సతాం కులజనప్రభవస్య లజ్జా
తాం త్వాం నతాఃస్మ పరిపాలయ దేవి విశ్వమ్ ॥ 4

కిం వర్ణయామ తవ రూప మచింత్య మేతత్
కించాతి వీర్య మసురక్షయకారి భూరి,

కిం చాహవేషు చరితాని తవాద్భుతాని
సర్వేషు దేవ్యసుర దేవగణాది కేషు ॥ 5

హేతుః సమస్తజగతాం త్రిగుణాపి దోషై
ర్నజ్ఞాయసే హరిహరాదిభి రప్యపారా,
సర్వాశ్రయాఖిల మిదం జగదంశభూత
మవ్యాకృతా హి పరమా ప్రకృతి స్త్వమాద్యా ॥

యస్యాః సమస్త సురతా సముదీరణేన
తృప్తిం ప్రయాతి సకలేషు మఖేషు దేవి,
స్వాహాసి వై పితృగణస్య చ తృప్తిహేతు
రుచ్చార్యసే త్వమత ఏవ జనైః స్వధా చ॥ 7

యా ముక్తి హేతు రవిచింత్య మహావ్రతాచ
అభ్యస్యసే సునియతేంద్రియ తత్త్వసారైః
మోక్షార్థిభి ర్మునిభి రస్త సమస్తదోషై
ర్విద్యాసి సా భగవతీ పరమా హి దేవీ ॥ 8

శబ్దాత్మికా సువిమల ర్గ్ యజుషాం నిధాన
ముద్గీథ రమ్యపదపాఠవతాం చ సామ్నామ్,
దేవీ త్రయీ భగవతీ భవభావనాయ
వార్తా చ సర్వజగతాం పరమార్తిహంత్రీ ॥ 9

మేధాసి దేవి విదితాఖిల శాస్త్రసారా
దుర్గాసి దుర్గ భవసాగర నౌరసంగా,
శ్రీః కైటభారి హృదయైకకృతాధివాసా
గౌరీ త్వమేవ శశిమౌళి కృతప్రతిష్ఠా ॥ 10

ఈషత్సహాస మమలం పరిపూర్ణ చంద్ర
బింబానుకారి కనకోత్తమ కాంతికాంతమ్,
అత్యద్భుతం ప్రహృతమా త్తరుషా తథాపి
వక్త్రం విలోక్య సహసా మహిషాసు రేణ ॥ 11

దృష్ట్వా తు దేవి కుపితం భ్రుకుటీక రాళ
ముద్యచ్ఛశాంక సదృశచ్ఛవి య న్న సద్యః,
ప్రాణాన్ముమోచ మహిష స్తదతీవ చిత్రం
కైర్జీవ్యతే హి కుపితాంతకదర్శనేన ॥ 12

దేవి ప్రసీద పరమా భవతీ భవాయ
సద్యో వినాశయసి కోపవతీ కులాని
విజ్ఞాత మేతదధునైవ యదస్త మేత
న్నీతం బలం సువిపులం మహిషాసురస్య ॥ 13

తే సమ్మతా జనపదేషు ధనాని తేషాం
తేషాం యశాంసి న చ సీదతి ధర్మవర్గః
ధన్యా స్తఏవ నిభృతాత్మజ భృత్యదారాః
యేషాం సదాభ్యుదయదా భవతీ ప్రసన్నా ॥ 14

ధర్మ్యాణి దేవి సకలాని సదైవ కర్మా
ణ్యత్యాదృతః ప్రతిదినం సుకృతీ కరోతి,
స్వర్గం ప్రయాతి చ తతో భవతీప్రసాదా
ల్లోకత్రయే ఽపి ఫలదా నను దేవి తేన ॥ 15

దుర్గేస్మృతా హరసి భీతి మశేషజన్తోః
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి,

దారిద్ర్యదుఃఖ భయహారిణి కా త్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా ॥ 16

ఏభిర్హతై ర్జగదుపైతి సుఖం తథైతే
కుర్వంతు నామ నరకాయ చిరాయ పాపమ్,
సంగ్రామ మృత్యు మధిగమ్య దినం ప్రయాంతు
మత్వేతి నూనమహితాః వినిహంసి దేవి ॥ 17

దృష్ట్వైవ కిన్నభవతీ ప్రకరోతి భస్మ
సర్వాసురా నరిషు ప్రహిణోషి శస్త్రమ్,
లోకాన్ ప్రయాన్తు రిపవో ఽపి హి శస్త్రపూతా
ఇత్థం మతి ర్భవతి తేష్వపి తే ఽతి సాధ్వీ ॥ 18

ఖడ్గప్రభానికరవిస్ఫురణై స్తథోగ్రైః
శూలాగ్రకాంతి నివహేన దృశో ఽసురాణామ్
యన్నాగతా విలయ మంశుమదిందుఖండ
యోగ్యాననం తవ విలోకయతాం తదేతత్ ॥ 19

దుర్వృత్త వృత్తశమనం తవ దేవి శీలం
రూపం తథైత దవిచింత్య మతుల్య మన్యైః
వీర్యంచ హంతృహృత దేవ పరాక్రమాణాం
వైరిష్వపి ప్రకటితైవ దయా త్వ యేత్థమ్ ॥ 20

కేనోపమా భవతు తే ఽస్యపరాక్రమస్య
రూపం చ శత్రుభయకార్యతిహారి కుత్ర
చిత్తే కృపా సమరనిష్ఠురతా చ దృష్టా
త్వయ్యేవ దేవి వరాదే భువనత్రయే ఽపి ॥ 21

త్రైలోక్య మేత దఖిలం రిపునాశనేన
త్రాతం త్వయా సమరమూర్ధని తే ఽపి హత్వా,
నీతా దివం రిపుగణా భయమప్యపాస్త
మస్మాక మున్మద సురారిభవం నమస్తే ॥ 22

శూలేన పాహి నో దేవి పాహి ఖడ్గేన చాంబికే,
ఘంటాస్వనేన నః పాహి చాపజ్యా నిఃస్వనేన చ॥ 23

ప్రాచ్యాం రక్ష ప్రతీచ్యాం చ చండికే రక్ష దక్షిణే,
భ్రామణే నాత్మ శూలస్య ఉత్తరస్యాం తథేశ్వరి ॥ 24

సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యేవిచరంతి తే
యాని చాత్యర్థఘోరాణి తైరక్షాస్మాం స్తథా భువమ్ ॥ 25

ఏవం స్తుతా సురైః సర్వైః కుసుమై ర్నందనోద్భవై ః
అర్చితా జగతో ధాత్రీ తథా గంధానులేపనైః ॥ 26

భక్త్యా సమస్తై స్త్రిదశైర్దివ్యై ర్ధూపైస్తు ధూపితా
ప్రాహ ప్రసాదసుముఖీ సమస్తాౝ ప్రణతాౝ సురాౝ ॥ 27

ఓం. దేవ్యువాచ ఓం.

వ్రియతాం త్రిదశాః సర్వే యదస్మత్తో ఽభివాంఛితమ్ ॥ 28

ఓం. దేవా ఊచుః ఓం.

భగవత్యా కృతం సర్వం న కించి దవశిష్యతే,
యదయం నిహతః శత్రు రస్మాకం మహిషాసురః ॥ 29

యది వాపి వరో దేయ స్త్వయాస్మాకం మహేశ్వరి
సంస్మృతా సంస్మృతాత్వంనో హింసేథాః పరమాపదః ॥ 30

యశ్చ మర్త్యః స్తవై రేభి స్త్వాం స్తోష్యత్యమలాననే
తస్యవిత్తర్థి విభవై ర్ధనదారాది సంపదామ్ । 31

వృద్ధయే స్మత్ ప్రసన్నాత్వం భవేథాః
సర్వదాంబికే ॥ 32

ఓం. ఋషిరువాచ ఓం.

ఇతి ప్రసాదితా దేవై ర్జగతో ఒర్థే తథాత్మనః
తథే త్యుక్త్వా భద్రకాళీ బభూవాంతర్హితా నృపా ॥33

---

ఇది శ్రీ మార్కండేయ పురాణాంతర్గత దేవీమహాత్మ్యమందు
ద్వితీయచరిత్రమున, మహిషాసురవధానంతరము
శక్రాదిదేవతలు చేసిన దేవీస్తుతి.

**శుంభాసురనిధనమునుగోరిన దేవతలు చేసిన**

# దేవీస్తుతి

ఓం. నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాస్మతామ్ ॥ ఓం. 1

రౌద్రాయై నమోనిత్యాయై గౌర్యై ధాత్ర్యై నమోనమః
జ్యోత్స్నాయై చేందురూపిణ్యై సుఖాయై సతతం నమః ॥ 2

కల్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మో నమోనమః
నైఋృత్యై భూభృతాం లక్ష్మ్యైశర్వాణ్యై తేనమోనమః ॥ 3

దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై,
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః ॥ 4

అతిసౌమ్యాతి రౌద్రాయై నమస్తస్యై నమోనమః
నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమోనమః ॥ 5

ఓం. యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా

ఓం. నమస్తస్యై ఓం, ఓం నమస్త స్యై ఓం,
ఓం నమస్తస్యై ఓం నమోనమః ॥ ఓం. 6

యా దేవీ సర్వభూతేషు చేతనే త్యభిధీయతే,
నమస్తస్యై .... .... .... .... 7

యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 8

యా దేవీ సర్వరూపేషు నిద్రారూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 9

యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 10

యా దేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 11

యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 12

యా దేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 13

యా దేవీ సర్వభూతేషు క్షాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 14
యా దేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 15
యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 16
యా దేవీ సర్వభూతేషు శాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 17

---

శ్లోకము వరకు ఉత్తరార్థము పై విధముగా పఠించవలెను.

యా దేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 18
యా దేవీ సర్వభూతేషు కాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 19
యా దేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 20
యా దేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 21
యా దేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 22
యా దేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా
సమస్తస్యై .... .... .... .... 23
యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా,

నమస్తస్యై .... .... .... .... 24

యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 25

యా దేవీ సర్వభూతేషు భ్రాన్తిరూపేణ సంస్థితా,
నమస్తస్యై .... .... .... .... 26

ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా
భూతేషు సతతం తస్యై వ్యాప్తి దేవ్యై నమోనమః ॥ 27

ఓం. చితిరూపేణ యా కృత్స్న మేత ద్వ్యాప్య స్థితా జగత్
ఓం నమస్తస్యై ఓం, ఓం నమస్తస్యై ఓం,
ఓం నమస్తస్యై నమో నమః ॥ 28

స్తుతా సురైః పూర్వ మభీష్టసంశ్రయా
త్తథా సురేంద్రేణ దినేషు సేవితా,
కరోతు సా నః శుభహేతు రీశ్వరీ
శుభాని భద్రాణ్యభిహంతు చాపదః ॥ 29

యా సాంప్రతం చోద్ధ తదైత్యతాపితై
రస్మాభి రీశా చ సురై ర్నమస్యతే
యా చ స్మృతా తత్క్షణమేవ హన్తి నః
సర్వాపదో భక్తి వినమ్రమూర్తి భిః ॥ 30

---

ఇది శ్రీ మార్కండేయపురాణాంతర్గత దేవీమహాత్మ్యమందు
శుంభాసుర నిధనమును గోరిన దేవతలు చేసిన స్తుతి.

# శుంభవధానంతరము దేవకృత దేవీస్తుతి
## (నారాయణీ స్తుతి)

ఓం. ఋషిఉవాచ ఓం.

ఓం. దేవ్యా హతే తత్ర మహాసురేంద్రే
సేంద్రాః సురా వహ్ని పురోగమా స్తామ్
కాత్యాయనీం తుష్టువు రిష్టలాభా
ద్వికాసివక్ర్తాస్తు వికాశితాశాః ॥ ఓం. 1

దేవి ప్రసన్నార్తి హరే ప్రసీద
ప్రసీద మాత ర్జగతో ఒఖిలస్య,
ప్రసీద విశ్వేశ్వరి పాహి విశ్వం
త్వ మీశ్వరీ దేవి చరాచరస్య ॥ 2

ఆధారభూతా జగత స్త్వ మేకా
మహీస్వరూపేణ యత: స్థితాసి,
అపాం స్వరూపస్థితయా త్వయైత
దాప్యాయ్యతే కృత్స్న మలంఘ్యవీర్యే॥ 3

త్వం వైష్ణవీ శక్తి రనంతవీర్యా
విశ్వస్య బీజం పరమాసి మాయా,
సమ్మోహితం దేవి సమస్తమేతత్
త్వం వై ప్రసన్నా భువి ముక్తి హేతుః ॥ 4

విద్యాః సమస్తా స్తవ దేవి భేదాః
స్త్రియః సమస్తాః సకలా జగత్సు

త్వయైకయా పూరిత మంబయైతత్
కా తే స్తుతిః స్తవ్యపరాపరోక్తిః ॥ 5

సర్వభూతా యదా దేవీ స్వర్గముక్తిప్రదాయినీ
త్వం స్తుతా స్తుతయే కావా భవంతు పరమోక్తయః ॥ 6

సర్వస్య బుద్ధిరూపేణ జనస్య హృది సంస్థితే,
స్వర్గాపవర్గదే దేవి నారాయణి నమోఽస్తుతే ॥ 7

కలాకాష్ఠాదిరూపేణ పరిణామ ప్రదాయినీ,
విశ్వస్యోపరతౌ శక్తే నారాయణి నమోఽస్తుతే ॥ 8

సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోఽస్తుతే ॥ 9

సృష్టిస్థితివినాశానాం శక్తిభూతే సనాతని
గుణాశ్రయే గుణమయే నారాయణి నమోఽస్తుతే॥ 10

శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోఽస్తుతే ॥ 11

హంసయుక్త విమానస్థే బ్రహ్మాణీ రూపధారిణి,
కౌశాంభః క్షరికే దేవి నారాయణి నమోఽస్తుతే ॥ 12

త్రిశూల చంద్రాహి ధరే మహావృషభవాహిని
మాహేశ్వరీ స్వరూపేణ నారాయణి నమోఽస్మతే ॥ 13

మయూరర కుక్కుట వృతే మహాశక్తిధరేఽనఘే
కౌమారీరూప సంస్థానే నారాయణి నమోఽస్తుతే ॥ 14

శంఖ చక్ర గదా శార్ఙ్గ గృహీత పరమాయుధే
ప్రసీద వైష్ణవీరూపే నారాయణి నమో உస్తుతే ॥ 15

గృహీతోగ్ర మహాచక్రే దంష్ట్రోద్ధృత వసుంధరే
వరాహరూపిణి శివే నారాయణి నమో உస్తుతే॥ 16

నృసింహరూపేణో గ్రేణ హంతుం దైత్యాన్ కృతోద్యమే,
త్రైలోక్యత్రాణ సహితే నారాయణి నమో உస్తుతే॥ 17

కిరీటిని మహావజ్రే సహస్ర నయనోజ్జ్వలే,
వృత్రప్రాణ హరే చైంద్రి నారాయణి నమో உస్తుతే ॥ 18

శివదూతీ స్వరూపేణ హతదైత్య మహాబలే
ఘోరరూపే మహారావే నారాయణి నమో உస్తుతే॥ 19

దంష్ట్రాకరాళవదనే శిరోమాలా విభూషణే
చాముండే ముండమథనే నారాయణి నమో உస్తుతే॥ 20

లక్ష్మి లజ్జే మహావిద్యే శ్రద్ధే పుష్టి స్వధే ధ్రువే,
మహారాత్రి మహా உవిద్యే నారాయణి నమో உస్తుతే॥ 21

మేధే సరస్వతి వరే భూతి బాభ్రవి తామసి
నియతే త్వం ప్రసీదేశే నారాయణి నమో உస్తుతే॥ 22

సర్వస్వరూపే సర్వేశి సర్వశక్తి సమన్వితే
భయే భ్యస్త్రా హి నో దేవి దుర్గే దేవి నమో உస్తుతే॥ 23

ఏతత్తే వదనం సౌమ్యం లోచనత్రయ భూషితమ్
పాతు నః సర్వభూతేభ్యః (భీతిభ్యః) కాత్యాయని
నమో உస్తుతే॥ 24

జ్వాలాకరాళ మత్యుగ్ర మశేషాసురసూదనమ్,
త్రిశూలం పాతు నో భీతే ర్భద్రకాళి నమో ఒస్తుతే ॥ 25

హినస్తి దైత్యతేజాంసి స్వనేనాపూర్య యా జగత్
సా ఘంటా పాతు నో దేవి పాపేభ్యో నః సుతా నివ ॥ 26

అసురా సృగ్వసాపంక చర్చిత స్తే కరోజ్జ్వలః
శుభాయ ఖడ్గో భవతు చండికే త్వాం నతావయమ్ ॥ 27

రోగా నశేషా నపహంసి తుష్టా
రుష్టాతు కామా నఖిలా నభీష్టా॥
త్వా మాశ్రితానాం న విపన్న రాణాం
త్వామాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాన్తి ॥ 28

ఏతత్కృతం యత్కదనం త్వయాద్య
ధర్మద్విషాం దేవి మహాసురాణామ్
రూపై రనేకై ర్బహుధాత్మమూర్తిం
కృత్వాంబికే తత్ప్రకరోతి కాన్యా ॥ 29

విద్యాసు శాస్త్రేషు వివేకదీపే
ష్వాద్యేషు వాక్యేషు చ కా త్వదన్యా
మమత్వగర్తే ఒతి మహాంధకారే
విభ్రామయత్యేత దతీవ విశ్వమ్ ॥ 30

రక్షాంసి యత్రోగ్ర విషాశ్చ నాగా
యత్రారయో దస్యుబలాని యత్ర
దావానలో యత్ర తథాబ్ధిమధ్యే
తత్ర స్థితా త్వం పరిపాసి విశ్వమ్ ॥ 31

విశ్వేశ్వరీ త్వం పరిపాసి విశ్వం
విశ్వాత్మికా ధారయసీతి నిత్యమ్,
విశ్వేశ వంద్యా భవతీ భవన్తి
విశ్వాశ్రయా యే త్వయి భక్తినమ్రాః ॥ 32

దేవి ప్రసీద పరిపాలయ నో ఽరి భీతే
ర్నిత్యం యథాసురవధా దధునైవ సద్యః
పాపాని సర్వజగతాం చ శమం నయాశు
ఉత్పాతపాక జనితాంశ్చ మహోపసర్గాన్ ॥ 33

ప్రణతానాం ప్రసీద త్వం దేవి విశ్వార్తి హారిణి
త్రైలోక్యవాసినా మీడ్యే లోకానాం వరదా భవ ॥ 34

వరదాహం సురగణా వరం యం మనసేచ్ఛథ
తం వృణుధ్వం ప్రయచ్ఛామి జగతా ముపకారకమ్ ॥ 35

సర్వబాధాప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి
ఏవ మేతత్త్వయాకార్య మస్మద్వైరి వినాశనమ్ ॥ 36

ఓం. దేవ్యువాచ ఓం.

వైవస్వతే ఽ న్తరే ప్రాప్తే అష్టావింశతిమే యుగే
శుంభోనిశుంభశ్చైవాన్యా వుత్పత్స్యేతే మహాసురౌ ॥ 37

నందగోపగృహే జాతా యశోదాగర్భ సంభవా
తతస్తౌ నాశయిష్యామి వింధ్యాచల నివాసినీ ॥ 38

పునరప్యతి రౌద్రేణ రూపేణ పృథివీతలే
అవతీర్య హనిష్యామి వైప్రచిత్తాంస్తు దానవాన్ ॥ 39

భక్షయంత్యాశ్చ తానుగ్రా॥ వైప్రచిత్తా న్మహాసురా॥
రక్తాదన్తా భవిష్యన్తి దాడిమీ కుసుమోపమాః ॥ 40

తతో మాం దేవతాః స్వర్గే మర్త్యలోకే చ మానవాః
స్తువన్తో వ్యాహరిష్యన్తి సతతం రక్తదన్తికామ్ ॥ 41

భూయశ్చ శతవార్షి క్యా మనావృష్ట్యా మనంభసి
మునిభిః సంస్తుతా భూమౌ సంభవిష్యామ్యయోనిజా ॥ 42

తతః శతేన నేత్రాణాం నిరీక్షిష్యామి యన్మునీ॥
కీర్తయిష్యన్తి మనుజాః శతాక్షీ మితి మాం తతః ॥ 43

తతో ఒహ మఖిలం లోక మాత్మదేహ సముద్భవైః
భరిష్యామి సురాః శాకై రావృష్టేః ప్రాణధారకైః
శాకంభరీతి విఖ్యాతిం తదా యాస్యామ్యహం భువి ॥ 44

తత్రైవ చ వధిష్యామి దుర్గమాఖ్యం మహాసురం
దుర్గాదేవీతి విఖ్యాతం తన్మేనామ భవిష్యతి ॥ 45

పునశ్చాహం యదా భీమా రూపం కృత్వా హిమాచలే
రక్షాంసి క్షయయిష్యామి మునీనాం త్రాణకారణాత్ ॥ 46

తదా మాం మునయస్సర్వే స్తోష్యన్త్యా నమ్రమూర్తయః
భీమాదేవీతి విఖ్యాతం తన్మేనామ భవిష్యతి ॥ 47

యదారుణాఖ్య స్త్రైలోక్యే మహాబాధాం కరిష్యతి
తదాహం భ్రామరం రూపం కృత్వా సంఖ్యేయషట్పదమ్ ॥ 48

త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురం
భ్రామరీతి చ మాం లోకా స్తదా స్తోష్యన్తి సర్వతః ॥ 49

ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి
తదా తదావతీర్యాహం కరిష్యా మ్యరిసంక్షయమ్ ॥ 50

ఇది శ్రీ మార్కండేయపురాణాంతర్గత దేవీమహాత్మ్యమందు
దేవతలు చేసిన స్తుతి. (నారాయణీస్తుతి)

## దేవీ మహాత్మ్యము - రుద్రగ్రంథి భేదము

## ఫలశ్రుతి

ఓం. దేవ్యువాచ ఓం.

ఓం. ఏభిః స్తవైశ్చ మాం నిత్యం స్తోష్యతే యః సమాహితః
తస్యాహం సకలాం బాధాంశమయిష్యామ్యసంశయం ॥ఓం. 1

మధుకైటభ నాశం చ మహిషాసుర ఘాతనం
కీర్తయిష్యన్తి యే తద్వ ద్వధం శుంభనిశుంభయోః ॥ 2

అష్టమ్యాం చ చతుర్దశ్యాం నవమ్యాం చైక చేతసః
స్తోష్యన్తి చైవ యే భక్త్యా మమ మాహాత్మ్య ముత్తమమ్ ॥ 3

న తేషాం దుష్కృతం కించి ద్దుష్కృతోత్థా న చాపదః
భవిష్యతి న దారిద్ర్యం న చైవేష్ట వియోజనమ్ ॥ 4

శత్రుతో న భయం తస్య దస్యుతో వా న రాజతః
న శస్త్రానలతో యౌఘాత్కదాచి త్సంభవిష్యతి ॥ 5

యస్మాన్మమైత న్మాహాత్మ్యం పఠితవ్యం సమాహితైః
శ్రోతవ్యం చ సదా భక్త్యా పరం స్వస్త్యయనం హి తత్ ॥ 6

ఉపసర్గా నశేషాంస్తు మహామారీ సముద్భవాన్
తథా త్రివిధముత్పాతం మాహాత్మ్యం శమయే న్మమ ॥ 7

యత్రై తత్పఠ్యతే సమ్య జ్నిత్యమాయతనే మమ
సదా న తద్విమోక్ష్యామి సాన్నిధ్యం తత్ర మే స్థితమ్ ॥ 8

బలిప్రదానే పూజాయా మగ్ని కార్యే మహోత్సవే,
సర్వం మమైతచ్చరిత ముచ్చార్యం శ్రావ్య మేవచ ॥ 9

జానతా జానతా వాపి బలిపూజాం తథా కృతాం
ప్రతీచ్ఛిష్యామ్యహం ప్రీత్యా వహ్నిహోమంతథాకృతమ్ ॥ 10

శరత్కాలే మహాపూజా క్రియతే యా చ వార్షికీ
తస్యాం మమైత న్మాహాత్మ్యం శ్రుత్వా భక్తిసమన్వితః ॥ 11

సర్వబాధా వినిర్ముక్తో ధనధాన్య సుతాన్వితః
మనుష్యో మత్ప్రసాదేన భవిష్యతి న సంశయః ॥ 12

శ్రుత్వా మమైత న్మాహాత్మ్యం తథా చోత్పత్తయః శుభాః
పరాక్రమం చ యుద్ధేషు జాయతే నిర్భయః పుమాన్ ॥ 13

రిపవః సంక్షయం యాన్తి కల్యాణః చోపపద్యతే
నందతే చ కులం పుంసాం మాహాత్మ్యం మమ శ్రుణ్వతామ్ ॥ 14

శాంతికర్మణి సర్వత్ర తథా దుఃస్వప్న దర్శనే
గ్రహపీడాసు చోగ్రాసు మాహాత్మ్యం శ్రుణుయాన్మమ ॥15

ఉపసర్గాః శమం యాన్తి గ్రహపీడాశ్చ దారుణాః
దుఃస్వప్నం చ నృభిర్దృష్టం సుస్వప్న ముపజాయతే ॥ 16

బాలగ్రహాభిభూతానాం బాలానాం శాన్తికారకం
సంఘాతభేదే చ నృణాం మైత్రీకారక ముత్తమమ్ ॥ 17

దుర్వృత్తానా మశేషాణాం బలహానికరం పరం
రక్షో భూతపిశాచానాం పఠనాదేవ నాశనమ్ ॥ 18

సర్వం మమైత న్మాహాత్మ్యం మమ సన్నిధికారకమ్ ॥ 19

పశు పుష్పార్ఘ ధూపైశ్చ గంధ దీపై స్తథోత్తమైః
విప్రాణాం భోజనై ర్హోమైః ప్రోక్షణీయై రహర్నిశమ్ ॥ 20

అన్యైశ్చ వివిధై ర్భోగైః ప్రదానై ర్వత్స రేణ యా
ప్రీతిర్మే క్రియతే సాస్మిన్ సకృత్సు చరితే శ్రుతే ॥ 21

శ్రుతం హరతి పాపాని తథారోగ్యం ప్రయచ్ఛతి
రక్షాం కరోతి భూతేభ్యో జన్మనాం కీర్తనం మమ ॥ 22

యుద్ధేషు చరితం యన్మే దుష్టదైత్య నిబర్హణం
తస్మిఙ్ శ్రుతే వైరికృతం భయం పుంసాం నజాయతే ॥23

యుష్మాభిః స్తుతయో యాశ్చ యాశ్చ బ్రహ్మర్షిభిః కృతాః
బ్రహ్మణాచ కృతా స్తాస్తు ప్రయచ్ఛన్తి శుభాం మతిమ్ ॥ 24

అరణ్యే ప్రాన్తరే వాపి దావాగ్ని పరివారితః
దస్యుభిర్వా వృతం శూన్యే గృహీతో వాపి శత్రుతః ॥ 25

సింహవ్యాఘ్రానుయాతో వా వనే వా వనహస్తిభిః
రాజ్ఞా కృద్ధేన చాజ్ఞప్తో వధ్యో బంధనతోఽపివా ॥ 26

ఆఘూర్ణితో వా వాతేన స్థితః పోతే మహార్ణవే
పతత్సు వాపి శస్త్రేషు సంగ్రామే భృశదారుణే ॥ 27

సర్వబాధాసు ఘోరాసు వేదనాభ్యర్థితోఽపి వా
స్మర న్మమైత చ్చరితం నరో ముచ్యేత సంకటాత్ ॥ 28

మమ ప్రభావా త్సింహాద్యా దస్యవో వైరిణ స్తథా
దూరా దేవ పలాయన్తే స్మరత శ్చరితం మమ ॥ 29

ఓం. ఋషి రువాచ ఓం.

ఇత్యుక్త్వా సా భగవతీ చండికా చండవిక్రమా
పశ్యతా మేవ దేవానాం తత్రైవాంతరధీయత ॥ 30

ఇది శ్రీ మార్కండేయపురాణాంతర్గత దేవీమాహాత్మ్యమందు
శుంభవధానంతరము, దేవతలు చేసిన స్తుతి.

# మీనాక్షీ పంచరత్నమ్

శ్లో॥ ఉద్యద్భాను సహస్రకోటి సదృశాం కేయూర హారోజ్జ్వలాం
బింబోష్ఠీం స్మిత దంతపంక్తి రుచిరాం పీతాంబరాలంకృతాం।
విష్ణుబ్రహ్మసురేంద్ర సేవితపదాం తత్త్వ స్వరూపాం శివాం
మీనాక్షీం ప్రణతో ఽస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిం॥ 1

శ్లో॥ ముక్తాహార లసత్కిరీటరుచిరాం పూర్ణేందు వక్త్రప్రభాం
శింజన్నూపుర కింకిణీమణిధరాం పద్మ ప్రభా భాసురాం।
సర్వాభీష్ట ఫలప్రదాం గిరిసుతాం వాణీ రమా సేవితాం
మీనాక్షీం ప్రణతో ఽస్మి సంతత మహం కారుణ్య వారాంనిధిం॥ 2

శ్లో॥ శ్రీవిద్యాం శివవామభాగ నిలయాం హ్రీంకారమంత్రోజ్జ్వలాం
శ్రీచక్రాంకిత బిందు మధ్యవసతిం శ్రీమత్సభానాయకీం।
శ్రీమత్ షణ్ముఖ విఘ్నరాజజననీం శ్రీమజ్జగ న్మోహినీం
మీనాక్షీం ప్రణతో ఽస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిం॥ 3

శ్లో॥ శ్రీమత్సుందరనాయకీం భయహరాం జ్ఞానప్రదాం నిర్మలాం
శ్యామాభాం కమలాసనార్చిత పదాం నారాయణ స్యానుజాం।
వీణావేణు మృదంగ వాద్యరసికాం నానావిధాడంబరాం
మీనాక్షీం ప్రణతో ఽస్మి సంతత మహం కారుణ్య వారాంనిధిం॥ 4

శ్లో॥ నానాయోగి మునీంద్రహృన్ని వసతిం నానార్థ సిద్ధిప్రదాం
నానాపుష్ప విరాజితాంఘ్రి యుగళాం నారాయణేనార్చితాం।
నాదబ్రహ్మమయీం పరాత్పరతరాం నానార్థతత్త్వాత్మికాం
మీనాక్షీం ప్రణతో ఽస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిం॥ 5

— శ్రీశఙ్కరాచార్యకృత మీనాక్షీ పంచరత్నమ్

# శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి

## గ్రంథములు

శాస్త్ర, సంప్రదాయ రహస్యములను మర్మము విడిచి విప్పి చెప్పు శ్రీశర్మగారి గ్రంథములన్నియు ప్రతివారు చదువతగినవి.

| | | |
|---|---|---|
| 1. | సౌభాగ్యలక్ష్మీ హృదయము | 4 - 00 |
| 2. | దుర్గాస్తుతి | 15 - 00 |
| 3. | శ్రీసత్యనారాయణశర్మ సాధనము | 4 - 00 |
| 4. | సౌరమంత్రపాఠము | 15 - 00 |
| 5. | జీవానందన నాటకము | 4 - 00 |
| 6. | భీమేశ్వర నుతి | 2 - 00 |
| 7. | సౌందర్యలహరి *(ఆనందలహరి 100 యంత్రములతో)* | 50 - 00 |
| 8. | శాస్త్రసాధనము | 15 - 00 |
| 9. | దేవపూజారహస్యము | 40 - 00 |
| 10. | శ్రీ సూక్తరహస్యార్థప్రదీపిక | 25 - 00 |
| 11. | శ్రీలక్ష్మీ హృదయము | 40 - 00 |
| 12. | శ్రీకాళిదాసదేవీపంచస్తవి | 40 - 00 |
| 13. | శ్రీవిద్యాంధ్రభాష్యము | 25 - 00 |
| 14. | శ్రీసప్తశత్యుపాసనాక్రమము | 125 - 00 |
| 15. | సాధనసామగ్రి - 1వ భాగం | 110 - 00 |
| 16. | సాధనసామగ్రి - 2వ భాగం | 60 - 00 |
| 17. | సాధనసామగ్రి - 3వ భాగం | 100 - 00 |
| 18. | సాధనసామగ్రి - 4వ భాగం | 110 - 00 |

### పునర్ముద్రణ కావలసినవి

1. శివరాత్రిపరతత్త్వము
2. శ్రీరాజవిద్యాగీత
3. కలిసంతరణ మహామంత్రము
4. సిద్ధాంతశిఖామణి
5. సో ఽహంసమాధి
6. అమ్మతోముచ్చటలు

**సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201.**

ముద్రణ : కమల ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి. ఫోన్స్ : 25072, 24472

